# వైరభక్తి

సంస్కృతాంధ్రసాహిత్యముల తులనాత్మక పరిశీలనము

# వైర భక్తి

సంస్కృతాంధ్రసాహిత్యముల తులనాత్మక పరిశీలనము



"శ్రీదేవీగానసుధాప్రపూర్ణ"

డా॥ పళ్ళె (పత్రి) నాగమణి
M A, M Phil, Ph D

తెలుగులెక్చరర్

టి జె పి యస్. కళాశాల

గుంటూరు.

వైరభక్తి - సంస్కృతాంధ్రసాహిత్యముల తులనాత్మక పరిశీలనము

ప్రథమముద్రణ, గ్రంథావిష్కరణ 2-1-1992
ప్రతులు 1000

ప్రతులకు

**Sri P. Anandachar**
H No B1/16 1st Line
Old Pattabhipuram
GUNTUR-522006

ముఖచిత్రరచన : శ్రీ జంకా రామారావు, సత్తెనపల్లి

టైటిల్ ప్రింటింగ్ . Golden Graphucs, గుంటూరు

ముద్రణ : పంచాక్షరీ ప్రెస్, గుంటూరు.

మూల్యము : రూ 75.00

# జ్ఞానానందతీర్థ ఆరాధనోత్సవం

4-1-92 ఆంధ్రప్రభ

(ఆంధ్రప్రభ విలేఖరి)

కొవ్వూరు, జనవరి 3 ప్రముఖ వాగ్గేయకారులు సద్గురు జ్ఞానానందతీర్థ ద్వితీయ ఆరాధనోత్సవం మంగళవారంనాడు జ్ఞానానందనిలయంలో అధ్యక్షులు శ్రీ ఓగిరాల శ్రీరామకృష్ణ అధ్యక్షతన జరిగింది శ్రీ దోర్బల ప్రభాకరశర్మ, శ్రీ రెబ్బప్రగడ రాజేశ్వరరావు, శ్రీమతి కేశిరాజు జయలక్ష్మి, శ్రీ పానుగంటి రాము జ్ఞానానందతీర్థ ప్రతిభా విశేషాలను వివరించారు

శ్రీమతి పానుగంటి ఎం లలిత ప్రసంగిస్తూ, గాయత్రీ ఉపాసనా పరంగా జ్ఞానానందతీర్థ రచించిన దేవీ గానసుధలోని కీర్తనల భక్తి జ్ఞాన కర్మయోగాల అంతరార్థాన్ని వివరించారు గాయత్రీమాత అధిష్ఠాన దేవతగా 'నాదయోగి' ప్రముఖ వాగ్గేయకారుడు జ్ఞానానంద తీర్థ ఆత్మసాక్షాత్కారం పొందిన బ్రహ్మజ్ఞానిగా పేర్కొన్నారు

గురువారంనాడు సంగీతసభ ద్వితీయవార్షికోత్సవ సందర్భంలో ప్రముఖ సంగీతకళాకారిణి శ్రీమతి అరుంధతి సర్కార్‌కు 'దేవీగాన సుధా ప్రవీణ' బిరుదప్రదానం చేశారు శ్రీ ఓగిరాల రామకృష్ణ, శ్రీ నిమ్మపూడి వీర్రాజు, శ్రీమతి అరుంధతి గాన ప్రావీణ్యతను ప్రశంసించారు

డాక్టర్ పి నాగమణి రచించిన 'వైరభక్తి' గ్రంథాన్ని శ్రీ రామకృష్ణ ఆవిష్కరించారు సంస్కృత ఆంధ్ర తులనాత్మక పరిశీలనగా సనకసనందనాది మహర్షుల జ్ఞానమార్గాన్ని జయ, విజయుల భక్తిమార్గాన్ని వైరాన బంధంగా పరిశీలించిన వినూత్న ప్రక్రియగా డా నాగమణి గ్రంథ ఇతివృత్తాన్ని వివరించారు

# నా మాట

భారత భాగవత రామాయణములు భారతీయ జీవనపథ నిర్దేశకములు. అందు భారత, రామాయణములు భౌతికజీవనమున కాచార్యత్వము నిర్వహించుచుండగా, భాగవతము ఆముష్మిక జీవననిర్వహణమునకు సాధకమగుచున్నది. పదునెన్మిది పురాణముల వేర్పరచిన వ్యాసభగవానునకే చిత్తవైక్లబ్యము కలుగ, సామాన్యుల విషయము వేరుగా చెప్పవలసినదేమి? తుదకు నారదప్రబోధనము వ్యాసుని కడతేర్చి, తన్ముఖమున మానవాళిని తరింపజేసినది. భాగవత పఠనము, అనుసరణమున ఎవరి అనుభవము వారిది. కారణము అది అనుభవైకవేద్యము. భావప్రసార ప్రచారముల కందునది కాదు. కాని ఇదియొక ప్రయత్నము.

డా॥ (శ్రీమతి) నాగమణి భాగవతమతిమును అనుభవములోనికి తెచ్చుకున్న విద్వాంసురాలు అగుట ఈ ప్రయత్నము. భాగవత తత్త్వము 'ఇది' అని తేల్చిచెప్పుట సాధ్యమగునది కాదు. సర్వమునకు భక్తి మూలకందమని చెప్పుట సులభమే. ఆ భక్తి నవవిధములని తద్‌జ్ఞుల నిరూపణము. వైరభక్తి కేవల భాగవతప్రతిపాదితము. భాగవతమునందది ప్రసరించిన తీరునకే 'వైరభక్తి' యొక్క వ్యాఖ్యానము. ఇది సాధారణ సిద్ధాంతగ్రంథమనిపించునుగాని, నిజమునకిది యట్టిది గాదు. అనుభవించి, ఆయనుభవమును చిత్తమునకు దెచ్చి, చిత్తమును విచారమార్గమునకు చేరదెచ్చి, తత్త్వమును తెలియచెప్పిన మార్గమిది. పట్టమునకైన సమర్పణము, ఫలితప్రాప్తి కేవలము లౌకికము. విషయగ్రహణ, పరిష్కారములు అలౌకికములు. శ్రీమతి నాగమణి నాపర్యవేక్షణలో పట్టమునందినది. మీదుమిక్కిలి నా సహాధ్యాయిని. ఇంతకుమించి పలుకుట తగదుగాక తగదు. గ్రంథస్థవిషయ నిరూపణాదికములకు సహృదయ పండితలోకము ప్రమాణమగుగాక.

ది 8-3-92 యార్లగడ్డ బాలగంగాధరరావు

**Prof Korada Mahadeva Sastri,** M A Dlitt
Rtd Prof of Telugu
S K University
Anantapur

లోకంలో మానవుల బుద్ధివృత్తులు వారివారి యోగ్యతలను అనుసరించి ప్రవర్తిస్తూ ఉంటాయి కనుక పరమేశ్వరుని అనుగ్రహం కావాలనుకున్నవారు 'పరమేశ్వరా! నాబుద్ధివృత్తులను సన్మార్గంలో ప్రవర్తించేట్లు అనుగ్రహించమని ప్రార్థిస్తూ ఆ ఆదిదేవుని శరణు పొందాలి అప్పుడే ఆ భక్తవత్సలునికి భక్తులమీద అనుగ్రహం కలుగుతుంది కాని భక్తుని భక్తిభావనలో పరమేశ్వరుని గూర్చిన 'చింతన' అన్నివేళలా నిరంతరం కావాలి అంటే, భక్తుడు 'సంతత శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతామృతాస్వాద సంధానుడై' భౌతికవిశ్వమునే విస్మరించాలి ఇట్టి మానసిక పరిణతి ప్రాప్తించిన భక్తునికే ఆదిదేవుని అనుగ్రహం సులభప్రాప్యం అవుతుంది ఈవిశిష్ట విషయాన్ని వైరభక్తి గ్రంథరచయిత్రి తమగ్రంథరాజంలో ఇలా తెలిపారు "నాస్తికులలో తీవ్రమైన అభినివేశం ఉన్నవారే వైరభక్తులైనారు" ఈవాక్యంలో వైరభక్తి జనించడానికి మూలం తీవ్రమైన అభినివేశమే అన్న సత్యం ఉంది ఈ సత్యాన్ని భక్తపోతన కవీంద్రుడు ఇలా తెలిపాడు "వైరానుబంధనంబున జేరిన చందమున విష్ణుచిరతరభక్తిం జేరగరాదటె తోచును నారాయణ భక్తియుక్తి నా చిత్తమునన్" కనుక శ్రీవిష్ణువుయొక్క సాయుజ్యప్రాప్తికి చిరతర భక్తికంటె వైరానుబంధనమే పరమసాధనమనీ, దగ్గరమార్గమనీ తేటతెల్లమయింది. ఇట్టి విశిష్టవిషయాలను గ్రంథకర్త్రి చక్కని నిదర్శనాలతో వివరించారు. ఉదాహరణకు "హిరణ్యకశిపుడు విష్ణుతత్త్వమును ఎరిగినవాడయ్యు విష్ణురూపమును ప్రత్యక్షముగా సందర్శింప

వలెనను జిజ్ఞాసతో నాయనను చూపుమని ప్రహ్లాదునడిగినాడు
ఇక్కడ తండ్రి ప్రహ్లాదుని ఒత్తిడిచేత కంబంలో ఒక ఘరమార్ధంఉంది
శ్రీవిష్ణుని వెంటనే దర్శించాలని హిరణ్యకశిపుని లోపల విష్ణుభక్తుని
కట్టుకొని గట్టిగ వైరభక్తి రక్షణకోసం అమహావిష్ణువు శైటకడ
తాడన అతని అంచనా దీనిని అమలపరచడానికే కన్నకొడుకుని
కూడా బాధించడానికి వెనుకాడలేదు అతని విష్ణుగర్వనోత్కంఠ
అంతటిదన్నమాట. రావణాసురుని వైరభక్తిలో కూడా ఇటువంటి
విశిష్టవిషయాలను ఈరచయిత్రి చక్కగా సోదాహరణంగా వివరిం
చారు

వైరభక్తి మానవులకు ఉపాదేయముకాదు నిజమే కాని
ఏభావమైనా ఉత్కృష్టమై ఏకాగ్రస్థితిని పొందినప్పుడు అట్టిది అలౌకిక
ధర్మంగా పరిణమిస్తుందనీ, అప్పుడట్టి భావానికి పుణ్యపాపాలు
అంటవనీ మనం గ్రహించాలి

భక్తి - ప్రత్యేకంగా వైరభక్తి - యొక్క స్వరూప స్వభా
వాలను క్షుణ్ణంగా తెలియగోరిన పాఠకోత్తములకు ఈ గ్రంథం
అనివార్యంగా అధ్యయనం చేయదగి ఉన్నది.



ఓమ్

ఆచార్య శలాక రఘునాథశర్మ
తెలుగుశాఖ
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయము

శ్రీ వెంకటేశ్వరపురం (po)
అనంతపురం-515008
తేది : 18-1-1992

# సౌజన్యసంభావనము

ఆత్మగతత్త్వముతో ఐహికభావములకు ముడి ఏర్పడినపుడు అవ్వియు పవిత్రములుగనే మారిపోవును. అగ్నిఁ బంటిన సర్వపదార్థములు మాలిన్యమును కోల్పోవునట్లు సముద్రములో చేరిన సర్వనదులు నామరూప స్వభావములను వదలివైచునట్లు భగవంతునిపై పొరలిన సర్వభావములు - లోకదృష్టితో అవి వంద్యములైనను, నింద్యములైనను - మహాప్రయోజనమునకు సాధకములే యగును. కామము, భయము, వైరము అనునవి ఆయుధముగా కొందరికి ఉపాదేయములైనవి. గోపికలు, కంసుడు, శిశుపాలాదులు వీని నాలంబనముగాఁగొని చక్రిని గాంచిరి. హరిని చెందిరి. కావలసినది ఉద్ధాను ధ్యానగరిష్ఠత. దానిని పండించుటకై భగవంతుడొక్కొక్కరిలో ఒక్కొక్క తీవ్రనిష్ఠను నిక్షేపించుచుండును.

శ్రవణాదులగు నవవిధ భక్తులతో పాటు కామ భయ వైరాది భక్తులనుగూడ భాగవతమే ప్రతిపాదించి నిరూపించినది. కావున 'వైరభక్తి' సశాస్త్రీయమే కాని, ఇది తక్కినవానివలె సులభోపాయము కాదు. భగవంతునిపై వైరనిష్ఠను బ్రదికినంతకాలము కట్టుకొని వ్రేలాడుటకెంత 'మొండితనము' కావలయును! హిరణ్యాక్ష హిరణ్యకశిపు, రావణ కుంభకర్ణ, శిశుపాల దంతవక్త్రులు దైవానుగ్రహమువలననే దానిని చెదరని దీక్షతో నిర్వహించిరి. హరిని చేరుకొనిరి. ఇట్టిది కాటిపట్టెదురుదేశట వంటిదైనను సత్ఫలదాయకమే యగుచున్నది సమర్థనకు సాధకమే యగుచున్నది.

డా॥ శ్రీమతి పి. నాగమణిగారు ఈవిలక్షణాంశము నెన్నుకొని శరిశోధనరంగమున ప్రవేశించుటను కరిశీలించగా వీరు దీనినిప్రధాన సాధకముగా సంభావించినట్లు తోచుచున్నది. ఇట్టి విషయములను చేపట్టుటకు గొప్పగుండెగావలెను, నిష్కలమైన శాస్త్రి గాహ సామర్థ్యము కావలయును ఆ రెండును వీరికి నిండుగా కలవని ఇందలి ప్రతి అధ్యాయము నిరూపించుచున్నది. పురాణేతిహాసములలో అపాతతః కనిపించు పరస్పర విరుద్ధాంశములను సమన్వయించుకొని ఒక నిర్దిష్టమైన తాత్పర్యమును గ్రహించు ధీశక్తి ఈనాడు క్రమక్రమముగా లోపించుచున్నది. దీనికి శ్రీమతి నాగమణిగారి రచన అపవాదప్రాయము. భాగవతము, విష్ణు, పద్మ, కూర్మ, మత్స్య, విష్ణుధర్మోత్తర పురాణాదులను చక్కగా అనుశీలించి జయవిజయ శాపవృత్తాంతమును సమన్వయించిన వైఖరి ప్రశంసనీయముగా నున్నది. హిరణ్యాక్షాదుల సాధకత్వాదులను క్రమపద్ధతిలో నిరూపించినతీరు మెచ్చుకొలుపుచున్నది. భక్తిని నిర్వచించిన వైఖరియు, దానికి రసత్వము కలదా? అను చర్చయు సశాస్త్రీయముగా సాగినవి. సందర్భోచితముగా సంస్కృతమున శిశుపాలవధాది కావ్యములను, తెలుగున ఆధునికకాలమున వెలసిన 'వైరభక్తి' కావ్యమును పరిశీలించి వెలయించిన అభిప్రాయములు ఈ గ్రంథమునకు నిండుదనము చేకూర్చినవి.

ఈవిధముగా వీరి ఈసారస్వతారాధనము ఒకవైపు తమకు ఇష్టకామ్యార్థసిద్ధిం కూర్చుచునే, మరియొకవైపు ఇట్టి విషయములందు నిశ్చయజ్ఞానము పొందలేనివారికి కరదీపికయై తత్త్వదర్శనము చేయుటకును సాధనమగుచున్నది.

మంచిగ్రంథమును మనకందించుచున్న శ్రీమతి నాగమణిగారిని మనసార అభినందించుచు విరమింతును.

ప్రజావతి ఎష్యశుద్ధ అష్టమీ
ఇందువాసరము

కలాత రఘునాథశర్మ

**Dr. G L N Sastry,**
M Sc M Phil Ph D
Head ofthe Depaptment of Physice
T J P S College Guntvr 6

# అభినందన

"భక్తి" అనగా "పరమప్రేమ" అని నారద భక్తిసూత్రములలో చెప్పబడినది వాస్తవమునకు భక్తికిని ప్రేమకును అర్థము ఒక్కటే! కాని, ప్రేమ అను పదమును లోకములో కామమునకు బదులుగాగూడ పొరపాటుగ వాడుచుండుటవలన భక్తి పవిత్రతను ప్రత్యేకించి చెప్పుటకు 'పరమప్రేమ' అని చెప్పవలసి వచ్చినదేమో! భౌతిక వసరములతో ముడిపడినది 'కామము', అవిధముగా కాక స్వార్థలేనిది 'ప్రేమ' 'పరమ' అనగా 'Absolute' అని పరమాత్మ పరముగాను, లేదా 'పరమ' అనగా 'ఉత్కృష్టమైన' లేదా 'మిక్కుటమైన' (supreme) అని సామాన్యముగను అర్థము చెప్పుకొనవచ్చును

పంచదార నీటిలోనున్నపుడు పంచదార తన ప్రత్యేకమైన అస్తిత్వమును కోల్పోయి, తానుగూడ నీటిలో ఇమిడిపోవును. నీటి పట్ల పంచదారకుగల ఇట్టిగుణముగా భక్తిని అర్థముచేసుకొనవచ్చును. నీటిసాన్నిధ్యములో కరిగిపోవు పంచదారవలెనే భగవంతుని సాన్నిధ్యములో భక్తుడు కరిగిపోవును. ఈ కరిగిపోయి, కలిసిపోవుటను సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యస్థితులలోని చివరిస్థితికి చెందిన భక్తిగా చెప్పుకొనవచ్చును

భార్యాభర్తలమధ్య ప్రణయకోపము వంటిదే భక్తునికిని భగవంతునికి మధ్యగల వైరభక్తి ఈ జంటలలోని ఇద్దరూ మధ్యలో ఎంతపోట్లాడుకొనిననూ చివరకు వారిరువురు ఒక్కటేగదా! మధ్యలో

కలుగజేసుకొనినవారు ఎవరివారగుదురు తానెప్పటికైనా భర్తను చెందవలసినదాననే అని భార్యను, భార్య ఎప్పటికైనా తనను చేర వలసినదేనని భర్తను తెలిసినట్లుగానే - ఆ ను ఎప్పటికైనా భగవం తుని చేరవలసినవాడనేనని భక్తుడు, భక్తుడు ఎప్పటికైనా తనను చేరవలసినవాడేనని భగవంతునికి తెలియును అందుచేతనే ఈ జంటల కథమధ్యలో ఎన్నెన్నైన అలజడులు ఏర్పడినను చివరకు కథ సుఖాం తమే అగును ప్రణయకోపమువచ్చి తీరినతరువాత అనురాగబంధము మరింత దృఢపడుటగూడ సహజము, సాధారణము అప్పుడు అట్టి వారిని విడదీయుటగూడ కష్టతరము

సనకసనందనాదులు జ్ఞానమార్గ సంప్రదాయమునకు సంబంధిం చినవారు జయవిజయులు భక్తిమార్గ సంప్రదాయమునకు సంబంధిం చినవారు ఈ రెండు సంప్రదాయములలోని సాధకబాధకములను గూర్చి చెప్పునదే జయవిజయులకథ

ఈ జయవిజయుల కథ వైరభక్తికి చక్కని కావ్యవస్తువు ఈ 'వైరభక్తిని' తన పరిశోధనాసిద్ధాంత శీర్షికగా ఎన్నుకొని, దానికి సంబంధించిన వివిధ సంస్కృత గ్రంథ గ్రంథములను పెదకి, అంశ లివిషయములను సేకరించి, క్రోడీకరించి అవసరానుకూలముగా విని యోగించి విషయమును వివరించుటలో అత్యంత శ్రద్ధాసక్తులను చూపి కృతకృత్యురాలైన డా (శ్రీమతి) నాగమణిని హృదయ పూర్వకముగా అభినందించుచున్నాను

ఈమె గళము గ్నుగంధురమంజుల మనోహరము. భక్తిగీత ములను ఆలపించుటకు తగిన సౌకుమార్యం, పవిత్రతలు ఈమెగళ మునకుగల ప్రత్యేకలక్షణములు ఈమె కలమునకుగూడా భక్తి విషయములో తగినసమగ్రత, జ్ఞానవిషయములో కావలసిన నద్వివేచన, విశ్లేషణ ప్రత్యేకలక్షణములుగా చెప్పుకొనవచ్చు నను టకు ఈ క్రిందనుదహరించిన విషయములే ఆధారములు.

భక్తినిగూర్చి, రసములలో భక్తికి ఇవ్వవలసిన స్థానమును గూర్చి తెలియవలసిన విషయములను సహేతుకముగా సప్రమాణిక ముగా విశదపరచుట

హిరణ్యాక్ష హిరణ్యకశిపుల, రావణ కుంభకర్ణుల, శిశుపాల దంతవక్త్రుల వృత్తాంతములను వివిధగ్రంథములనుండి గ్రహించి సంక్షిప్తముగ పొందుపరచి వాటిలో ఒకేవృత్తాంతమునకు సంబం ధించిన విషయము ఎట్లు వివిధరీతులలో తెలుపబడినదో ఎత్తిచూపి నిర్దుష్టమైన తన అభిప్రాయములో వీరిదైవంతమునకు సమన్వయపరచు టకు చేసినప్రయత్నము ప్రశంసనీయము

వివిధ సంస్కృతాంధ్ర గ్రంథములను సంగ్రహించుటయే కష్టము సంగ్రహించగలిగినను అవసరమగు విషయములను వాటి నుండి గ్రహించుట కష్టతరము పాఠకులకు శ్రమను తగ్గించి తాను కష్టపడి ‘వద్దించినవిస్తరి’వలె తన ఈగ్రంథమును రచించినది ఈ ప్రయత్నమువలన సామాన్యముగా తెలియని కొన్ని క్రొత్త విషయములు వెలుగులోనికి వచ్చినవి ఉదా ’- 1) ప్రహ్లాదునికన్న తల్లి లీలావతిగా లోకప్రసిద్ధము కాని పద్మపురాణములో ఈమె పేరు కళ్యాణి ఈమె ఉత్తానపాదుని కూతురు 2) మత్స్య కూర్మ పురాణములప్రకారము ప్రహ్లాదుడుగూడ నారాయణునితో యుద్ధ ముచేసి ఓడిపోయి నారాయణుని అనుగ్రహమునకు పాత్రుడయ్యెను

‘యజ్ఞో వైవిష్ణుః’ అన్న వచనమునకు వ్యాఖ్యానముగా వరా హావతారమునుపురించి వరాహాంగములు యజ్ఞాంగములకు సాదృశ్య గల సమన్వయమును విశదీకరించిన విధానము బాగున్నది

హిరణ్యాక్ష శిశుపాలురు నారాయణుని చేసిన నిందయందలి పదార్థములకు స్తుతిపరార్థమును ఇచ్చుచు శ్లేషణ పాఠకులకు చక్కని కానుక.

రావణాసురుని ఆయుస్సు 8 కోట్ల 50 లక్షల సంవత్సరములన్న విషయముగూడా పాఠకులకెరింగించుట కీవ్యాసము దోహదపడినది.

చిట్టచివరకు మోక్షవిషయమై ఈమెయొక్క, శ్రీరాధావర తత్త్వోపాసకులు అయిన బ్రహ్మశ్రీ ఆర్. వీరభద్రరావుగారియొక్క నిశ్చితాభిప్రాయమును ఆమె వ్రాసిన మాటలలోనే తెలియపరచి నా అభినందన వాక్యము ను ముగించెదను.

"జీవి ఒకసారి సంపూర్ణస్థితి పొందినపిదప శాపకారణముచే బాహ్యరూపాదికము లు మారినను స్వస్వరూప జ్ఞానము నశించదు. జయవిజయులు భగవత్సాన్నిధ్యము పొందిన సంపూర్ణమూర్తులు. బ్రాహ్మణశాపముచే రాక్షసజన్మ ఎత్తినను వారు స్వస్వరూప జ్ఞానమును మఱచిపోదురా? అట్లు మఱచిపోయినచో ఏ మోక్షపదము గూడ శాశ్వతము కాదన్నమాటే "

"సంపూర్ణస్థితినిపొందిన జీవి శాపకారణముచేనైనను స్వస్వరూపజ్ఞానమును మఱచిపోవునన్నట వేదాంతతత్త్వమునకు వెన్నుపోటు జడభరతుడు తనతరువాతి రెండుజన్మలలో స్వస్వరూపజ్ఞానమును మఱచిపోలేదు "

పైనచెప్పిన ప్రతిపాదనాపూర్వక సిద్ధాంతములోని సత్యమును నిర్ధారించుటకే డా॥ (శ్రీమతి) నాగమణి తన ఈపరిశోధనలో కృషి చేసినది. ఈకృషిలో ఆమెకు నిస్సంకోచముగా ధ్యేయము సిద్ధించినది. ఆర్షవిజ్ఞానపరముగు ఇట్టి పరిశోధనావిషయములను మరిన్ని వెలుగులోనికి తీసుకురాగల శక్తిసామర్థ్యములను, ఆయురారోగ్యైశ్వర్యములను భగవానుడు ఆమెకు ప్రసాదించవలెనని హృదయపూర్వకముగా ప్రార్థించుచున్నాను.

శ్రేయోభిలాషి
జి. ఎల్. యన్. శాస్త్రి
25-12-91

# నెనరు

### శ్రీ గురుభ్యోనమః

"పత్రి శీనప్ప సిరుంకుప్ప" అని పేర్గాంచిన ప్రసిద్ధనటుండగు పత్రి శ్రీనివాసరావు, సద్ధీమణి శ్రీమతి రమణమ్మ నాతలిదండ్రులు నిరంతర గోసేవ, సాధుసంతర్పణ వారి జీవనము పూజ్య శ్రీ శేషతీర్థస్వామివారిచే 'రాజర్షి' అనిసన్మానింపబడిన మహనీయులగు తండ్రి, త్రికరణశుద్ధిగా ఆయననుసరించుటతప్ప అన్యమెరుంగని సాధ్వి తల్లి - వారి గర్భవాసమున జన్మించిన పుణ్యమే నన్నింతవానను చేసినదని నా విశ్వాసము వారికట్టి కృతజ్ఞతలనో, నమస్కృతులనో పలుకబూనుట అవివేకమే కాగలదు జననమరణ చక్రబద్ధినైన యున్నంతకాలము ఆ పుణ్యదంపతుల సంతానముగా జన్మింపజేయుమని విశ్వవ్యాపికి నా వినమ్ర ప్రార్థనము.

శ్రీ దేవీగానసుధాకర, శ్రీ జ్ఞానానందతీర్థ దీక్షానామ, వింశతి శతాబ్ద వాగ్గేయకార, శ్రీ గాయత్రీ పంచాయతనపీఠ సంస్థాపకాచార్య బ్రహ్మశ్రీ ఓగిరాల వీరరాఘవశర్మగారు(కొవ్వూరు) అస్మద్గురువరేణ్యులు వాత్సల్యనిధియైన గురుదేవులు నానిరంతరాభ్యున్నతి నాకాంక్షించినారు మనస్థైర్యమునకు విఘాతము కలిగినప్పుడెల్ల "షడ్గుణయుత శమదమాది సంపద్విశిష్ట చిద్ఘనానంద సుధాకరుడై వెలిగే" సద్గురు చరణసరోరుహములే శరణ్యములైనవి రాజయోగి శ్రీ వీరరాఘవశర్మగారికి తగినయిల్లాలు శ్రీమతి పిచ్చమాంబాసతి "సహజ సంస్కారిణియైన ఇట్టిసాధ్వి నాకుపత్నిగా లభించుటవలననే నాజీవయాత్రలో పవిత్రమైన నిష్కామ భక్తియోగమును శ్రీమద్భగవతీ గాయత్రీదేవిని యారాధింపుచూ గృహస్థాశ్రమమును పవిత్రముగా గడపుచున్నాన"ని గురుదేవులు స్వయముగా పలికిన పలుకులు భర్తృ జీవనవాహినిలో ఆత్మలీనమైన 'ధర్మమునకు దర్పణము' మత్పురా

కృత శుభాధిక్యముచేత ఇట్టి గురుదంపతుల అవ్యాజ వాత్సల్యమునకు పాత్రమైతిని సాక్షాద్గాయత్రీస్వరూపులైన గురుదంపతుల చరణార విందములకు నాయీ గ్రంథ మంకితము ఇట్టిభాగధేయము నొసగిన ఆజన్మాంతాపితరులకు నానమస్సహస్ర ధిక సాష్టాంగప్రణతులు.

నావిద్యాభివృద్ధికి ప్రధాన కారకులు మాఅక్క శ్రీమతి రాధా బాయి, బావగారు శ్రీ భారద్వాజ హనుమంతరావుగారు అంతియ కాదు, యోగీశ్వరేశ్వరులైన గురుదేవుల కటాక్షము కలుగుటకును కారకులు. వారికి కృతజ్ఞతలు చెప్పికొనుటను భావచాఁపు ఈమట నామమాత్రముగాక ఆర్ద్రీకృతచిత్త విన్రతము

గుర్వనుగ్రహము, దైవానుగ్రహము నాపై సంపూర్ణముగ కలవని నా విశ్వాసము. గురుదేవుల నిరంతరస్ఫూర్తి, శ్రీను తిరుమల తిరుపతి దేవస్థానముల వారి ఆర్థికసహాయము ఇందులకు నిదర్శనము. ఈ గ్రంథప్రచురణకు తమ సంస్థానమునుండి పదివేల రూప్యముల ననుగ్రహించిన శ్రీ వేంకటేశ్వరస్వామివారికి శతకోటి ప్రణామములు. సంబంధిత కార్యనిర్వహణాధికారులకు మనఃపూర్వక కృతజ్ఞతలు.

పరిశోధనావ్యాజమున మహనీయ భావుల పరిచయభాగ్యము, ఆశీస్సులు లభించుట నాపుణ్యవిశేషము. పరిచితులచే 'నాన్నగారు' ని ప్రేమమీర పిలువబడు పరమయోగి, ఆగ్లవిద్యాధికారి బ్రహ్మశ్రీ ఆర్. వీరభద్రరావుగారు శ్రీరాధావరతత్త్వోపాసనము వారికి ఉచ్ఛ్వాసనిశ్వాసము. వ్యయప్రయాసలను గణింపక శ్రీరాధావర తత్త్వమును దక్షిణభారతమునకు సుబోధముచేయుటకు తమరచనల మూలమున, ఉపన్యాసముల మూలమున నిరంతర కృషిసల్పుచున్న మహనీయులు నాన్నగారు. వారి ప్రవచనముల నొండు రెండు భావుల మాత్రమే గ్రంథమున నుట్టంకించినను, అంతర్లీనముగ వారిప్రభావము నాపై సర్వతోముగ నున్నది. ఇంక బ్రహ్మశ్రీ ఉప్పలూరి పుస్తయ్య

శాస్త్రిగారు శ్రీనృసింహోపాసకులు వారు దయతో నాసందేహము లన్నింటిని తీర్చినారు వారలకు శతానేక ప్రణామములు

యం ఫిల్ పట్టమునకై "ప్రహ్లాదచరిత్ర - ఆంధ్రభాగవత పరిష్కారము"ను విషయమును పరిశోధించు కాలముననే 'వైరభక్తి' యందు చికీర్ష కలిగినది తద్గ్రంథ నిర్మాణమందాత్మాహ్వానమున నన్ను అనేకవిధముల ప్రోత్సహించిన మార్గదర్శకులు డా॥ గూర్లగడ్డ బాలగంగాధరరావుగారు సహాయగుణమే తానుగా రూపుదాల్చిన వారిఋణము తీర్చుకొనలేనిది కనుక సదా ఋణగ్రస్తనై యుండుటయే నాయభీష్టము వారి "నామాట" వ్రాసిన సహృదయతకు తార్కాణము

అభిప్రాయపూర్వక శుభాశీస్సుల నిచ్చిన పుంభావసరస్వతులు ప్రొఫెసర్ కోరాడ మహాదేవశాస్త్రిగారికి, ప్రొఫెసర్ శలాక రఘునాథశర్మగారికి, డా॥ జి యల్. యన్ శాస్త్రిగారికి నా భక్త్యంజలులు. నా పరిశోధనను ప్రశంసించుచు విద్వన్నివేదికలు పంపిన పరీక్షాధికారులకు నమస్సులు

కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్యగారు నాకు ప్రాతః స్మరణీయులు వారి శ్రీమద్భాగవతము, తృతీయస్కంధము, తృతీయభాగము నందలి ఉపోద్ఘాతమును నా గ్రంథమునకు అవతారికగా పొందగల్గుటచే ధన్యనైతిని పరిశోధనసమయమున శ్రీ ప్రసాదరాయకులపతి, కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారల భాగవత గ్రంథపఠన సంస్కారమెంతగానో ఉపకరించినది ఆమహనీయులకు నమశ్శతములు

శ్రీ గాయత్రీమాత చిత్రమునకు, గురుదంపతుల ఛాయాచిత్రమునకు తనపద్యముల నుపయోగించుకొనుటకు అంగీకరించిన శ్రీమతి మాలతికి నిరంతర గురుకటాక్షప్రాప్తిపూర్వక శుభాశీస్సులు

పరిశోధనావ్యాసగ్రన్థ రచనాకాలమున సంపూర్ణ సహకారమునందించిన మా శ్రీవారికి, అన్న శ్రీగోపాలకృష్ణకు, వదిన శ్రీమతి తులసికి నానమస్సుమాంజలులు ఇంక నా సమస్త సంస్కారములకు మూలము మా అరవింద తననుగూర్చి ఏమియు పలుకఁబోవుటయే నా హృద్గతభావమునకు స్పష్టరూపము. నా ఉన్నతికి పరోక్షకారకులైన శ్రీ మాధవ పెద్ది రాధాకృష్ణమూర్తిగారికి కృతజ్ఞతాంజలులు. ఈ గ్రంథరచన కనేకవిధముల సహకరించిన డా॥ రామకృష్ణగారికి, శ్రీ యస్ యల్. యన్ మూర్తిగారికి, ఇంకను ప్రత్యక్షముగను పరోక్షముగను సహకరించిన వారందరికి నామనఃపూర్వక కృతజ్ఞతలు.

గ్రంథస్థవిషయము ప్రస్ఫుటమగునట్లు ముఖచిత్రమును నను కూర్చిన శ్రీ జింకా రామారావుగారికి, దానిని అందముగా తీర్చిన గోల్డెన్ గ్రాఫిక్స్‌వారికి, చక్కగా ముద్రించియిచ్చిన పంచాక్షరీ ప్రెస్‌వారికి నా ధన్యవాదములు

ఇంక తుదిగా నాయీ గ్రంథమును విద్వన్మండలి ముందుంచు భాగధేయము నొసఁగిన భక్తవశంవదునకు నా సహస్రాధిక సాష్టాంగ ప్రణామములు.

"సా విద్యా యా విముక్తయే"

సుధీజనవిధేయ

నాగమణి





జ్ఞానానంద మనస్సరో విహారస్వేచ్ఛాలోలహంసీ శివ
ధ్యానానంద విచార్యనాకుశల సత్యజ్ఞాన యోగీశ్వరా
దీనానంద విజ్ఞాంతరంగిణి భవద్వైతస్వభావా శివా
మానానందతురీయ సౌఖ్యవరదా మాంపాహి మాహేశ్వరీ.



సంస్తుత్యంబహా ! నీచరిత్ర ! మహదాశ్చర్యంబు నిర్విఘ్నమా
సంస్తుత్యంబహా ! జీవనమ్ము ఘనమా సంసార తాపఘ్నమా
సంస్తుత్యంబహా ! నీదా కీర్తనము మోక్షద్వార సోపానమా
సంస్తుత్యంబహా ! పిచ్చమాంబ సతి సుజ్ఞానమ్ము శ్రీ రాఘవా!

నీలో(జూచితి నాదుమాత(బితరున్ చిద్రూపు(జౌ సద్గురున్
కైలాసాధిపు కూర్మిరాణిగిరిజన్ కైవల్యచింతామణిన్
కాలాతీతను కర్మనాశనము దుర్గ్రాహ్యంబు నీ తత్త్వమా
లీలామానుష వేషధారిణివి తల్లీ పిచ్చమాంబాసతీ.



గ్రంథకర్త్రి జననీ జనకులు.

శ్రీ పత్రి శ్రీనివాసరావు,

శ్రీమతి రమణమ్మ

# విషయసూచిక

అవతారిక



సత్యం విధాతుం నిజభృత్యభాషితమ్
వ్యాప్తించ భూతేష్వఖిలేషు చాత్మనః
అదృశ్యతాద్భుతరూపముద్వహన్
స్తంభేసభాయాం న మృగం న మానుషమ్





# అవతారిక

ఆధ్యాత్మిక సాధనయందు ముఖ్యముగా రెండువిధములైన సంప్రదాయములు అనాదినుండియు అనుష్ఠింపబడుచున్నవి. అందొక మార్గమున సాధకుడు ఐహికసాధులతోగాని, యోగసాధనతోగాని తనకలోశములను శుద్ధిచేసికొని జితేంద్రియత్వమును సాధించుకొని శక్తి సంపన్నుడగును. అట్టివాడు నిరంతరము తన ప్రవర్తనమును చక్కబరచుకొనుచు ధర్మాధర్మ నిర్ణయములను నిరాకరణచేసి వివేకము, వితర్కము మున్నగు సాధనములతో పురోగతి సాధించును. రెండవ సంప్రదాయము ననుసరించిన సాధకుడు భక్తిప్రధానమైన సాధనము చేయును. అతని సాధనమునకు సర్వసమర్పణ బుద్ధియే మూల సూత్రము. తానెరిగిన ధర్మాధర్మములను గూర్చిన నిర్ణయము లు తనవిగావు. ఇందు మొదటిసంప్రదాయము ననుసరించువారు తమ సామర్థ్యము నభివృద్ధిచేసికొని దైవానుగ్రహమునకు అర్హతను సమ కూర్చుకొనువారు. రెండవమార్గము ననుసరించువారు అర్హతను గూర్చి పట్టించుకొనక దానిని తముపాసించు దైవమునకే వదలి వేయువారు. ఇందు మొదటివారిని జ్ఞానులనియు, రెండవవారిని ప్రపన్నులనియు చెప్పుదురు. జ్ఞానులకు తమ అర్హతనుగూర్చిన శాస్త్రత తమకు సంబంధించినది. ప్రపన్నుల విషయమున అది తమ దైవమునకు సంబంధించినది.

ఈరెండు మార్గములలో మొదటిమార్గమువారికి పొరపాటు లున్నచో పతనము తప్పదు. ఎంత తెలిసినవారైనను నిర్ణయము తమది అయినపుడు తముపొరపాట్లకు తామే బాధ్యులు. ఈపొరపా

ట్లను సర్దుకొని దైవమునకు తమయెడ ఆనుకూల్యము కలిగించుకొను యత్నముండును ఇక రెండవతరగతివారు పొరపాట్లు చేసినచో బాధ్యత తమదికాదు కనుక వారి మార్గమున పతనములేదు ఈ ఇరు మార్గములవారికిని క్రమశిక్షణ విషయమున, కర్తవ్య నిర్వహణము విషయమున సాధనముఖ్యము! అది లేనిచో రెండుసంప్రదాయముల వారికిని తిరోగతియేగాని పురోగతిలేదు కర్తవ్యమును నిర్వహించి కర్తవ్యమును నిర్వహించి పరిపూర్ణత నార్జించుకొన జూచువారు మొదటితరగతివారు కర్తవ్యము నిర్వహించుకొని దానిని భగవదర్పితముగా విడచిపెట్టువారు రెండవతరగతివారు ఈ రెండుతరగతుల వారును వరుసగా జిజ్ఞాసువులు, ముముక్షువులు అనబడుదురు ప్రస్తుత గ్రంథభాగమున నీ ఇరుతెగల వారి వైఖరులను చిత్రించి యుపదేశపూర్వకమైన జ్ఞానమిచ్చుట ప్రధానసారాంశము అందు మొదటి తరగతివారి కుదాహరణముగా సనకసనందనాదులు, రెండవ తెగ వారి కుదాహరణముగా జయవిజయులు చిత్రింపబడిరి దైవానుగ్రహమునకు ఏ తెగవారెట్లు పాత్రులో నిరూపణ చేయుటయే ఈ భాగమందలి జయవిజయుల కథలో ముఖ్యాంశము సనకాదులు వైకుంఠనగరము నారోహణచేసి క్రమముగా విష్ణుస్థానమును చేరుకొనుట వారిజీవితసాధనకు సంకేతము సనకాదులు తమ ఆరోహణ మార్గమున సర్వము విష్ణుమయముగా చూచునట్టి సాధనచేసిరి ఈ సాధనలో ఆరు కక్ష్యలుదాటి ఏడవకక్ష్యయందు పొరబడిరి అనగా ద్వారపాలకుల రూపమునందు విష్ణువునకన్న అన్యము నంగీకరించిరి. దానితో వారికి విష్ణువు మొగల గర్భసీమాయక ద్వారపాలకు లడ్డగించిరి జయవిజయు లట్లుగాక, కేవలము కర్తవ్య నిర్వహణమే తమ సర్వస్వముగా గలవారు దానితో వారు కేవలము విష్ణులోకమునందలి భాగములుగ స్థిత్వమందిరి

మొదటి సాధనకు ఫలితము గా సనక దులు ద్వారపాలకులను శపించుట జరిగినది రెండవమార్గము నకు సంబంధించిన జయవిజ యులు తమ్ము శపించిన ఋషులలో కూడ అన్యమును దర్శింపక మిుల గిరి ఈ రెండుతరగతులవారికిని భగవంతుడొసగిన శాశ్వత ధర్మ రూపమైన పరిపాకారమార్గమే ద్వారపాలకుల శాపకథగా నిరూపింప బడినది సనకాదులు విష్ణువునకుకూడ గౌరవనీయులైనవారు జయ విజయులు తనకొలువులోని వారు అందు సనక దులు కొంత వేరుగా చూడబడువారు జయవిజయులు తనవారుగా చూడబడు వారు అని విష్ణువుచేసిన వివరణమునకు సారాంశము ఎవరిని గౌర వింపవలెనో వారు కొంచెము దూరస్థులగుట సత్యము ఎవరిని వేరుగా గౌరవింపనక్కరలేదో వారియందంతర్యామి భావన కరిపూ ర్ణము గనుక సామీప్య, సాయుజ్య, సారూప్యాదులు సిద్ధించినవని నిరూపింపబడినది "మీవంటి పెద్దలను గౌరవించుటలో భంగము కలిగినచో నా బాహువులనైన ఖండింతును కనుక జయవిజయులకు మీరిచ్చిన శాపము సంగీకరించితిని" అని నారాయణుడు పలుకు టలో సనకాదులు పరిపూర్ణతకు దూరస్థులనియు, జయవిజయులు నారాయణుని బాహువులవలె కనిచేయుచున్నారనియు వివరింప బడినది ఇది శాశ్వత ధర్మగోప్త అయిన నారాయణుని ధర్మసూత్ర ములలో నొకటిగ నిరూపింపబడినది

లోకమున జ్ఞానముచేత, తిక్ష స్సుచేత, శీలము దచేత గౌరవింప బడువారు కొందరు, వారిని గౌరవించువారు కొందరు గౌరవింపబడు వారు గౌరవించువారిలో నారాయణుడున్నాడని మరచినచో బాధలు తప్పవు ఇది రెండవ ధర్మాంశము "నేను మీచరణధూళిని శిరస్సున

ధరించి ఇట్లు నారాయణునకుగా నుండగలిగితిని" అని విష్ణువు సనకాదులతో పలుకును నారాయణుడు ఋషుల చరణధూళిని శిరస్సున ధరించెననగా పెద్దల చరణధూళి నారాధించు దాసులలో నారాయణుడున్నాడని భావము. దానిని ఎరచినవారు ఎన్నివేల సంవత్సరములు తపస్సుచేసి జితేంద్రియత్వము సాధించినను శాపములిచ్చుటయున్నగు. పౌరపాలులచేత దెబ్బతిందురు

---

కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య, శ్రీమద్భాగవత ప్రకాశము, తృతీయస్కంధము తృతీయభాగము, ఉపోద్ఘాతము

# వైరభక్తి

సంస్కృతాంధ్రసాహిత్యముల తులనాత్మక పరిశీలనము

## భక్తి - నిర్వచనము

> "వాత్సల్యాదభయ ప్రదాన సమయాదార్తార్తి నిర్వాపణాత్
> ఔదార్యాదఘ శోషణాదగణిత శ్రేయః పద ప్రాపణాత్
> సేవ్యశ్శ్రీపతిరేక యేవ జగతామ్ స ప్యత్ర పట్సాక్షిణః
> ప్రహ్లాదశ్చ విభీషణశ్చ కరిరాట్పాంచాల్యహల్యాధ్రువః"

హైందవ జీవనమునకు, ఆర్షధర్మమునకు నవినాభావ సంబంధము. ఆర్షధర్మమునైన భక్తిజ్ఞాన వైరాగ్యములు ఆధ్యాత్మజీవనమునకు ఆత్యుత్తమ మార్గములు. భక్తివలనజ్ఞానము, జ్ఞానమువలన వైరాగ్యము సిద్ధించును కావున భక్తిశేషద్వయ సాధకమనుట నిర్వివాదము భక్తిలేని జ్ఞానము నిరుపయోగము

భక్తులకు భగవానుఁడు వారియొక్కగ్రత ననుసరించి తగిన ఫలముల నొసఁగును ఇట్టివానికి దృష్టాంతములు కావలెను ఇందులకా ప్త వాక్యమైన ఆర్షవాఙ్మయమే ప్రమాణము. భక్తులకు సేవ్యుఁడైన పరమ పురుషుఁడెవరను సందేహము కలుగువారికి లోకోత్తరమార్గమును జూపినది పై శ్లోకము. ఆర్తులు భగవంతుని శరణు జొచ్చుట సహజము. ఐహిక సుఖరక్తులైనవారు భగవంతుని స్మరింతురని భాగవతుల అభిప్రాయము.

> "శ్రీ కుంఠ పద్మాక్ష హరే మురారే
> గోవింద దామోదర మాధవేతి

వక్తుం సమర్థోఽపి న వక్తి కశ్చిత్
అహో జనానాం వ్యసనాభిముఖ్యమ్"

అని కులశేఖరులు 'ముకుందమాల' యందు విషయలో మును నిరసించినారు[1] ఇట్టి విషయవాంఛల నుండి విము నొసర్చి సంకీర్తనమును జేయింపుమని భగవంతుని ప్రార్థింపవలె! భక్తులను హెచ్చరించినారు.

"శ్రీవల్లభేతి వరదేతి దయాపరేతి
భక్తప్రియేతి భవలుంఠన కోవిదేతి
నాథేతి నాగశయనేతి జగన్నివాసే
త్యాలాపనం ప్రతిపదం కురుమే ముకుంద"[2]

అని భగవంతుని శరణు వేడవలెను ప్రభావయుక్త మానవుని కంటె భగవంతుడెవ్వడను ప్రశ్న నాటికిని నేటికిని మతమున వినిపించుచునే యున్నది. వారిలో తీవ్రమైన అ మున్నవారే వైరభక్తులైనారు. వారిని నాస్తికులనుటకు వీల వైరభక్తులకు దైవసంబంధ జ్ఞానమున్నది. నాస్తికులకా జ్ఞానము

వైరభక్తియను వ్యవహారము రూఢము గావించుటకు స భక్తి శబ్దార్థమును విచారింపవలసియున్నది. భక్తి అను శబ్దమ ధాతు ప్రత్యయములను వేఱుచేసినచో 'భజ్' ధాతువునకు అర్థము 'క్తిన్' ప్రత్యయమునకు భావమర్థము. అనగా భ మున కవయవార్థము సేవించుట కాని భగవద్విషయకమైన భక్తిగా లోకమున ప్రసిద్ధినందినది. భగవంతునియందలి ప్రేమ

---

1 ముకుందమాల వ్యాఖ్యానము - శ్రీ భాష్యం అప్పలాచార్యులు శ్లోకము - 33 పుట - 37

2 ముకుందమాల శ్లోకము - 2 పుట - 2

యని నారదభక్తిసూత్రము 1 ఈ భక్తి నిర్వచనము ప్రీతి భావమునకే వర్తించును ఆలక్షణము "యథా వ్రజగోపికానామ్" — గోపికల భక్తివంటిదని యచటనే పేర్కొనబడినది కాని భగవంతుని సేవించు నుపాయములనేకములగుటచే నింతవఱకే పరిమితము కావవసరము లేదు ముముక్షువులకు ప్రేమరూపమైన భక్తి సాధన మని భక్తి సూత్రములు తెలుపును భక్తివలన, జ్ఞానము, జ్ఞానమువలన వైరాగ్యము కలుగునని అచటనే ప్రతిపాదితము కర్మజ్ఞానములకంటె భక్తిమార్గము శ్రేష్ఠము 2 కర్మజ్ఞానయోగముల ఫలమదృష్టము భక్తిఫలము ప్రత్యక్షానుభోగ్యము 3 ఈభక్తికి సాధనములు విషయ త్యాగము, సత్సాంగత్యము, అఖండస్మరణము, గుణశ్రవణ కీర్తనము, మహాత్ముల దయ మున్నగునవి

ఇవియన్నియు సామాన్య విషయములు భగవదనుగ్రహ విశేషముచే పాండిత్యాదులలోను, వయోభేదములోను నిమిత్తము లేకయే అపూర్వభక్తి కలుగవచ్చును నిఖిలజన సేవ్యుడైన అట్టి భగవత్స్వరూపమెట్టిదనియు, భగవచ్ఛబ్దార్థమేది యనియు ప్రాచీనులు

---

1 "అథాతో భక్తిమ్ వ్యాఖ్యాస్యామః",
"సాత్వస్మిన్ పరమ ప్రేమరూపా"
నారదభక్తి సూత్రములు, 1వ, అధ్యాయము, 1, 2 సూత్రములు పుట 3

2 'సాతు కర్మజ్ఞాన యోగేభ్యోప్యధికతరా"
1వ అధ్యాయము 25వ, సూత్రము, పుట 45
'తస్యాః జ్ఞానమేవ సాధన మిత్యేకే"
1వ, అధ్యాయము, సూత్రము 28, పుట 51
అన్యోన్యాశ్రయత్వ మిత్యన్యే"
1వ, అధ్యాయము, సూత్రము : 29, పుట : 52

3. "ఫలారూపత్వాత్" 1,వ అధ్యాయము, సూత్రము 26, పుట 47
నారద భక్తి సూత్రములు

మీమాంస చేసినారు 'భగ' శబ్దమునకు భాష్యము వ్రాయుచు శంకరభగవత్పాదులు

"ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశసః శ్రియః
జ్ఞాన వైరాగ్య యో శ్చైవ షణ్ణాం భగ ఇతీరణా"[1]
అని వ్యాఖ్యానించినారు
"ఉత్పత్తిం ప్రలయం చైవ భూతానామగతిం గతిం
వేత్తి విద్యామవిద్యాంచ సవాచ్యో భగవానితి"[2]

అని భగవచ్ఛబ్దమును కూడ వివరించినారు. సమగ్రమైన ఐశ్వర్యము (శాసనాధికారము), సమగ్ర ధర్మ స్వరూపము, యశస్సు, సంపద, జ్ఞానము, వైరాగ్యమునను ఈ ఆరు గుణముల సముదాయమునకు 'భగ' మని పేరు. ఈ భగమెవ్వని యందు కలదో ఆతడు భగవంతుడు. కావుననే ప్రాణుల పుట్టుక, ప్రళయము, స్థితిగతులు, సంసారము, మోక్షమునను తత్త్వము లెవ్వని యధీనములందుండునో అతడే భగవంతుడు. భగవంతుని భక్తుడు భాగవతుడు. భగవంతుని కథయు, భాగవతుల కథయు భాగవతమగును. అట్టి భాగవతమే దేవుని లీలలు వర్ణించినదో అతడే జగత్సేవ్యుడు. ఫలప్రాప్తి దృష్టాంతము లుండుటచే నారాయణుని పరదైవముగా భావించి, సేవించిన వారే భాగవతోత్తములైనారు.

## భక్తికి రసత్వము

రసమనగా నానందము. కావ్యరసమును ఆనందదాయకమగుటచే రసశబ్దము చేతనే వ్యవహరింపబడును. విభావానుభావ వ్యభిచారీ సంయోగముచే రస నిష్పత్తి సంభవించునని రససూత్రము

---

1, 2 విష్ణుసహస్రనామము, శంకరభాష్యము, శ్లోకము : 78, పుట : 182 విక్రమ సంవత్సరము 2026

ఆనంద సఖండమయ్యు దానిని పొందు మార్గములు భిన్నములగుటచే రసోపాధి రూపములు స్థాయి భావములని వ్యవహృతములు నిర్వికారాత్మకమైన చిత్తమున ప్రథమ స్పందనభావము, భావములన్నింటికిని స్థాయిత్వము సంభవింపదు ఆలంకారికులు ముప్పదిమూడు వ్యభిచారి భావములు, తొమ్మిది స్థాయి భావములు పేర్కొనినారు కొందఱు సాత్త్విక భావములను పేరిట మఱి యెనిమిది భావములను చెప్పినారు ఈసాత్త్విక భావములు అనుభావ భేదములుగ మమ్మటాదులు భావించి, విభావానుభావ వ్యభిచారి భావములనే రసోపకరణములుగ నిర్దేశించినారు విద్యానాథాదులు సాత్త్వికమునుగూడ రసోపకరణములందు చేర్చినారు

ఈ విభావానుభావ వ్యభిచారి భావముల సంయోగము ఒక క్రమమునననుసరించి జరుగును ఆ క్రమము చర్వణా వేగముచే వెనువెంటనే గోచరింపదు కావున రసధ్వనినే అసంలక్ష్యక్రమ ధ్వనియని వ్యవహరించినారు ఈ దశయందు వ్యభిచారి భావములనన్నిటి నతిక్రమించి, స్థిరరూపమును బొంది రసరూపమున బరిణతి చెందునది స్థాయి భావము ఒకే భావము విభావాది పోషణననుసరించి స్థాయియును, సంచారియును కావచ్చును.1 భావములన్నియు స్థాయిభావములగుట కర్హత కలవైనను ఎనిమిది భావములనే స్థాయి భావములుగా భరతముని గుర్తించినాడు. శాంతము ప్రకృతియనియు, మిగిలిన ఎనిమిది రసములును దాని వికృతులనియు భరతమతము 2 తరువాతివారైన

---

1 "రత్యాదయః స్థాయిభావాః స్యుర్భూయిష్ఠాః విభావజాః
స్తోకం విభావైరుత్పన్నాః తఏవ వ్యభిచారిణః"
జగన్నాథ పండితరాయలు, రస గంగాధరము, ప్రథమాననము, పుట 16

2 "శాంతాద్భావాః ప్రవర్తంతే భిన్నహేతు సమాశ్రయాత్
భావో వికారో రత్యాదిః శాంతస్తు ప్రకృతిర్మతః

ఉద్భటాదులు శాంతమునుకూడా రసముగ సంగీకరించినారు వారు ప్రతిపాదించిన మతమును సమర్థించుచు జగన్నాథుడు నిర్వేదముకూడ అభినేయమే కావున శాంతము తొమ్మిదవ రసమనియే సిద్ధాంతీకరించినాడు 1 దృశ్యకావ్యములందు శాంతరసము సంగీకరించకునివ దుకూడ అభినయమవసరము లేని మహాభారతాదులయందు దానిని రసముగా సంగీకరించుటకు బాధలేదు కావున శాంతమును తొమ్మిదవ రసముగా సంగీకరించి తీరవలెనని జగన్నాథుని ప్రతిపాదనము.2

ఈ తొమ్మిదిరసములలో ప్రధాన రసమేదియను విషయమున మతభేదములున్నవి. భవభూతి తన ఉత్తరరామ చరితమున కరుణ మొక్కటియే రసమనియు, ప్రవాహములోని నీరు అలలుగను, సుడులుగను, నీటిబుడగలుగను మారినట్లు కరుణమే రసాంతరముగ వివర్తమును బొందుననియు పేర్కొనినాడు 3 ఇది యాలంకారిక మతము కాకపోయినను, ప్రసిద్ధకవి సమ్మతమగుటచేత మతభేదముగా ప్రసిద్ధికెక్కినది

---

పునర్నిమిత్తా పాయేతు తత్రైవ పరిలీయతే"
రసగంగాధరము, పీఠిక - పుట 38

1 రసగంగాధరము, పుట 153

2 "యైరపి నాట్యే శాంతో రసః నాస్తీత్యభ్యుపగమ్యతే
తైరపి బాధకాభావాత్ మహాభారతాది ప్రబంధానామ్
శాంతరస ప్రధాన తయా అఖిలలోకానుభవ సిద్ధత్వాచ్చ
కావ్యేసః అవశ్యం స్వీకార్యః" రసగంగాధరము, పుట 156

3 'ఏకోరసః కరుణయేవ నిమిత్తభేదాత్
భిన్నః పృథక్పృథగివాశ్రయతే వివర్తాన్
ఆవర్తబుద్బుద తరంగ మయాన్ వికారాన్
అంభోయథా సలిలమేవ హి తత్సమస్తమ్"
భవభూతి, ఉత్తరరామచరితమ్, తృతీయాంకము శ్లోకము 47, పుట : 202

శృంగారమే ప్రధానరసమని భోజుని ప్రతిపాదనము 1 శృంగారము ప్రధాన రసముగుటకు ఆనందవర్ధనుని "శృంగార యేవ మధురః పరః ప్రహ్లాదనో రసః' (ధ్వన్యాలోకము, ద్వితీయోద్ద్యోతము) అను వాక్యము ఆధారమై యుండును కాని వాత్సల్యము రసముగా చెప్పుటకాధారములు లేవు

రససంఖ్య యీవిధముగ నెనిమిదియొద్దనో, తొమ్మిదియొద్దనో ప్రామాణికముగ నిలువవలసియుండును లేనిచో భరతముని వాక్యమప్రమాణికమగును.

ఈ విషయమునే జగన్నాథుడిట్లు వివరించినాడు "అథ కథమేతే యేవ రసాః భగవదాలంబనస్య రోమాంచ అశ్రుపాతాదిభిః అనుభావితస్య హర్షాదిభిః పరిపోషితస్య భాగవతాది పురాణశ్రవణ సమయే భగవద్భక్తైరను భూయమానస్య భక్తి రసస్యాదుర పహ్నవత్వాత్ భగవదనురాగరూపా భక్తిశ్చాత్ర స్థాయిభావః న చాసౌ శాంతరసే అంతర్భావమర్హతి అనురాగస్య వైరాగ్య విరుద్ధత్వాత్ ఉచ్యతే - భక్తేః దేవాది విషయ రతిత్వేన భావాంతర్గత తయా రసత్వానుప పత్తేః

"రతిర్దేవాది విషయా వ్యభిచారీ తథాంజితః
భావప్రోక్తః తదాభాసా హ్యనౌచిత్య ప్రవర్తితాః"

ఇతిః ప్రాచాం సిద్ధాంతాత్ నచత్వ్రితకామినీ విషయాయాః అపి రతేర్భావత్వాపత్తు, రతిత్వా విశేషాత్, అనువా భగవద్భక్తే రేవ

---

1. 'శృంగారవీర కరుణాద్భుత రౌద్రశాంత
బీభత్స వత్సల భయానక హాస్యనామ్నః
అమ్నాసిషుః దశరసాన్ సుధియోవయంతు
శృంగారమేవ రసనాద్రసమా మనామ"
భోజుడు, శృంగారప్రవేశిక, మంగళాచరణశ్లోకము 8 పుట 1

స్థాయిత్వమ్, వినిగమకాభావాత్, ఇతి వాచ్యమ్ భరతాది ముని వచనానామేవా త్ర రసభావత్వాది వ్యవస్థాపకత్వేన స్వాతంత్ర్యా యోగాత్ అన్యథా పుత్రాది విషయాయాః అపి రతేః స్థాయి భావత్వమ్ కుతో నస్యాత్ నస్యాద్వా ఇతః శుద్ధ భావత్వం జుగుప్సా శోకాదీనామ్, ఇత్యఖిల దర్శనమ్ వ్యాకులీస్యాత్ రసా నామ్ నవత్వ గణనాచముని వచన నియంత్రితా భజ్యేత, ఇతియథా శాస్త్రమేవ జ్యాయః"[1]

'ఈ రసములు తోమ్మిదే యెట్లగును? భగవంతుడు ఆలంబన ముగా కలిగి రోమాంచము, అశ్రుపాతము మున్నగు అనుభావములను బొంది, హర్షాగులచే పరిపోషితమై భాగవతాది పురాణశ్రవణ సముయమున భగవద్భక్తుచే ననుభవింపబడు భక్తిరసము పరిహరింప రానిది కదా! భగవంతుని యందలి అనురాగరూపమైన భక్తి యిచట స్థాయిభావము ఇది శాంతిరసము నందంతర్భవింపదు అను రాగము వైరాగ్యవిరుద్ధముకదా అను పూర్వపక్షము వివరించి సమా ధానమిట్లు చెప్పినాడు—

భక్తి దేవాది రతి విషయమగుటచేత భావాంతర్గతమగును గాన దానికి రసత్వమనుపపన్నము దేవాది విషయకమైన రతియును, వ్యంజనా విషయమైన వ్యభిచారి భావము ను భావధ్వని విషయములు అట్లయినచో స్త్రీవిషయకమైన రతియును భావము కాకూడదా? ఇచ్ఛయనునది భగవంతుని యందైనను, స్త్రీ విషయకమైనను గుణ ప్రవృత్తి సమానముకదా! ఒకదానినే ఒకవిషయమున రసమనియు, వేఱొక విషయమున భావమనియు చెప్పుటకు ఏకపక్ష సమర్థకమైన ప్రమాణము లేదుకదా! అనగా భరతాది మునివచనమే రసభావ ములను నిర్ణయించుట యందు ప్రామాణికమనుటచే స్వాతంత్ర్యము

1 జగన్నాథపండితరాయలు రసగంగాధరము, పుట 262

నవలంభింపరాదు అట్లు ప్రమాణముకానిచో పుత్రాది విషయక మైన రతికూడ స్థాయిభావ మేలకారాదు? జుగుప్సా శోకాదులకు శుద్ధ భావత్వమంగీకరింపరాదా? ఇట్టి ప్రశ్నలుత్పన్నము లగుటచే నవస్థా దోషముకలిగి, శాస్త్రమంతయు వ్యాకులమగును. భరతముని సమ్మతమై ప్రామాణికమైన నవరస సిద్ధాంతము[1] భగ్నమగును కావున శాస్త్రానుసారముగ తొమ్మిది రసములని పేర్కొనుటయే న్యాయము

జగన్నాథుడిట్లు పేర్కొనుట మధుసూదన సరస్వతి 'భక్తి రసాయనము'ను దృష్టిలో నుంచుకొని చేసిన వ్యాఖ్యగా కొందఱను చున్నారు మధుసూదన సరస్వతి విభావానుభావ వ్యభిచారి భావ సంయోగ విషయమేదైనను రసవిషయము కావచ్చుననినాడు భక్తి-రస సిద్ధాంతమును పేరుపెట్టి చెప్పకున్నను జగన్నాథుడు రసప్రతీతి వాదములలో మధుసూదన సరస్వతి మతమునుకూడ నుదహరించినాడు 'భావనావిశేషముచేత సహృదయునకు తన సహృదయ ధర్మముచే తెలియబడిన విభావాదులచే సంపర్కము నొందిన ఆయాస్థాయి భావ ములతో కూడిన చిత్తవ్యాపారము యోగికి సమాధియందు కలిగినట్లు

---

1 తొమ్మిదవ రసమైన శాంతముకూడా భరతసమ్మతమైనట్లును దానిని మమ్మటుడు స్వీకరించినట్లును వామనాచార్యులు మమ్మటుని కావ్యప్రకాశమునకు 'బాలబోధిని' పేరిట వ్యాఖ్యానము వ్రాయుచు పేర్కొనినాడు "శృంగార హాస్య కరుణ రౌద్రవీర భయానకాః బీభత్సాద్భుత సంజ్ఞౌ చేత్యష్టౌ నాట్యేరసాఃస్మృతాః" — కావ్యప్రకాశము, చతుర్థోల్లాసము, కారిక - 29, సూత్రము , 44 ఈ కారిక భరతుని నాట్యశాస్త్రమున 6వ అధ్యాయమున నున్నట్లును, దానికే మార్పును లేకుండ మమ్మటుడు స్వీకరించినట్లును బాల బోధిని, పుట 98లో వామనాచార్యులు వ్యాఖ్యానించినారు 'నిర్వేదః స్థాయి భావోస్తి శాంతోఽపి నవమోరసః — (కావ్యప్రకాశము, సూత్రము : 47, కారిక - 35, పుట - 117) అను సూత్రమీ వ్యాఖ్యకు ప్రమాణము

రసాస్వాద సమయమున సహృదయునకు కలుగును. తన్మయీ భావ
మని ఫలితార్థము ఇట్టి రసానందము లౌకికమైన మానసిక వ్యాపా
రము కాకపోవుటచే నది లౌకిక సుఖములతో పోల్చదగినదికాదు.
కావున లౌకిక వాసనావరణము తొలగిన పిమ్మట కలిగెడి చిదానంద
విశిష్టమైన రత్యాది స్థాయిభావము రసమని యర్థము ' ఇంకను మధు
సూదన సరస్వతి మతమిది[1] యని జగన్నాథుడు

'ప్రథమమున సహృదయుడు కావ్యరూపమున శబ్దమును వినును.
తరువాత పదముల యర్థము అతని మనసున చేరును అప్పుడు సహృ
దయ ధర్మముచే తాను చూచుచున్న లేదా వినుచున్న పాత్రతో
తాదాత్మ్యమును పొందును పరిణామ స్వభావము గల మనసు
ఆపాత్రయొక్క మనసుగా రసాస్వాదమున ప్రవర్తించును విభావాను
భావ వ్యభిచారి భావములు సాధారణీకరణ స్థితి తరువాత నలౌకికమైన
భావమును బోధించును ఈ మూడు భావముల కలయికచే స్థాయి
భావమునందు పర్యవసాయి యగు సమూహాలంబనాత్మకమగు మాన
సిక వృత్తి ప్రేక్షకునకు లేదా శ్రోతకు కలుగును తరువాత నాస్థితి
వలన నుత్తమ సుఖము వ్యక్తమగును అట్టి యానందమునే పూర్వా
చార్యులు కొందఱు రసమని చెప్పుచున్నారు '

ఇట్టి యభిప్రాయమును ప్రతిపాదించిన మధుసూదన సరస్వతి
తన 'భక్తిరసాయనము'న భక్తిని ప్రత్యేక రసముగా పరిగణించినాడు

పై వివరణముచే, రససంఖ్యను నిర్దేశించిన జగన్నాథుడు తన

---

1 "జ్ఞాతాః స్వపర సంబంధాదన్యే సాధారణాత్మనా అలౌకికా బోధయంతి
భావమ్ భావాశ్రయోవ్యమి భావత్రితయ సంసృష్ట స్థాయి భావావగాహినీ
సమూహాలంబనాత్మికా జాయతే సాత్త్వికీమతిః సానంతరక్షణే వక్ష్యం
వ్యనక్తి సుఖముత్తమమ్ తద్రసః కేచిదాచార్యాః తామేవతు రసమ్ విదుః"
రస గంగాధరము, పుట : 115

కంటె పూర్వుడైన మధుసూదన సరస్వతి గ్రంథమును చూచియే యుండుననియు, దానిని బట్టియే భక్తికి ప్రత్యేక రసత్వము లేదని అభిప్రాయ పడియుండుననియు చెప్పవచ్చును చైతన్య సంప్రదాయాను సారియగు శ్రీల రూపగోస్వామి ప్రభుపాదులు భక్తిని రసముగా నిరూపించి, విభావాను భావ వ్యభిచారి భావ నిరూపణము చేసి, వాని కన్నింటికిని సోదాహరణముగా కృష్ణపరముగ సమన్వయము చేసినారు రూపగోస్వామి తన భక్తిరసామృత సింధువు'లో దక్షిణ విభాగమును పేరిట ఐదు అధ్యాయములతో నీ నిరూపణమును మిక్కిలి విస్తారముగ చేసియున్నారు. అది ప్రకరణానుసారము నిరూపింపబడును

మధుసూదన సరస్వతికన్నను ప్రాచీనకాలముననే భక్తి రసాంతరమను వాదమున్నట్లు ప్రాచీన గ్రంథముల వలన తెలియనగును దేవతా విషయకమైన యిచ్ఛ అహంకార పరిహారము ప్రధానోద్దేశముగా కలదియగుటచే శాంతరసములో నంతర్భవించునని విశ్వనాథుడు కావ్యప్రకాశ వ్యాఖ్యానమున ప్రతిపాదించినాడు 1 సాహిత్యదర్పణ కర్తయు, కావ్యప్రకాశ వ్యాఖ్యాతయునగు విశ్వనాథుడు క్రీ శ 1800 - 1880 సం॥ వరకు జీవించియున్నట్లు పండితులు నిరూపించినారు 2 కావున ప్రాచీన కాలమునుండి భక్తికి రసత్వమును పండితు లంగీకరించుచున్నారనియే చెప్పవచ్చును కొందఱు విమర్శకులీ వాదమును నిరాకరించినను ప్రత్యక్షానుభవ సిద్ధమగు భక్తికి రసత్వమపరిహార్యము.

---

1 "అస్యాశ్చ దేవతా విషయ రతేరపి స్వీకారేణ అహంకార రహితత్వే శాంతే అంతర్భావః

కావ్యప్రకాశ దర్పణము, చతుర్థోల్లాసము కారిక, , 35, పుట 119

2 "The date above assigned to Viswanadha between 1300–1380 A D is thus conformed by unimpeachable and independent testimony ' — History of sanskrit poetics,

P V Kane, Page No 302

రస శబ్దమునకనేకార్థము లున్నవి "రసః స్వాదేజలే వీర్యే శృంగారాదౌ విషేద్రవే బోలే రాగే గృహే ధాతౌ తిక్తాదౌ పారదే పిచ ప్రేమి భావే వాస్యాత్మ నిచ సుపేయే స్వరసే సుఖే" అని పదునాని మిది అర్థములను హేము కోశమునుండి విమర్శకు లుదాహరించినారు 1 వీనిలో రసపదార్థమునకు కావ్యమున నన్వయించు స్వాదము, శృంగారాదులు, రాగము, ప్రేమ, భావము, సుఖమునను ఆఱును ప్రస్తుతార్థములు. ఇవి యన్నియును మానసిక వ్యాపారములు రస శబ్దమునకు కర్త్రర్థమున 'రసతి ఇతిరసః', కర్మార్థమున 'రస్యతే ఇతిరసః', భావార్థమున 'రసనమ్ రసః' అని విగ్రహము చెప్పవచ్చును కావున పై యాఱు అర్థములలో కావ్యోపయోగి యగు నానంద వ్యాపారము ఏదియైనను రసమని సామాన్యార్థము. రస ప్రతీతియు ప్రాచీన సంస్కారమున్నవారికే కలుగునని యాలంకారికుల సిద్ధాంతము 2 ఈ సంస్కారమే వాస్తవానందము భాసించుటకు మూలకారణము. భక్తునియందును భగవన్నామ స్మరణము చేయునపుడు తొలుత లౌకిక దృష్టి యుండవచ్చును కాని క్రమముగా తాను భావించు మూర్తి మనోగోచరమైనపుడు తాదాత్మ్యమును బొందును అందువలన సాధారణీకరణము సంభవించి బాహ్యవ్యాపారములు మఱచును. బాహ్యవ్యాపార విస్మృతివలనను, ఆనందదాయకమగు భగవత్స్మరణము వలనను రససిద్ధి - అనగా నానందానుభవము కలుగును భక్తునకు నామస్మరణ సందర్భమున రోమాంచాశ్రు పాతాదులను అను భావములు సంభవించును అట్టి యను భావ సంపత్తి కలుగనిచో నాతనికి భక్తి సిద్ధింపదు భక్తి సిద్ధుడగుటకు తనకట్టి అనుభావములను కలుగజేయుమని భక్తుఁడు భగవంతుని ప్రార్థించును

---

1 రస గంగాధరము, పీఠిక పుట - 20

2. "ప్రాగ్భవ విష్ఠ వాసనా రూపోరత్యాదిరేవ రసః"

రసగంగాధరము, పుట - 106

"బద్ధేనాంజలినా నతేన శిరసా గాత్రైః సరోమోద్గమైః
కంఠేన స్వరగద్గదేన నయనేనోద్గీర్ణ బాష్పాంబునా
నిత్యం త్వచ్చరణారవింద యుగల ధ్యానామృతా స్వాదినా
మస్మాకం సరసీరుహాక్ష సతతం సంపద్యతాం జీవితమ్"1

ఇట్టి ప్రార్థనచే భక్తుడు భగవ దనుగ్రహమువలన నీయను భావములను పొందగలడు వానిచే భగవత్తాదాత్మ్యమునకు సౌలభ్య మేర్పడి సిద్ధిని పొందగలడు. భక్తాగ్రేసరుడగు రామదాసును ఈయభి ప్రాయమునే సూచించినాడు.

"రామ హారే కకుత్స్థకుల రామ హారే రఘురామ రామ శ్రీ
రామ హారే యటంచు మదిరంజిల శ్లోక గళంబు లీల నీ
నామము సంస్మరించిన జనంబు భవంబెడ బాసి తత్పరం
ధామ నివాసులౌదురుట దాశరథీ కరుణాపయోనిధీ"

ఈ శ్లోకగళ యనగా స్వచ్ఛ్రగానమును అనుభావమే ఈ యన. భావము విభావమును సిద్ధింప జేయును విభావమనగా కారణము, అను భావము కార్యము సంచారీ భావము సహకారి 2 కార్యకారణ సహ కారులగు విభావానుభావ వ్యభిచారులతో రసము వ్యంగ్యమైనట్లే భక్తి సిద్ధియును ప్రత్యక్షానుభవ సిద్ధమగును ఇచట తొలుత విభా వము, తరువాత అనుభావము అను వరుస పాటింపవలసియున్నది కాని

---

1 కులశేఖరులు - ముకుందమాల శ్లోకము -21, పుట - 52

2 "కారణాన్యథ కార్యాణి సహకారీణి యానిచ
రత్యాదేః స్థాయినో లోకే తానిచేన్నాట్య కావ్యయోః
విభావానుభావా స్తత్ కథ్యంతే వ్యభిచారిణః
వ్యక్తస్సతైః విభావాద్యైః స్థాయిభావో రసస్మృతః"
కావ్యప్రకాశిక, చతుర్థోల్లాసము, కారికలు - 27, 28 సూత్రము - 43, పుట - 85

వీనిలో స్పష్టముగ శాబ్ద్యాదృ క్రకంచముననకు కన్పించునది భక్తియందు అను భావము మాత్రమే రసము ప్రతీయమాన మగునపుడు వీనిలోనే రెూక్కటి స్పష్టముగ నున్నను, మిగిలిన రెండును దానికంగభూతములై సహకారులగును 'భావధ్వని' అనిపేర్కొనిన పక్షమునకూడ భక్తి అసంలక్ష్యక్రమధ్వని విషయమగును ఈ యసంలక్ష్యక్రమ ధ్వనికే 'రసధ్వని'యని పేరు కావున భక్తికి రసమని పేరుపెట్టినను, పెట్టకున్నను రసప్రతిపత్తియున్నట్లే చెప్పనగును భావధ్వనియు నసంలక్ష్యక్రమ విషయమని ఆలంకారికులు పేర్కొనినారు

"రసభావ తదాభాస భావశాంత్యాది రక్రమః
ధ్వనేరాత్మాంగి భావేన భాసమానో వ్యవస్థితః"[1]

రసము, భావము, రసాభాసము, భావాభాసము, భావశాంతి మున్నగువవి అసంలక్ష్యక్రమ ధ్వనికి విషయములు వీనికి కావ్యము న ప్రాధాన్యముండవలెను అక్రమమనగా విభావానుభావ వ్యభిచారుల క్రమము లేనిదని యర్థము కాని క్రమము లేకుండ రసప్రతీతి యుండదు కావున వీని సంయోగము వేగముగ జరుగునపుడు వాని క్రమము చక్రభ్రమణమునందలి యాకులవలె స్పష్టముగా కన్పట్టదని భావము దీనినే లోచనకారుడు రసధ్వనియని పేర్కొనుచు,

"ఏవం రసధ్వనే రేవ అమీ భావధ్వని ప్రభృతయః నిష్యందా ఆస్వాదే ప్రధానం ప్రయోజక మేవాంశం విభజ్య పృథగవ స్థాప్యతే యథా గంధయుక్తిజ్ఞ వికరస సమ్మూర్ఛితా మోదోప భోగేఽపి శుద్ధ మాంస్యాది ప్రయుక్తమిదం సౌరభమితి. రసధ్వనిస్తు స యేవయోఽత్ర ముఖ్యతయా విభావానుభావ వ్యభిచారి సంయోజ

---

1 ధ్వన్యాలోకము, ద్వితీయోద్యోతము, కారిక - 3, పుట - 369

నోదితస్థాయి ప్రతిపత్తికస్య ప్రతిపత్తుః స్థాయ్యంశ చర్వణాప్రయుక్తః
ఏవ ఆస్వాద ప్రకర్షః"[1]

'ఎచ్చట విభావానుభావ వ్యభిచారుల సంయోగముచే రసము నాస్వాదించువారికి భావము స్థాయిగా గోచరించునో అట్టియాస్వాద ప్రకర్షయే రసము'నినాడు కాని రససంఖ్యను మాత్రము నిర్దేశింప లేదు భావధ్వని మున్నగునవి యున్నియు రసధ్వనియొక్క భేదములే అనియు, ఆస్వాద ప్రధాన ప్రయోజకత్వ రూపమైన అంశమే వీనికి భేదకమనియు, విభావానుభవ వ్యభిచారి సంయోగమను సామాన్యాంశ మున్నను రసధ్వని, భావధ్వని అనుపేరిటి విశేషాంశములవలన నివి భిన్నపదములచే వ్యవహరింపబడుననియు పేర్కొనినారు కావున ప్రసిద్ధ లాక్షణికుల మతమున భావధ్వనికి రసధ్వని ప్రతిపత్తికలదనియు, భక్తికి భావధ్వని యను వ్యవహారము సాంకేతికమే కాని అనుభవ న్యూనతాబోధకము కాదనియు చెప్పవచ్చును

ముమ్మట భట్టును ఆనందవర్ధనుని యభిప్రాయము ననుసరించు చునే రసభావాదులు రసధ్వని విషయములని పేర్కొనినాడు

"రసభావ తదాభాస భావశాంత్యాది రక్రమః
భిన్నో రసాద్యలంకారా దలంకార్యతయా స్థితః"[2]

పై విషయ వివరణము ననుసరించి ప్రాచీనుల యభిప్రాయమున భక్తికి రసత్వ ప్రతిపత్తిని గూర్చిన చర్చకు సారాంశమిది

భక్తి ప్రయత్న సాధ్యము కాదు భగవదనుగ్రహము వలన సాధ్యమగు సిద్ధి విశేషము అట్టి సిద్ధికిని అంతర్గత సంస్కారముండ

---

1. ధ్వన్యాలోక లోచనము, అభినవగుప్తుడు
రసభావః కారికా వ్యాఖ్య, పుట - 377

2 కావ్యప్రకాశము, చతుర్థోల్లాసము 26వ కారిక, సూత్రము 42, పుట 84

వలెను ఆ సంస్కారము లేకున్నను భగవంతుని శరణు జొచ్చుటచే భక్తిసిద్ధి సాధ్యము

భక్తి శబ్దమునకు సేవయని యౌగికార్థము భగవద్విషయక రతి యని రూఢ్యర్థము దేవాది విషయకమైన భక్తి భావము ఇది భావధ్వని విషయము ఈ భావమును సంజ్ఞ శాస్త్రప్రసిద్ధమైన సాంకేతిక నామమేకాని, రసాస్వాదమునకు విరోధమైనదికాదు భావధ్వని యందును రసాస్వాదనతో సమానమైన ఆనందానుభూతి యుండును. అందువలననే ఇది రసధ్వని విషయమైనది

## భక్తి రసమను వారి వాదము

భక్తి భగవత్సాన్నిధ్యము చేరుటకు మార్గము అట్టి భక్తి ప్రధానములైన కావ్యములు, స్తోత్రగ్రంథములు ఏవియో కొన్ని కావు, రసభరితములైన కావ్యములుగా వవతరించినవి తక్కువ అనియే చెప్పవచ్చును. భారతజాతికి శ్రీమద్రామాయణ, భారత, భాగవతములు మహానిధానములు భాగవతము పురాణము, మహాభారత మితి హాసము, శ్రీమద్రామాయణము కావ్యము వీనిలో భక్తిప్రధాన మైనది భాగవతము

భక్తిలోగల వివిధమార్గములలో మధురభక్తి బహుజనాదరణీ యము మధుర భక్తి సంప్రదాయవాగుల మతమున భగవంతుడు పురుషమూర్తి, భక్తులు స్త్రీప్రకృతులు గోపికలు కూడ ఒకనాడు సుమార్గులేయను కథయొకటి ప్రచారములోనున్నది దానికి ఉపబలక ముగా,

"యత్సౌందర్యమవేక్ష్య జీర్ణ మునయో వా శాంబు పర్ణాశనాః
హ్యైర్యం నార్య ఇవాపనర్య సహసాం సంత్యజ్యలజ్జామపి సంభోగం
కిల వవ్రుః "

అను శ్లోకమొకటి పౌరాణికులు చెప్పుదురు రామావతారమున శ్రీరాముడు దండకారణ్యమున చరించునపుడు అచటి మహర్షులాయన దివ్యరూపమునకు సమ్మోహితులై సంయోగమును కోరిరనియు, ఆకోర్కెను ద్వాపరమున తీర్చగలనని శ్రీరాముడు వారికి చెప్పినట్లును, వారే ద్వాపరమున గోపీలుగా జన్మించిరనియు రూపగోస్వామి 1

ఇక భాగవతము నందలి 'గోపికాగీతము'ను వేఱుచేసి చూచినచో దశమస్కంధము నందలి నాలుగధ్యాయములును (29 - 32) రసభరితమైన కావ్యమనియే చెప్పవచ్చును వీనియందు కూడ శృంగారమునకంటె గోపికల ముముక్షుత్వమునకే ప్రాధాన్యమున్నట్లు పురాణములు నిగదితమొనర్చినవి సుఖదుఃఖములు ప్రారబ్ధము ననుసరించి కలుగును జీవికి ఏది ప్రియహేతువో అది సుఖము ఏది అనిష్టమో అది దుఃఖము 2 పాప పుణ్యములకును, సుఖదుఃఖములకును సంబంధమున్నది సుఖానుభూతివలన పుణ్యక్షయము కలుగును దుఃఖానుభవమువలన పాపక్షయమగును ఇట్లు సుఖదుఃఖానుభూతుల వలన పుణ్యపాపములు నశింపగా సిద్ధించిన నిర్గుణ స్థితియే మోక్షము అంతియేకాని కేవల పుణ్యము మోక్షహేతువు కాదు ఈ విషయమును ప్రాచీనులిట్లు నిరూపించి, దానిని గోపికా గీతలయందే సమన్వయించినారు

---

1 భక్తి రసామృత సింధువు, పుట 118

2 ' యద్యత్ప్రియమ్ తత్సుఖమ్ తదాహుః
తదేవ దుఃఖమ్ ప్రవదంత్యనిష్టమ్
ఇష్టంచ మేస్యాదితరచ్చ న స్యాత్
ఏతత్కృతే కర్మవిధిః ప్రవృత్తః"
శ్రీమహాభారతము, శాంతిపర్వము, 194వ అధ్యాయము, శ్లోకము 10
పుట : 1052

"తదప్రాప్తి మహాదుఃఖ విలీనాశేష పాతకా
తచ్చింతా విపులాహ్లాద క్షీణ పుణ్యచయా తథా
చింతయంతీ జగత్సూతిం పరబ్రహ్మ స్వరూపిణమ్
నిరుచ్ఛ్వాసతయా ముక్తిం గతాన్యా గోపకన్యకా"1

రాస క్రీడయందు తొలుత యమునా నదీ తీరమున గోపికలతో కృష్ణుడు విహరించినాడు అందువలన వారికి 'సౌభాగ్యమదము' కలిగి నదట భక్తునకు మదముండరాదు భక్తు ననుగ్రహింపదలచినచో భగవంతుడు స్వయముగా పూనుకొని అతనిలోని మదాంశను తొల గించును శ్రీకృష్ణునకు గోపికలలోని ఈ సౌభాగ్యమదమును తొల గింప వలెనను అనుగ్రహబుద్ధి కలిగినది

"తాసాం తత్సౌభగమదమ్ వీక్ష్యమానంచ కేశవః
ప్రశమాయ ప్రసాదాయ తత్రైవ అంతరధీయత' 2

శ్రీకృష్ణుని యంతర్ధానము వలన ఏకకాలమున సుఖాను భూతియు, దుఃఖానుభూతియు కలిగినవి కృష్ణాంతర్ధానము మహా దుఃఖము దాని ననుభవించుటచే పాప క్షయమైనది కృష్ణచింతన మాహ్లాద హేతువు. ఆ సుఖానుభూతి వలన పుణ్యక్షయమైనది పాపపుణ్యములను ప్రారబ్ధము తొలగి పోవుటచే గోపికలు ముక్తులై నారని విష్ణుపురాణమున వర్ణితము

అందువలన భక్తి సమస్త పురుషార్థ సాధకము, శ్రేయో దాయకము ఇట్టి భక్తిని భారతీయ వాఙ్మయములో రసముగా

---

1 విష్ణుపురాణము, 5వ అంశము, 13వ అధ్యాయము శ్లోకములు: 21, 22 పుట : 402

2 శ్రీమద్భాగవతము, దశమస్కంధము, 29వ అధ్యాయము శ్లోకము : 48 పుట 488

సూచించిన తొలి కావ్యము1 జయదేవుని 'గీత గోవిందము'న వచ్చును

ఇతడు గౌడ (నేటి బెంగాల్ ప్రాంతము) దేశస్థుడు పన్నెండవ శతాబ్దికి చెందినవాడు 2 జయదేవుడు శృంగార భక్తితముగా కావ్యమును కూర్చినట్లు బాహ్యదృష్టికి కాన్పించును దానికి తోడి కావ్యమును

"వాగ్దేవతా చరణ చిత్రిత చిత్త సద్మా
పద్మావతీ చరణ చారణ చక్రవర్తి
శ్రీ వాసుదేవ రతికేళి కథా నిబంధ
మేతం కరోతి జయదేవ కవిః ప్రబంధమ్"3

అని కవియే పేర్కొనుటయు నీ యనుమాన మునకు దోహదము కలిగించును. కాని యీ యనుమానమును పరిష్కరించుచు హరిస్మరణకు నిదియొక సాధనము మాత్రమేనని కవియే చెప్పికొనిన విషయమును శృంగార ప్రబంధవాదులు విస్మరించు చున్నారు హరిస్మరణమే కావ్యలక్ష్యమని జయదేవుడు నిశ్చ్యప్రచనముగా పేర్కొనినాడు

---

1 గీత గోవిందమునకు కావ్యలక్షణములున్నవా యను సంశయమునకు సమాధానముగా నది కావ్యమేయని శ్రీ తల్లావఝల శివశంకర స్వామి నిరూపించినారు దీని ననుసరించియే వారు రచించిన 'పద్మావతీ చరణ చారణ చక్రవర్తి' అను ఖండకావ్యమున కననగును

2 'The transitional stage between pure lyric and pure drama a lyrical drama though dating from the twelfth century is the earliest literary specimen of primitive type of play that still survives in Bengal and must have preceded the regular drama The Poem contains no dialogue in the proper sense
సంస్కృత సాహిత్య ఇతిహాసః పుట 78

3. గీతగోవిందము, ప్రథమసర్గ, శ్లోకము 2 పుట . 1

"యది హరిస్మరణే సరసమ్ మనః
యది విలాస కళా సు కుతూహలమ్
కమల కోమల కాంత పదావ లీమ్
శృణు తదా జయదేవ సరస్వతీమ్"1

వీనిలోనొకదాని కన్నను మఱియొకటి బలవత్తరము అది యథా పూర్వము హరి కథాసక్తి యున్నవాఁడే హరి విలాసముల నాకర్ణించుట యందను రక్తుఁడగును ఆ విలాస సరసత జయదేవోక్తి యందే కలదని శ్లోకార్థము కావున హరిస్మరణమే జయదేవుని పరమాశయము ఆ హరి స్మరణము మనః పూర్వకముగ జరుగవలెను అట్టి మనస్సు సరసమై యుండవలెను భక్తికిని, రసమునకును సమన్వయము లేనిచో నిది సాధ్యము కాదు జయదేవుడు సభక్తికముగు మనస్సునకు పర్యాయముగనే "సరసమ్మనః" అను పదమును ప్రయోగించినట్లు గ్రహింపవచ్చును భక్తి రసమును వాదమునకు అంకురార్పణమిట్లు పన్నెండవ శతాబ్దము లోనసే జరిగినట్లు దీనివలన విశదమగును

ఈ వాదమునకు ప్రాణ ప్రతిష్ఠగావించిన వాఁడు శ్రీల రూప గోస్వామి భక్తిని రసమని సోపపత్తికముగ నిరూపించినవాఁడు రూపగోస్వామి యొక్కఁడే యనుట అతిశయోక్తి కాదు. ఇతఁడును, జీవ గోస్వామియు సన్నదమ్ములు వీరు కర్ణాటక బ్రాహ్మణ వంశము నకు చెందినవారు 2 వీరి పూర్వులు పదునాల్గవ శతాబ్దమున వంగదేశమునకు వలస వచ్చినారు చైతన్యుని కృష్ణభక్తి ప్రచారోద్యమము వీరి నాకర్షించినది రూపగోస్వామి తన భక్తిరసామృత సింధువు', 'ఉజ్జ్వల నీలమణి' యను గ్రంథముల రెండింటిని భక్తిరస

---

1 గీతగోవిందము ప్రథమసర్గ శ్లోకము 3 పుట : 2
2 History of Sanskrit Poetics, P V Kane Page 314

శాస్త్రములని పేర్కొనినాడు జీవగోస్వామి చైతన్యుని [illegible] నందలి ఆధిభౌతిక తత్త్వమునుగూర్చి పరిశోధన చేసినాడు [illegible] రూపుడు క్రీ శ 1470 నుండి క్రీ శ 1554 వరకు జీవించియుండురని పి వి కాణేగారు అభిప్రాయపడినారు 1

రూపగోస్వామి రచించిన రెండు గ్రంథములలోను ఉజ్జ్వల నీలమణికన్నను భక్తిరసామృతసింధువు ప్రసిద్ధిపొందినది. శాపున అందలివిషయమే యిట నిరూపింప బడుచున్నది భక్తిరసామృత సింధువు నాలుగు విభాగములుగ విభజింపబడినది పూర్వవిభాగమున నాలుగు లహరులు కలవు వానిలో సామాన్యభక్తి, సాధనభక్తి, భావభక్తి, ప్రేమభక్తి యనునవి క్రమముగా నిరూపితములు రెండవ దైన దక్షిణ విభాగమున భక్తి రసమని నిరూపితము ఈవిభాగము నందు అయిదు లహరులున్నవి మొదటి నాల్గింటియందు క్రమముగా రససాధనములగు విభావ, అనుభావ, సాత్త్విక, వ్యభిచారిభావము లును, పంచమ లహరియందు రసోపాధియైన స్థాయిభావమును నిరూ పితములు భగవద్విషయక రతియే భక్తిరసమునకు 'స్థాయియనియు, అది శుద్ధమైనపుడు ముఖ్యరసమనియు, రసాంతర మిళితమైనపుడు గౌణభక్తిరసమనియు నిందు వివృతము మూడవదియైన పశ్చిమ విభాగమున నైదు లహరులున్నవి వానియందు వరుసగా శాంత భక్తిరసము, ప్రీతిభక్తిరసము, ప్రేయోభక్తిరసము, వత్సలభక్తి రసము, మధురభక్తిరసము ననునవి నిరూపితములు ఇక నాల్గవదియైన ఉత్తరవిభాగమున తొమ్మిది లహరులు కలవు వీనిలో నాయా రస ములతో కూడినపుడుకూడ భక్తిరసము మిశ్రిత రసనామములతో

---

1 Sanathana and Rupa were alive in 1554 A D and died in the same year at the interval of a few months So the life of Rupa extended from about 1470 A D to 1554 A D
P V Kane Page 315

సుపపదముగా వ్యవహృతము అవి క్రమముగా హాస్యభక్తిరసము, అద్భుతభక్తిరసము, వీరభక్తిరసము, కరుణభక్తిరసము, రౌద్రభక్తిరసము, భయానకభక్తిరసము, బీభత్సభక్తిరసము ననునవి ఇవి వరుసగా నేడులహరులలోని విషయములు అష్టమలహరియందు రసమైత్రీవైరములు వివృతములు తుదిలహరియందు రసాభాసము నిరూపితము.

రూపగోస్వామి ఉత్తమ భక్తిలక్షణముల నిట్లు నిరూపించినాడు

"అన్యాభిలాషితాశూన్యం జ్ఞాన కర్మాద్యనావృతమ్
ఆనుకూల్యేన కృష్ణానుశీలనం భక్తిరుత్తమా"1

ఇతరాభిలాషలు లేనట్టిదియు, జ్ఞాన కర్మాదులచే ఆవరింపబడనిదియు, అనుకూలముగ కృష్ణానుశీలనము చేయునట్టిదియునగు భక్తి ఉత్తమమైనది

"సాలోక్యేత్యాది పద్యస్థ భక్తోత్కర్ష నిరూపణమ్
భక్తేర్విశుద్ధతావ్యక్త్యా లక్షణే పర్యవస్యతి"2

భక్తుల యుత్కర్షను నిర్ణయించు సాలోక్యాది శ్లోకము ఈ భక్తిలక్షణ ప్రసంగమున అనుపయోగమయ్యును ఏల ఉదాహృతమైనది? దానికి సమాధానము చెప్పబడుచున్నది- ఈ భక్తునియందు అన్యాభిలాషలేని శుద్ధభక్తి యుండుటచే అతడు సాలోక్యాది ముక్తులను స్వీకరింపడు. అందువలన ఈ పద్యమునందున్న భక్తోత్కర్ష

---

1 భక్తిరసామృతసింధువు, పూర్వవిభాగము, ప్రథమలహరి,
శ్లోకము - 11, పుట - 8

2. ,, ,, ప్రథమలహరి
శ్లోకము - 16 పుట - 5

నిరూపణము భక్తిరయుక్త విశుద్ధత్వ ప్రకాశముద్వారా శుద్ధభక్తి లక్షణమున పర్యవసితమగుచున్నది

భాగవత మంగీకరించిన భక్తివిధానముల నన్నింటిని రూప గోస్వామి లక్ష్యముగ గ్రహించినాడు

"తస్మాత్కేనాప్యుపాయేన మనః కృష్ణే నివేశయేత్"1

అను శ్లోకమునందు భాగవత దృష్టాంతములుగా చూపబడిన ముక్తిమార్గములన్నియు భక్తికి సాధనములుగ సంగీకరించుటచే వైరానుబంధమును గూడ ముక్తిమార్గమున నితడంగీకరించెనని చెప్ప వచ్చును దేవర్షి నారదోక్త ప్రకారములలో వైరానుబంధము మిగి లిన వానికంటె సులభసాధనముగ భాగవతమున ప్రతిపాదితము 2

ఇదిగాక పద్మపురాణమునందలి శ్లోకమును కూడ సాధనభక్తి నిరూపణమున ప్రమాణముగ రూపగోస్వామి చూపినాడు

"పాద్మేచ

"స్మర్తవ్యః సతతం విష్ణుర్విస్మర్తవ్యో న జాతుచిత్
సర్వే విధి నిషేధాః స్యురేతయోరేవ కింకరాః"3

భాగవతమున వైరానుబంధమునందు సతత స్మరణము కలుగు నని వర్ణితము. సంస్కృత భాగవతమున భయ, వైరమిశ్రిత భక్తికి

---

1 యథా సప్తమే (7-1-31) అని భాగవతమునందలి శ్లోకమే ఇట నుదా హరణముగ ప్రదర్శితము

భక్తిరసామృతసింధువు, పూర్వవిభాగము, ద్వితీయలహరి, శ్లో॥ 4 పుట-16

2 "యథా వైరానుబంధేన మర్త్యస్తన్మయ తామియాత్
న తథా భక్తియోగేన ఇతిమే నిశ్చితామతిః" 7-1-27

3 భక్తిరసామృతసింధువు, పూర్వవిభాగము, ద్వితీయలహరి శ్లో॥ 8 పుట-17

చూపబడిన దృష్టాంతము పోతనభాగవతమున భయమిశ్రిత భక్తి దృష్టాంతమైనది 1

సర్వరసములును సామాన్యముగ భక్తివిషయము లగును విశేష నిషేధములు తరువాత నిరూపింపబడును. ప్రధానరసములు శృంగార వీరములు వీనిని భక్తిమార్గములుగ స్వీకరించిన సందర్భములు ఇతిహాసములయందు ప్రసిద్ధమైనవి ఈ రెండురసములును సాధనములగుటకు ఆరసములచేత భక్తులుగా ప్రసిద్ధులైనవారికి ప్రత్యేక కారణములున్నవి మధురభక్తి శృంగారమిశ్రితము ఈరసమునకు రాసక్రీడయే పరమోదాహరణము తరువాతివారికి అది సాధనమగుటచే వారు ముక్తులగుటకు స్మరణ సంకీర్తనములే వారివిషయమున ప్రాధాన్యము వహించినవనుట అనుభవసిద్ధము గోపికలు పూర్వజన్మమున మహర్షులు అందువలన వారి శృంగార భక్తి సకారణము ఆ విషయమును రూపగోస్వామి యిట్లు నిరూపించినాడు

"పురా మహర్షయః సర్వే దండకారణ్యవాసినః
దృష్ట్వా రామం హరిం తత్ర భోక్తుమైచ్ఛన్ సువిగ్రహమ్"
"తే సర్వే స్త్రీత్వమాపన్నాః సముద్భూతాశ్చ గోకులే
హరిం సంప్రాప్య కామేన తతో ముక్తా భవార్ణవాత్" 2

ఈభక్తి కామరూపమైనదని పేర్కొన్నను, వీనిలో రసస్థానమును స్వీకరించునది శృంగారమా భక్తియా అను అనుమానము

---

1 "కీటః పేశస్కృతా రుద్ధః కుడ్యాయాం తమను స్మరన్" 7-1-28
"ఏవంకృష్ణే భగవతి మాయామనుజ ఈశ్వరే" 7-129
"కీటకము దెచ్చి భ్రమరము పాటవమున బంభ్రమింప" 7-16

2 భక్తిరసామృతసింధువు, పూర్వవిభాగము, ద్వితీయలహరి, శ్లోకములు - 301, 302 పుట - 119

రాకతీరదు రసాంతరమేళనమునకు భక్తియే రసమని రూపగోస్వామి సిద్ధాంతము భక్తిరసత్వమును సోపపత్తికముగా నతఁడిట్లు నిరూపించి నాఁడు

"విభావైరనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః
స్వాద్యత్వం హృది భక్తానామానీతా శ్రవణాదిభిః
ఏషా కృష్ణరతిః స్థాయీ భావో భక్తిరసో భవేత్" 5

కృష్ణరతిరూపమైన యీస్థాయిభావము విభావము, అనుభావము సాత్త్వికము, వ్యభిచారి యున్నగు భావముల ద్వారా శ్రవణాదులచే భక్తజనుల హృదయములయందు ఆస్వాద్యత్వమును పొందినచో భక్తిరసమగును

"ప్రాక్తన్యాధునికీ చాస్తి యస్య సద్భక్తి వాసనా
ఏషభక్తి రసాస్వాద స్తస్యైవ హృది జాయతే" 6

జన్మాంతర సంబంధమైన లేదా ఆధునికమైన భగవద్భక్తి వాసన ఎవనికి యుండునో వాని హృదయమునందే భక్తిరసాస్వాదము పుట్టును

"భక్తి నిర్ధూత దోషాణాం ప్రసన్నోజ్జ్వల చేతసామ్
శ్రీ భాగవత రక్తానాం రసికా సంగ - రంగిణామ్" 7

"జీవనీభూత గోవిందపాదభక్తి సుఖశ్రియామ్
ప్రేమాంతరంగ భూతాని కృత్యాన్యేవాను తిష్ఠతామ్" 8

"భక్తానాం హృదిరాజంతీ సంస్కార యుగలోజ్జ్వలా
రతిరానంద రూపైవ నీయమానా తు రస్యతామ్" 9

"కృష్ణాదిభిర్విభావాద్యైర్గతైరనుభవాధ్వని
ప్రౌఢానంద చమత్కార కాష్ఠామాపాద్యతే పరామ్" 10

భక్తి ప్రభావముచే సర్వదోషములు సమూలముగ పెకలింపబడగా ఎవని చిత్తము ప్రసన్నమగునో (శుద్ధ సాత్త్విక విశేషము ఆవిర్భవించుటకు యోగ్యము, ఉజ్జ్వలము నై యున్నదో), ఎవరు భగవానుని యందు అనురక్తులో, రసిక జనుల నిత్య సాంగత్యమున కుతూహలురై యున్నారో (ఉల్లాసాతిరేకము), ఎవరు శ్రీగోవింద చరణారవిందముల యందలి భక్తి సుఖ సమృద్ధినే జీవాతువని ఎఱుంగుదురో, ప్రేమయొక్క అంతరంగము మొదలైన శ్రవణ కీర్తనాదులను నియతముగ అనుష్ఠించుచున్నారో ఆ భక్తులందలి హృదయములయందు విరాజిల్లు ప్రాక్తనమైన ఆధునికమైన వాసనా ద్వయముచే ఉజ్జ్వలమైన ఆనందస్వరూపమగు రతియే అనుభవవేద్యము. అది శ్రీ కృష్ణాది విభావాదుల సాహచర్యమున ఆస్వాదనీయతను పొంది పరమ ప్రౌఢానంద చరమ సీమను పొందును 1

ఇట ఆలంబనోద్దీపన విభావములన్నియు కృష్ణ మధురభక్తి పరముగ మాత్రమే అన్వయింపబడినవి దక్షిణ విభాగమంతయు నిట్టి నిరూపణమునకే పర్యాప్తము.

ఇక రెండవదియైన వీరరసము భక్తికి విషయముగుట ఉత్తర విభాగమున విస్తృతముగా వివృతము. అనగా నిందు వీరభక్తి రసము నిరూపితము

“సేవోత్సాహ రతిః స్థాయీ విభావాద్యైర్నిజోచితైః ।
ఆనీయమానా స్వాద్యత్వం వీరభక్తి రసో భవేత్”—1

తనకు తగిన విభావాదుల సహకారముచే ఉత్సాహరతి స్థాయిభావరూపమున ఆస్వాదనీయత్వమును పొందినచో ‘వీరభక్తిరసము’ అగును.

---

1 భక్తిరసామృత సింధువు, దక్షిణ విభాగము, ప్రథమలహరి శ్లోకములు 8 నుండి 10 పుటలు 146, 147

"యుద్ధ దాన దయా ధర్మైశ్చతుర్ధా వీర ఉచ్యతే
ఆలంబన ఇహ ప్రోక్త ఏష ఏవ చతుర్విధః" —2

"ఉత్సాహ స్యేవ భక్తానాం సర్వేషామేవ సంభవేత్" —3

ఈవీరభక్తిరసమున యుద్ధవీరము, దానవీరము, దయావీరము, ధర్మవీరము అను భేదములతో భక్తచతుష్టయమే ఆలంబనముగా చెప్పబడినది. ఒకానొక భక్తునియందు యుద్ధోత్సాహము, మరియొకని యందు దానోత్సాహము మున్నగురూపములతో ఈ ఉత్సాహరతి భక్తులందరిలోను సంభవమగును[1]. వైరమును భక్తిసాధనముగ పేర్కొనుటకిదియే ప్రమాణము. వీరభక్తిరసమనియే ఉత్తర విభాగమునందలి తృతీయలహరికి పేరు. భాగవతమున 'వైరానుబంధమ'ని వర్ణితమైనదే వీరభక్తిగా నిందు వివృతము.

"భక్తిరసామృత సింధువు భక్తిరసమును ప్రతిపాదించు శాస్త్రీయ గ్రంథము. దీనిలో శ్రీరూపగోస్వామి సాహిత్య శాస్త్రమున స్వీకరింపబడిన రసములను భక్తిలో పర్యవసితము చేసెను. భక్తిని ముఖ్యరసముగా భావించి మిగిలిన సాహిత్య శాస్త్రమున రసత్వస్థానము లభింపక పోవుటచే రసమునకు సంబంధించిన సమస్త ఉపకరణములను ఈరూపముతో భక్తిలో ఘటిల్ల జేయవలెననియు, దానివలన భక్తికి రసరూపము నిచ్చుటలో కావ్య శాస్త్రీయదృష్టితో నెట్టి యాటంకము కలుగదనియు తలంచి శ్రీరూపగోస్వామి ఈ గ్రంథమును రచించెను. విభావానుభావ సంచారీభావములను యథాపూర్వకముగ మనస్సులో నుంచుకొని స్థాయిభావములను భగవద్రతియందు నిలిపి భక్తిరసమును నిలబెట్టెను."

"దక్షిణ విభాగము - ఈ విభాగమున గ్రంథకారుడు

---

1 భక్తిరసామృత సింధువు, ఉత్తరవిభాగము, తృతీయలహరి శ్లోకములు 1,2,3 పుట ; 575

సాహిత్య శాస్త్రములోని రసప్రక్రియను ఆధారముగ చేసికొని భక్తిని స్వతంత్రరసముగ నిరూపించుటకు ప్రయత్నము చేసెను భరతముని చెప్పిన "విభావానుభావ సంచారి సంయోగాద్రస నిష్పత్తిః" అను సూత్రమును ఆధారముగ చేసికొని రసవివేచనము చేయబడినది సాహిత్యశాస్త్రములోని ఈ రస సిద్ధాంతమును ఉన్నదున్నట్లుగ చరితార్థము చేయుటకు శ్రీరూపగోస్వామి ఈ విభాగమున సాంగోపాంగముగ భక్తిరసమును వివరించెను "1

ఇక భక్తికి రసత్వమును చెప్పిన ప్రసిద్ధులలో మధుసూదన సరస్వతి మఱియొకఁడు ఈతఁడు పదునేడవ శతాబ్దమునకు చెందిన వాఁడు 2 మధుసూదన సరస్వతి మతమున భక్తి ద్వివిధము ఒకటి నవరస మిళితము, మఱియొకటి శుద్ధ సత్త్వము ఈ విభాగమును తాను నిరూపింపదలచినట్లు 'భక్తిరసాయనము'న తన గ్రంథాదియందే అతడు ప్రతిజ్ఞ చేసినాడు

"నవరస మిలితం వా కేవలం వా పుమర్థమ్
పరమ మిహ ముకుందే భక్తి యోగం వదంతి
నిరుపమ సుఖ సంవిద్రూపమస్పృష్ట దుఃఖమ్
తమహ మఖిల తుష్ట్యై శాస్త్ర దృష్ట్యా వ్యనజ్మి' 3

ఈ ప్రతిజ్ఞకను కూలముగనే గ్రంథమును మూడుల్లాసములుగా విభజించినాఁడు ప్రస్తుత పరిశోధనాంశమునకు ప్రథమోల్లాసము చెం దును భక్తికి రసముతో మేళనమిట్లు సంభవించును, భక్తి రస

---

1 భక్తిరసామృత సింధువు, భూమిక, పుటలు 16, 17, 18

2 భక్తిరసాయనము - ఆంధ్ర వివృతి - శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు పీఠిక, పుటలు 11, 12

3 భక్తిరసాయనము, ఆంధ్రవివృతి ప్రథమోల్లాసము, శ్లోకము 1 పుట 1

మునకు భగవంతుడాలంబనము. తులసీ చందనాదులు ఉద్దీపన విభావములు. నిర్వేదాదులు సంచారీ భావములు. భగవదాకారతారూపమైన మనోవృత్తి స్థాయి భావము. వీని సంయోగమున నుద్భవించు పరమానంద సాక్షాత్కారము రసమగును. నవరసములలో మిళితమైన భక్తి యోగములో వ్యంగ్యము భగవద్రూపమైన ఆధ్యాత్మిక తత్త్వము. అదియే ఆనందరూపము (నిరుపమ సుఖసంవిద్రూపము). ఈ జ్ఞాన స్వరూపమైన ఆనందము (సంవిద్రూపము) ప్రత్యక్ష సిద్ధము, సర్వ జనానంద హేతుకము 1

సంసార పాశబద్ధులై కర్మవశమున చరించువారికి చిత్తశాంతి నిచ్చునది భక్తి రసాయనము 2 భక్త్యనుభూతి విషయమై భక్తునియందు కలుగు ప్రక్రియను కూడ మధుసూదనుడు విస్తారముగ వివరించినాడు. ఈ వివరణము అభినవగుప్తపాదులు రస ప్రతీతికి చెప్పిన ప్రక్రియను బోలియున్నది.

మనస్సు సంసార వాసనలచే నావృతమై యుండుట వలన కఠినమై యుండును. అది నిప్పుసెగకు లక్క కరిగినట్లు తాపకములైన విషయముల వలన ద్రవత్వము నొందును 3 ఆ విషయము కామ క్రోధాదులు. వీనివలన ద్రుతత్వము గాంచిన మనస్సునందు కరగిన లక్కపై ముద్రితా చిహ్నము వడినట్లు భక్తి ముద్రిత మగును. ఈ విషయ వాసనలును అలౌకికము గుటచే భక్తునకు లౌకిక విషయ స్పర్శ యుండదు

---

1 భక్తిరసాయనము, ఆంధ్రవివృతి, ప్రథమోల్లాసము, పుటలు , 2, 3
2 ,, ,, శ్లోకము 2 పుట 4
3 ,, ,, ప్రథమోల్లాసము శ్లోకము ; 4 పుట ; 5

ఈ ప్రక్రియా సారాంశమిది

"ద్రుతస్య భగవద్ధర్మాత్ ధారావాహికతాం గతా
సర్వేశే మనసో వృత్తిః భక్తిరిత్యభిధీయతే"1

ఇదియొక విధముగ భక్తికి నిర్వచనము అగును. ద్రవీభూత మైన చిత్తమున భగవద్విషయక చింతనము ప్రవేశించినపుడు ప్రాప్తి సంయోగముచే భగవద్విషయిక స్మరణము ధారావాహిక మగును. ఇట్టి యవిచ్ఛిన్న భగవత్స్మరణమే వాస్తవమైన భక్తి. అదియే రసము. అదియే ఆనందము. ఈ యోగాంగము ననుభవించుటకును అంతర్గత సంస్కార మపేక్షితము. ఈ సంస్కారమునే 'వాసన', 'భావము', 'భావన' అని వ్యవహరింతురు 2

విషయ సంయోగము వలన కలుగు చిత్తద్రుతి లౌకిక విషయ వశీకృతమగు చిత్తమునకు ద్రుతి కలుగునంత వఱకే అపేక్షితము. ఆకొంతకే సంయోగము తీవ్రతరముగ నపేక్షింపబడును. మనసునకు కూడ వ్యక్తి సంస్కారమునుబట్టి ఈ శిథిలీకరణమున మృదువు, మధ్యమము, తీక్ష్ణమునను త్రివిధ శోధ మపేక్షితమగును. ఈ శోధన యందును క్రమముగా వికాసము, విస్తారము, క్షోభమునను మూడు విధములైన స్పందనలు కలుగును. మాలిన్యమునుబట్టి, వస్త్రము యొక్క మార్దవ కాఠిన్యములనుబట్టి క్షాళనమవసరమైనట్లే, మనసున కును ఇట్టి శోధనమవసరము. ఆయా పద్ధతులచే వస్త్రము క్షాళిత మైనట్లే మనసును లౌకిక వాసనారహితమై నిష్కల్మషమగుటచే

1 భక్తిరసాయనము, ఆంధ్రవివృతి, ప్రథమోల్లాసము శ్లోకము ; ౩ పుట, ౫

2 'ద్రుతే చిత్తే వినిక్షిప్తః స్వాకారో యస్తు వస్తున
సంస్కార వాసనా భావ భావనా శబ్ద భాగసౌ"

భక్తిరసాయనము, ఆంధ్రవివృతి, ప్రథమోల్లాసము శ్లోకము ; ౬ పుట : ౬

నానందానుభూతి కర్తగుగును కావుననే చిత్తక్షోభ జనకములగు రసములందు కూడ అలంకారిక మూర్ధన్యులకు ఆనందదాయకత్వము అభ్యుపగతము

"కరుణాదావపి రసే జాయతే యత్పరమ్ సుఖమ్
సచేతసా మనుభవః ప్రమాణమ్ తత్రకేవలమ్"

అని పండితులు వ్యాఖ్యానించుచున్న కారికలోని యంతరార్థమిదియే

చిత్తద్రుతి కలిగిన తరువాత తాపహేతువులగు కామక్రోధాదులతో కించిత్సంయోగము మనసునకు కలుగగా వాసనారూపమున వస్తువు ప్రవేశింపదు వస్తుదర్శనము వలన కలుగు చిత్త విక్షేపము వలన అనుభూతి మూలమున వాసనా సంపర్కము కలుగును వాసనానుభూతుల సంచలనము వలన వస్తు స్వరూపమును గోచరింపజేయు చిత్తవృత్తి ప్రారంభమగును చిత్తద్రుతియందు వాసనా రూప సంస్కారము ఉద్దీప్తమగుననియు, శిథిలీభావమున వాసనాభానమగుననియు ఫలితాంశము 1 ద్రవరూపమున నున్న చిత్తమున ప్రవేశించిన తరువాత చిత్తము కాఠిన్యమును పొందినపుడంతర్లీనములైన వాసనలు తిరిగి చిత్తద్రుతి కలుగునపుడు బహిర్గతములగును 2 ఈ వాసన విభావానుభావ సంచారి సంయోగముచే పరిపుష్టమై రసముగా నభివ్యక్తమగును పరమానంద సాక్షాత్కార రూపమున నీస్థాయిభావము రసత్వమునందును

---

1 భక్తిరసాయనము, ఆంధ్రవివృతి, ప్రథమోల్లాసనము శ్లోకము 7 పుట 7

2. " " " " 8 " 7

"భగవాన్ పరమానంద స్వరూపః స్వయమేవహి
మనోగత స్తదాకార రసతామేతి పుష్కలమ్"1

ఆ పరమానంద దశయందు చైతన్యాంశ భాసించును ఈ చైతన్యమునకు, సాత్త్వికమైన మనోవృత్తికి భేదము లేదు అందువల్ల నే భక్తి రసత్వమును బొందుచున్నది. లౌకిక రసములలోకన్నను భక్తిరస ప్రతీయమానమైన ఆనందమున అలౌకికానందము పరాకాష్ఠనొందును. కావున భక్తిరసము రసాంతరములకన్న శ్రేష్ఠము.

"అతస్తదా విర్భావితమ్ మనసి ప్రతిపద్యతే
కించిన్న్యూనాం చ రసతామ్ యాతిజాడ్య విమిశ్రణాత్"2

తిరువతి సాంఖ్యసిద్ధాంతము ననుసరించియు, వేదాంతమతము ననుసరించియు రససిద్ధాంతమును మధుసూదన సరస్వతి నిర్వచించి నాడు. లౌకిక వాసనలు కలిగిన రసములో ఆలంబన రూపమైన వస్తువు మూలమున భావించినను ప్రకృతి అలౌకికముయగును. ఒకే స్త్రీని భార్యయని, స్నుషయని, మాతయని భావించుట కలదు. ఈ భావనలలో భేదములు కన్పించుచున్నవే గాని, వీటికి విషయభూతమైన స్త్రీ యొక్క రీతియే ఒక స్త్రీమూర్తి గా వ్యారూపముతోను, బాంధవ్యవిశేషముతోను చూచినదానికిని, భావించినదానికిని విషయ భేదము సహృదయ ప్రత్యక్ష సిద్ధమైనట్లే మిగిలిన రసములయందును కలుగును 3

"భగవంతం విభుం నిత్యం పూర్ణం బోధసుఖాత్మకమ్
యద్గృహ్ణాతి ద్రుతం చిత్తం కిమన్యదవశిష్యతే"4

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | భక్తిరసాయనము, ఆంధ్రవివృతి, ప్రథమోల్లాసము | శ్లోకము . 9 | పుట : 10 |
| 2 | " | " | " | " 18 | " 13 |
| 3 | " | " | " | " 24, 25 | " 20 |
| 4 | " | " | " | " 28 | " 23 |

దేశకాలాతీతుఁడైన భగవంతుని భావించినపుడు లౌకిక వాసన లేనియు శేషించినవు భక్తియోగమునకు భగవదాకారమగు చిత్తవృత్తి ప్రధానము

"కాతివ్యం విషయే కుర్యాద్ద్రవత్వం భగవత్పదే
ఉపాయైః శాస్త్ర నిర్దిష్టైరను క్షణమతో బుధః"1

భగవదాకారమైన చిత్తము కలుగవలెనన్నచో భక్తుడు శాస్త్రవిహితోపాయములలో ప్రతిక్షణమును చిత్తమునకు కాఠిన్యము నాపాదించి భగవత్పద చింతనమున ద్రవత్వము కలుగునట్లు ప్రయత్నింపవలెను భక్త్యుపాయములు నారదమహర్షిచే శ్రీమద్భాగవతమున, (1-5-28 to 29) విస్తృతముగ వివృతములు.

ద్వితీయోల్లాసము

భగవద్రూపమైన చిత్తవృత్తి వాసనారూపమై ద్రవీభూతమగు చిత్తమున రసరూపము నొందుటచే భక్తిరసమగును చిత్తద్రుతి కారణముల వలన భక్తియు ననేక భేదములు కలదగును 2 శృంగారయు క్తమగు భక్తి ప్రసిద్ధము. క్రోధయుక్తమగు భగవద్విషయక రతి భావము కూడ భక్తిగనే పరిగణింపబడినది

"క్రోధ ఈర్ష్యా నిమిత్తం తు చిత్తాభిజ్వలనం భవేత్
తజ్జన్యాయాం ద్రుతౌ సా తు ద్వేష శబ్దేన గృహ్యతే"3

ఈర్ష్యవలన జనించు క్రోధమున చిత్తము జ్వలించును అసూయచే దీప్తమైనను జెందిన చిత్తద్రుతియందు కలుగు భగవదాకారత ద్వేషపద వాచ్యమగును

1 భక్తిరసాయనము, ఆంధ్రవివృతి, ప్రథమోల్లాసము శ్లోకము : 80 పుట : 30
2 భక్తిరసాయనము ఆంధ్రవివృతి, ద్వితీయోల్లాసము, శ్లోకము 2 పుట 62
3 " " " శ్లోకము : 5 పుట 64

'ద్వేషము కలుగునపుడు చిత్తవిక్షేపము కల్పించును ఉద్దీపక దర్శనమున కలుగు మన స్తపనాదికము నివృత్తింపవలెనని, తద్విషయము నివృత్తింపవలెను ఒక విషయముపై ద్వేషము కలిగి నచో ఆ విషయము నశించినచో ద్వేషము నశింపగలదు విషయ నాశమున మనః ప్రీతి కలుగును 1 ఉద్దీపక నాశనము సఫలీకరించు క్రోధమును ద్వేషమందురు ఉద్దీపక ప్రీత్యర్థకమగు క్రోధమును రతియందురు ఈరతిని విప్రలంభరూపముగా గ్రహింపవలెను కించి ద్విప్రియ దర్శన శ్రవణాదుల మూలమున వచ్చు ఈర్ష్యా కషాయి తత్వమును విప్రలంభ విశేషతా ప్రయోజకముగా స్వీకరింపవలెను 2 భగవద్విషయాసూయ సిద్ధ్యచే ప్రదీప్త చేరుస్కుచైన శిశుపాలుని ద్వేషము తెలిసినదే!

ఇట్టి వైరభక్తి తరువాత వైరముతోపాటు ప్రీతిహేతువైన ఈర్ష్యయు నిర్వచింపబడినది ప్రియుడు అపరాధము చేయగా గోపిక లకు కలిగిన వైక్లబ్యరూపమగు చిత్తవృత్తివలన మిశ్రితమైన రతిభావ మిట్టి ఈర్ష్యా విషయమగును ఈర్ష్యయందు భయత్రాసములు 3 అంగ ములు కావచ్చును ఇట్లే భయానకాదులైన రసాంతరములయందు సహితను రత్యాదులు స్థాయిత్వమును పొంది భక్తిరసమునకంగము లగును 4 ఈ నవరస విషయత్వమేకాక, భక్తి స్నేహాదిరూపమున

1 భక్తిరసాయనము, ఆంధ్రవివృతి, ద్వితీయోల్లాసము, శ్లోకము : 6 పుట 65
2 " " " శ్లోకము : 7 పుట 65
3 "ఔత్పత్తిక ప్రభవః త్రాసః స్వాపరాధోత్థమ్ భయమితి భయ త్రాసయోర్భేదః" రసగంగాధరము, ప్రథమాననము, పుట : 163
(ఆయతి వస్తువులవలన కలిగిన వెఱపు త్రాసము తన యపరాధమువలన కలిగిన వెఱపు భయము)
4 రెండు విరుద్ధరసములు మూడవదానికి అంగములగుటవలన వాని ప్రతీతియందు విరోధముండదు

కూడ నుండవచ్చును. అది పదముచే దాస్యము, ప్రీతి మున్నగునవి గృహీతములు. స్థాయి భావములతోనే శోక, హర్షాదులైన భావాంతరములతోను మిళితమై[1] భక్తి రసత్వమునొందును హర్ష మిశ్రణమున భగవద్విషయక రతి శుద్ధము హర్షముకూడ హాస్యరసముగ పరిణతి నందినచో హాసము స్థాయియగును అపుడు "నవరస మిళితం వా" అను విభాగమునకు ఈభక్తి విషయమగును[2] ఈవిధముగ రసాంతరములును భక్తి విషయములగుట ద్వితీయోల్లాసమున వివృతము అవి ప్రస్తుతములు కాకుండుటచే నిట నిరూపింపబడలేదు.

రసమునకు సాధారణ లాక్షణికులు అంగీకరించిన లక్షణముల కన్న భిన్నమైన స్వరూపము నంగీకరించియు, రససంఖ్య విషయమున మధుసూదన సరస్వతి ప్రాచీనులనే యనుసరించినాడన వచ్చును. భక్తిని రసముగా పేర్కొన్నను, దానిని దశమ రసముగా నితడు చెప్ప లేదు మధుసూదనునకు రససంఖ్యయందును, రసస్వరూపము నందును పూర్వలాక్షణికులతో నభిప్రాయ భేదములేదు రస ప్రతీతి ప్రకారము అభినవ గుప్తాదుల మార్గమునే యీతడు ననుసరించినాడు సజాతీయ, విజాతీయ భావములచే స్వరూపమునకు హాని లేక రస పర్యంతము నిలుచు భావము స్థాయియని ప్రాచీనుల నిర్వచనము. ఆ ప్రసిద్ధ స్థాయిభావములనే మధుసూదనుడు ద్వితీయోల్లాసమున వివరించినాడు ఒకే భావము నిమిత్త భేదమునుబట్టి స్థాయియును, సంచారియును కూడ కావచ్చును నిమిత్తము విభావానుభావవృత్తి విభావాదులు బలవత్తరములైనచో నొక భావము స్థాయియగును స్తోక విభావోత్పన్నమైన ఆ భావమే సంచారియగును. విభావాదులు

---

1 భక్తిరసాయనము, ఆంధ్రవివృతి, ద్వితీయోల్లాసము శ్లోకము : 12 పుట : 68

2 " " " శ్లోకము . 14 పుట : 69

చిత్తద్రుతి హేతువులు. చిత్తద్రుతులన్నియు రసములు కాదగినవని మధుసూదనుని మతము

"యావత్యో ద్రుతయశ్చిత్తే, భావాస్తావంత ఏవహి
స్థాయినో, రసతాం యాతి విభావాది సమాశ్రయాత్"[1]

ఈ యభిప్రాయమునే తరువాత జగన్నాథుడును గ్రహించి నాడు

"రత్యాదయః స్థాయిభావాః స్యుర్భూయిష్ఠ విభావజాః
స్తోకం విభావైరుత్పన్నాః తఏవ వ్యభిచారిణః"[2]

మధుసూదనుని "యావత్యో ద్రుతయః" అను కారికను వివరించుచు వ్యాఖ్యాతలు భావములు అసంఖ్యాకములనియే పేర్కొని నారు

చిత్తద్రుతులెన్ని తెరగులగలవో అన్ని భావములే కలవని యెంచవలెను అనుగతములగు కామాద్యుపాధులచే సంకలితము లైనవి చిత్తవృత్తులగుటచే చిత్తద్రుతులసంఖ్యాకములు కావని, భావముల సంఖ్యనే చిత్తద్రుతుల సంఖ్యగా నెంచవలెనని నిశ్చయము చిత్తద్రుతులకంటె నభిన్నములగు స్థాయిభావముల సంఖ్య సహితమిట్లే నిశ్చితమగుచున్నది ఈస్థాయిభావములకు విభావాది సంయోగము కలుగగా రసత్వము సిద్ధించును ఏభావము రసముగా పరిణమించ గలదో ఆభావమునే స్థాయిభావమని వ్యవహరింపవలెను 3

ఈ యసంఖ్యాకములైన భావములలో భక్తి విషయములైన వానిని పరిమితములుగ మధుసూదనుడు నిరూపించినాడు స్థాయిభావ

---

1 భక్తిరసాయనము, ఆంధ్రవివృతి, ద్వితీయోల్లాసము శ్లోకము: 20 పుట, 78
2 రసగంగాధరము, పుట 160
3 భక్తిరసాయనము, ద్వితీయోల్లాసము పుట 78

ములలో ధర్మవీరము, దయావీరము, బీభత్సము, శాంతమునను నవి ప్రబలములైన ఆలంబన విభావములు లేకపోవుటచే భక్తి రసముగా పరిణతిని బొందవు 1 ఇట్లు కొన్నిటిని నిషేధించుటవలన మిగిలిన భావములు భక్తివిషయములనియే మధుసూదనుని మతము

ఇక వీరరసభేదములలో మిగిలిన రెండును దానవీరము, యుద్ధవీరము. దానవీరము భక్తికి విషయమగుట బలిచక్రవర్తియందు స్పష్టముగ కన్పట్టును దానమిచ్చునపుడు బలికి ప్రతిగ్రహీత విష్ణువను నిశ్చయజ్ఞానమున్నది అంతటి వానికి దానమిచ్చుటకన్న సదృష్టమేమున్నదను బలి వాక్యములే యిందులకు నిదర్శనము యుద్ధవీరమున కూడ నాయా ప్రతియోద్ధలకు తను ప్రతిద్వంద్వి భగవంతుడే యను నిశ్చయ జ్ఞానము కొన్ని సందర్భములలోను, కావచ్చునను అనుమానము మఱికొన్ని సందర్భములలోను కన్పించును అపుడును వైరములోడి భక్తి కావున యుద్ధవీరము భక్తివిషయమే యగుట నిశ్చయము

శ్రీమద్భాగవతమున నీవైరభక్తియే వైరానుబంధమని వ్యవహృతము భగవద్వైరుల యందు భక్తి భగవత్కృపచే నిగూఢము భక్తుడు కానివానికి భగవంతుడు సాయుజ్యమీయడు వైరభక్తులకు వారి కర్మసమాప్తి కాలమున భగవంతుడు సాయుజ్యము నొసంగుట పురాణ ప్రసిద్ధము. ఈవిషయము ప్రకరణానుసారము నిరూపింపఁబడును

భావ మిశ్రితమైన భక్తియందు భక్తివ్యవహారము అనుపపన్నమైనచో మిగిలినవానికిని నిట్టి అనుభక్తి కలుగకపోదు రసములు భక్తితో మేళనము పొందునపుడు చతుర్విధమార్గములు శుద్ధ మిశ్ర

---

1 భక్తిరసాయనము, ద్వితీయోల్లాసము, శ్లోకము 28 పుట 74

రూపమున సంభవించును 1 రౌద్రాదులు భగవదాలంబనము లైనచో కేవల మిశ్రితములగును ఈరస మిశ్రణము గుణత్రయ సంపర్కము వలన సిద్ధించును భగవద్గీతోక్త మార్గమున గుణమిశ్రణము తరువాతి ఇరువది కారికలయందు వివృతము. వీరసముచే భక్తి మిళితమైనచో ఆరస శబ్దమును ఉపపదముగా చేర్చి భక్తి వ్యవహరింపబడవచ్చును 2

ఉల్లాసాంతమున మమ్మటాదుల మతము నాక్షేపించుచు మధుసూదన సరస్వతి తన సిద్ధాంతమునిట్లు స్థాపించినాడు

"రతిర్దేవాది విషయా వ్యభిచారీ తథోర్జితః
భావః ప్రోక్తో రసో నేతి యదుక్తం రసకోవిదైః"3

దేవాది విషయమై వ్యంజన మూలమున ప్రత్యాయితమై వ్యభిచారి భావముగానున్న రతియును భావము రసముకాదని రసకోవిదుల మతము

"దేవాంతరేషు జీవత్వాత్ పరానందాప్రకాశనాత్
తద్యోజ్యం పరమానందరూపే న పరమాత్మని"4

దేవతలు కాని వారలయందలి రతి క్షుద్రానందాత్మకమై, లోకోత్తరానందావగతి నీయజాలక పోవుటచే ఈవాదము యుక్తియుక్తమే.

"కాంతాది విషయా వా యే రసాద్యాస్తత్ర నేదృశమ్
రసత్వం పుష్యతే పూర్ణసుఖాస్పర్శిత్వ కారణాత్"5

---

1 భక్తిరసాయనము, ద్వితీయోల్లాసము, శ్లోకము 37 పుట 79
2 భక్తిరసాయనము, ద్వితీయోల్లాసము, శ్లోకములు 68, 69 పుట 91
3 " " శ్లోకము 75, పుట 94
4 " " శ్లోకము 76, పుట 94
5 " " శ్లోకము 77, పుట 94

కాంతాది విషయాశ్రయములైన భావములు శృంగారాది రసము లుగా పరిణమించునట్లు పరమానందరూపమగు పరమాత్మను విష యముగా గల భావముకూడ పరిణమించు నని రాదు. కాంతాది విష యక మగు రసమున పూర్ణానంద స్వభావము లేదు. పూర్ణము, దుఃఖా సంభిన్నమునగు సుఖము లేనపుడే భావము పుష్టమై రసముకాగలదు.

"పరిపూర్ణ రసా క్షుద్ర రసేభ్యో భగవద్రతిః
ఖద్యోతేభ్య ఇవాదిత్య ప్రభేవ బలవత్తరా"[1]

మిణుగురు పురుగు ప్రకాశముకంటె సూర్యతేజము ప్రబల తేజోయుతమైనట్లు, లౌకిక క్షుద్రరసములకంటె పరిపూర్ణ రసీభవ న్మార్గమగు భగవద్రతి విశిష్టము, బలవత్తరము

"క్రోధశోక భయాదీనాం సాక్షాత్సుఖ విరోధినామ్
రసత్వమభ్యుపగతం తథానుభవమాత్రతః"[2]

"ఇహానుభవ సిద్ధేపి సహస్రగణితో[4] రసః
జడే నైవ త్వయా కస్మాదకస్మాదపలప్యతే" 3

క్రోధశోక భయాది భావములు సుఖప్రతికూలములు దుఃఖాంశగల యీభావములు సహితము విభావాది సంయోగము కలుగగా రసరూపము నందుచున్నవని ఆలంకారికుల యభిప్రాయము. ఈభావములనుండి రౌద్ర కరుణ భయానకాది రసములు నిష్పన్నము లగునని మన యనుభవమే చెప్పుచున్నది. భగవద్విషయకమగు రతి నుండి కూడ వీటికన్న 'చేయి రెట్లు గొప్పది, లోకోత్తరాహ్లాద హేతు వునగు మహాత్తర రసము నిష్పన్నమగుచున్నదని శ్రుతి, స్మృతి, అను

---

1 భక్తిరసాయనము, ద్వితీయోల్లాసము, శ్లోకము 78 పుట 94
2 ,, ,, శ్లోకము 79 పుట 95
3 ,, ,, శ్లోకము 80 పుట 95

భవములు చేతోళ్ళ చాటుచున్నవి ఇది రసముకాదని అయుక్తిక ముగా, అసంబద్ధముగా ప్రలపించుటకు బుద్ధిహీనుండే త్వరపడగలఁడు. రసమునగా భక్తిరసమే ఇంతకుమించిన రసములేదు భక్తిరసమును రసరాట్ అనవలెను.[1]

మధుసూదన సరస్వతి యభిప్రాయమున భక్తి స్వరూపమును రసత్వమునను విషయముల నిట్లు క్రోడీకరించవచ్చును

భక్తి యోగము చిత్తద్రుతి హేతువైన ప్రతి భావమును రసమగును రసమనగా నలంకారశాస్త్ర సంజ్ఞకాక ఆనందమను సామాన్యార్థమనే మధుసూదనుడు గ్రహించినాఁడు భక్తిరసమనినపుడు కూడ వలెఁడు 'ఆనందము'ను అర్థముగా రస శబ్దమునకు స్వీకరించినాఁడు ఆనందాంశ పరాకాష్ఠ నధిరోహించినపుడు భక్తి రసమగును ఈ రసస్వరూపము లౌకిక ముకాదు మమ్మటాదులు పేర్కొనిన లౌకిక రసములు ఎమయవానచే క్షుద్రములు అర్థాపత్తిచే భక్తికి రసత్వ చెప్పరాదను పర్యము యోగము ఫలితాంశము

లౌకిక రససంఖ్య విషయమున మధుసూదనునకు విప్రతిపత్తి లేదు భక్తికి అలౌకిక రసముగా ప్రత్యేకమైన ప్రతిపత్తి కల్పించవలె నమంజసానుగుణని అతని అభిప్రాయము లౌకిక రసములతో కలిపి చెప్పుట యారకిక సమ్మతమైనచో భోజాదులవలెనె దశరసము లని కంఠోక్తిగ చెప్పియుండడివాఁడు.

## రస సమన్వయము :

భరతముని, నుండి మమ్మటుని వఱకుగల ప్రసిద్ధాలంకారికు లెవరును భక్తిని భావమనినారు. వారి మతమున శృంగారాది సంజ్ఞ కలిగిన తొమ్మిదియే రసములు

[1] భక్తిరసాయనము, ద్వితీయోల్లాసము, పుట 96

రూపగోస్వామి, మధుసూదన సరస్వతి భక్తిని రసమునినారు వీరి యుద్దేశమున 'రస' శబ్దమునకు ఆనందమర్థము విభావానుభావ చర్వణమువలన భక్తికూడ రసస్థితిని బొందును

ఆనందమే రసమనుట ఉపనిషత్సిద్ధాంతము "రసో వై సః", "రసగ్ హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి" అని శ్రుతివాక్యము శ్రుతి ప్రమాణముచేత నానందమే రసమని సిద్ధాంతీకరింపవలగును ఆలంకారికులును స్థాయిభావ ప్రాప్తమైన ఆనందము రసమని యంగీకరించినారు లౌకిక వాసనలు కలిగిన శృంగారాది భావములయందే రసత్వము చెప్పగా, లౌకిక స్పర్శలేని అలౌకికానందమగు భక్తికి రసత్వమంగీకరించుట న్యాయము! శ్రుతి ప్రమాణసిద్ధమైన భక్త్యానందము సకల సహృదయ ప్రత్యక్షానుభవ సిద్ధము అనుభూతి విశేషమే రసము భక్తియందు అనుభూతి ప్రత్యక్షసిద్ధము కావున దీనిని రసముగా నంగీకరించుట యుక్తము

## నవవిధ భక్తి

భాగవతమునందంతటను భక్తిప్రాధాన్యము గోచరించును. భక్తిమార్గ ప్రకరణ ద్వితీయ, సప్తమ, ఏకాదశ స్కంధములయందు విస్తృతము భక్తి భిన్నమార్గములలో సేవింపదగిన విషయము. అందు లకు లోకప్రసిద్ధములైన శ్రవణాదిమార్గములు భాగవత సప్తమ స్కంధమున వర్ణితములు.

"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్" 7-5-23

"ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తిశ్చేన్నవలక్షణా క్రియతే
భగవత్యద్ధా తన్మన్యేఽధీత ముత్తమమ్" 7-5-24

విష్ణుకథా శ్రవణము, నామకీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము - అనునవి నవవిధ భక్తిమార్గములు వీనిలో నొకదానికొకటి హేతువులు కావచ్చును ఒక్క భక్తునియందే అన్నిమ ర్గములుండవచ్చును. ప్రహ్లాదునియందు స్మరణము ప్రధానముగానభివర్ణితమైనను, మిగిలిన లక్షణములుకూడ నతనియందు కాననగును రాక్షస బాలురకతఁడు ఉపదేశించిన భక్తిమార్గములలో నీవిషయము విదితము

శ్రవణము "శ్రవణం తత్స్వరూప రూపగుణ విభూతి శ్రవణమ్"[1]

ఈమార్గమునకు పరీక్షిన్మహారాజు ప్రశస్తోదాహరణము భాగవతశ్రవణ ముత్తమమార్గమని భాగవత ప్రతిపాదితము

"నిగమ కల్పతరోర్గలితం ఫలమ్
శుకముఖాదమృత ద్రవ సంయుతమ్
పిబత భాగవతం రసమాలయమ్
ముహురహో రసికా భువిభావుకాః"[2]

శౌనకాదులు భగవత్కథా శ్రవణమునకు తమ జీవితముల నంకితమొనర్చిన భక్తులు

కీర్తనము ప్రహ్లాద ప్రత్యేకాను భూతములైన భక్త్యవస్థలు భాగవతమున వర్ణింపఁబడినవి "దనుజారిలీలావతారంబులందలి .. " (7—242) ఇత్యాది పద్యములలో కీర్తన, వందన, ధ్యానాది భక్తి మార్గములు విశేషముగ నభివర్ణితములు. కీర్తనము సర్వభక్త సాధారణము

---

1 చంద్రికావ్యాఖ్య, పుట 965

2 శ్రీమద్భాగవతము, ప్రథమస్కంధము, ప్రథమాధ్యాయము శ్లోకము 3 పుట 69

స్మరణము. నిరంతర భగవన్నామ స్మరణము ఇదియు శ్రవణమునందలి భగవత్స్వరూపము, భగవద్గుణములు, భగవద్వైభవముల స్మరించుట వలన నానందహేతువు స్మరణమునకు ప్రహ్లాదుఁడు ప్రకృష్టోదాహరణము 1

పాదసేవనము అర్చావిగ్రహమునుకాని, సాక్షాత్సంభవమైన పుడు భగవత్పాదములనుకాని సేవించుట ఇది ప్రతిభక్తునకు సాధారణమే భగవంతుని విషయమున మానసికమును అగునని వ్యాఖ్యాతలు 2

అర్చనము పూజ. ఇదియును సర్వభక్తవిషయము అంబరీషుని యందిది విశేషముగ ప్రతిపాదితము

వందనము భగవద్వందనమును సర్వభక్త సామాన్యము. ప్రహ్లాద నారదాది భాగవతోత్తములందఱును ఉదాహృతులే

దాస్యము; భక్తుఁడు భగవంతుని యజమానునిగను, తనను దాసునిగను భావించుట భగవద్భక్తునకు దాస్యము చేయుటయు భగవత్ప్రీతికరమని శ్రీవైష్ణవ సంప్రదాయము భక్తశిఖామణియగు కులశేఖరాళ్వారులు ఈమార్గమునకు పరమోదాహరణము 3

---

1 "పానీయంబులు ద్రావుచుం గుడుచునన్ భాషించుచున్ 7-123 పుట 41

2 "భగవద్విషయ మానసికమ్" చంద్రికావ్యాఖ్య పుట 906

3 ఘుష్యతే యస్య నగరే రంగయాత్రా దినేదినే
తమహం శిరసా వందే రాజానం కులశేఖరమ్" ము.కుందమాల, శ్లోకము 1
పుట 1

కులశేఖరుల జీవితపర్యంతము భాగవతుల సేవతోడనే గడచినదట శ్రీరంగేశుని దర్శనమునకై బయలుదేరుట, భాగవతులు తనయింటికి వచ్చుటతో ప్రయాణము మానుకొని వారిని సేవించుట ఆయనకు నిత్యకృత్యము జీవిత పరిసమాప్తి నాఁడును ఇదియే కార్యక్రమము. తుదకు శ్రీరంగేశుఁడా భాగవతోత్తముని యనుగ్రహించినాఁడు

భాగవతదశమస్కంధమున

"రుక్మిణియను కన్యకామణిగలదు  అయ్యిందువదన నీకుం
గైంకర్యంబు సేయంగోరి"1

"ధన్యచరిత నీకు దాస్యముచేయని
జన్మమేల యొన్ని జన్మములకు"2

అనుచునగ్నిద్యోతనుని మూలమున రుక్మిణిపంపిన సందేశమును దాస్యభక్తికి ఉదాహరణము

సఖ్యము  స్నేహము  పాండవులు, యాదవులు, కుచేలుడు మున్నగువారు సఖ్యభక్తికి ఉదాహృతులు

ఆత్మనివేదనము . శరీర పోషణభారమును, రక్షణను పూర్తిగ భగవదాయత్తముచేసి భక్తుడు నిశ్చింతుడగుట  ఇది ప్రహ్లాదుని యందును మయూరధ్వజుడను భక్తునియందును, (భారతము, అశ్వమేధ పర్వము) విశేషముగా వ్యక్తము  శరీరమమత్వము లేకుండుటయే దీని ముఖ్యలక్షణము

రుక్మిణీదేవియందును శ్రవణముతో ప్రారంభమైన భక్తివిశేషము ఆత్మనివేదన పర్యంతము వర్ణితము  ఇది కామముకాదు కావున భక్తివిశేషమే రుక్మిణియందు భాగవత ప్రతిపాదితమనుట యుక్తము  "వీనీగుణములు" అనుపద్యమున శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము, ఆత్మనివేదనము అనులక్షణములు ఆమెయందభివర్ణితములు

---

1  శ్రీమదాంధ్రభాగవతము, దశమస్కంధము, పూర్వభాగము,  పుట 331
పద్యము 1701,

2  ,,  ,,  ,,  పద్యము 1709 పుట 332

ఇక భాగవత శ్రేష్ఠుడగు ప్రహ్లాదుడును ఆత్మనివేదనకు ఉదాహరణమే

ఇవికాక శ్రీమద్భాగవతము కామము, భయము, వైరములను కూడ భక్తిమార్గములుగ ప్రతిపాదించినది. కాని యీమార్గములు సర్వభక్త సాధారణములుకావు. వారివారి సంస్కారములనుబట్టి కారణము అనుస్యూతముగ నాథ భక్తుల కథలయందు గోచరించును

కామము : ఇది గోపికా విషయమునందే భాగవతమునందు ప్రదర్శితము. రుక్మిణి విషయమున కామము కాదు. గోపికలు పరవిశేషమున జన్మించిన మునులని పురాణోక్తము. భాగవతాభిప్రాయమున ఈ కామమునందును భక్తియే ప్రధానసూత్రము. లక్ష్యాంతరము కానరాకపోవుటచే తన్మాత్రపర్యవసాయి యని గ్రహింపనగును

భయము దీనికి కంసుడొక్కడే విషయముగుచున్నాడు. భయయోగమునను విష్ణుసాయుజ్యము సిద్ధించునని భాగవత ప్రతిపాదనము

"కామోత్కంఠత గోపికల్ భయమునం గంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాల ముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులుం
బ్రేమన్ మీరలు భక్తి నేము నిదె చక్రింగంటిమెక్కైన ను
ద్దామ ధ్యాన గరిష్ఠుడైన హరిజెందన్ వచ్చు ధాత్రీశ్వరా" 7_18

వైరము : పైని ఉదాహరించిన పద్యమే వైరమునకును ప్రమాణము. మూలమున చూపబడిన భ్రమరకీట న్యాయమును పోతన భయమునకు మాత్రము పరిమితి మొనర్చినాడు.

## వైరభక్తిగా వ్యవహరించుటకు హేతువులు

'వైరమ్' అనునాకము తద్ధితవృత్తి పీరు కు సంబంధించినదని యౌగికార్థము నేటి యర్థమనునది ద్వేషమను రూఢము కాని సమాసవృత్తియందు (వైరభక్తి) కాని, తద్ధితవృత్తిగాకాని దీనికి యౌగికార్థము గ్రహించినను దోషముకాగు వృత్తియను శబ్దమునకు పరార్థాభిధానమనియే వ్యాకరణ సంప్రదాయము 1

తద్ధితవృత్తియందు వైరశబ్దమునకు పీరసంబంధియనియు, సమాసవృత్తియందు 'వైరము సాధనముగాగల' అనియు నర్థము చెప్పవలెను సంస్కృతమున "వైరేణ భక్తిః" అను విగ్రహమున "కర్తృకరణే కృతాబహులమ్"2 అనుసూత్రముచే సిద్ధిం చును వైరశబ్దము కోశములయందు విరోధము, విద్వేషములను నర్థముల రూఢము "వైరం విరోధో విద్వేషః మన్యు శోకౌతు శుక్ స్త్రియామ్" అని అమరము 3 కాని వైరశబ్దమునకు విగ్రహము వ్రాయుచు భట్టోజీ దీక్షితుల కుమారుడైన భానోజీ దీక్షితులు "వీరస్యకర్మ" అని నిర్వచించినాడు అట్లు చెప్పుటకు ప్రమాణముగ పాణినీయ సూత్రమునే ఉదాహరించినాడు 4 శబ్దాంతరమున 'యువాదిగణ' పాఠములో "హాయనాంతయువాదిభ్యోణ్" అను సూత్రముచే 'అణ్' ప్రత్యయమునైనను చేయవచ్చునని పేర్కొని

---

1 "పరార్థాభిధానమ్ వృత్తిః"
సిద్ధాంతకౌముది, సర్వసమాసశేష ప్రకరణము భట్టోజిదీక్షితులు, పుట 620

2 2-1-32, సిద్ధాంతకౌముది, పుట 504

3 అమరకోశము, 1-7-25, పుట 103
రామాశ్రమి వ్యాఖ్యాసహితము, భానోజిదీక్షితులు

4 "ద్వంద్వాత్ వున్ వైరమైథునికయోః"
పాణినీయము : 4-3-125 పుట : 110

నాడు దీనికిని 'వీరస్యకర్మ' అనియే విగ్రహము ఈ 'హాయనాంత' అను సూత్రముచే విధింపబడు 'అణ్' ప్రత్యయము భావకర్మ ప్రకరణములోనిది 'వీరస్యకర్మ', 'వీరస్యభావః' అనురెండు విగ్రహములును అట్టిచో సాధువులగును కాని మొదటి పక్షమును సూచించిన వ్యాఖ్యాత "యువాదిత్వాత్ వా అణ్" అని చెప్పుటచే ద్వితీయ విగ్రహమునందలి తన యరుచిని ప్రకటించినాడు ఇట్లు చెప్పుట శాస్త్ర సంప్రదాయము. కావున 'వీరస్యకర్మ' అనునది వైయాకరణ సమ్మతమార్గమనియు, నమా సమున కరణముగానిది అన్వయించుననియు 'వైరభక్తి' శబ్దార్థము చెప్పుట సముచితము రూపగోస్వామియు సాధనభక్తిని నిరూపించుచు వైరముసుకూడ భక్తిసాధనముగా చెప్పుట చేతను వైరమునకు కరణత్వము ఉపపన్నమగుచున్నది

ఆయా పాత్రలకు తగిన విభావాదుల సహకారముచే సుత్సాహ రతి స్థాయిత్వమును పొందినచో నాస్వాదయోగ్యమై వీరభక్తిరస మగును వీరము దాన, దయాయుద్ధ ధర్మవీరములనియు చతుర్విధము ఈనాల్గింటిలోను యుద్ధవీరము ప్రధానస్థానమును వహించును భగవంతుని యుద్ధపరాక్రమమును వినుచు సంతోషించు లక్షణమొక విధమైన యుద్ధవీరము తన పరాక్రమమునకు గర్వించి, భగవంతునికూడ నిర్లక్ష్యముచేయుట మఱియొక విధమైన యుద్ధవీరము దీనిని 'కత్థితము' అని రూపగోస్వామి వ్యవహరించినాడు 1 యుద్ధవీరమునకు ఆలంబనములైన వీరులలో గర్వము, ఆవేగము, ధృతి, లజ్జ, మతి, హర్షము, అవహిత్థ, అమర్షము, ఔత్సుక్యము, అసూయ, స్మృతియును నవి వ్యభిచారి భావములగును కావున యుద్ధవీరమున రౌద్రము కన్పట్టినచో తదంశమాత్రము 'అమర్షము'ను సంచారిభావముగా గ్రహించుట ఉచితము ఒకరసము స్పష్టముగా వ్యక్తమగునపుడు

---

1 భక్తిరసామృత సింధువు, ఉత్తరవిభాగము, తృతీయలహరి శ్లో॥లు 13,14,15 పుట : 578

రెండవరసము అంగభూతమైనను దోషముకాదు అట్లగుట అపరి హార్యము శృంగారమున హాస్యము; వీరమున రౌద్రము; రౌద్రమున వీరము; కరుణమున భయానక బీభత్సములు, వ సిలో కరుణమునను వానికి అంగాంగిభావము సాంతిశీయము గుచున్నది

దయావీరమును, ధర్మవీరమునుకూడ భక్తిరస విషయములుగ ఆసందర్భమున రూపగోస్వామి ఉదాహరించినాడు 1 మధుసూదన సరస్వతి ఈరెండింటికిని భక్తిరసత్వమును నిరాకరించినాడు. వీరభక్తి రసమునకువలెనే రౌద్రభక్తియు రసాగ్రమగునని రూపగోస్వామి సిద్ధాంతము ఇదియును వైరశబ్దమునకు విద్వేషముపు అర్థము చెప్పి నచో వైరభక్తి విషయమేయగును

## వైరభక్తికి ఉదాహృతులు కాదగిన పాత్రలు

విష్ణుపార్షదులైన జయవిజయులు సనకాదిపూర్షుల శాప ప్రభావముచే రాక్షస జన్మత్రితయమును పొందినారు వారే హిర ణ్యాక్ష హిరణ్యకశిపు; రావణ కుంభకర్ణ, శిశుపాలదంతవక్త్రులు
"వైరానుబంధ తీవ్రేణ ధ్యానేనాచ్యుత సాత్మతామ్
నతౌ పునర్హరేః పార్శ్వమ్ జగ్మతు ర్విష్ణుపార్షదా"2
అని వ్యాసవాణి, అంతేకాదు,

"యథా వైరానుబంధేన మర్త్యస్తన్మయ తామియాత్
న తథా భక్తియోగేన ఇతిమే నిశ్చితామతిః"3

---

1 భక్తిరసామృత సింధువు, ఉత్తరవిభాగము, తృతీయలహరి శ్లోకములు 47 నుండి 61 పుటలు 587 నుండి 590

2 శ్రీమద్భాగవతము, సప్తమస్కంధము, ప్రథమాధ్యాయము శ్లోకము : 47 పుట : 17

3 " " " శ్లోకము : 27 పుట 11

అని దేవర్షినారదమతము.

శాపవశమున రాక్షసజన్మలెత్తిన హిరణ్యాక్షాదులు నిరంతర వైరసాధనతో భగవత్సాన్నిధ్యమును బొందిరని భాగవతోక్తి

ఆయాపాత్రలకు తగిన విభావ దులసహకారముచే సుత్సాహ రతి స్థాయిత్వమును బొందినచో నాస్వాదయోగ్యమై వీరరసకి రస మగును భగవంతునివలన తనకుకలిగిన అపకారముచే మనఃప్రజ్వల నము కలిగినచో ప్రజ్వలితమైన అట్టి చిత్తవృత్తి క్రోధమగును ఇది రౌద్రరసమునకు స్థాయి కాని ధర్మనిర్వహణము భగవంతుని కర్తవ్యము కర్తవ్య నిర్వహణము చేయువాడు అపరాధికాడు. హిరణ్యాక్షాదులకును ఈవిషయము తెలియును అందువలనవారు క్రోధమున కన్న భగవంతుని విషయమున చూపిన జిజ్ఞాస యందుత్సాహమే గోచరించును అది యుద్ధవీరస్థాయియగు సుత్సాహము. హిరణ్యా క్షుడు తనకుసరియగువీరుఁడెవ్వఁడని సంచరించుచు వరుణుని సూచ నపై హరినన్వేషించినాఁడు ఆతని యన్వేషణ ఫలించి హరి వరాహ రూపమున దర్శనమిచ్చి, యుద్ధము ననుగ్రహించినాఁడు కావున హిర ణ్యాక్షుఁడు సమానస్కంధుఁడైన ప్రతిద్వంద్విగా నారాయణుని భావించుటచే నాతని యుత్సాహమునకు హరి ఆలంబనమైనాఁడు

హిరణ్యకశిపుని విషయమునను నారాయణ స్వరూపమెట్లుండునోయను జిజ్ఞాసయే ఆతని యన్వేషణకు మూలహేతువు. ప్రహ్లాదుని బాధించుటకును అదియే కారణము.. హిరణ్యాక్షుని వధవలన హిరణ్యకశిపునకు మనఃప్రజ్వలనము కలుగలేదా? అదిరౌద్రరస విష యము కాదాయను ప్రశ్న సహజముగనే యుత్పన్నమగును కాని హిరణ్యకశిపుఁడు స్వయముగా దానినపరాధముగా భావింపలేదు తమ్ముఁడు వీరధర్మమును పాటించెనని యూరటనొందినాఁడు. జీవులకు మరణము సహజమనియు, హిరణ్యాక్షునకది స్వధర్మానుష్ఠానమున

సిద్ధించినదనియు తల్లిని స్వయముగా నూరడించుటచే హిరణ్యకశిపునకు మనసున నిట్టిరౌద్రము లేదనియే చెప్పవచ్చును

రావణుని మనఃప్రజ్వలన విషయమున శూర్పణఖ పరాభవించుట మాత్రమే హేతువుకాదు ఖరాదుల మరణమునకును ప్రతీకారేచ్ఛ అతనియందు కలదు అది వీరధర్మానుషక్తియును రావణునకును రాముఁడు నారాయణుఁడను జ్ఞానమున్నది అతని యుత్సాహమునకు తన పరాక్రమమేకాక, కుంభకర్ణాదుల వీరాది ఆశయు ప్రోత్సాహకమైనది

కుంభకర్ణుని విషయమున నపరాధమాతని నుండికాని, రాముని నుండికాని కన్పట్టదు రావణునిపక్షము వహించి వచ్చుటయే కుంభకర్ణుని యపరాధము తనవారిని రక్షించుకొనుటయందు తనశక్తి చూపవలెననుట కుంభకర్ణుని యుత్సాహము

శిశుపాలుఁడు సహజముగా గర్విష్ఠుఁడు ఇతనికి వైరము జన్మసిద్ధము శిశుపాలుని జన్మకాలముననే శ్రీకృష్ణుఁడాతని మృత్యువని నిశ్చయమైనది రుక్మిణీహరణము శ్రీకృష్ణుఁడాతనికి చేసిన యపకారమే కాని దీనికన్న శరణుజొచ్చిన రుక్మిణిని రక్షించుట భగవంతుని కర్తవ్యము వనితారక్షణము[1] వీరకర్తవ్యము అంతేకాక అప్పటికి ఆమె కన్యయగుటచే కృష్ణుని దోషములేదు. కృష్ణుఁడు తన ప్రతిజ్ఞ పూర్తియగు వఱకు శిశుపాలుని యపరాధములను మన్నించి, తుదకు వధించినాఁడు

ఇక దంతవక్త్రుని విషయమున శిశుపాల వంశోద్భవనితో మనః ప్రజ్వలనమే అతఁడు ద్వారకను ముట్టడించుటకు హేతువు ఐనను యుద్ధమారంభమైన పిదప యుద్ధవీరమే ప్రధానము

---

1 "వనితా, ఖాతరాగా స్త్రీ" అమరకోశము, 2-6-2, పుట : 261

వీరు శాక్షాత్తీకొందరు వైరభక్తులున్నట్లు భాగవతము పేర్కొనినది

"వైరేణ యం నృపతయః శిశుపాలపౌండ్ర
శాల్వాదయోగతి విలాస విలోకనాద్యైః
ధ్యాయంత ఆకృతధియః శయనాసనాదౌ
తత్సామ్య మాపురనురక్తధియాం పునఃకిమ్"[1]

ఇట్లు "వైరేణధ్యాయంతే" అని స్పష్టముగా చెప్పటచే వీరి విషయమున వైరమే ధ్యానమార్గమని భాగవత సమ్మతమనుట నిర్వివాదము. వైరభక్తులై భగవంతుని చేతిలో మరణించుటయే వీరికి ముక్తిహేతువైనది. జయవిజయులకు జన్మత్రయమున కలిగిన వైరభక్తి విశేషము తక్కినవారికి లేదనియు, కావునవారు ప్రసిద్ధులు కారనియు భాగవతమున నిగదితము[2] కనుక ప్రస్తుత కరిశోధనమున పైమూడు జంటలు మాత్రమే కరిశీలనకర్హములుగా గ్రహీతములు.

---

1 శ్రీమద్భాగవతము, 11-5-48, పుట : 634

2 "కతమోపి నవేనస్యాత్ పంచానాం పురుషం ప్రతి
తస్మాత్ కేనాప్యుపాయేన మనః కృష్ణే నివేశయేత్"
శ్రీమద్భాగవతము, 7-1-34 పుట : 881

## వేనుఁడు మున్నగువారు వైరభక్తులు కాలేపోవుటకుగల కారణము

వేనుని కథ శ్రీమద్భాగవతము, చతుర్థస్కంధము, 14,15 అధ్యాయములలో వర్ణితము అంగమహారాజు చేసిన అశ్వమేధయాగఫలముగా ప్రాజాపత్య పురుషుఁడాయనకు పాయసపాత్రనందించినాఁడు ఆరాజు పాత్రనాఘ్రాణించి భార్యకిచ్చినాఁడు ఈదోషమువలన నధర్మలక్షణములతో కుమారుఁడు జన్మించినాఁడు అతఁడే వేనుఁడు వేనుఁడు తన మాతామహుఁడైన మృత్యువు లక్షణములు కలవాఁడై బాల్యము నుండి పాపవర్తనుఁడైనాఁడు. ఇట్టికుమారుని జూచి అనపత్యతయే యింతకన్న నుత్తమమని తండ్రిబాధపడి రాజ్యము వదలివెడలినాఁడు బంధువులాయననన్వేషించి వ్యర్థప్రయత్నులై గత్యంతరములేక వేనుని తల్లియైన సునీథయనుమతితో వేనుని పట్టాభిషిక్తుని జేసినారు అప్పటి నుండి యాతఁడు మఱింత క్రూరుఁడై బ్రాహ్మణులు యజ్ఞాదికములు చేయరాదనియు, ఎవరును దానధర్మములు చేయరాదనియు చాటింపు వేయించినాఁడు మహర్షులు సామోపాయమున నాతనిని మార్చుటకు ప్రయత్నించినారు వేనుఁడు రాజైన తనను సేవింపక, ఇతరదేవతలను సేవించుట యుక్తముకాదని మునులను తిరస్కరించి పలికినాఁడు వేనునకు మునులకు జరిగిన సంభాషణము సంస్కృతాంధ్ర భాగవతములందు సమానము 1 వేనుఁడిట్లు వితండవాదము చేయగా, హరినింద వినలేని మహర్షులు ఈశ్వరనిందా హతుఁడైన వేనుని క్రోధహుంకారముచే వధించినారు ఈవృత్తాంతమువలన వేనుఁడు భగవద్వైరి అయ్యున్నాయనచే హతుఁడు కాలేదనుట స్పష్టము

---

1 శ్రీమద్భాగవతము, చతుర్థస్కంధము పుటలు : 575 నుండి 584
శ్రీమదాంధ్రభాగవతము, చతుర్థస్కంధము పద్యములు : 416 నుండి 427
పుటలు : 295, 296

సాల్వుఁడు శిశుపాలుని స్నేహితుఁడు శిశుపాలవధానంతరము ద్వారకపై దండెత్తి శ్రీకృష్ణునిచేతిలో నిహతుఁడైనాఁడు స్నేహధర్మముచే కృష్ణునిపైనెత్తి వచ్చినాఁడేతప్ప సాల్వునకు భగవంతునితో జన్మసిద్ధ వైరమున్నట్లు భాగవతమున కన్పట్టదు శ్రీకృష్ణునిచేతిలో మరణించుట మాత్రమే అతనికి ముక్తిహేతువుగా భావింపనగును

ఇఁక పౌండ్రక వాసుదేవుఁడనువాఁడు కృష్ణుననుకరింప యత్నించి వాసుదేవనామమును, శంఖచక్రములను విడిచిపెట్టుమని ఆయనకు సందేశమంపినాఁడు, తుదకు కృష్ణునితో యుద్ధముచేసి మరణించినాఁడు ఇట్టివాఁడును కృష్ణునిచే హతుఁడైనాఁడుతప్ప ఆయనతో వైరానుబంధము లేదు

ఇచట గమనింపవలసిన మఱియొక అంశమున్నది భగవంతుఁడు శ్రీకృష్ణావతారమున నింతమంది వైరులను వధించినను శిశుపాల దంతవక్త్రులనుండి మాత్రమే వారివధానంతరము సూక్ష్మజ్యోతి కృష్ణునిలో ప్రవేశించినది కనుక వారు సాయుజ్యము నొందినట్లు నిగదితము మిగిలిన యెవ్వరికిని భగవంతుఁడిట్టి యుత్తమగతిని కలుగజేసినట్లు భాగవతమున కానరాదు కావున కృష్ణావతారమున శిశుపాల దంతవక్త్రులిరువురే యథార్థ వైరభక్తులనుట భాగవతాభిప్రాయము "వైరేణ యం నృపతయః" అను శ్లోకమునందలి ఇతరోదాహరణములు వారి సద్గతిని సూచించునవి మాత్రమే మఱియు "అనురక్తధియాం పునః కిమ్" అనునర్థాపత్తికి ఉపబలకములు.

హిరణ్యాక్ష హిరణ్యకశిపు, రావణ కుంభకర్ణ, శిశుపాల దంతవక్త్రులే వైరభక్తులనుటకు ప్రమాణములు.

హిరణ్యాక్ష హిరణ్యకశిపులకు బ్రాహ్మణశాప ప్రభావము వలన వారివధయందు జ్యోతిః ప్రవేశరూపమైన సాయుజ్యము వర్ణితము కాలేదు రావణ కుంభకర్ణు విషయమునను ఇట్లే యెఱుంగ వలెను శిశుపాల దంతవక్త్రులకు భగవంతుఁడు సాయుజ్యము ననుగ్రహించుటకు కారణము వారి శాపావసానమే మూఁడుజన్మల వైరము, తరువాత సాయుజ్యము ననుగ్రహించెదనని పరమాత్ముఁడు జయవిజయులకిచ్చిన అభయము నెరవేర్చవలసిన సమయమాసన్నమగుటచే వారికట్లు కర్మపరిపాకాంతమున సాయుజ్యము ననుగ్రహించినాఁడు

ఈ మూఁడు జంటలు కాక ఇంకొందఱు సోదరులైన రాక్షసులును భగవంతునివలన నిహతులైనట్లు పురాణములు పేర్కొనినవి వారిలో మధుకైటభులు, మాలి సుమాలి అనువారు ప్రసిద్ధులు వీరిలో మొదటి రెండుజంటలు హిరణ్యకశిపునకు పూర్వులు వారికి నారాయణునితో వైరము లేదు మాలి సుమాలి హిరణ్యకశిపునకు తరువాతివారు వారికిని వైరము లేనట్లు వారివాక్యములవలననే విదితము 1 వీనివిస్తరము తత్ప్రతిపాదితమైన దేవీభాగవతమున కననగును జయవిజయుల జన్మత్రితయము తప్ప, మిగిలినవారు వైరభక్తులకు దృష్టాంతములు కారని చెప్పుటయే వీరిచట ఉదాహరించుటలోని ఉద్దేశ్యము ఇంక భగవంతుఁడు హిరణ్యాక్షాదులైన మూఁడుజంటలను మాత్రమే స్వసంకల్పానుసారము వైరభక్తులుగ జన్మింపఁజేసినాఁడు కావున వీరినే వైరభక్తులనుట యుక్తము

---

1 వాల్మీకిరామాయణము, ఉత్తరకాండ, 6వ సర్గ శ్లోకములు : 88, 40 పుట 886

## హిరణ్యాక్ష హిరణ్యకశిపులు :

హిరణ్యకశిపుని వృత్తాంతము తొలుత శ్రీమద్రామాయణమున కన్పట్టును ఇందు హిరణ్యకశిపుడు రాక్షసవంశమునకు మూలపురుషుడని వర్ణితము హిరణ్యాక్ష వృత్తాంతమిందు లేదు సుమాలి యను రాక్షసుడు తనవారితో హిరణ్యకశిపునంతటి వానిని సంహరించిన నారాయణుని జయించుట తమకు శక్యము కాదని పలుకు సందర్భములో హిరణ్యకశిపుని ప్రస్తావనకలదు
"హిరణ్యకశిపోః మృత్యురన్యేషాంచ సురద్విషామ్
దుఃఖం నారాయణం జేతుం యో నో హంతుమభీప్సతి"1

మహాభారతములో కూడ కొన్ని సందర్భములలో నాతని ప్రస్తావనమున్నది వానిలో శిశుపాలుడు హిరణ్యకశిపుని యంశావతారమను వాక్యముమాత్రమే ప్రసుతోపయోగి

జయవిజయుల శాపవృత్తాంతమునకు ప్రధాన ప్రమాణములుగ గ్రహింపదగినవి శ్రీమద్భాగవతము, విష్ణుపురాణము, పద్మపురాణము వనిలో శ్రీమద్భాగవతము, విష్ణుపురాణము భక్తులకును, వైష్ణవసంప్రదాయమునకును ప్రమాణములుగ పరంపరగ స్వీకృతములగుచున్న గ్రంథములు పద్మపురాణము కాళిదాసు, భవభూత్యాది మహాకవులచే ప్రామాణిక గ్రంథముగ స్వీకృతము ఇది భాగవతము, పద్మపురాణమునను రెండు ప్రామాణిక గ్రంథములయందును జయవిజయుల శాపవృత్తాంతము రెండువిధములుగ వర్ణితము శ్రీమద్భాగవతమున తృతీయ, సప్తమస్కంధములలో నీవృత్తాంతము వివృతము పద్మపురాణమున నుత్తరఖండము, 261వ అధ్యాయమున నీకథయున్నది

---

1 శ్రీమద్రామాయణము, ఉత్తరకాండ, 6వ సర్గ శ్లోకము 84 పుట 836

## శ్రీమద్భాగవతము - తృతీయ స్కంధము ;

ఇందు పదునైదు, పదునారవ యధ్యాయములలో బ్రహ్మ దేవతలకు ఈవృత్తాంతమును వర్ణించి చెప్పినాడు. బ్రహ్మమానస పుత్రులైన సనకసనందనాదులు హరిని దర్శించుటకు వైకుంఠమున కేగినారు. ఆరు కక్ష్యాంతరములు కడచి, సప్తమ ప్రాకారమును సమీపించుచుండగా ద్వారపాలకులిరువురు వారినడ్డగించి వేత్రదండములతో జడిపించినారు 1 అందుచే మునులు

"తద్వా మనుష్య పరమస్య వికుంఠభర్తుః
కర్తుం ప్రకృష్టమిహ ధీమహి మందధీభ్యామ్
లోకానితో వ్రజతమంతర భావదృష్ట్యా
పాపీయసః త్రయ ఇమే రిపవోస్యయత్ర"2

'మీరు వైకుంఠమున నుండుటకు తగ్గులు కారు. ఈపాపప్రవర్తన కలిగినందున కామక్రోధ లోభములను శత్రువులు కలిగిన పాపలోకములయందు జన్మించెదరుగాక' యని శపించినారు. సనకాదుల యీ వాక్యములను విని ద్వారపాలకులు వారిపాదములపైబడి శరణువేడినారు

"భూయాదఘోని భగవద్భిరకారి దండో
యో నౌ హరేత సురహేళన మప్యశేషమ్
మా వోనుతాప కలయా భగవత్స్మృతి ఘ్నో
మోహో భవేదిహ తు నౌ వ్రజతో రధోధః"3

---

1 'వేత్రేణ చాస్ఖలయతామతదర్హణాం తౌ"
3-15-30, పుట 126

2 3-15-34, పుట 381

3 3-15-36, పుట : 381

'పాపకారులమగు మాకు మీరుచితమైన శిక్షచే విధించినారు కాని మిమ్మొక విషయము ప్రార్థించుచున్నాము అధోలోకముల యందు మూఢబుద్ధులమై జన్మించినను, భగవత్స్మృతిని నశింపఁజేయు మోహము మాకు కలుగకుండుగాక! లేదా మోహమునందును భగవత్స్మృతి నశింపకుండునట్లు మమ్మనుగ్రహింపుఁడు' అని ప్రార్థించినారు ఈవిధమైన రెండు వ్యాఖ్యానములును శ్రీధరులు చూపినారు.1

వీరిట్లు ప్రార్థించుచుండఁగనే నారాయణుఁడు ఈవృత్తాంతము తెలిసి స్వయముగ ద్వారముకడకు వేంచేసి వారికి దర్శనమిచ్చినాఁడు మునులాయనను స్తుతించినారు. నారాయణుఁడు వారితో 'వీరిరువురు నాపార్షదులు జయవిజయులను వీరు మిమ్ముల నవమానపరచి మహాపరాధమొనర్చినారు తన సేవకులుచేసిన యపరాధములకు యజమానియే బాధ్యుఁడగును అందువలన నన్ను క్షమింపుఁడని ప్రార్థించుచున్నాను' అని భావగంభీరముగ పలికినాఁడు అందులకు మహర్షులు 'నీలీలలు మాకర్థముకావు వేదధర్మమే లోకాధారము. ఆధర్మమును నీవు రక్షించుచుందువు నీవలన సనాతనధర్మము పుట్టినది. అది నీ అవతారములవలననే రక్షింపఁబడుచున్నది. నీవు నిర్వికారుఁడవు' అనుచు నిత్యాదిగ స్తుతించినారు2 అటుపిమ్మట నారాయణుఁడు తన పార్షదులతో 'మీరు భయమునొందకుఁడు మీకు శుభమగును. బ్రహ్మతేజస్సును3 నేను నివారింపగలిగినను, దానికి విరోధకుఁడనగుట

---

1 'అధోథః మూఢధియా వ్రజతోఽపి భగవత్స్మృతి ప్రతిఘాతకో మోహో న భవేత్ కింతు మోహేపి స్మృతిర్న ప్రహాతాత్ ఇతి ప్రార్థనా" శ్రీధరీయము, 3-15-36 పుట 381

2 "త్వత్తః సనాతనోధర్మః రక్షతే తనుభిస్తవ ధర్మస్య పరమో గుహ్యో నిర్వికారో భవాన్ మతః" 3-16-18 పుట 387

1 "బ్రహ్మతేజస్సమర్థోపి హంతుం నేచ్ఛేమతం తుమే" 3-16-29 పుట 389

నాకుసమ్మతముకాదు. బ్రాహ్మణాపరాధము క్షమింపరానిది' అని పలికినాడు. ఇట్లు తన పార్షదులను సమాధానపరచి భగవంతుడు మహర్షులతో 'వీరిరువురు సురేతరగతినిపొంది, క్రోధముతో కూడిన సమాధిచే యోగానుబంధమును పొందినవారై వేగముగ తిరిగి చేర గలరు. ఈశాపము నాసంకల్పమువలననే కలిగినది ఇంక విచారింప నేమియు లేదు' అనుచు మృదూక్తులతో వారిని వీడ్కొలిపినాడు.

తృతీయస్కంధమున మూడుజన్మలను ప్రస్తావనలేదు 'అసుర యోనియందుబుట్టి నాతో విరోధించి, విరోధమువలన నాస్మృతి బాయ కుండుటచే నాచేమరణమునొంది త్వరలో నన్నుచేరగలర'ని భగవాను డనినట్లు మాత్రమే వర్ణితము 1

దితిగర్భమున రాక్షసులు జన్మింపబోవుచున్నారను భయముతో దేవతలు బ్రహ్మను శరణువేడినపుడు ఆయనవారికి వృత్తాంతమును జెప్పి, ఆజయవిజయులే యిపుడు కశ్యపతేజముతో కవలలుగా జన్మింప నున్నారనియు, నారాయణుడే తానుచేసిన వాగ్దానమును నెరవేర్చు టకుత్వరలో వారిని సంహరించుననియు నూరడించినాడు. 2 జయవిజ యులే హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగ జన్మించినారు

---

1 "మయి సంరంభయోగేన నిస్తీర్య బ్రహ్మహేళనమ్
ప్రత్యేష్యతో నికాశమ్ మే కాలే నాల్పీయసా పునః"
3-16-31 పుట : 390

2 3-16-35,36 పుట : 390

## శ్రీమద్భాగవతము - సప్తమస్కంధము

ఇందలి శాపవృత్తాంతమిది

దేవర్షి తనకు భాగవతకథ చెప్పుచున్న సందర్భములో ధర్మరాజు, శిశుపాలుడు విష్ణుసాయుజ్యమును పొందుటనుగూర్చి ఆశ్చర్యముతో ప్రశ్నించినాడు. 'పరమయోగులకుకూడ నసంభవమైన వాసుదేవ సాయుజ్యము విద్వేషియగు శిశుపాలునకెట్లు లభించినది? భగవంతుని నిందించిన వేనుడు తామసలోకమును పొందినాడు. మరి శిశుపాల దంతవక్త్రులెట్లు సిద్ధిపొందినారు? వారి నాలుకలేల పుచ్చిపోలేదు? అట్లు కాకపోగా సర్వులు చూచుచుండ శిశుపాలుడు సాయుజ్యమును పొందినాడుకదా! నామనసు డోలాయమానమగుచున్నది' అని ధర్మరాజు తనసందేహమును వెలిబుచ్చినాడు.

అందులకు నారదుడు 'ఈశరీరమునందభిమానముండుటచే ప్రాణులకు నేను, నాదిఅను వైషమ్యము కలుగుచున్నది. బద్ధజీవునకువలె భగవంతునికి అట్టిలక్షణముండదు. ఆయన అసురులను శిక్షించుట వారిమేలుకొరకే. వైరిభావము, భక్తియోగము, భయము, స్నేహము, కామము వీనిలో ఏయుపాయముచేగాని ఆయనయందు మనస్సును లగ్నముచేయవచ్చును. భక్తియోగముకన్నను వైరానుబంధముతో స్వామిని వేగముగా చేరవచ్చును. మీ పినతల్లి కుమారులైన శిశుపాల దంతవక్త్రులు విష్ణుపార్షదులు. శాపవశమున వైకుంఠమునుండి భ్రష్టులైరి' అని తెలిపినాడు.[1]

ఇంకను, విష్ణుస్వరూపులైన విష్ణుపార్షదులకు భూలోకమున జన్మమెట్లు కలిగినదో సవిస్తరముగ తెలుపుమని యడిగిన ధర్మరాజు

---

1 సప్తమస్కంధము, 1.వ అధ్యాయము, శ్లోకములు : 24 నుండి 27, 33 పుట 879

నకు నారదుఁడిట్లు సమాధానమిచ్చినాఁడు ఒకప్పుడు బ్రహ్మమానస పుత్రులైన సనకసనందనాదులు ఐదారుసంవత్సరముల వయసుగల బాలకుల రూపములతో దిగంబరులై విష్ణుదర్శనమునకై వైకుంఠమునకు వెడలినారు వారిని ద్వారపాలకులడ్డగింపగా, రజస్తమోరహితమైన విష్ణుపాదమూలమున నుండ నర్హులు కారనుచు అసురయోనియందు జన్మింపుఁడని శపించినారు 1 ఇట్లు శప్తులైన జయవిజయులు వైకుంఠమునుండి పతనముపొందుచుండగా సనకాదులు కరుణాళువులై మూఁడుజన్మలలో తిరిగి వైకుంఠమును చేరగలరని యనుగ్రహించినారు 2

జయవిజయులు మొదటిజన్మయందు దితిగర్భమున హిరణ్యాక్షహిరణ్యకశిపులుగ జన్మించినారు అందు హిరణ్యకశిపుఁడగ్రజుఁడు కాని తృతీయస్కంధమున వీరిరువురును కవలలుగా పేర్కొనబడినారు ఐతే వీరిలో నగ్రజుఁడు, అనుజుఁడు ఎవరను ప్రశ్న యుత్పన్నమగును

"ప్రజాపతిర్నామ తయోరకార్షీత్
యః ప్రాక్ స్వదేహాత్ యమయోరజాయత
తం వై హిరణ్యకశిపుం విదుర్యథా
యం తం హిరణ్యాక్షమసూత సాగ్రతః' 3

---

1 7-1-87 నుండి 39 పుట 881

2 తృతీయస్కంధకథయందు మూఁడుజన్మలను ప్రస్తావనకాని, ఆజన్మలివియని కాని వివరణములేదు ఆవివరణము సప్తమస్కంధమున తెలుపబడినది
సంరంభయోగమున తిరిగి తనను చేరగలరని విష్ణువు తనపార్షదులకిచ్చిన అభయము సప్తమస్కంధమున లేదు యథావసరమితముగ రెండుసందర్భములయందలి కథను సమన్వయము చేసికొనవలెను లేనిచో నేకవాక్యత రాదు

3 3-18-17 పుట : 392

ప్రజాపతి దేహమునుండి మొదట (దితిగర్భముద్వారా) శరీరమును పొందినవాడు హిరణ్యకశిపుఁడు. దితియందు హిరణ్యాక్షుని ప్రసవించినది. కవలపిల్లలలో ముందుపుట్టినవాఁడు తండ్రితేజస్సు తరువాత ప్రవేశించుటవలన రూపుదిద్దుకొనును. వెనుకపుట్టినవాఁగు తండ్రితేజస్సు ముందుప్రవేశించుటవలన రూపుదిద్దుకొనును. ఈ క్రమమునను సరించి హిరణ్యాక్షుఁడు పెద్దవాఁడైనను పితృక్రమముకు ప్రధానముకావున హిరణ్యకశిపుఁడే పెద్దవాఁడు. ఈ భావమునే శ్రీధరులను నిర్ధారించినారు 1

నారాయణుఁడు హిరణ్యాక్షుని వరాహరూపమునను, హిరణ్యకశిపుని నరసింహరూపమునను సంహరించినాఁడు. రెండవజన్మమున

---

1 "యమయోర్మధ్యే యథా స్వదేహాత్ ప్రథమ మజాయత హిరణ్యకశిపుం విదుః దితిః ప్రథమం యమసూతతం హిరణ్యాక్షం యథా విదుః తథా నామ కృతవానిత్యర్థః అయం భావః యదాహి గర్భాదాన సమయే యోనిపుష్పం విశద్వీర్యం ద్వేధా విభక్తం అదితః పశ్చాద్భాగేన చ ప్రవిశతి తథా యమౌ భవతః తయోశ్చ పితృతః ప్రవేశక్రమ విపర్యేణ మాతృతః ప్రసూతి

"యథా విశత్ ద్విధా భూతం యోనిపుష్పం పరిక్షరత్
ద్వౌ తదా భవతో గర్భౌ సూతిర్వేశ విపర్యయాత్"

ఇతి పిండశుద్ధి స్మరణాత ఆతః స్వదేహాత్ పూర్వం యో జాతః తస్య హిరణ్య కశిపురితి దితేః ప్రథమం యః ప్రసూతః తస్య హిరణ్యాక్ష ఇతి నామ కృతవాన్" పుట 391

ఈవిషయమున నింకను సందేహమున్నచో హిరణ్యకశిపుఁడే పెద్దవాఁడని సప్తమస్కంధమున స్పష్టముగా పేర్కొనబడినది. దానినిటు సమన్వయించినచో విషయము స్పష్టమగును

"హిరణ్యకశిః పూర్వే క్షో హిరణ్యాక్షోను జస్తతః"
7-1-42 పుట 382

వారు విశ్వవసుకుమారులుగ కైకసియందు రావణ కుంభకర్ణులుగా జన్మించినారు. హరి శ్రీరామావతారమెత్తి వారిని సంహరించినాఁడు ఈవృత్తాంతము నవమస్కంధమున వివృతము. మూఁడవజన్మమున శిశుపాలదంతవక్త్రులుగ జన్మించి శ్రీకృష్ణునిచే సుదర్శనాయుధమూల మున నిహతులైనారు.[1] ఇట్లువీరు వైరానుబంధ తీవ్రతవలనను, నిరంతర ధ్యానమువలనను నారాయణునితో సామ్యమునుబొంది తిరిగి విష్ణుపార్షదులుగా విష్ణువును చేరినారు.

"వైరానుబంధ తీవ్రేణధ్యానే నాచ్యుత సాత్మతామ్
నతౌ పునర్హరేః పార్శ్వం జగ్మతుర్విష్ణు పార్షదౌ"[2]

## శ్రీమదాంధ్ర భాగవతము - తృతీయస్కంధము .

నారాయణుఁడు యజ్ఞవరాహమై తనకోరలపై భూమిని నిలిపి నాఁడు ఇదియిట్లుండగా కశ్యపునిభార్యయగు దితి అకాలమున భర్తృ సమాగమము చేసినది ఆమె గర్భవతి కాఁగా, జన్మింపఁబోవు పుత్రులు క్రూరకర్ములగుదురని కశ్యపుఁడు పలికినాఁడు ఈపూర్వరంగమున సనకాదులు త్రిలోకసంచారము చేయుచు హరిదర్శనాభిలాషులై వైకుంఠమున కేగినారు అచట ద్వారపాలకులైన జయవిజయులు వారినడ్డగింపగా, మునులుకోపించి శాపనవృత్తిచే దండించినారు

---

1 ఈవృత్తాంతమును దేవర్షి ధర్మజునకువివరించు సమయమునకు దంతవక్త్రి వధజరుగలేదు కాని దంతవక్త్రివధ సిద్ధమైనట్లు నారదుఁడు నిర్ణయించి ధర్మజునకుచెప్పెనని శ్రీధరులు వ్యాఖ్యానించినారు
"అభూతస్యాపి దంతవక్త్రవధస్యాపి తజ్ఞాతక
ప్రామాణ్యేన సిద్ధవన్నిర్దేశః"
శ్రీధరీయము 7-1-21 పుట 879

2 7-1-48 పుట : 882

వున భూలోకమున కామక్రోధలోభముల చే బాధ నొందునట్లు
ృంబగలరని శపించినారు ఈ శాపము మూలానుకూలము శ్రీశు
యమును మూలమునకు కామక్రోధలోభములని శ్రీధరీయము 1
కన శ్రీధరానుసరించి కామక్రోధలోభములని పేర్కొనినాడు

అపుడా ద్వారపాలకులు తమతప్పునెరిగి "మీకరుణావలోకన
ంతులుగ ..." (8-580) కరుణింప వేడినారు ఇంతలో నారాయ
దచెటికి వచ్చినాడు సనకాదుల స్తుతియు, నారాయణ వాక్యము
ం మూలమునకన్ననిందు విస్తృతముగ వర్ణితము

## మ స్కంధము :

ఇందు ధర్మజుని ప్రశ్నయు, నారదమహర్షి సమాధానమును
న యథాతథముగ ననువదించినాడు.

ః పేశస్కృతా రుద్ధః కుడ్యాయాం తమనుస్మరన్
ంభ భయయోగేన విందతే తత్స్వరూపతామ్2 7-1-80

అనుశ్లోకమున భయద్వేషములరెంటిని మూలము చెప్పెగా,
వ

ము దెచ్చి భ్రమరము పాటవమున బంభ్రమించ భ్రాంతంబై త
ంకము భ్రమరరూపము బాటించి వహించుగాదె భయయోగ
5" 7-16

అని భయమునుమాత్రమే చెప్పినాడు

---

"ఇమే కామః క్రోధః తథాలోభయితి గీతోక్తాః త్రయో రిపవో భవంతి"
8-16-84, శ్రీధరీయము పుట : 881

"పేశస్కృతా భ్రమరేణ సంరంభో ద్వేషః భయంచ" శ్రీధరీయము.
పుట : 881

"వైరానుబంధనంబున జేరిన చందమున విష్ణునిరతరభక్తిం
జేరగరాదనితోచును నారాయణభక్తియుక్తి నాచిత్తమునన్" 7-15

అనునారదుని పలుకులు మూలానుకూలము లు

"వక్రత్వం బెటులేకపాయని మహావైరంబుతో" " 7-15

అనుపద్యమున పోతనమూలమును, శ్రీధరీయమును అనుసరించి దంతవక్త్రుని మరణముకూడ సిద్ధమైనట్లు నారదమహర్షిచే పలికించినాడు

కామద్వేష భయస్నేహ సేవ తిరేకములయిదింటిలో నొక్కటియైన వేఁపకుతేటి నిమిత్తమున ఆరేడు వ్యర్థుడైనట్లు పోతన యథామూలముగ వర్ణించినాడు

## శాపమునందలి - మతభేదములు ;

శ్రీమద్భాగవతమునందలి ప్రసిద్ధకథ యిట్లుండగా, లోకమున మతిమొక శాపవైవిధ్య కథకూడ ప్రచారమునను న్నది జయవిజయులు బ్రాహ్మణశప్తులై నారాయణుని ప్రార్థించినారు. శ్రీహరి వారికి భూలోకమున జన్మించుటవలన కలిగిన వియోగము ను దీర్చుకొనుటకు ఏడుజన్మల దాస్యభక్తి కాని, మూఁడుజన్మల శత్రుత్వము కాని అనుభవించిన తరువాత తిరిగి వైకుంఠమును చేరగలరనుచు రెండు మార్గములను సూచించినాడు. అందులకువారు త్వరముగా భూలోకమున నెక్కువ కాలముండ లేమనియు, మూఁడుజన్మలవైరములో ప్రతిజన్మలోను స్వామిచేతనే సంహరింపబడి ఆయనను చేరుదుమనియు వేడికొనగా భగవానుడంగీకరించినాడు సంస్కృతవాఙ్మయములో నీకథ పద్మపురాణమున యథాతథముగ కన్పట్టుచున్నది

"రుద్ర ఉవాచ

"హిరణ్యకశిప హిరణ్యాక్షౌ కాశ్యపేయౌ మహాబలౌ
దితిపుత్రౌ మహావీర్యా సర్వదైత్యపతీ ఉభే"
"నామ్నా తౌ జయవిజయా శ్వేతద్వీపే హరింగతౌ
తస్మిన్ ప్రవిష్టాన్ యోగీంద్రాన్ సనకాదీన్ మహాబలౌ"
"వారయామాసతుర్దేవి హరి సందర్శనోత్సుకాన్
తైః ప్రశప్తౌ మహావీర్యా ద్వారపాలౌ సురోత్తమౌ"

సనకాదయ ఊచుః

"ఉత్పత్స్యతః పృథివ్యాంతు ద్వాస్థౌ దేవస్యకింకరౌ"

రుద్ర ఉవాచ

"ఇతిశాపమ్ తయోర్దత్వా తత్ర తస్థుర్మునీశ్వరాః
దేవస్తదర్థం జ్ఞాత్వాచ తానాహూయచ తావపి
తౌ ద్వాస్థౌరబ్రవీ త్తత్ర భగవాన్ భూత భావనః"

భగవానువాచ

"కృతవంతౌ మహావీర్యావపరాధం మహాత్మనామ్
నాతిక్రమణీయ మిదం భవద్భ్యాం ద్వారపాలకౌ
దానవత్వం సప్తజన్మాని యువాం భక్త్వా మమానఘౌ"
"అమిత్రతాం తథా త్రీణి జన్మాని భజతోపివా"

రుద్ర ఉవాచ

"ఇత్యుక్తౌ తౌ మహావీర్యావబ్రూతాం పరమేశ్వరమ్"

జయవిజయ ఊచతుః,

"చిరకాలం మహింగంతుం న సమర్థౌ స్వమానద
తస్మాత్ త్రీణ్యేవ జన్మాని విద్వేష్ట్వంచ భజావహే
దేవ త్వయైవ నిహతౌ ప్రాప్స్యావో భవదంతికమ్"1

---

1 పద్మపురాణము, ఉత్తరఖండము, ఉత్తరార్థము 287వ, అధ్యాయము, శ్లోకములు : 1 నుండి 9 పుటలు 817, 818

ఈయేడుజన్మల దాస్యవృత్తాంతము ఆంధ్రసాహిత్యములో శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారు మాత్రము ప్రస్తావించినారు

ఇక శాపవృత్తాంతము న జన్మక్రమమునను సరించి పునర్జన్మ పర్యంతము పరిశీలింపవలసియున్నది

## హిరణ్యాక్ష హిరణ్యకశిపుల వృత్తాంతముగల ప్రసిద్ధ గ్రంథములు ,

హిరణ్యాక్ష హిరణ్యకశిపుల[1] ప్రస్తావన సంస్కృతసాహిత్య మున తొలుత శ్రీమద్రామాయణము, ఉత్తరకాండలోనున్నది తరువాత శ్రీమద్భాగవతము - తృతీయ, సప్తమ స్కంధములలోను, విష్ణుపురాణము - ప్రథమాంశము, పదునారవ అధ్యాయమునుండి ఇరువది యధ్యాయములవఱకును, బ్రహ్మాండపురాణము - అనుషంగ పాదము, పంచమాధ్యాయములో, మత్స్యపురాణము, 165 వ. అధ్యాయములోను, విష్ణుధర్మోత్తరపురాణము - ప్రథమభాగము, 53 వ అధ్యాయములోను, మహాభారతము - ఆది, అరణ్య, శాంతి అనుశాసనిక పర్వములలోను, హరివంశము - హరివంశపర్వము, 41వ అధ్యాయము, భవిష్యపర్వము, 41వ అధ్యాయములలోను, పద్మపురాణము - ఉత్తరఖండము, ఉత్తరార్థములోను; కూర్మపురాణము- పూర్వవిభాగము, 6,15 అధ్యాయములలోను వీరివృత్తాంతము ప్రస్తావితము. 2

1 'హిరణ్యాక్ష హిరణ్యకశిపుల'ను సమాస సాధుత్వ విచారము : హిరణ్యకశిపుఃదగ్రజఃయు కావున "భ్రాతుర్జ్యాయసః"

(2-2-34, సిద్ధాంతకౌముది, 2వ భాగము వార్తికము : 1416, పుట : 606) అను వార్తికముచే హిరణ్యకశిపశబ్దము పూర్వనిపాతము పొందవలసి యుండును కాని, లోకమున హిరణ్యాక్ష హిరణ్యకశిపులనుటయే ప్రసిద్ధము అందువలన సమాసావయములలో తక్కువ అచ్చులుకలిగిన హిరణ్యాక్ష శబ్దమును ముందుచెప్పి "అల్పాచ్ తరమ్" (2-2-34, సిద్ధాంతకౌముది, 2వ భాగము, పుట - 606) అనుసూత్రముచే సాధువుగ చెప్పికొనవలెను వార్తికము స్థలాంతరముల యందు చరితార్థమగుటచే అవకాదమైనను బాధలేదు

2 పై జెప్పిన పురాణములలోని హిరణ్యాక్ష హిరణ్యకశిపుల వృత్తాంత వివర ములు కూర్మపురాణమునుండి గృహీతములు

కూర్మపురాణము, పరిశిష్టము - 2, పుట , 7

నరసింహపురాణమను పేర ఉపపురాణమొకటి 68 అధ్యాయములతో లభించుచున్నది కాని దీనిలో నరసింహావతారమునకు ప్రాధాన్యము ఇందలి నృసింహావతారకథతో భాగవతకథకు సామ్యము మిక్కిలితక్కువ ఆంధ్రములందలి ఎఱ్ఱాప్రెగడ నృసింహపురాణమునకు గూడనిది మూలముకాదు దానికి విష్ణుపురాణము ప్రధానాధారము పైజెప్పినవానిలో ప్రధాన ప్రమాణములుగ గ్రహింపదగినవి భాగవత, విష్ణు, విష్ణుధర్మోత్తర, పద్మపురాణములు, మహాభారతేతిహాసమును

ఆంధ్రగ్రంథములలో ప్రసిద్ధముగ శ్రీమదాంధ్రభాగవత, నృసింహపురాణ, హరివంశములలో హిరణ్యాక్ష హిరణ్యకశిపుల వృత్తాంతము కన్పట్టును మిగిలినగ్రంథములును ప్రామాణికములే యైనను, భాగవతమే యొన్నదగినది ఇవికాక ఆయాపురాణములకు యథాతథములైన అనువాదములునుకలవు సంస్కృత ప్రసిద్ధగ్రంథములకును, ఆంధ్రప్రసిద్ధ గ్రంథములకును ఈవృత్తాంతమునగల తారతమ్యము తులనాత్మకపరిశీలనము జరుపుటకనుకూలముగ కేవలానువాదములిట పరిహరింపబడినవి

సంస్కృత భాగవతము - హిరణ్యాక్షుఁడు

(తృతీయస్కంధము),

దితిగర్భమును ధరించియుండఁగా, లోకోపద్రవమైన రాక్షసో త్పత్తి కలుగగలదనియెఱిఁగి దేవతలు తన్నివారణమునకై బ్రహ్మను ప్రార్థించినారు ఇదిపదునాల్గవ అధ్యాయమునందలి పూర్వరంగము బ్రహ్మ వారికి జయవిజయుల శాపవృత్తాంతమునుజెప్పి, వారిజననము లోకోపద్రవమైనను శ్రీహరివలన తిరిగిశాంతికలుగునని నిశ్చయ సూచకముగ చెప్పినాఁడు ఇదిపదునారవ యధ్యాయములోని అవతారిక

రాఁబోవు ఉపద్రవమునకు విధాతపరిహారమును సూచించుటచే దేవతలు నిశ్చింతగా నిజనివాసములకు చేరినారు దితి నూఱుసంవత్సరములు గర్భవతిగానుండి కవలలన్ప్రసవించినది వారిజన్మసమయమున ననేకములైన యుత్పాతములు కన్పట్టినవి. వారిలోచిన్నవాఁడైన హిరణ్యాక్షుఁడు గదాధరుఁడై యుద్ధమునన్వేషించుచు లోకసంచారము చేయసాగినాఁడు 1 హిరణ్యకశిపుఁడు బాహుబలసంపన్నుఁడై బ్రహ్మవరగర్వితుఁడై, మృత్యుభయము లేనివాఁడై లోకముల వశపఱచుకొనినాఁడు హిరణ్యాక్షుఁడు యుద్ధాన్వేషియై చరించుచుండఁగా దేవతలు, గరుత్మంతునకు భయపడిపర్వతములవలె కదలక నుండ గాఁగిరి దేవతిలెవ్వరును కదలకపోవుటచే హిరణ్యాక్షుఁడు భయంకరముగగర్జించుచు సముద్రములో నన్వేషించినాఁడు అచట శాసువించిన వరుణునకు నమస్కరించి యుద్ధమును ప్రసాదింపుమని కోరినాఁడు 2 ఇట 'ప్రలబ్ధుమ్' అను పదమునకు అవహాస్యము గూఢ్య

---

1. ' గదా పాణిర్దివం యాతో యుయుత్సుః మృగయన్ రణమ్"
3-17-20 పుట - 392

2 "తత్రోపలభ్యాసుర లోకపాలకమ్
యాదోగణానాం వృషభం ప్రచేతసమ్ , " 3-17-27 పుట : 393

ర్థము 1 ఇంకను హిరణ్యాక్షుఁడు వరుణునితో 'నీవు లోకపాలుర కధి
పతివి ఇదివరలో దైత్యదానవులనుజయించి రాజసూయము చేసితివి
వీర్యమదముచే మదించిన వారిదర్పము నణగింపఁగలవు' అని కలికి
నాఁడు ఈపలుకులలోని అపహాస్యమును గ్రహించిన వరుణుఁడు
హిరణ్యాక్షునితో 'నేనిప్పుడు శాంతుఁడనైనాను నాయందు యుద్ధో
త్సాహము లేదు రణమార్గకోవిదుఁడు, రాక్షసశ్రేష్ఠుఁకు అహితుఁడు
పురాణపురుషుఁడునైన నారాయణునికంటె నీకుతగిన ప్రతిద్వంద్వి
లేఁడు ఆతఁడు రణోత్సవముచే నిన్నానందింపఁజేయఁగలఁడు నీవంటి
అభిమానవంతులు (మనస్వినః) ఆతనినే యన్వేషించుచున్నారు 2
నారాయణుఁడు నీవంటి అసత్పురుషులను శిక్షించుటకును, సత్పురుషు
లను రక్షించుటకును వివిధరూపములను ధరించుచున్నాఁడు' అని
చెప్పినాఁడు అట్టివారి యేరూపమున నున్నాఁడో హిరణ్యాక్షుఁడు
అన్వేషించిన సులభముగా నుండునని వరుణుని యభిప్రాయము
లేనిచో 'స్వయాధియా' అను పదమునకు తగినంత ప్రతిపత్తి
యుండదు

ఇట్లు వరుణుఁడు చెప్పగావిని అభిమానవంతుఁడగు హిరణ్యా
క్షుఁడు లోకసంచారము చేయుచు నారదునివలన నారాయణుఁడు

---

1 ఇందలి అంతరార్థము ప్రకరణోచితముగ వివృతమగును

2 "నయేవముత్సిక్త మదేన విద్విషా
దృఢం ప్రలబ్ధో భగవాన్ అపాం పతిః
రోషం సముత్థం శమయన్ స్వయాధియా
వ్యవోచదంగోప శమం గతావయమ్" 3-17-29
"పశ్యామి నాన్యం పురుషం పురాతనాత్
యస్సంయుగే త్వాం రణమార్గకోవిదమ్
ఆరాధయిష్య త్యసురర్షభై హి తమ్
మనస్వినో యం గృణతే భవాదృశాః" 3-17-30 పుట ; 399

రసాతలముననున్నట్లు తెలిసికొని వెడలినాఁడు అచట జయశీలియు, ధరాధరుఁడును, దంష్ట్రలచే ప్రకాశించువాఁడును, మిఱుమిట్లుగొలుపు శరీరకాంతిగలవాఁడునగు వరాహరూపియైన నారాయణునిగాంచి హిరణ్యాక్షుఁడు 'అజ్ఞుఁడా! భూమినివదలిపెట్టుము జలవాసులగు వారికీభూమిని సృష్టికర్తయిచ్చియున్నాఁడు వదలనిచో సూకరాకారమునఁనున్న నీవు క్షేమముగాఁ మరలిపోలేవు నీవు మాశత్రువులచేత మా నాశమునకై[1] సృష్టింపబడినావా? యోగమాయతో లోకముల నాక్రమించినవాఁడవును, అల్పసత్త్వుఁడవునగు నిన్నుసంహరించి స్నేహితుల దుఃఖమును తొలగింపఁగలను మూలాధారము నశించుటచే ఋషులు, దేవతలుకూడనుండరు[2] అనిపలికినాఁడు

హిరణ్యాక్షుని యీదురాలాపములను విని నారాయణుఁడు భూమిని నీటిపై తేలునట్లుంచి, రాక్షసుని సమీపించినాఁడు హిరణ్యాక్షుఁడు శ్రీహరిపై గదనువిసరఁగా, ఆయన దానిని మధ్యలోనేపట్టుకొని, అతని 'ఓహిరణ్యాక్షా! నేను వనగోచరమైన మృగమునే నీవంటి గ్రామసింహములను వేటాడుదును ధీరులు ఆత్మశ్లాఘను పాటించుకొనరు నేను రసౌకసులన్యాసమును హరించినమాట నిజమే బలవంతునితో వైరముపెట్టుకొని యుద్ధములో నిలువగలనా? నీవుపాదచారులలో నుత్తముఁడవు, ఊహాకందనివేగముగల వాఁడవు నన్నుచంపి నీవారి కన్నీటినితుడిచివేయుము హీనుఁడు ప్రతిజ్ఞ నిలుపుకొనలేఁడు' అని యధిక్షేపించినాఁడు ఈయధిక్షేపమునువిని హిరణ్యాక్షుఁడు తిరిగి తనగదనుగ్రహించి, యుద్ధమునకు పూనుకొనినాఁడు శ్రీహరియు లీలా

---

1 3-18-4 ఇచట 'అథవాయ' అనుపదము హిరణ్యాక్షుని సాధకత్వమునకు మార్గదర్శకమని తరువాత శ్రీధరీయానుసారము నిరూపితమగును

2 ఈనిందయంతయు వ్యాజస్తుతిపరమను శ్రీధరవాక్య ప్రకరణోచితముగ వివృతమగును

ర్థకు యుద్ధమును పొడిగించినాడు అపుడు బ్రహ్మదేవుడు సమయము మించినచో రాక్షసునకనుకూలమైన వేళ వచ్చుననియు, ఈ యభిజన్మ మహార్తనమయమున వానిని సంహరించి లోకమునకు శుభముగూర్చు మనియు నారాయణుని ప్రార్థించినాడు

బ్రహ్మప్రార్థనను మన్నించి నారాయణుడుగదతో హిరణ్యాక్షు తాలువుపై మోదినాడు ఇంకను విజృంభించుచున్న రాక్షసుని జూచి స్వామిచక్రమును[1] స్మరించినాడు చక్రమునుధరించిన వాడును, తనపార్షదముఖ్యునిచే[2] వీచింపబడినవాడునునైన స్వామి చక్రాయుధముతో హిరణ్యాక్షునిసంహరించి, వైకుంఠమునకు మరలి నాడు హిరణ్యాక్షుని మరణము ఉత్తమోత్తమమైనదని దేవతలు కొనియాడినారు

---

1. ''సునాభం చ అస్మరద్విభుః'' 3-19-5 పుట : 338
2. ''తం వ్యగ్రచక్రం దితి పుత్రాధమేన
స్వపార్షద ముఖ్యేన విషజ్యమానమ్
చిత్రావాచోతద్విదాం ఖేచరాణామ్
తత్రస్మాసన్ స్వస్తితేమమ్ జహీతి'' 3-19-6 పుట : 338

హిరణ్యకశిపుఁడు (సప్తమస్కంధము)

హిరణ్యాక్షవృత్తాంతము తరువాత కథాప్రసంగమున హిరణ్యకశిపుని వృత్తాంతము సప్తమస్కంధ పర్యంతము వ్యవహితము. జయవిజయుల శాపానంతరము, హిరణ్యాక్షవధప్రస్తావముతో సప్తమస్కంధమున హిరణ్యకశిపువృత్తాంతమారంభము.

హిరణ్యాక్షుని మరణమున ఆగ్రహించిన హిరణ్యకశిపుఁడు దానవులతో 'నా తమ్ముఁడైన హిరణ్యాక్షుఁడు దేవతాపక్షము వహించిన హరిచే నిహతుఁడైనాఁడు. ఆ విష్ణువు అస్థిరచిత్తుఁడు. నా శూలముతో నాతనిని సంహరింపగలను. అతఁడు మరణించినచో దేవతలుకూడ నశింపగలరు. మీరు భూలోకమునకేగి వేదములను, యజ్ఞములను, బ్రాహ్మణులను బాధింపుఁడు. నారాయణుఁడు వేదాశ్రయుఁడు[1] కావున నీమార్గమాతనిని కనుగొనుటకు ఉపయోగించును' అని యాజ్ఞాపించినాఁడు. హిరణ్యకశిపుని యాజ్ఞానుసారము రాక్షసులు లోకములను బాధించినారు.

పిమ్మట హిరణ్యకశిపుఁడంతఃపురములోనికేగి హిరణ్యాక్షుని మరణమునకు దుఃఖించుచున్న తల్లిని, భ్రాతృజాయను 'హిరణ్యాక్షుఁడు వీరమరణము పొందినాఁడు. చలికందిరి క్రింద పాంథులు చేరినట్లు సంయోగవియోగములుగల సంసారమునకిట్టివి సహజము. గుణమయమైన ప్రపంచమున నిశ్చలుఁడునైనవాఁడు పరమాత్ముఁడువలె ప్రకాశింపఁగలఁడు. చావుపుట్టుకలగూర్చి విలపించుట యవివేకము' అని ఊరార్చినాఁడు.

హిరణ్యాక్షుని జంపిన శ్రీహరిని సాధింపదలచి హిరణ్యకశిపుఁడు బ్రహ్మనుగూర్చి ఘోరతపమాచరించినాఁడు. తపమునకు మెచ్చి

---

1 'విష్ణుర్ద్విజ క్రియామూలో యజ్ఞో ధర్మమయః పుమాన్ ,, " 7-2-

ప్రత్యక్షమైన బ్రహ్మను ఇంట బయట, రాత్రియందును పగటియందును, ఆయుధముల చేతను, భూమ్యాకాశములయందును, నరుల చేతను మృగముల చేతను, ప్రాణుల చేతను అప్రాణుల చేతను, సురాసురుల చేతను, ఉరగముల చేతను మరణము లేకుండ వరము వేడినాడు ఇంకను, యుద్ధమున తన నెదిరించువారు లేకుండునట్లును, ప్రాణులపై నేకాధిపత్యమును కూడ కోరినాడు బ్రహ్మవినమ్మటిని అనుగ్రహింపగా వరోద్రిక్తుడైన హిరణ్యకశిపుడు దిగ్విజయము సాధించి లోకముల నాక్రమించినాడు రాక్షసపీడితులైన దేవతలు నారాయణు నాశ్రయింపగా, స్వామివారికభయమిచ్చినాడు

ఇట్లుండ హిరణ్యకశిపునకు శీలసంపన్నుడైన ప్రహ్లాదుడు జన్మించినాడు ఇట ప్రహ్లాదుని గుణశీలములు విస్తారముగా వర్ణితములు వానిలో నాతనికి జన్మతః వచ్చిన విష్ణుభక్తి మిగిలిన గుణసంపదకన్నను సర్వోత్తమస్థానము నాక్రమించినది

శుక్రకుమారులైన చండామర్కులు ప్రహ్లాదుని శిష్యునిగా స్వీకరించి విద్యాభ్యాసము చేయింపసాగినారు ఒకనాడు హిరణ్యకశిపుడు కుమారుని విద్యాస్ఫూర్తిని పరీక్షింపగోరి ప్రశ్నింప, నారాయణునాశ్రయించుటయే ఉత్తమవిద్యయని ప్రహ్లాదుడు సమాధానమిచ్చినాడు వానిని బాలవాక్యములుగా భావించిన హిరణ్యకశిపుడు తొలుత ఉదాసీనుడయ్యు పునఃపునః ప్రబోధమునను బాలుడు విష్ణుభక్తి వదలక పోవుటచే ఈ కుమారుని చంపుడని రాక్షసుల నాజ్ఞాపించినాడు ఎన్నివిధముల ప్రయత్నించినను ప్రహ్లాదుడు సాధ్యుడు కాకపోవుటచే నాతడు సేవించు విష్ణువెక్కడయని హిరణ్యకశిపుడు గద్దించి పలికినాడు సభాభవన స్తంభమున నారాయణుని చూపగలవాయని ప్రశ్నించిన తండ్రికి, ప్రత్యణువునను వ్యాపించియున్న శ్రీహరి ఈ స్తంభమునను నుండుటలో విచిత్రమేమియని ప్రహ్లా

దునిసమాధానము హిరణ్యకశిపుఁడాగ్రహముతో ఖడ్గముగ్రహించి, స్తంభముపై ముష్టిఘాతమొనర్చినాఁడు అపుడా స్తంభమునుండి కరాళరూపముతో నరసింహస్వామియుద్భవించి హిరణ్యకశిపునకు దర్శనమనుగ్రహించినాఁడు హిరణ్యకశిపుఁడా విచిత్రరూపమును గూర్చి తర్కించినాఁడు అనంతరముస్వామికిని, హిరణ్యకశిపునకును భీషణసంగ్రామము ఘటించినది స్వామి, గరుడుఁడు సర్పమును చీల్చినట్లు హిరణ్యకశిపుని ద్వారదేశముపై నూరుమధ్యభాగమునను౦చి నఖములతో చీల్చి సంహరించినాఁడు ప్రహ్లాదుఁడా యుగ్రనృసింహుని ప్రార్థించి శాంతింపజేసినాఁడు

తృతీయ, సప్తమస్కంధములందలి కథాంశములలో కొలది భేదములున్నట్లును హిరణ్యకశిపుఁడు హిరణ్యాక్షుఁడు బ్రదికియున్న కాలమున నేతపస్సుచేసి, బ్రహ్మవలనవరములు పొందినట్లు తృతీయ స్కంధమున వర్ణితము (8-17-19) హిరణ్యాక్షుఁడు బ్రహ్మనుగూర్చి తపస్సుచేసినట్లు ఎచటను వాచ్యముగ వర్ణింపఁబడలేదు ఆదివరాహ మూర్తియగు నారాయణుఁడు హిరణ్యాక్షునితో యుద్ధముచేయుచున్నపుడు, హిరణ్యాక్షుఁడు తపఃసవరములు పొందినట్లుబ్రహ్మ స్వామికి తెలుపును (8-18-28) ఇక సప్తమస్కంధమున హిరణ్యాక్షుని మరణమునకు ప్రతీకారమునకై హిరణ్యకశిపుఁడు తపమొనర్చినట్లు వర్ణితము (7-3-1, 7-4-4)

## శ్రీమదాంధ్రభాగవతము హిరణ్యాక్షుడు

(తృతీయస్కంధము)

ఇందు మూలకథాంశము చాలవరకు సమానము. హిరణ్యకశిపుని తపస్సువిషయము మూలమునకన్న స్పష్టము. కశ్యప ప్రజాపతి ఆ కవలలకు నామకరణమొనర్చి తిరిగి తపోవనమున కేగినాడు. హిరణ్యకశిపుడు తపమొనర్చి లోకాధిపుడైనట్లును, ఏతత్కాలమునందే హిరణ్యాక్షుడు యుద్ధాన్వేషియై సంచరించుచున్నట్లును వర్ణితము.

"అయ్యవసరంబున నతులతేజోవిరాజితుండైన హిరణ్యకశిపుండు హిరణ్యగర్భవరదాన గర్వంబునను దుర్వారపరిపంథి గర్వనిర్వాపణాఖర్వభుజా విజృంభణంబునను నిఖిలలోకపాలాదుల జయించి స్వవశంబొనర్చి సంతుష్టాంతరంగుండై యొండునుందనకు మృత్యుభయంబు లేక నిర్భయుండై సుఖంబుండె ... " (3-612)

హిరణ్యాక్షుని తపమునుగూర్చియు నీసందర్భముననే పోతన స్పష్టముగ వర్ణించినాడు. "వనజాసన వరప్రదానంబు చింతించి ." (3-6-12) అను వాక్యములో నీయర్థమునిగదితము. బ్రహ్మ నారాయణునితో బలుకుసందర్భములో హిరణ్యాక్షుని తపఃప్రస్తావన మిందు లేదు. వరుణుడు నారాయణునితో యుద్ధముచేయుమని హిరణ్యాక్షునకు చెప్పుట సమానాంశము. ఈఘట్టమనువాదమున కొంత విస్తృతము. పోతన మూలమునందలి "నారదాద్రసాతలం నిర్విశే" (3-18-1) అను సంగ్రహవాక్యమును మతికొంత పెంచినాడు. ఈ పెంపు హిరణ్యాక్షుని రోషమును పెంపుసేయునది 1 హిరణ్యాక్షుడు

---

1 "సరసిరుహోదరుం దొడరి సంగరమొనరించి ... " 3-629
"గురుభుజుండ మహాత్ముండు వికుంఠపురంబున నేడులేడు ... "
3-630

చూపిన ఆదిరాహాకూత వర్ణనము మూలమున నొక్క శ్లోకమునకు పరిమితముకాగా, అనువాదమున నీవర్ణనము విస్తృతము. ఈవిస్తార వర్ణనము జరుగబోవు ద్వంద్వయుద్ధమునకు ప్రాధాన్యమును కల్పించును. హిరణ్యాక్షుడట్టి వరాహముతో పోరనున్నాడని అతని పరాక్రమముకూడ ధ్వన్యంతరముగనిట సూచితము. యుద్ధారంభ సమయమున మూలశ్లోకములను పోతన యథాతథముగననువదించినను శ్రీధరుడుచూపిన వ్యాజస్తుతి అనువాదములోనికిరాలేదు. మిగిలిన సంభాషణము సమానము. యుద్ధవర్ణనము మూలమునకంటె వీరరస పోషకము.

స్తుతిపరమున శ్రీధరునియభిప్రాయము పోతనకుసమ్మతమే. కాకున్నచో హిరణ్యాక్షుని మరణమునుగూర్చి బ్రహ్మాదులు ప్రశంసించిన సందర్భమునను వదిలివేసెడివాడు కాడు. మఱి పోతనవ్యాజస్తుతిని గ్రహింపకపోవుటకు వీరరససందర్భము కారణము కావచ్చును. ఎట్టివారికైనను యుద్ధోత్సాహమున నధిక్షేపము మాత్రమే తోచుట సహజము. శ్రీధరుడు నిందయందు రెండర్థములనుచూపి, భగవంతుడు లీలార్థమై దురుక్తిపరముగనున్న అర్థమునుమాత్రమే గ్రహించెననియు, అట్లు గ్రహించుటకు దేవతలయందలి అనుగ్రహము కారణమనుచు "అపార్థైః నిమిత్తభూతైః తుష్యమాణః యథాశ్రుతార్థగ్రాహిణాం బ్రహ్మాదీనాం అనుకంపయా వీక్ష్యమాణ ఇత్యర్థః" అని భగవదాశయమును స్పష్టముగ వ్యాఖ్యానించినాడు. స్తుత్యర్థము భగవంతునకు సమ్మతము. దేవతలకిది భగవల్లీలయగుటచే దురవగాహము. భగవంతుడు వ్యథనొందుటకాదు. దేవతలను కాపాడ దలచుటయే ఉద్దేశ్యము. లేనిచో నాగ్రహమసంగతమగును.

దేవతలయందలి అనుగ్రహము కారణముగా శ్రీహరి రాక్షసుని పట్ల ఆగ్రహించినాడను శ్రీధరుని భావమునననుసరించి పోతన,

"హరి సరోజాత భవ ముఖాసురులకెల్ల
వచ్చుదురవస్థ కాత్మలోపంతనొంది ." (8-644)

అని వర్ణించినాడు స్వామి దేవతలను కాపాడడం చుటచేతనే

"సురరిపు వాక్యాంకుశముల
గురు కుపిత స్వాంతుడగుచుం గొమరారె " (8-645)

అని పోతన వివరించినాడు

హిరణ్యకశిపుడు :

తృతీయస్కంధమున హిరణ్యకశిపుని జన్మప్రకారము, అతడు వరములనుపొంది రాజ్యముచేసినాడని విషయమాత్రము సూచితము. సప్తమస్కంధమున ధర్మరాజు నారదునిప్రశ్నించు సందర్భమున విస్తారముగ నీతనివృత్తాంతము వర్ణితము. హిరణ్యాక్షుని మరణానంతరము హిరణ్యకశిపుడు సభదీర్చుట, దానవులను ధర్మగ్లానికి ప్రోత్సహించుట, బంధువు నోదార్చుచు సుయజ్ఞోపాఖ్యానము చెప్పుట మున్నగు ఘట్టములు మూలముతో సమానము. హిరణ్యకశిపునితపస్సు మూలముతో సమానాంశములను తపస్స్రీవ్రత యించుమిక్కుటము ప్రజ్వలనరాలు, దేవతలువారిని శరణుజొచ్చుట సమానాంశములు

ప్రహ్లాదచరిత్రము మూలానుసారి అయ్యునధికభాగము స్వతంత్రము. ఇందలి "ఎందారనికండ మాధుర్యమున దేలు మధుపంబు వోవునే మదనములకు", "కమలాక్షునర్చించు కరములు కరములు", "కంజాక్షునకుగాని కాయంబు కాయమే." ఇత్యాది స్వతంత్రపద్యరత్నములు ఆంధ్రదేశమున నత్యంతప్రసిద్ధములు ఈ భాగము కేవలానువాదముకాక భక్తిరసప్రధానమగు ఖండకావ్యము వలెనుండును గజేంద్రమోక్షణము, వామనావతారఘట్టము, రుక్మిణీ కల్యాణము మున్నగుఘట్టములందును మూలానుసారియైన స్వతంత్రత కన్పట్టును నృసింహావతార విర్భావవర్ణనము, నృసింహ హిరణ్యకశిపు యుద్ధవర్ణనము మూలమునకన్న విపులము

బ్రహ్మాండ పురాణము ,

శౌనకాదులకు సూతుడు రాక్షసులజన్మప్రకారమును, వంశ స్థరములను చెప్పుచు హిరణ్యాక్ష హిరణ్యకశిపుల వృత్తాంతము నారంభించినాడు. కశ్యప ప్రజాపతికి దితియందు ఇరువురు కుమారులును, ఒక కుమార్తెయును జన్మించినారు. ఈ ఇరువురు కుమారులు రాక్షస వంశమునకు మూలపురుషులు. వారిలో పెద్దవాడు హిరణ్యకశిపుడు చిన్నవాడు హిరణ్యాక్షుడు. ఇందువీరు కవలలుగా పేర్కొనబడలేదు. దితిగర్భమున హిరణ్యకశిపుడున్న కాలమున కశ్యపుడు చేయు అశ్వమేధయాగమునందు సహధర్మచారిణియైన దితికి "హిరణ్యకశిపు" అనే ప్రత్యేకమైన ఆసనమునిచ్చినారు. ఆ సమయమున జన్మించిన శిశువు వెంటనే పెద్దవాడై ఆ యాసనము నలంకరించినాడు. అందువలన ఆపేరుతోనే ఆతడు ప్రఖ్యాతుడైనాడు.* రెండవవాడు హిరణ్యాక్షుడు. వీరి చెల్లెలు సింహిక. ఈమె కుమారుడు రాహువు.

హిరణ్యకశిపు శబ్దమునకు మఱియొక వ్యుత్పత్తి ఇచటనే చెప్పబడినది. యజ్ఞశాలయందు ఆ యాసనముపై దితి ప్రసవించగా, ఋత్విక్కులు దర్భలతో సమార్జనముచేసి హోతకై వేసిన బంగారపు కశిపువున నుంచినారు. వెంటనే పెరిగిన ఆ శిశువు రెండవ యాసనము అధిష్ఠించుటచే ఇచటి ఋషులాతనికి హిరణ్యకశిపుడని నామకరణము చేసినారు.**

---

* సౌత్యేహన్యతిరాత్రస్య కశ్యపస్యాశ్వమేధికే।
హిరణ్యకశిపుర్నామ ప్రథితం పృథగాసనమ్"

** దిత్యాగర్భాద్వినిష్క్రమ్య తత్రాసీనః సమంతతః।
హిరణ్యకశిపుస్తస్మాత్ కర్మణా తేన సంస్కృతః।"

5వ అధ్యాయము, శ్లోకములు - 4, 5
పత్రాంకము - 101 పుట - 202

హిరణ్యకశిపుఁడు లక్షసంవత్సరములు[1] నిరాహారుఁడై తల క్రిందులుగా బ్రహ్మనుగూర్చి తపమొనర్చి, సర్వభూతములచే నవధ్యునిగా వరమును పొందినాఁడు యోగసాధనచే దేవతలను జయించి, సర్వదేవతాస్వరూపమును ధరించినాఁడు[2] దేవతలందఱును తనకు వశులగునట్లును, ఆర్ద్రవస్తువులవలనను - శుష్కవస్తువులవలనను, పగలును - రాత్రియును తనకుమరణము లేకుండునట్లు బ్రహ్మవలన మఱియొకవరమును వేడినాఁడు ఈవరములనిచ్చుట దుర్లభమనుచునే బ్రహ్మవాని ననుగ్రహించినాఁడు అట్లు సర్వదేవమయుఁడై తన మహిమచే చంద్రత్వ, సూర్యత్వ, వాయుత్వాది సమస్తలక్షణములను గ్రహించి వర్తించినాఁడు అతనిపాలనలో దేవతలును సోమపానము చేసినారు ఈహిరణ్యకశిపునిగూర్చి ప్రాచీనశ్లోక మొకటి ప్రచారములోనున్నది[3] హిరణ్యకశిపుఁడే దిక్కునకుచూచునో దేవతలా

---

1 'శతంవర్ష సహస్రాణామ్" శ్లో॥ 14, పుట - 200

2 'యోగాత్ దేవాన్ వినిర్జిత్య సర్వదేవత్వమాస్థితః"

5వ అధ్యాయము శ్లోకము - 12

పత్రాంకము - 100 పుట - 200

3 'హిరణ్యకశిపూరాజా యాం యామాశాం నిరైక్షత
తస్యై తస్యై తదాదేవా నమశ్చక్రుః మహర్షిభిః'

బ్రహ్మాండపురాణము - శ్లోకము - 26

పత్రాంకము - 100 పుట - 200

సరిగా ఈ భావము కలిగిన శ్లోకము మాఘకావ్యము, ప్రథమసర్గయందు హిరణ్యకశిపుని వర్ణన సందర్భమున కానవగును

"స సంచరిష్ణుర్భువనాంతరేషు యాం
యదృచ్ఛయా శిశ్రియదాశ్రయః శ్రియః
అకారి తస్యై ముకుటోపలస్ఖలత్
కరైః త్రిసంధ్యం త్రిదశైః దిశేనమః"

మాఘకావ్యము - ప్రథమసర్గ - శ్లోకము - 46 పుట - 17

దిక్పాలకాది మహర్షులతోపాటు నమస్కారముచేయుచుండిరి. అట్టి హిరణ్యకశిపునకు నరసింహస్వామి మృత్యువైనాడు. నరునివలన జన్మకలుగుటయు, నరాకారము కలిగి యుండుటయు అను కారణములచే నాతడు నరసింహుడైనాడు. ఇచ్చట 'నర' శబ్దము ప్రహ్లాదపర్యాయముగ సూచితము. కానితరువాత సగముసింహము, సగమునరుడు అని వర్ణించుటచే మొదటి నరసింహశబ్దవ్యుత్పత్తి శ్రేష్ఠార్థపర్యాయము కావచ్చును. సుదర్శనాయుధముధరించిన నృసింహస్వామి ఆ యాయుధమువలన హిరణ్యకశిపునకు మరణము లేకపోవుటచే నఖములతో నురోవిదారణముగావించి సంహరించినాడు. హిరణ్యకశిపునకు ప్రహ్లాదుడు, సంహ్లాదుడు, అనుహ్లాదుడు, హ్లాదుడు అని నల్వురుపుత్రులు. వారిలో ప్రహ్లాదుడు పెద్దవాడు.

## సంస్కృత నరసింహ పురాణము

ఇది యిరువదియెనిమిది అధ్యాయములు ఉపపురాణము ఇందు 39 వ అధ్యాయమునుండి 44 వ అధ్యాయము వఱకు హిరణ్యాక్ష, హిరణ్యకశిపుల వృత్తాంతము కలదు మార్కండేయుఁడు దశావతారములగూర్చి మహర్షులకు వివరించుచు, వరాహావతార కథను చెప్పినాఁడు బ్రహ్మదినము (ఒకకల్పము) పూర్తి అయిన తరువాత అవాంతర ప్రళయమురాఁగా ప్రపంచమేకార్ణవమైనది ఆ సమయమున దితిపుత్రుఁడైన హిరణ్యాక్షుఁడు పాతాళమున నివసించుచు దేవతల బాధింపసాగినాఁడు ఆదివరాహ రూపుఁడై నారాయణుఁడు భూమినుద్ధరింప, దేవతల యాగకర్తలకు భూమి యాధారమనిభావించి హిరణ్యాక్షుఁడు ధాత్రియందలి ధారణ శక్తిని గ్రహించి, సముద్రములో దాగినాఁడు. ప్రాణికోటిని ధరించు శక్తిలేక భూమి తిరిగి రసాతలమును చేరినది నారాయణుఁడు మఱల దంష్ట్రిలపై భూమిని నిలిపి, యుద్ధమున హిరణ్యాక్షుని జయించినాఁడు అటుపిమ్మట పర్వతములపై భూమినుంచి ఆయన వైకుంఠమును చేరినాఁడు ఈమధ్యకాలములోనే స్వామి 'శాకక్షేత్రము'నుచోట నివసించినాఁడు

హిరణ్యకశిపుఁడు బ్రహ్మనుగూర్చి అనేకవేల సంవత్సరములు తపమొనర్చినాఁడు బ్రహ్మ ప్రత్యక్షమై వరము కోరుమనగా శుష్కముచేతను, ఆర్ద్రముచేతను, నీరు అగ్ని మున్నగు సమస్త వస్తువుల వలనను, సమస్త ప్రాణుల వలనను మరణము లేకుండునట్లు వరము వేడినాఁడు ఇట్టివరము ఇదివరలో నెవరును కోరలేదనియు, ఐనను అనుగ్రహించుచుంటిననియు పలికి బ్రహ్మ అంతర్హితుఁడైనాఁడు బ్రహ్మవరోద్ధతుఁడైన హిరణ్యకశిపుఁడు దేవతలనుద్దేశించి యజ్ఞాదికములు చేయరాదనియు, తనకే యజ్ఞభాగములీయవలెననియు, తననే పూజింపవలెననియు లోకములను శాసించినాఁడు

దేవతలు బృహస్పతి మొదటగా వైకుంఠము చేరి రాక్షసబాధ తొలగింప విష్ణువును ప్రార్థించినారు త్వరలో హిరణ్యకశిపుని వధింప గలనని భగవానుడు వారికి అభయమిచ్చినాడు

దేవతలు హిరణ్యకశిపుని తపమును విఘ్న మొనర్చిదలచి నారు నారద పర్వతులను మహర్షులు చిలుకలై హిరణ్యకశిపుని యెదుట నారాయణనామ ముచ్చరించినారు అదివినలేని హిరణ్యకశి పుడు తపస్సు చాలించి స్వగృహమునకు మరలినాడు ఆసమయ మున ఆతనిభార్య యుతుగతియై యున్నది ఆతకస్సు గర్భకాలమున జన్మించినవాడే ప్రహ్లాదుడు తిరిగి హిరణ్యకశిపుడు బ్రహ్మను గూర్చి తపస్సుచేసి వరములను పొందినాడు రెండవమారు హిరణ్య కశిపుడు తపమొనర్చుచున్న సమయములో నింద్రుడాతని భార్య నపహరింపజూచినాడు నారదమహర్షి యింద్రుని వారించి ప్రహ్లా దుని కొంతకాలము తన యాశ్రమములో నుంచుకొని ఆబాలుని విష్ణు భక్తుని చేసినాడు హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని విష్ణుభక్తి సహింప లేక కుమారుని సంహరించుట కనేక ధముల ప్రయత్నించి విఫలుం డైనాడు హిరణ్యకశిప, ప్రహ్లాదుల సంవాదమిట వర్ణితము విసుగు చెందిన హిరణ్యకశిపుడు స్తంభమునందు విష్ణువును జూపగలవాయని ప్రహ్లాదుని ప్రశ్నించినాడు. ప్రహ్లాదుని కన్నులకు నరసింహస్వామి రూపము స్తంభములో గోచరించినది హిరణ్యకశిపుడా స్తంభమును పగులగొట్టగా నందుండి నరసింహుడు దవతరించి సంధ్యాకాలమున గృహద్వారముపై తనయూరువులపై నుంచుకొని నఖములతో హిర ణ్యకశిపుని బొట్టచీల్చి సంహరించినాడు పిమ్మట శాంతించిన స్వామి శ్రీశైలశిఖరముచేరి అచట నివసించినాడు అదియే అహో బిలక్షేత్రము

పద్మపురాణము—

(ఉత్తరఖండము)

జయవిజయులు బ్రాహ్మణశప్తులై, దితియందు కశ్యపప్రజాపతి వలన హిరణ్యాక్ష, హిరణ్యకశిపులుగ జన్మించినారు అప్రమాణ శరీరుడగు హిరణ్యాక్షుడు వేలకొలది చేతులతో పర్వతయుక్తమైన భూమిని పెకలించి, శిరస్సుపై ధరించి రసాతలమున ప్రవేశించినాడు అందులకు భయపడిన దేవతలు నారాయణుని శరణుజొచ్చినారు శ్రీహరి మహావరాహరూపమును ధరించి ఆదిమధ్యాంతరహితమైన శరీరముతో అన్నిప్రక్కలను చేతులు, పాదములు, కన్నులు కలిగి రసాతలము చేరినాడు ఒక దంష్ట్రితో హిరణ్యాక్షుని సంహరించి రెండవ దంష్ట్రితో భూమినుద్ధరించి పైకితెచ్చినాడు దేవతలు వరాహరూపుడగు భగవంతుని స్తుతించినారు

తమ్ముడు మరణించిన వృత్తాంతము విని హిరణ్యకశిపుడు వేయి దివ్యసంవత్సరములు1 బ్రహ్మనుగూర్చి ఘోరతపమొనర్చి అనితరసాధ్యములైన వరములను పొందినాడు తరువాత సమస్త లోకములను స్వాయత్తము గావించుకొని, ఉత్తానపాదుని కుమార్తె అయిన కల్యాణియనునామెను వివాహమాడినాడు 2 ఆమెయందు ప్రహ్లాదుడు జన్మించినాడు మిగిలిన వృత్తాంతము శ్రీమద్భాగవత సమానము

ప్రహ్లాదుని వేధించుచు స్తంభమున శ్రీహరిని చూపగలవా యను ప్రశ్నసందర్భము మాత్రము కొంత వేరయియున్నది 3 హిరణ్య

---

1 'దివ్యవర్ష సహస్రాణి " 238వ అధ్యాయము శ్లోకము - 2 పుట - 819

2 239వ అధ్యాయము, శ్లోకము - 9 పుట - 820

3 ఈవిషయము హిరణ్యకశిపుని భావిజ్ఞాన సూచకముగ ప్రకరణానుసారము వివృతముగను

కశిపుడు స్తంభమునరచేతవేసి, ప్రహ్లాదుని వధింపబోగా స్తంభము నుండి నృసింహస్వామి యావిర్భవించినాడు. కొంతతడవు స్వామికిని, హిరణ్యకశిపునకును యుద్ధము జరిగినది హిరణ్యకశిపుని అవసాన సమయమున స్వామి తన ఉత్సంగము లో నుంచుకొని సంహరించునపుడు అతడు చిరకాలము హరిముఖసందర్శనము ను పొందుభాగ్యమునకు పాత్రుడైనాడు అందువలన విష్ణుభక్తునకు ద్రోహముచేసిన పాపము, విష్ణునిందాపాపము నశించినవి పిమ్మట నిర్మలాత్ముడైన హిరణ్యకశిపుడు కృతార్థుడైనాడు

## కూర్మపురాణము—

కూర్మపురాణము, పూర్వభాగము, ఆఱవ అధ్యాయమున వరాహావతార వృత్తాంత మున్నది ఇందు భూమ్యుద్ధరణము మ ్రమే వర్ణితము పదునైదవ అధ్యాయమున హిరణ్యకశిపుని వృత్తాంతము కలదు దితివలన కశ్యపునకు హిరణ్యాక్ష హిరణ్యకశిపులు జన్మించినారు హిరణ్యకశిపుడు మహాబలసంపన్నుడై బ్రహ్మవలన వరములను పొంది లోకములను బాధింపసాగినాడు దేవతల ప్రార్థనపై హిరణ్యకశిపుని వధించుటకు నారాయణుడు తనయంశతో నొకపురుషుని సృష్టించినాడు 1 ఈవృత్తాంతము విని హిరణ్యకశిపుని పుత్రులగు ప్రహ్లాదాదులు ఆపురుషునితో యుద్ధమొనర్చినారు ఆపురుషుడు వారిని జయించి, వైకుంఠమునకు మరలిపోయినాడు

తరువాత నారాయణుడు స్వయముగ నరసింహరూపముతో యుద్ధమునకు రాగా, హిరణ్యకశిపుడు తనపెద్దకుమారుడైన ప్రహ్లా

1 "త్వ్రాత్వా తదైనతై దుక్తం సవిష్ణుర్లోకభావనః
వధాయ దైత్యముఖ్యస్య సోఽసృజత్ పురుషం స్వయమ్"
15వ అధ్యాయము: శ్లోకము – 32 పుట – 89

దని ఆయనపైకి పంపినాడు ప్రహ్లాదుడు ప్రయోగించిన పాశు పతాస్త్రము స్వామియందు లీనమైనది అపుడు ప్రహ్లాదునకు విష్ణు ప్రసాదమున యథార్థజ్ఞానము కలిగి, విష్ణువును శరణువేడుమని తండ్రికి హితవుచెప్పఁగా హిరణ్యాక్షుఁడామాటలను తిరస్కరించినాడు తరువాత జరిగిన యుద్ధమున నరసింహస్వామి హిరణ్యకశిపుని సంహ రించినాడు హిరణ్యకశిపుఁడు మరణించిన తరువాత హిరణ్యాక్షుఁడు స్వామికి భయపడి ప్రహ్లాదుని వదలి పారిపోయినాడు 1

నారాయణుఁడదృశ్యుఁడైన పిమ్మట ప్రహ్లాదుఁడు హిరణ్యా క్షుని తిరిగి తెచ్చి పట్టాభిషిక్తుని గావించినాఁడు 2 తరువాత నారాయ ణుఁడు వరాహరూపమును ధరించి హిరణ్యాక్షుని సంహరించినాఁడు అప్పు ప్రహ్లాదుఁడు రాజైనాడు ప్రహ్లాదుఁడొకప్పుడు పొరపాటున ఒక బ్రాహ్మణు నవమానించి, విష్ణుభక్తిని విస్మరించుటచే శాప మును బొందినాఁడు ఆశాపవశమున, తనతండ్రిని చంపినందులకు ప్రతీకారముగ ప్రహ్లాదుడు నారాయణునితో యుద్ధమొనర్చినాడు 3 శాపావసానమున తిరిగి జ్ఞానమును పొందిన ప్రహ్లాదుఁడు హిరణ్యా క్షుని కుమారుఁడగు అంధకుని పట్టాభిషిక్తుని గావించి, తాను తపము నకు వెడలిపోయినాడు

---

1 'హతే హిరణ్యకశిపౌ హిరణ్యాక్షో మహాబలః
విసృజ్య పుత్రం ప్రహ్లాదం దుద్రువే భయవిహ్వలః'
15వ అధ్యాయము, శ్లోకము – 69 పుట – 92

2, "గతే నారాయణే దైత్యం ప్రహ్లాదోఽసురసత్తమః
అభిషేకేణ యుక్తేన హారణ్యాక్షమయోజయత్"
15వ అధ్యాయము, శ్లోకము – 72 పుట – 92

3 "పితుర్వధ మనుస్మృత్య క్రోధం చక్రే హరిం ప్రతి"
15వ అధ్యాయము, శ్లోకము – 85 పుట – 93

మత్స్యపురాణము—

ఇందు సూతుఁడు శౌనకాది మహర్షులకు హిరణ్యకశిపు వృత్తాంతమును దెలిపినాఁడు హిరణ్యకశిపుడు బ్రహ్మనుగూర్చి ఘోర తపస్సుచేసి, అనితరసాధ్యములైన వరములను పొంది లోకములను పీడించినాఁడు దేవతలు నారాయణుని ప్రార్థింపఁగా, స్వామి నృసింహరూపమున నోంకార సహాయుఁడై హిరణ్యకశిపుని సభా మండపమున నావిర్భవించినాఁడు. అచట విహరించుచున్న నరసింహుని రాక్షససముఖ్యు లెదిరించి పరాజితులైనారు అపుడు హిరణ్యకశిపుని కుమారుఁడగు ప్రహ్లాదుఁడు స్వామితో యుద్ధమొనర్చి పరాజితుఁడైనాఁడు అతనికి నారాయణుని యందు భక్తిప్రపత్తులు కలిగి, స్వామిని శరణుకోరుమని తండ్రికి నచ్చచెప్పినాఁడు కాని హిరణ్యకశిపుఁడు నృసింహస్వామి నెదిరించి ఆయనచే హతుఁడైనాఁడు ఈ వృత్తాంతము పద్మకల్పమున జరిగినట్లు మత్స్యపురాణమున సూచితము

(163వ అధ్యాయము, 1 నుండి 6 శ్లోకములు)

విష్ణుధర్మోత్తరపురాణము—

ఇందు దైత్యవంశ వర్ణన సమయమున సంగ్రహముగ హిరణ్యాక్ష హిరణ్యకశిపుల వృత్తాంతము వర్ణితము దితికి కశ్యపునివలన హిరణ్యాక్ష హిరణ్యకశిపులను కుమారులు కలిగినారు వారిలో హిరణ్యాక్షుని 'నరవరాహ' రూపమును ధరించియు, హిరణ్యకశిపుని 'నృసింహ' రూపమును ధరించియు శ్రీహరి సంహరించినాఁడు 1

---

1 "హిరణ్యాక్షో హతో రాజన్ నృవరాహేణ సంయుగే
హిరణ్యకశిపూ రాజన్ నృసింహేన నిపాతితః"
విష్ణుధర్మోత్తరపురాణము, ప్రథమఖండము, 121వ అధ్యాయము
శ్లోకము - 2 పత్రాంకము - 78 పుట - 156

## సంస్కృత మహాభారతము —

ఇందు ఆది, అరణ్య, శాంతి, అనుశాసనిక పర్వములలో హిరణ్యకశిపు వృత్తాంత ప్రస్తావన మున్నది ఈకథ శ్రీమద్భాగవత కథతో సదృశము. ఆదిపర్వమున హిరణ్యకశిపుడే శిశుపాలునిగ జన్మించినట్లు వర్ణితము.

"దితేః పుత్రస్తయో రాజన్ హిరణ్యకశిపుః స్మృతః
న జజ్ఞే మనుష్యే లోకే శిశుపాలో నరర్షభః" 1

దితికి హిరణ్యకశిపుడొక్కడే కుమారుడని ఆదిపర్వము

"ఏక యేవ దితేః పుత్రః హిరణ్యకశిపుః స్మృతః" 2

అరణ్యపర్వములో నరసింహావతార వర్ణన సందర్భమున హిరణ్యకశిపు ప్రస్తావన కలదు

"ఆదిదైత్యో మహావీరో హిరణ్యకశిపుస్త్వయా
నారసింహం వపుః కృత్వా సూదితః పురుషోత్తమ" 3

మిగిలిన పర్వములయందలి కథ అన్నిప్రతులలోను సమానాధ్యాయములలో కన్పట్టుటలేదు

## విష్ణుపురాణము - సంస్కృతము —

ఇందు ప్రహ్లాదచరిత్రకే ప్రాధాన్యము జయవిజయుల శాప వృత్తాంతమిట ప్రస్తావింపబడలేదు విష్ణుపురాణము-ప్రథమాంశమున 16 నుండి 20 అధ్యాయములవఱకు ప్రహ్లాదచరిత్రము విపులితము హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని బాధించిన వృత్తాంతమే ఈయధ్యాయ

---

1 ఆదిపర్వము, 61వ అధ్యాయము శ్లోకము - 5 పుట - 334
2 ఆదిపర్వము, 59వ అధ్యాయము శ్లోకము - 17 పుట - 318
3 అరణ్యపర్వము, 100వ అధ్యాయము, శ్లోకము - 20 పుట - 550

ములందు విస్తారముగ వర్ణితము ఈ పురాణమును పరాశరుఁడు మైత్రేయునకు వివరించినాఁడు

హిరణ్యకశిపుఁడు దిగ్విజయము గావించి ఇంద్రాది దేవతలను వశవర్తుల నొనరించుకొనినాఁడు అతని పుత్రుఁడు ప్రహ్లాదుఁడు విష్ణు భక్తుఁడు కుమారుని విష్ణుభక్తిని సహింపలేని హిరణ్యకశిపుఁడు బహు విధముల నాతని వారింపఁ జూచినాఁడు ఎంతకును ప్రహ్లాదుఁడు తన మార్గమునకు రాకపోవుటచే ఆబాలుని వధింపవలసినదిగా నాగుల కాజ్ఞ యిచ్చినాఁడు పిమ్మట వరుసగా దిగ్గజములను, యోధులను, సేవకులను ప్రహ్లాదుని బాధించుటకు వినియోగించినాఁడు. అబాలు నిచే విషముఁ దినిపించినాఁడు నారాయణుఁడు నిరంతరమా బాలుని రక్షింపుచుండుటచే నవియన్నియు నిష్ఫలములైనవి ఇట్లే సంశోషవ యువు ప్రపాతము మున్నగు మారణోపాయములన్నియు ప్రయో గించి హిరణ్యకశిపుఁడు విఫలుఁడైనాఁడు. బాధలు తీవ్రతరము కాఁగా ప్రహ్లాదుఁడు విష్ణువును స్తుతించినాఁడు

ప్రహ్లాదునకు నారాయణుఁడు ప్రత్యక్షమైనాఁడు విష్ణుద్వేష పాపమునుండియు, విష్ణుభక్తుఁడగు తనను అనేకవిధముల బాధించిన పాపమునుండియు తనతండ్రిని విముక్తుని జేయుమని ప్రహ్లాదుఁడు స్వామిని ప్రార్థించినాఁడు శ్రీహరి యట్లే అనుగ్రహించి ప్రహ్లాదునకు నిత్యభక్తియు, పిమ్మట మోక్షమునుకూడ ననుగ్రహించి అంతర్ధాన మైనాఁడు పిమ్మట ప్రహ్లాదుఁడు తండ్రికడకేగి ప్రణామమొనర్ప హిరణ్యకశిపుఁడును కుమారుఁడు ప్రతిక్రియుస్నందులకు సంతసించి, అతనినట్లు ప్రేమతో జూచినాఁడు నరసింహావతారము ప్రహ్లాదుని రక్షించుటకేకాని హిరణ్యకశిపుని సంహారమునకు కాదని తెలియు చున్నను, నరసింహస్వరూపియగు నారాయణునిచేతనే హిరణ్య కశిపుఁడు సంహరింపబడినట్లు

"పితర్యుపరతిం నీతే నరసింహ స్వరూపిణా
విష్ణునా సోఽపి దైత్యానాం మైత్రేయాభూత్ పతి స్తతః"[1]
అను శ్లోకమువలన విదితమగును.

## సంస్కృత హరివంశము - హరివంశపర్వము

ఇందు జనమేజయునకు వైశంపాయనుఁడు భగవంతుని అవ తారముల తత్త్వమును దెలుపుచు వరాహ నృసింహావతారముల వృత్తాంతమును జెప్పినాఁడు. సర్వప్రాణులకు హితమును కలిగించు టకై నారాయణుఁడనేక విధము లుగ సర్వభూతాత్మకుఁడై ఆవిర్భ వించుచుండును. వరాహావతారము (శ్రుతి ముఖము చతుర్వేదములు-వరాహపాదములు, యూపము - దంష్ట్రి), (క్రతువులు - దంతములు, యజ్ఞవేది - ఆస్యము, అగ్ని - జిహ్వ, దర్భలు - రోమములు; బ్రహ్మ - శీర్షభాగము, అహోరాత్రములు - కన్నులు, వేదాంగ ములు - ఆభరణము, ఆజ్యము - ఆననము; స్రువములు-తుండము; సామవేదఘోష - (వరాహముచేయు) ధ్వని, ప్రాయశ్చిత్తములు - నఖములు. ఇది సంగ్రహముగా యజ్ఞవరాహ స్వరూపము. ఇట్టి యజ్ఞవరాహముచే హిరణ్యాక్షుఁడు హతుఁడై న పిమ్మట రసాతల మునను న్న భూమి యుద్ధరింపఁబడినది.

### శ్రీ న ర సిం హా వ తా ర ము

పూర్వము కృతయుగమున దైత్యులకాదిపురుషుఁడైన హిరణ్యకశి పుఁడు 11,500 సంవత్సరములు[2] బ్రహ్మనుగూర్చి ఘోరతప మొనర్చి నాఁడు. అతని శమదమములకు, బ్రహ్మచర్యమునకు బ్రహ్మ మిక్కిలి

1 విష్ణుపురాణము, ప్రథమాంశము, 20వ అధ్యాయము
శ్లోకము - 32 పుట - 105

2 "దశవర్ష సహస్రాణి శతాని దశపంచచ"
శ్లోకము - 41 పుట - 147

నంతరించినాడు 1 హిరణ్యకశిపుడు సర్వభూతములవలనను, సర్వ వస్తువులవలనను మృత్యువులేకుండ వరమడిగినాడు. కాని అమర త్వము కోరలేదు. ఎవ్వడు తనను సరివారముగ పాశ్చిపహారము చేతనే నాశనము చేయగలడో అతడు తనకు మృత్యువు కాగలడని పలికినాడు హిరణ్యకశిపుడు. తనకు సర్వభూతాత్మకత్వము ననుగ్ర హింపుమని ప్రార్థించ బ్రహ్మ అట్లే అనుగ్రహించినాడు. ఈవరముల వలన హిరణ్యకశిపుడు లోకకంటకుడు కావచ్చుననియు, అతని వధోపాయము నాలోచించ వలసినదనియు, దేవతలు బ్రహ్మను వేడి నారు. తపఃఫలమును హిరణ్యకశిపుడు అనుభవించవలసినదే అనియు, ఫలక్షయానంతరము విష్ణువే అతనిని సంహరించుననియు బ్రహ్మ వారికి అభయమిచ్చినాడు.

నారాయణుడు దేవతల ప్రార్థనపై నరసింహునిగా నవతరించి హిరణ్యకశిపుని సభాభవనము ప్రవేశించినాడు. అతని అనుచరులను పిమ్మట హిరణ్యకశిపుని స్వామి సంహరించినాడు. 2

## తెలుగు హరివంశము

ఎఱ్ఱన గ్రంథితమైన హరివంశముత్తరభాగము, నవమా శ్వాసమున వరాహ నృసింహావతారముల వృత్తాంతమున్నది. నారా యణుడు యోగనిద్రలో నుండగా యుగ సహస్రము గడచినది. పిమ్మట నిద్రమేల్కాంచి సృష్టినిగూర్చి చింతించినాడు. ఇంతలో

1 "తతశ్చమదమాంచ బ్రహ్మచర్యేణ చానఘ
బ్రహ్మా ప్రీతో భవత్తస్య తపసా నియమేన చ"
శ్లోకము - 42 పుట - 147

2 "దైత్యం సోஉతి బలం దీప్తం దృప్త శార్దూల విక్రమమ్
దృష్ట్వా దైత్యగణ్యైర్గుప్తం హతవానేక పాణినా"
శ్లోకము - 78 పుట - 149

మహాండమొకటి నారాయణ వదననిష్క్రాంతమైనది వేయిసంవత్సరములకా యండము పగిలినది దానినుండి యొనిమిది రంధ్రములద్వారా వెలువడిన రసము బంగారురంగుతో నెనిమిది దిక్కులకును ప్రవహించినది ఆగనముతో కొంత భాగము ఘనీభవించి మేరుపర్వతమైనది మిగిలిన పర్వతములు నిట్లే యేర్పడినవి ఇంకను మిగిలిన రసప్రవాహము సాగరముశైనది ఈరసప్రవాహమున భూమి కు నిగిపోయినది యజ్ఞక్రియల కాధారమైన కర్మస్థానము నశించుటచే దేవతల ప్రార్థనచే యజ్ఞవరాహమై నారాయణుడు భూమినుద్ధరించినాడు ఆ సమయమున హిరణ్యాక్షుడు విజృంభించి లోకోపద్రవ కారియైనాడు వరాహరూపియైన నారాయణుడు దేవతల బాధకు జాలినొంది హిరణ్యాక్షునితో తలపడి, చక్రప్రయోగముచే నాతనిని సంహరించినాడు

తమ్మునిమరణవార్తవిని హిరణ్యకశిపుడు 11000 సంవత్సరములు తపమొనర్చి బ్రహ్మవరములు పొంది దర్పయుక్తైనాడు దేవతలనూరార్చుచు హిరణ్యకశిపుని అవసానమునుగూర్చి బ్రహ్మ వారికి వివరించినాడు బహుకాలము తరువాత దేవతల ప్రార్థనపై హిరణ్యకశిపుని సంహరించుటకు స్వామి వానిసభయందు దావిర్భవించినాడు హిరణ్యకశిపుడు నరసింహస్వామిని తన మృత్యువుగా గుర్తించినట్లిట సూచితము (నవమాశ్వాసము, పద్యము 319) ప్రహ్లాదుడు దివ్యదృష్టితో నరసింహుని నారాయణునిగా నెరిగి ఏదేని ఉపాయముతో తప్పించుకొనుడని తండ్రిని, పరివారమును హెచ్చరించినాడు హిరణ్యకశిపుడా మాటలను సరకుగొనక స్వామితో యుద్ధమునకు తలపడినాడు అతని దివ్యాస్త్రములన్నియు స్వామియందు లీనమైనవి విప్రచిత్తి ప్రముఖదానవు లాయనచే హతులైనారు పిమ్మట స్వామి తనదీప్త ఖరరుహములతో హిరణ్యకశిపుని ఉరోవిదార మొనర్చినాడు

## తెలుగు నృసింహపురాణము

ఎఱ్ఱనగారి నృసింహపురాణము అహోబలక్షేత్ర ప్రశంసాత్మకము ఇది సంస్కృత నృసింహపురాణమున కనువాదము కాదు భాగవత, విష్ణుపురాణముల కథాంశములు ఇందధికభాగము గ్రహింపబడినవి హరివంశమున నున్న వృత్తాంతముకూడ ఎఱ్ఱనకృతమయ్యు ముతాలవిధేయము హరివంశమున శాపవృత్తాంతము లేదు అది భాగవతమునుండి గృహీతము భాగవత భావములిందు అనువదింపబడినవి ముఖ్యముగా మహర్షుల శాపముపశక్యభోగ్యమనుచు, శాపకాలమునకూడ శుభములు లుగునని నారాయణుడు జయవిజయులతో పలికిన పలుకులు భాగవత ప్రభావ భావితములు 1

భాగవతమున నారాయణుడే ద్వారముకడకువచ్చి జయవిజయుల నోదార్చినాడు. నృసింహపురాణమున స్వామి వారిని తన సమక్షమునకు పిలిపించి సాంత్వన వచనములు పలికినట్లున్నది ఇది స్వస్వామి భావ నిరూపకము భాగవతము శరణాగత వాత్సల్య ద్యోతకము జయవిజయులపై సానుభూతి కలుగునట్లు ఎఱ్ఱన సనకాదులకును, జయవిజయులకును సంవాదమును కూర్చినాడు

జయవిజయులు ప్రథమ జన్మమున దితికిని, కశ్యపప్రజాపతికిని హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగ జన్మించినారు హిరణ్యకశిపునితపము, బ్రహ్మవరములు, లోకకంటకత్వము విస్తృతముగ వర్ణితములు హిరణ్యకశిపుని తపోభంగమునకై అప్సరసలు వచ్చుట, ఋతువర్ణనలు ఇత్యాదులను ఎఱ్ఱన ప్రబంధ మర్యాదననుసరించి రచించినాడు హిరణ్యకశిపుని భార్యకు స్వప్నమున విష్ణువు సాక్షాత్కరించుట,

---

1 నృసింహపురాణము, ప్రథమాశ్వాసము, గద్య - 101 పుట - 37
భాగవతము, తృతీయస్కంధము, 17వ అధ్యాయము

శుక్రుఁడు ఆ మెకు త్వరలో నారాయణాంశనో కుమారుఁడు జన్మిం చునని చెప్పుట ఎఱ్ఱనగారి స్వతంత్ర కల్పనమే యానవచ్చును. ప్రసిద్ధ పురాణములయందీ స్వల్పవృత్తాంతము వ్యాగ్యము ప్రహ్లాగుని హిరణ్యకశిపుఁడు బాధించుట విష్ణుపురాణము ననుసరించినదని విమ ర్శకుల యభిప్రాయము ప్రహ్లాద హిరణ్యకశిపుల సంవాదమును, నృసింహావిర్భావమును భాగవతానుసారియే! ఎఱ్ఱన గ్రంథమందలి ఈ వర్ణనలను తరువాత పోతన కొంతవఱకు ననుసరించినాఁడు 1 నరసింహస్వామి హిరణ్యకశిపునితో నొనర్చిన యుద్ధము ఎఱ్ఱన స్వతంత్రవర్ణనము

పై గ్రంథములను పరిశీలింపఁగా నొక్కొ వృత్తాంతమనేక విధము లుగ నుండుట పైరుధ్యముగనె కన్పట్టును పౌరాణికులు, విమర్శకులు, మీమాంసా శాస్త్రజ్ఞులు వీనిని కల్పభేదములచే జరిగిన వేఱువేఱు కథలని అభిప్రాయపడినారు ఇట్టిభేదములు ప్రతివృత్తాంతమునకును సర్వసాధారణము సముద్రమథనము, దక్షయజ్ఞము మున్నగువాని యందును పురాణములలో నిట్టిభేదము గోచరము. భక్తిప్రమయమున భాగవతము ప్రమాణమైనట్లు తక్కిన గ్రంథములు కావనుట లోక

---

1. ప్రహ్లాద హిరణ్యకశిపుల సంవాదము
నృసింహపురాణము, పంచమాశ్వాసము, పద్యములు – 47 నుండి 81
పుటలు – 171 నుండి 181
భాగవతము, సప్తమస్కంధము, పద్యములు – 139 నుండి 146, 163 నుండి 183 పుటలు – 46 నుండి 48, 53 నుండి 60
నృసింహావిర్భావము ;
నృసింహపురాణము, పంచమాశ్వాసము, గద్యము – 82 పుట – 181
భాగవతము, సప్తమస్కంధము, గద్యము – 265 పుట – 99

విదితము. భాగవతమునందే ఈవిషయము నిగదితము[1] ప్రమాణమైన కావ్యముగను, పురాణముగను, భక్తిప్రతిపాదకమగు శాస్త్రముగను భాగవతము శిరోధార్యము. పరతత్త్వమును జేరుటకు మిగిలిన శాస్త్రములకన్న భాగవతముత్తమసాధనమనియు, దానియందు నిరూపింపబడిన వస్తువు వాస్తవమనియు, అది తాపత్రయ నిర్మూలన హేతువనియు, భాగవత పఠనమున పరమేశ్వరుడే హృదయస్థుడగుననియు భాగవతవిషయ సారాంశము

హిరణ్యాక్ష హిరణ్యకశిపుల వృత్తాంతమున భాగవతమే ప్రధానప్రమాణముగ స్వీకృతము

---

1 ధర్మః ప్రోజ్ఝిత కైతవోఽత్ర పరమో నిర్మత్సరాణాం సతామ్
వేద్యం వాస్తవ మత్రవస్తు శివదం తాపత్రయోన్మూలనమ్
శ్రీమద్భాగవతే మహాముని కృతే కింవా పరైరీశ్వరః
సద్యోహృద్య వరుధ్యతేఽత్ర కృతిభి శ్శుశ్రూషుభి స్తత్క్షణాత్"

శ్రీమద్భాగవతము, ప్రథమస్కంధము,
1వ అధ్యాయము, శ్లో॥ 2 పుట - 65

## హిరణ్యాక్షుని సాధకత్వము

నవవిధభక్తులు భగవానుని జేరుటకు శ్రేష్ఠమార్గములయ్యు, వైరము సులభసాధక భక్తిమార్గముగ భాగవతమునను, ఇతర ప్రామాణిక గ్రంథములలోను నిరూపితము. వైరభక్తియే 'వైరాను బంధము'ని శ్రీమద్భాగవత వ్యవహారము 1 ఇట్టివైరభక్తులలో కారణ జన్ములైన వారికిమాత్రమే ఈమార్గమనుష్ఠేయము 2 జయవిజయులు వైరభక్తిమార్గమున తిరిగి భగవంతుని చేరుటకు భగవత్సంకల్పమే కారణము. అందువలన జన్మాంతరమునను వారు కారణజన్ములు. ఈ విషయము భాగవతమున నిశ్చప్రచయముగ నిరూపితము శ్రీధరీయమును ఈవిషయమును దృఢీకరించును

"మహైవతు మతం సమ్మతమ్ ఇదమత్ర తత్త్వం యద్యపి సనకాదీనాం క్రోధోపి న సంభవతి న చ భగవత్పార్షదయోః తయోర్వా బ్రాహ్మణ ప్రాతికూల్యమ్ నచ భగవతః స్వభక్తోపేక్షా నచ వైకుంఠగతానాం పునర్జన్మ తథాపి భగవత్ సిసృక్షాదవత్ కదాచిత్ యుయుత్సా సంజని తదా అస్యైషామల్ప బలత్వాత్ యత్స్వపార్షదానాం తుల్య బలత్వేపి ప్రాతికూల్యానుపపత్తేః ఏతామేవ బ్రాహ్మణనివారణే ప్రవర్త్య, తేషుచ క్రోధముత్పాద్య, తచ్ఛాప వ్యాజేన ప్రతిపక్షం విధాయ, యుద్ధకౌతుకం సంపాదనీయమితి భగవతైవ వ్యవసితమ్ తత్సర్వం సంగచ్ఛతే తదుక్తశాపో మహైవ నిమిత్త ఇతి మాభిన్నమితి"

(శ్రీధరీయము, తృతీయస్కంధము, 16వ అధ్యాయము
శ్లోకములు . 29, 30 పుట ' 390)

---

1, ' యథా వైరానుబంధేన " 7-1-27 పుట - 11
' వైరానుబంధ తీవ్రేణ " 7-1-47 పుట - 1/
"వైరానుబంధనంబున 7-15 పుట - 5

2 వేనుడు మున్నగువారికి అనుష్ఠేయము కాదనుట

శాపము భగవానునకు సమ్మతము కాని శాపకర్తృత్వమిది సనకాదులకు క్రోధమే కలుగకుండవచ్చును అంతేకాదు, భగవత్పార్షదులకు బ్రాహ్మణ ప్రాతికూల్యమును కలుగదు నారాయణుఁడు శాపము నుపసంహరింపగలిగియు భక్తునుపేక్షించుచు తూష్ణీంభావము వహింపలేదు అట్లే వైకుంఠములోని వారికి పునర్జన్మయు కలుగరాదు కాని భగవంతుని సంకల్పము, సృష్టిచేయవలెనను కోరిక ఇట్టిది భగవంతునకు యుద్ధము చేయవలెనను కోరిక కలిగినది ఇతరులందఱును తనకంటె నల్పసత్త్వులు తన పార్షదులు సమానబలవంతులైనను వారియందు శత్రుత్వము కలుగదు అందువలన వారిని బ్రాహ్మణ నివారణమునందు ప్రవర్తింపఁజేసి, వారియందు క్రోధము కలిగించి, వారి శాపవ్యాజమున ప్రతిపక్షమును సృష్టించి, పోషించి, భరించి యుద్ధకౌతుకమును తీర్చుకొన వలెననెడి సర్వమును భగవత్సంకల్పమే 1 అందువలన దీనిలో జయవిజయులకు కాని, మహర్షులకు కాని దోషస్పర్శ లేదు 2

---

1 'ఏతౌ సురేతర గతిం ప్రతిపద్య సద్య
స్సంరంభ సంభృత సమాధ్యనుబద్ధ యోగౌ
భూయస్సకాశ ముపయాస్యత ఆశు యో
వశ్శాపో మయైవ నిమిత్తస్తదవైత విప్రాః" 3-16-26 పుట - 389

2 'స్రష్టుమిచ్ఛా సిసృక్షా"— ఇది సనాద్యంతధాతువృత్తి
'ధాతోః కర్మణః సమాన కర్తృకాత్ ఇచ్ఛాయాం వా"
(3-1-7 పాణినీయము, సిద్ధాంతకౌముది, 4వ భాగము పుట - 304)

అను సూత్రముచే 'సన్' ప్రత్యయము కర్త తనకు కలిగిన కోరికను వ్యక్తపఱచుట అనునర్థమున ధాతువుపై వచ్చును ఇది భావార్థకమైనచో సన్నంతముపై "అప్రత్యయాత్" (3-3-102) పాణినీయము, సిద్ధాంత కౌముది, 4వ భాగము పుట - 692)

అను సూత్రముచే అకారముచేరి కృదంతమగును సృష్టి చేయవలెనను

పోతన శ్రీధరుని భావమునింత స్పష్టముగ స్వీకరింపలేదు కాని వైరప్రాశస్త్యమును మాత్రము మోక్షహేతువుగ భగవద్వాక్యముల పేర్కొనినాఁడు

"అనఘుఁడు భగవంతుం డి
ట్లనియెన్ మునులార వీరలసయము భువికిన్
జనియించట నసురయోనిన్
జనియింతురు లోభ మోహ సంగతులగుచున్" 3_584

"దేవజనావళికుపహతి
గావించుచు నిఖిలభువన కంటక వృత్తిన్
జీవించుచు నాయెడ నం
భావిత వైరానుబంధ భావములగుచున్" 3_585

"ఆహవముఖమున నను నతి
సాహసమున నెదిరిపోరి చక్రనిశిత ధా
రాహతి దెగివచ్చెదరు
త్సాహ మెలర్పంగ నాదు సన్నిధి కంతన్" 3 586

"నను వైరంబున నైనను
మనమున దలఁచుటను నానమక్షమున మదా
నన మీక్షించుచు నీల్గుట
ననఘాత్మకులై వసింతు రస్మత్పదవిన్" 3_588

"వినుఁడిలమీఁద నిఁకెన్నటి
కిని బుట్టువులేదు వీరికిని వీరలు వ
ల్కినయట్ల నాదుచిత్తము
నను దలతుంగాన వీరానసంబులనింకనే" 3_589

---

కోరికయు,ఆదరణమును రెండును భగవంతునియందే కలిగినవని శ్రీధరుఁడు వన్ ప్రత్యయాంతమును ప్రయోగించినాఁడు

ఇట్లే "యోద్ధుమిచ్ఛా యుయుత్సా" అనుదానియందును ఎఱుగవలెను

శ్రీమద్భాగవత సమ్మతమైన నిట్టిభావమును ఎఱ్ఱాప్రెగడయు నృసింహపురాణమున వివరముగ వర్ణించినాఁడు

హిరణ్యాక్షుఁడు నారాయణారాధనమునకై ఉదాత్త సిద్ధిప్రదమైన, అనన్యాదృశమైన వైరమార్గమును అవలంబించినాఁడని ఈ గ్రంథముల తాత్పర్యము సాధకుఁడు స్వయముగ జ్ఞాని అయ్యు గురువుల అనుగ్రహమునకు పాత్రుఁడు కావలెను గురువు ఎంత ఉపదేశించినాఁడను దానికన్న ఎల్లుపదేశించినాఁడనునదే గురుశిష్యసంబంధమున ప్రధానము శిష్యుఁడు నాల్గవభాగము జ్ఞానము గురువువలనను, మఱియొక నాల్గవభాగము తనమేధ వలనను, ఇంకొక నాల్గవభాగము సతీర్థులవలనను, చివరిభాగము కాలక్రమమునను గ్రహించునని గురుపరంపరలోనున్న వ్యవహారము 1 యోగ్యుఁడైన వానికి మాత్రమే యోగ్యుఁడైన గురువు యోగ్యమైన వస్తువు ననుగ్రహించును భాగవతమున నిట్టి యోగ్యతాత్రితయము స్పష్టముగ నిరూపితము

హిరణ్యాక్షుఁడు నారాయణు నన్వేషించుచు జైత్రయాత్ర ప్రారంభించినప్పుడే అతనియందలి జిజ్ఞాస వ్యక్తము కాని గుర్వనుగ్రహము లేకపోవుటచే నాయన్వేషణకు స్పష్టాకృతి లేదు విద్యాప్రాప్తికి అర్హుఁడగుట వలననే నారాయణుఁడు తనను చేరుటకు మార్గము సులభముచేసినాఁడు ఇట విద్య నారాయణ సందర్శనరూపము పరమాత్మ సాక్షాత్కారము కావలెనన్నచో భౌతిక పదార్థములన్నిటి నన్వేషించి వానితత్త్వము తెలిసికొనవలెను అప్పుడు తాను దర్శించిన పదార్థములలో నిది ఆత్మరూపము కాదను నిశ్చయ

---

1 "ఆచార్యాత్ పాదమాదత్తే
పాదం శిష్య స్స్వమేధయా
పాదం సబ్రహ్మచారిభ్యః
పాదం కాలక్రమేణ చ"

జ్ఞానమేర్పడి జిజ్ఞాస విస్తృతమగును హిరణ్యాక్షుని లక్ష్యము నారాయణుఁడు అది లోకసాధారణ రీతిలోనే అసత్యమార్గమున ప్రారంభమైనది అసత్యమార్గమున సన్వేషణ ఆరంభించినను అర్థ్వనకు సత్యమార్గము తుదకు లభించును

"ఉపాయాశ్శిక్షమాణానాం బాలానాముపలాలనాః
అసత్యే వర్త్మని స్థిత్వా తతః సత్యం సమీహతి"

ఈ జిజ్ఞాసారంభముచే జ్ఞానప్రాప్తికి హిరణ్యాక్షుఁడు అర్హుఁడైనాఁడు ఈ పరీక్షయం త్రము శిష్యుని యోగ్యత నిరమయునకై చిరకాలము కొనసాగినది తుదకాతని సాధన ఫలించి నారాయణునివంటి యోగ్యుఁడైన గురువు లభించినాఁడు

గురూపదిష్టమైన మార్గము దుర్లభమైనపుడు తిరిగి సక్రమమార్గమున చింతన చేయించువాఁడు యోగ్యునకు భగవదనుగ్రహము వలన లభించును ఆమార్గమే నారదోపదేశము 1 నారాయణుఁడు కూడ హిరణ్యాక్షునితో యుద్ధముచేయలేక తాను తప్పించుకొనుటకై నారాయణునికడకు పంపెనని చెప్పుటకు వీలులేదు హిరణ్యాక్షుఁడు పలికిన పలుకులలో నారాయణునిపట్ల అవహాస్యమును, తన ప్రతాపాదికముల ప్రాగల్భ్యమును ఉన్నట్లు వాచ్యార్థము గోచరించును "నీచవత్" అనునుపమానము ఇవార్థమును సూచించును కాని నీచుఁడని తెలుపదు నారాయణునికడ వాస్తవముగ హిరణ్యాక్షుఁడు వినయమునే చూపినాఁడు. లేనిచో "ప్రణిపత్య" అనునది వ్యర్థమగును లేదా "నీచవత్ ప్రణిపత్య" అని 'మిక్కిలి వినయముతో నమస్కరించి' అని అన్వయించుట యుక్తము

---

1 'నారదాద్రోపాతలం నిర్విశేః' 3-18-1 పుట - 304

హిరణ్యాక్షుఁడు వరుణుని జూచిన సందర్భములోని వర్ణనమిది

"సవర్ష పూగానూ దధా మహాబలశ్చరన్మహోర్మిన్ శ్వసనేరితా ముహుః
మౌర్వ్యాభి జఘ్నే గదయా విభావరీ మాసేదివాం స్తాతపురీం
ప్రచేతసః" 3.17.26

"తత్రో పలభ్యాసుర లోకపాలకం యాదోగణానామృషభం ప్రచేతసం
స్మయన్ప్రలబ్ధుం ప్రణిపత్య నీచవజ్జగాద మే దేహ్యధిరాజ
సంయుగమ్" 27,

"త్వం లోకపాలాధిపతిర్బృహచ్ఛ్రవా వీర్యాపహో దుర్మద వీర
మానినాం

విజిత్యలోకే కిల దైత్యదానవాన్ యద్రాజసూయేన
పురాఽయజత్ప్రభో" 28

హిరణ్యాక్షుఁడు విభావరీనగరమునను న్న వరుణుని చేరుటకు కొన్ని సంవత్సరము లన్వేషింపవలసి వచ్చినది ఈ యన్వేషణ తప స్సులో భాగము అచట "ప్రచేతసు"ని దర్శించి, నమస్కరించి యుద్ధభిక్షను కోరినాఁడు హిరణ్యాక్షునకు లభించిన గురువు దిక్పాల కులలో నుత్తముజ్ఞాని అట్టిగురువు లభించుట హిరణ్యాక్షుని సుకృతము వరుణునకు ప్రచేతసుఁడను వ్యవహారము ప్రసిద్ధము దానికి జ్ఞానసం పన్నుఁడని యర్థము

"ప్రకృష్టంచేతో యస్య స ప్రచేతాః వరుణజ్ఞానివరుణ ఇత్యర్థః విజ్ఞానాత్మకం చిత్తమితి శ్రీభాష్యలక్షణాత్ - విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత ఇతి శ్రుతేశ్చ ప్రజ్ఞాకరణస్య విజ్ఞాన పూర్వత్వాత్ తదనుష్ఠానేతి భావః - చితీ సంజ్ఞానే ఇతి ధాతోశ్చ నిష్పన్నం జ్ఞానిత్వమ్ "1

---

1 శ్రీచంపూరామాయణమ్, ఆసూరి అనంతాచార్యకృతమ్, ఆసూరి నృసింహాచార్య వ్యాఖ్య, గద్య - 45 పుట - 33

"ప్రబుద్ధమ్" అను పదమునకు ఉపహాసనము రూఢ్యర్థము కాని 'లభ్' ధాతువు ప్రాప్త్యర్థకము పొందఁదలఁచినదానిని చక్కఁగా పొంద టకై అని తుమున్నంతమునకు యౌగికార్థము. కృదస్ప్రత్తివలన హిరణ్యాక్షుఁడేదిరా ఉత్తమగతి సన్నిహించుచున్నాఁడను అర్థము సూచితము ఇక్లే "సంయుగమ్" అనుపదియు యుద్ధమున రూఢి యగును ఇది 'యుజ్' ధాతువుయొక్క 'ఘ' ప్రత్యయాంతము యుగము సంజ్ఞ అయ్యు భావార్థకముగుటచే రోగమును అర్థమే యౌగికార్థముగ గ్రహింపవచ్చును చక్కని రోగమునుపదేశింపు మని వరుణుని కోరినాఁడని వ్యంగ్యము ఇది శబ్దశక్తి మూలధ్వని రోగరూఢమైన శబ్దమువలన రూఢ్యర్థము వాచ్యార్థముచే తెలియఁ బడఁగా, యౌగికార్థము నేయర్థము సూచించునో అది శబ్దశక్తి మూలధ్వనియని పండితరాయల సిద్ధాంతము. 2

ఇట్టి వ్యాఖ్య హిరణ్యాక్షుని నిందయందు స్తుతిని పేర్కొన్న శ్రీధరీయమున కనుకూలము హిరణ్యాక్షుఁడు వరుణుని మహత్వ మును పొగిడిన వాక్యములును ఈయర్థమునే సూచించును హిరణ్యా క్షుఁడు వరుణుని లోకాధిపతి అనియు, మహాకీర్తిసంపన్నుఁడనియు, తామే వీరులమని విఱ్ఱవీగెడువారి శౌర్యమును పరిహరింపగలవాఁ డనియు, దైత్యదానవులను జయించి రాజసూయము చేసినవాఁడనియు ప్రశంసించినాఁడు ఇదిసంపూర్ణముగ ప్రలంభము కాదు "వీరమాస్తి"

---

1 "యోగరూఢస్య శబ్దస్య యోగే రూఢ్యా నియంత్రితే
ధియం యోగ స్పృశోర్థస్య యా సూతే వ్యంజనైవ సా"
రసగంగాధరము, ద్వితీయాననము,
వృత్తివిచారము, శబ్దశక్తి మూలధ్వని పుట - 41

అనఁగా వీరుఁడనని తనకుఁదానే భావించువాఁడు 1 అంతకుమిం చిన వీరుఁడున్నప్పుడు వానితో "సంయుగము" సంభవించినచో వీరమానిత్వము తొలఁగును అనఁగా మదము నశించిపోవును మదము పోవుట ముక్తిహేతువని ఆర్షవచనము 2 హిరణ్యాక్షునకు శాపవశమున సంక్రమించిన మదము ఆజన్మకు తొలఁగిపోవు కాలమాసన్నమైనది అందువలన మదాపహారియైన వాని సన్నిధికి చేరినాఁడు మదాపహరణము వరుణునివలన సంభవింపకున్నను అతఁడు ప్రేరకుఁడగుటచే కార్యమున భాగస్వామి యైనాఁడు

వరుణునకు హిరణ్యాక్షుని మదోత్సేకము కోపహేతువై నను, జ్ఞాని యగుటచే నాత్మనిగ్రహము నొందఁగలిగినాఁడు ఆయునకు అంతర్దృష్టి యవసరమైనది దానికి ముందు శమమనుష్ఠేయము శమ మనఁగ నంతరింద్రియ నిగ్రహము ఉపశాంతి నొందుటచే హిరణ్యాక్షునకు తత్త్వముపదేశింపఁ గలిగినాఁడు ఉపశాంతికి ప్రజ్ఞానము హేతువు వరుణునకు ప్రజ్ఞానముచే నారాయణుని సర్వాత్మకత్వము గోచరించినది దానినే హిరణ్యాక్షున కుపదేశించినాఁడు పోతన యీ సందర్భమున వాచ్యార్థమునకే ప్రాధాన్య మొసఁగినాఁడు

"యాదోగణాధీశుఁడగుచుఁ బాతాళ భు
వన పరిపాలుఁడై తనరుచున్న
వరుణునిఁగనుఁగొని పరిహాసితోక్తుల
నిట్లను విశ్వముం జెన్నఁగలుఁగు

---

1 "వీరమాత్మానం మన్యతే వీరమాని"
"ఆత్మమానేఖశ్చ" అనుసూత్రముచే 'ణిని' ప్రత్యయము
3-2-83, సిద్ధాంతకౌముది, ఉత్తరార్థము, పుట - 487

2 "తాసాం తత్సౌభగమదం వీక్ష్యమానంచ కేశవః"
భాగవతము, దశమస్కంధము, 29వ అధ్యాయము, శ్లో॥ 48 పుట-489

సకలలోకైక పాలకులలో నతి బలా
ధికుఁడని జగము నుతింపఁదగిన
శూరుండవిపుడు నీపౌరుష మొప్పంగఁ
గదనరంగమున నన్నెదిరించువాఁడు

నీభుజావిక్రమంబును బ్రాభవంబు
నడఁతునని బల్కుటయు విని యబ్ధివిభుఁడు
పగలి జయమును వృద్ధియు బలము నాత్మ
బలము దలపోసి దనుజాతోఁ బవరమునకు"    3.621

"మనమున శాంతిబూని నియమంబున సంగరముజ్జగించి    "    3.623
"గొనకొని యజ్ఞపోత్రుఁడు వికుంఠపురంబున నున్నవాఁడు    "
3.624

ఇత్యాదిగనున్న వరుణుని సమాధానము శ్రీధరుని స్తుతిని కొంతవఱకు దృష్టిలో నుంచుకొనినట్లు తోఁచును ఇట, నారాయణుఁడే అక్షయ శౌర్యుఁడను వరుణుని యుపదేశము హిరణ్యాక్షుని జిజ్ఞాసను గ్రహించి నట్లు నిరూపించును

"పశ్యామి నాన్యం పురుషం పురాతనాద్య స్సంయుగే
త్వాం రణమార్గ కోవిదమ్
ఆరాధయిష్యత్యసురర్షభేహి తం మనస్వినో యం గృణతే
భవ దృశాః"    3.17.30

పురాతనుఁడైన నారాయణుని కన్న రణమార్గకోవిదుఁడైన హిరణ్యాక్షుని యుద్ధోత్సవముచే నారాధింపఁగలవాఁడు మఱియొకఁడు లేఁడనియు, అట్టి పురుషోత్తముని ఆతనివంటి మనస్వులు ప్రార్థించు చున్నారనియు వరుణుఁడు పలికినాఁడు ఈశ్లోకమున ప్రత్యేకముగా గమనింపఁదగిన పదము లనేకములున్నవి జయవిజయులు తననారా

ధించుటకు భగవంతుఁడు చూపిన ముక్తిమార్గము మహారణము
అర్థానిని సూచించునది "రణమార్గకోవిద" విశేషణము "సంయుత"
శబ్దము అనువృత్తము భక్తులు భగవంతునికట్ల ఏమార్గమున భక్తిని
ప్రకటింతురో అట్టిమార్గముననే స్వామియు వారిని సేవించును
"యే యథా మాం ప్రపద్యంతే తాన్ తథైవ భజామ్యహమ్"1
అను భగవద్వాక్యము దీనికి ప్రమాణము

భక్తుని భగవంతుఁడు సేవించుట యనుమాట విపరీతముగ
గోచరింపవచ్చును కాని, అది భగవద్వాత్సల్యము, భగవద్గుణోక్తి
'మనస్వీ' అనుమాటకు ఉత్తమమైన మనసు కలవాఁడని యర్థము
అంతే కాక మత్వర్థీయము నిత్యయోగము 2ను కూడ సూచించును
నిత్యమును (భగవంతునియందు) లగ్నమైన మనసుకలవాఁడని అర్థము
'గృణతే' అను క్రియయు సాభిప్రాయము ఇది స్తోత్రార్థకమని

---

1 'ఆరాధయిష్యతి' అను పదములోని రాధ్ ధాతువును, భజామ్యహమ్'
లోని 'భజ్' ధాతువును సమానార్థకములు

2 మనః అస్య అస్తి ఇతి మనస్వీ
'అస్ మాయా మేధా స్రజో వినిః" 5-2-121
సిద్ధాంతకౌముది, పూర్వార్ధము, పుట - 874

అను సూత్రముచే అస్ అంతమగుటచే 'విన్' ప్రత్యయము మతుప్
ప్రత్యయార్థము వచ్చు ప్రత్యయములు విస్తారము, నింద, ప్రశంస, నిత్య
యోగము, అతిశయము, సంబంధము, వస్తువునకు స్థితిమాత్రమునను అర్థ
ములను సూచించుచు వచ్చును తద్ధిత ప్రత్యయాంతము వృత్తియగుటచే
నేకార్థీభావమున నీయర్థము సంగతమగును

"భూమ నిందా ప్రశంసాసు నిత్యయోగేతి శాయనే
సంసర్గేస్తి వివక్షాయాం భవంతి మతుబాదయః'
సి కౌ 5-2-94 వార్తికము - 3183 పుట - 865

శ్రీధరులు 1 ఇచట వైరమే ప్రధానమైనచో 'గృణతే' అనుక్రియ ఆయర్థమున వ్యర్థము. వాస్తవమునకు 'గృ' ధాతువు శబ్దార్థకము 2 గృణతే యనునది పిలుచుచున్నారను నర్థమున వాచకము. హిరణ్యాక్షునివంటివారు నారాయణునివంటి వారిని యుద్ధమునకు పిలుచుట యుక్తమని వాచ్యార్థము. శ్రీధరుఁడు మనస్వి శబ్దమునకు తత్క్షణాను కూలముగ సూచ్యార్థమునే వ్యాఖ్యానించినాఁడు ఈవిధముగ ఉత్తమమైన ఉపదేశమును వరుణునివలన హిరణ్యాక్షుఁడు పొందగలిగినాఁడు

ఈయుపదేశము వరుణుని ముఖమున వెలువడుట కూడ సాభిప్రాయము. జయవిజయులు శాపమును పొందిన పిమ్మట వారినూరార్చుచు స్వామి వారు తనవలన మృతినొంది తనను చేరగలరని అభయమిచ్చినాఁడు ఆ వాగ్దానమును నెరవేర్చవలసిన సమయము సన్నమైనది ప్రతిజ్ఞానిర్వహణలో భాగముగ వరుణుని యుపదేశమును నారాయణుఁడు కూర్చినాఁడని భావింపదగును విరాట్స్వరూపమైన నారాయణునకు వరుణుఁడు రసనేంద్రియము 3 ఏయుపదేశమైనను

1 "గృణతే మనంతి" శ్రీధరీయము పుట - 393

2 "గృశబ్దే క్ర్యాది" సి కౌ ఉత్తరార్థము, ధాతువు - 1498 పుట-261

3 పురుషసూక్తమునారము నారాయణ విరాట్స్వరూపమును వర్ణించుచు శ్రీమద్భాగవతము,

"ద్వారకాణి చత్వరథాత్వంగః పత్మాది విప్టోరహసీ ఉభేవ్య తద్రూప విజృంభః పరమేష్ఠి ధిష్ణ్యమాపో ఒన్య తాలురసపిన జిహ్వా"

2-1-30 పుట - 200

జలము విరాడ్రూపుఁడైన నారాయణునకు రసనేంద్రియమని పేర్కొనినది జలమనఁగా జలాధిదేవతయైన వరుణుఁడని అర్థము బోధనయు నిట్లే అనువదించినాఁడు

"జలంబులు జిహ్వేంద్రియంబు రసంబు" 2-16 పుట - 7

దాని సహాయమున నే జరుగవలెను. భగవంతుడు హిరణ్యాక్షునకు నిర్వాణమార్గ ముపదేశించుటకు వరుణముఖముగ సంకల్పించుట తదనుకూలము

ఈవిధముగ వరుణోపదేశమును బొందిన హిరణ్యాక్షుడు దైవసంకల్పము చేతనే ఆయనను కావలేక అన్వేషణను సాగించినాడు లక్ష్యశూన్యమైన హిరణ్యాక్షుని యన్వేషణము వరుణుని యుపదేశ మునకు పిమ్మట లక్ష్యోన్ముఖమైనది లక్ష్యోన్ముఖత్వమును లక్ష్య సిద్ధికి చేర్చుటకు నారదుని దర్శనము సాధనమైనది ఈవిషయము మూలమునకన్న పోతన యనువాదమున స్పష్టము

"అని వరుణుండు పల్కిన దురాగ్రహవృత్తి హిరణ్యలోచనుం డనయము మానసంబున భయంబొకయింతయు లేక సంగరా వని నెదిరింప నేడ నరవర్ధను దుష్టవిమర్దనున్ జనా ర్దను నిఖిలామరేశ్వరవరస్తుతు సంచితమార్గవర్తియై" 3.629

ఇందలి 'అమరవర్ధను దుష్టవిమర్దను జనార్దను' అను పదములు హిరణ్యాక్షుని జ్ఞానిత్వసూచకములు

"చనుచవనచరమున నారద
మునివరుడెదురేగుదెంచి ముదమునలిరెక్కా
దనుజేంద్ర యెందుబోయెద
వని యడిగిన నారదునకు నతడిట్లనియెన్ 3.630

"నరసిరుహోదరుండొడరి సంగరమేనొనరించి యిందిరా వరుని వసంతుడ్రుంచి . ... ... ... " 3.631

'వసంతుడ'ను పద్యము ప్రయోగము హిరణ్యాక్షుని విష్ణుపార్షదత్వ సూచకము.

"గురుభుజుఁడమ్మహాత్ముఁడు వైకుంఠపురంబున నేఁడు లేఁడు భూ
భరమువహింపనాదికిటి భావము దాల్చి రసాతలంబునం
దిరవుగనున్న వాఁడచటికేగఁగ నోపుదువేని నేగు మం
దరయాఁగఁగల్గునీకు నసురాంతకుతోడి రణంబవశ్యమున్" 3-682

'దురాగ్రహము'ను మాట వాచ్యార్థమున ద్వేషపరము ఆగ్రహ శబ్దమును కట్టుదల యనుదానికి పర్యాయముగ వాడుట సంస్కృత సంప్రదాయము మూలమున "నారదాద్రసాతలం సర్వ విశే" అను వాక్యాంశము పోతనయందు విస్మృతమైనది

రాక్షసుని చూడఁగనే నారదుఁడు "ముదముదలిర్పన్" ఎందు బోయెదవని ప్రశ్నించినాఁడు నారద హిరణ్యాక్షుల సమాగమము సార్థకము కానిచో నారదునకు కలిగిన ముదము నిరర్థకమనక తప్పదు లేదా పోతన పాదపూరణమునకు గ్రహించెననవలసి వచ్చును ఇది గంభీరార్థ ప్రతిపాదకము కావుననే సమాగమ సంతోష సాంగత్యము సిద్ధించును మూలమున దిఙ్మాత్రముగ సూచితమైన అర్థము దురవగాహము. దానిని పోతన యీసందర్భమున నావిష్కరించినాఁడు

నారద దర్శనమునకు ఫలము "వైకుంఠపురంబున నేఁడు లేఁడు" అని నారాయణుని విలాసము తెలుపుట మఱి యెచటనున్నాఁడని ఆకాంక్ష. రసాతలమున నున్నాఁడని సమాధానము రసాతలమున నాతనికేమిపని యని తిరిగి సందేహము భూభరము వహింపనని సంశయ నివర్తకము అనేక రూపములతో నారాయణుఁ డుండవచ్చునను వరుణుని పలుకులకు వివరణము "ఆదికిటిభావముఁ దాల్చి" అను స్వరూపవర్ణనము ఫలము అసురాంతకుతోడి రణము హిరణ్యాక్షుఁడు రణమార్గకోవిదుఁడౌట ఫలసిద్ధి అవశ్యమని ప్రాప్త్యాశ హిరణ్యాక్షుని యన్వేషణము నిర్దిష్టలక్ష్యముపై కేంద్రీకృతము,

రసాతలమునకేగిన హిరణ్యాక్షుఁడు ఆదివరాహమును జూచి రోషముతో నిందావాక్యముల నిట్లు పలికినాఁడు

"దదర్శతత్రాభిజితం ధరాధరం ప్రోన్నీయమానావనిమగ్రదంష్ట్రయా ముష్ణంతమక్ష్ణా స్వరుచోఽరుణశ్రియాజహాస చాహో వనగోచరో
మృగః" 3.18.2

"ఆహైనమేహ్యజ్ఞ మహీం విముంచ నో రసౌకసాం విశ్వసృజేయ
మర్పితా
నస్వస్తియాస్యస్యనయా మమే క్షతస్సురాధమాసాదిత
సూకరాకృతే" 3.18.3

"త్వం నస్సపత్నైరభవాయ కిం భృతో యో మాయయా హంత్య
సురాన్పరోక్షజిత్
త్వాం యోగమాయా బలమల్పపౌరుషం సంస్థాప్య మూఢ ప్రమృజే
సుహృచ్ఛుచః" 3.18.4

"త్వయి స్థితే గదయా శీర్ణశీర్షణ్యస్మద్భుజ చ్యుతయాయేచ తుభ్యం బలిం హరిష్యంత్యృషయో యేచదేవా స్స్వయం చ సర్వే న
భవిష్యంత్యమూలాః" 3.18.5

"న తుద్యమానో దురుక్తి తోమరైర్దంష్ట్రాగ్రగాం గాముపలక్ష్య
భీతామ్" 3.18.6

తోదం మృషన్నిరగాదంబుమధ్యాద్గ్రాహాహతస్సకరేణుర్యథేభః"
3.18.6

'ఓసూకరాకారా! ఇటురమ్ము అజ్ఞుఁడా! భూమిని వదలుము బ్రహ్మచే జలవాసులకీయఁబడినదీభూమి దీనిని వదలనిచో సూకరాకారమునున్న నీవు క్షేమముగా తిరిగిపోలేవు నీవు మా శత్రువుల చేత మా నాశనమునకై సృష్టింపఁబడినావా ? యోగమాయచే లోకముల నాక్రమించినవాఁడవును, అల్పసత్త్వుఁడవు నగుచున్నా సంస్థాపించి మావారి దుఃఖములు తొలగింపఁగలను మూఢాధముని

నశించుటచే దేవతలు కూడనుండరు' అనుచు హిరణ్యాక్షుఁడు హరి హాస పూర్వకముగ నవ్వినాఁడు

ఈ భాగమున వాచ్యార్థమును యథాతథముగ గ్రహించి పోతనకవి వీరరసానుకూలముగ తీర్చినాఁడు

"ఘనసూకర మూఢాత్మక
వనరుహసంభూత దత్తవరదానమునం
గనిన రసాతలగత భువి
యనయంబును నాయధీనమై వర్తించున్" 3-643

"గొనకొని నీవీధరణిం
గొనిపోకుము విడుము కాకకొనియేగెద వే
గొనియెద నీప్రాణము గై
కొనుమిదె నామాట చలము గొనసేమిటికిన్" 3-644

"మాయావి వగుచు నిప్పుడు
వాయక యీపుడమిఁ జోరభావంబున నీ
వీయెడ గొనిపోఁజూతు న
యాయతభుజబలముచేత నదఁటక యనుచున్" 3-645

"అవిరళయోగమాయా బలంబునఁజేసి
యల్పపౌరుషమున నలరునిన్ను
నర్థి సంస్థాపించి యస్మత్సుహృద్భృత్య
కులులకెల్లను మోదములయఁజేయఁ
జెలువేది మద్గదా శీర్ణుఁడవగు నిన్నుఁ
గనుగొని దేవతా గణములెల్ల
నిర్భయులై చాలనెఱి నశించెదరన్న
విని యజ్ఞపోత్రియై వెలయుచున్న

హరి సరోజాతభవముఖామరుల కెల్ల
వచ్చు దురవస్థ కాత్మలో వంతనొంది
నిశిత దంష్ట్రాగ్రగలసితస్థయై నగడుధరణి
దేవితో నొప్పె నా దేవదేవుఁ డపుడు' 3-646

ఎంత వాచ్యమైనను పోతనగారి నిందయందును "అవిరళ యోగమాయాబలంబునఁ జేసి", "సంస్థాపించి" ఇత్యాదిగ స్తుతియును వ్యక్తము

శ్రీధరపండితుఁడు హిరణ్యాక్షుని నిందయందు వాస్తవముగ స్తుతియే యున్నదని స్పష్టముగ వ్యాఖ్యానించినాఁడు (పు 394, 395)

"హిరణ్యాక్షేణ అధిక్షేపార్థం ప్రయుక్తాపి భారతీ వస్తుతో భగవంతం స్తౌతి - తథాహి, వనగోచరః జలశయనః శ్రీనారాయణః స ఏవ యోగిభిర్మృగ్యత ఇతి మృగః దుష్టాన్విహంతుం మృగయతి ఇతి వా అజ్ఞః నాస్తిజ్ఞో యస్మాత్ హే సర్వజ్ఞేత్యర్థః సురాః అధమాః యస్మాత్ హే సురోత్తమ మమిష్ఠమాణస్యాపి సతః మామనాదృత్య త్వమనయా సహ వర్తమానః అస్మదీయం స్వస్తి సమస్తమంగళం రాజ్యం యాస్యసి ప్రాప్స్యసి నాత్ర సందేహః తథాప్యస్మత్కృపయా విముంచేత్యర్థః ఆసాదితా లీలయా స్వీకృతా సూకరాకృతిర్యేన (తి) తంమితి అభవాయ నాశాయ భృతః పుష్టః వస్తుతస్తు మోక్షాయ భృతో ధృతః ఆశ్రిత ఇత్యర్థః యోధవాక్ పరోక్షేణ జయతీతి తథా, వస్తుతస్తు సుదూర ఏవ స్థిత్వా జయతీతి సంస్థాప్య హత్వా వస్తుతస్తు యోగమాయారూపమచింత్యం బలం యస్య అల్పం పౌరుషం యస్మాత్తం త్వాం సమ్యక్ స్థాపయిత్వా భక్తహృది స్థిరీకృతేత్యర్థః హేమూఢ ప్రమూఢాక్ ప్రత్యా ప్యాయ యతీతి తథా ప్రవూర్త్రాఎతి ధాతుః సుహృదాం శుచః సంసారదుఃఖాని మృజే నాశయామి యత స్త్వం త్వద్మర్బాంధవా

నపి మోచయసీతి భావః (4) త్వయీతి అన్నగన్ధ్యజచ్యుత యాపి గదగూ శీర్ణం శీర్షం యస్య తథాభూతే త్వయి సుఖం సంస్థితే సతి యే శుభ్యమధునా బలిం హరంతి నవీనాః భక్తాః యే చ పూర్వభక్తా ఋషయో దేవాశ్చ తే సర్వే స్వయమేవోద్యం వినైవ అమూలా న భవిష్యంతి కింతు దృఢమూలా ఏవ భవిష్యంతీత్యర్థః (5) స ఇతి సః శ్రీహరిః అరేర్గురుక్తాన్యేవ తోమరాశ్చ్యత్రుభిశేషాః తైస్తుద్యమానో వ్యథమానః దంష్ట్రాగ్రగతాం పృథివీం భీతామాలక్ష్య తోదం దురుక్తవ్యథాం మృష్ట్వా సహామ న ఏవ నిర్గతః కరేణుః హస్తినీ వస్తుతస్తు దురుక్తైః అమరైర్నిమిత్తభూతైస్తుద్యమానః యథా శ్రుతార్థగ్రాహిణాం బ్రహ్మాదీనాం అనుకంపయా ఎవీద్యమా న ఇత్యర్థః తోదం మృషన్నిత్యస్యాప్యయమేవార్థః" (6)

వనశబ్దమునకు నీరు, అరణ్యము అని అర్థము 'వనగోచరుఁడు' అనఁగా శ్రీమన్నారాయణుఁడు జలధిశాయనుఁడని స్తోత్రము 'మృగ' ధాతువు అన్వేషణార్థము యోగులచే నన్వేషింపఁబడుటచే నారాయణుఁడు మృగశబ్దవాచ్యుఁడు. లేదా దురాత్ములను సంహరించుటకై వారి నన్వేషించువాఁడనియు చెప్పవచ్చును 'అజ్ఞః' అను దానికి నఙ్ సమాసము కాక స్తుతిపరమున బహువ్రీహి జానాతీతి జ్ఞః - వేత్తా నాస్తి జ్ఞః యస్మాత్ ఎవ్వనికంటె తెలిసినవాఁడు లేఁడో వాఁడు - సర్వజ్ఞుఁడని యర్థము అట్లే 'సురాధమ' శబ్దము సురాః అధమాః యస్మాత్ - ఎవ్వనికంటె దేవతలు అధములో అట్టి వాఁడు - సురోత్తముఁడని యర్థము 'అభవ' శబ్దము మోక్షార్థకము భవమనఁగా సంసారము నాస్తి భవః యస్మాత్ అని పంచమ్యర్థమున బహువ్రీహి రాక్షసులకు మోక్షము కలిగించుటకు అవతరమెత్తిన వాఁడని భావము

"త్వం నః సపత్నైః" అను శ్లోక భావము పోతనగారి యను వాదమున శ్రీధర వ్యాఖ్యానసమన్వయముతో "అవిరళ యోగ మాయాబలంబున" అనుపద్యమైనది "సంస్థాప్య" అనుదానికి 'చంపి' అని వాచ్యార్థము లీలావిలాసముచే కొంత పురుషాకృతి ధరించిన నారాయణుని భక్తితో హృదయమున నిలుపుకొని అని స్తుతి ఇట సంస్కృతిపదము పరివృత్త్యసహిష్ణువగుటచే పోతన యథాతథముగ 'సంస్థాపించి' అనినాడు

బ్రహ్మాది దేవతలకు భగవత్సంకల్పము వలన ఈనిందయందలి వాచ్యార్థము మాత్రమే స్ఫురించినది భగవంతునకు స్తుతిపరమైన అంతరార్థముకూడ నవగతమైనది. యుద్ధప్రవృత్తికై, బ్రహ్మాదిదేవతల మనస్తుష్టికై భగవంతుడు వాచ్యార్థమాత్రమును గ్రహించి లీలార్థము క్రోధము వహించినాడు ఈవిషయము మూలమునందును శ్రీధరీయమునందును నిగదితము "నతుద్యమానో దురుక్తి" అను శ్లోకమునకు శ్రీధరుడు భగవంతుని వ్యథకు దేవతలపైగల దయయే కారణము కాని, హిరణ్యాక్షునిపై క్రోధము కాదని స్పష్టముగ వ్యాఖ్యానించినాడు

"యథా శ్రుతార్థగ్రాహిణాం బ్రహ్మాదీనామ్
అనుకంపయా నిపీడ్యమాన ఇత్యర్థః"1

అని స్పష్టప్రతిపత్తికై తాత్పర్యము శ్రీధరపండితుడు నిరూపించినాడు హిరణ్యాక్షునకు భగవానుడిచ్చిన సమాధానము కూడ కేవల వాచ్యార్థమునే గ్రహించినట్లు నిరూపించును.

---

1 "శ్రుతమనతిక్రమ్య యథా శ్రుతమ్"
యథాశబ్దమునకు పదార్థానతి వృత్తి అర్థము శ్రుతార్థమును అతిక్రమింపని యర్థమనుట వాచ్యార్థమని తాత్పర్యము

భగవానుని సమాధానమిది

"సత్యం వయంభో వనగోచరా మృగా యుష్మద్విధా న్మృగయే గ్రామసింహాన్
న మృత్యుపాశైః ప్రతిముక్తస్య ధీరా వికత్థనం తవ గృహ్ణంత్యభద్రం" 3-18-10

"ఏతే వయం న్యాసహరా రసౌకసాం గతహ్రియో గదయా ద్రావితాస్తే
తిష్ఠామహేథాపి కథం చిదాజౌ స్థేయం క్వ యామో బలినోత్పాద్యవైరం" 3-18-11

"త్వం పద్రథానం కిల యూథపాధిపో ఘటస్వ నోఽస్వస్తయ ఆశ్వనూహః
సంస్థాప్య చాస్మాన్ప్రమృజాశ్రు స్వకానాం యస్స్వాం ప్రతిజ్ఞాం నాతి పిపర్త్యసభ్యః" 3-18-12

'మేము వా స్తవముగ వనగోచరములైన మృగములమే (సింహము) నీవంటి గ్రామసింహములను వేటాడుదుము ధీరులాత్మశ్లాఘు గావించుకొనరు ఆత్మశ్లాఘు నీకు అమంగళకారి యగును. మేము రసౌకసుల న్యాసమును హరించిన మాట నిజమే నీగదచే తరుమబడిన వారమయ్యు నిలచియున్నాము బలవంతునితో వైరముపెట్టుకొని యుద్ధములో నెట్లు నిలువవచ్చునని నీవుపాదచారులలో నుత్తముడవు మాయూహకందని వేగము కలవాడవు మమ్ము చంపి నీవారి కన్నీటిని తుడిచివేయుము హీనుడు ప్రతిజ్ఞ నిలుపుకొనలేడు' అని భగవానుడధిక్షేపించి పలికినాడు

హిరణ్యాక్షునకు ఆజన్మయుండధికమైన యుద్ధకుతూహలము కూడ తీర్చుట భగవంతుని నిశ్చయము అట్లే తన లీలావినోదమైన

యుద్ధేచ్ఛ నిర్వహించుకొనుటయు సమ్మతము 1

ఉదాత్త గంభీరముగ యుద్ధము సాగినది స్వామి నిరాయుధుఁడై నాఁడు యుద్ధమర్యాదను పాటించి హిరణ్యాక్షుఁడు యుద్ధముఁ దక్కి నిలచియుండఁగా 'సరసిజనేత్రుఁడు దనుజేశ్వరు సంగర ధర్మమునకు' కరమాశ్చర్యమందినాఁడు ఈయుద్ధలీల అభిజిద్వేళ పర్యంతము కొనసాగినది పోతన ఈయుద్ధఘట్టమును కావ్యధర్మమునకను కూలముగ వీరరస సముచితము గావించినాఁడు మూలమునకంటె యోధ ప్రతియోధుల సంవాదము, యుద్ధము విస్తృతముగ నిందు వర్ణితము "సత్యం వయంభో" అను శ్లోకము

"వినరా యోరి యమంగళాచరణ యుద్వృత్తిన్ ననున్ నీమది
న్ననయంబున్ వనగోచరంబగు మృగంబంచున్ దలంతౌర నే
నెనయన్ వన్యమృగంబ యౌదు బలిమిన్నెంతెంచు నీబోఁటి యా
శునకశ్రేణి వధింతు నేఁడని మొనన్ జోకోర్చి వర్తించినన్" 3-657

అని సంభాషణరూపమైనది భగవంతుఁడు హిరణ్యాక్షునితో పలికిన పలుకులు నిందాస్తూపముగ అనూదితములైనను భావగర్భితములు

"బలిమిగలవేని నాతో
గలనను నెదిరించి పోరగడగుమునీకో
ర్కులు నేఁడు దీర్తు నారక
తలపోయ వీక్షనంబు దగగు దురాత్మా" 3-658

"నీకోర్కులు నేఁడుదీర్తు" నని తన పార్షదునకు హరి అభయమిచ్చినాఁడు.

---

1 'ఏకదాభగవతః యుయుత్సాసమజని "

"వినుమిదిగాక సంగరవివేక విశారదులైన యట్టి స
జ్జనములు మృత్యుపాశములఁ జాలనిబద్ధులునయ్యు నీవలెన్
గొనకొని యాత్మ సంస్తుతులకున్ మదమందరిచేల యీ వికత్థనములు బంటుపంతములె దైత్యకులాధమ యెన్నిచూడఁగన్" 3-659

"ధృతిఁ బాతాళమునందు నీవనడి
నన్నెదురుమాపే తీర్తు నీకోరికల్" 3-660

"ఎన్నఁబదాతియూథములకెల్ల విభుండవు పోటుబంటవై
నన్నురణోర్విఁ నేఁడెదిరి నన్ భవదీయబలంబు నాయువున్
మిన్నకగొందుఁ జూడుమిది మేరఁగ మేదిని పీతదైత్యపై
వన్నెకు నెక్కఁజేసెద నవార్యపరాక్రమ విక్రమంబునన్" 3-661

"నను నెదురంగఁజాలిన ఘనంబగు శౌర్యము ." 3-662

"ననునిట సంస్థాపించెదనని " 3-663

వరాహస్వామి, హిరణ్యాక్షుల యుద్ధవర్ణనమునకూడ "రణమార్గకోవిదమ్" అని వరుణుఁడు పలికిన విశేషణము సార్థకమగునట్లు పోతన

"ఇట్లు దలపడి యన్యోన్య జయకాంక్షల నితరేతర.. " 3-669

అని వర్ణించినాఁడు

"అనఘా యీయభిజిన్ముహూర్తమున దేవారాతి మర్దింపవే"

అను బ్రహ్మదేవుని విన్నపమును కనుసంజ్ఞతోనే అంగీకరించినట్లు తెలిపి, స్వామి కదనకుతూహలమును కొనసాగించినాఁడు ఇది హిరణ్యాక్షునకు చిరకాల దర్శనసౌఖ్యము కలుగజేయవలెనను సంకల్పము మాత్రమే హిరణ్యాక్షుఁడు తనకు భగవంతుఁడనేక పర్యాయములు ఆయుధము నిచ్చుచుండుట న్యూనతగా భావించిన పౌరుషశాలి [1]

---

1 'నైచ్ఛద్గదాం దీయమానం హరిణా విగతప్రభః" 3-19-12 పుట-388

తన సంకల్పము నెరవేరినపిమ్మట భగవంతుఁడు దేవతల విఘ్నభయమును మన్నించి, హిరణ్యాక్షుని వధించినాఁడు

ఈవిధముగ లీలావినోదియైన భగవంతునకుకూడ నాశ్చర్యము గొల్పిన పరాక్రమవంతుఁడగు హిరణ్యాక్షుఁడు మహోదాత్తుఁడనుట నిశ్చయము. దుర్వృత్తి శాపవశప్రాప్తము. వైరము భగవత్ప్రసాదితము. అదియును ఉదాత్తసిద్ధిప్రదమగుటచే ప్రథమజన్మయందు ధన్యుఁడయ్యెననియే చెప్పనగును 1

"వరయోగీంద్రులు యోగమార్గముల నెవ్వానిన్ మనోవీథి సు
స్థిరతన్ లింగశరీరభంగమునకై చింతింతురా పంకజో
దరు పాణ్యాహతి దన్ముఖాంబురుహమున్ దర్శించుచుం బచ్చె దు
ర్భగితోత్తంసుఁడు దైత్యవల్లభుని సౌభాగ్యంబు దానెట్టిదో" 3-706

"నముచుతి వీరు దైత్యకులశాసను పారిషదుల్ మునీంద్రు శా
పమున నిశ్చిష్టజన్మమునఁ బైకొని పుట్టియు నేఁడు విష్ణుచే
నమయుటఁజేసి మీఁదనగు జన్మమునన్ జలజాక్షు నిత్య వా
సమున వసింతు రెన్నటికిఁ జావును బుట్టువులేవు వీరికిన్" 3-707

అనుచు హిరణ్యాక్షుని మరణము మహోదాత్తమని ఆతని పరమశత్రువులైన దేవతలే శ్లాఘించుటయు, ఆతఁడు నారాయణుని పార్షదుఁడను విషయమును స్మరించుటయు హిరణ్యాక్షుని అదృష్ట విశేషమును, వైరభక్తి తత్పరతను నిగదితమొనర్చును

---

1 భగవంతుఁడు సంహరించినపిమ్మట హిరణ్యాక్షుని తేజస్సు ఆయనయందు లీనము కాకపోవుటకు కర్మశేషము కారణము లీనమైనచో తక్కిన రెండు జన్మలును సంభవింపవు హిరణ్యకశిప, రావణ కుంభకర్ణుల విషయమునను ఇట్లే తెలియనగును

## హిరణ్యకశిపుని సోదరత్వము

హిరణ్యకశిపుని వృత్తాంత మనేక పురాణములయందనేక విధములుగ వర్ణితమైనను, ఆతని ప్రాక్తన జన్మసంస్కారమును నిరూపించునది శ్రీమద్భాగవతమునందలి సప్తమస్కంధమనియే చెప్పవచ్చును భగవంతుని లీలలను చెప్పునది భాగవతము భాగవతము దశలక్షణ సంపన్నము ఇందలి ప్రథమ ద్వితీయస్కంధములు ఉపోద్ఘాతరూపములు తృతీయస్కంధమునుండి క్రమముగా భాగవత దశలక్షణములు భగవంతుని లీలలుగ సమన్వయింపబడినవి

ఆలక్షణములివి

1 సర్గము, 2 విసర్గము, 3 స్థానము, 4 పోషణము
5 ఊతి, 6 మన్వంతరము, 7 ఈశానుకథ, 8 నిరోధము
9 ముక్తి, 10 ఆశ్రయము

వీనిలో చిట్టచివరిదైన ఆశ్రయము పరబ్రహ్మ స్వరూపుడైన నారాయణుని ప్రత్యక్షానుభవ మూలమున తెలుపునది ఇట్టి ఆశ్రయ స్వరూప జ్ఞానమునకు ముందు శుద్ధమతిత్వమునకై మిగిలిన నవలక్షణములును తెలిసికొనవలసి యున్నది ఈ విషయము శ్రీమద్భాగవతము, ద్వితీయస్కంధము, దశమాధ్యాయమున స్పష్టముగ నిరూపితము 1

---

1 "అత్ర సర్గో విసర్గశ్చ స్థానం పోషణ మూతయః
మన్వంతరేశానుకథా నిరోధో ముక్తిరాశ్రయః" 2-10-1,
"దశమస్య విశుద్ధ్యర్థం నవానామిహ లక్షణమ్
వర్ణయంతి మహాత్మానః శ్రుతేనార్థేన చాంజసా" 2-10-2
శ్రీమద్భాగవతము, పుట - 285

శ్రీమద్భాగవతము నందలి సప్తమస్కంధము 'ఊతి' యను లక్షణమును దెలుపును ఊతి యనగా కర్మవాసన అది శుభకర్మానుసారియు, అశుభకర్మానుసారియు కావచ్చును ద్వివిధమైన ఊతికి దృష్టాంతమిదే సప్తమస్కంధము శుభరూపకర్మకు ప్రహ్లాదుడు, అశుభరూప కర్మానుసారికి హిరణ్యకశిపుడు నుదాహృతులుగ నవినాభావ సంబంధముతో నిందు నిరూపితులు శుభవాసన మహదనుగ్రహమువలన సిద్ధించును నారదానుగ్రహముచే ప్రహ్లాదునకట్టి 'శుభవాసన' సిద్ధించినది సనకసనందనాదుల మహాక్రోధముచే హిరణ్యకశిపునకు 'అశుభవాసన' సిద్ధించినది శుభాశుభములు రెండును భగవల్లీలా జన్యములగుటచే కర్మఫల భోక్త నిమిత్తమాత్రుండు ఫలము తనవలన కలిగినదని భావించువాడు అహంకారమూఢుడు ప్రకృతిగుణముల వలననే గుణకర్మల ఫలితము, తత్తదానురూప్యము సిద్ధించును 1 ఈ భగవద్వాక్యము శుభాశుభోదాహృతులైన ఇరువురియందును అన్వయ వ్యతిరేకరూపముగ గోచరించును

హిరణ్యకశిపునకు విష్ణుద్వేష మొక్కటిదక్క అధికభాగము ఉత్తమలక్షణములే యున్నవి అతని యాభిజాత్యము లోకోత్తరము కశ్యపప్రజాపతికి దితియందు జన్మించిన హిరణ్యకశిపుడు తల్లియుపరాధమున రౌద్రమూర్తియైనాడు అదియు భగల్లీలయే హిరణ్యకశిపుని ఆలోపమును సరిజేయుటకు అతని జన్మకాలమునందే ప్రహ్లాద జన్మమునుకూడ కశ్యపప్రజాపతి వర్ణించినాడు వంశానురూపముగ విద్యాసంపత్తియు నుండును. బ్రహ్మనుగూర్చి తపస్సుచేయుటకు ముందే హిరణ్యకశిపుడు ప్రపంచపు స్థితిగతుల నెఱిగిన జ్ఞాని

---

1 "ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః
అహంకార విమూఢాత్మా కర్తాహమితి మన్యతే"
శ్రీమద్భగవద్గీత, తృతీయోధ్యాయము శ్లో॥ 27 పుట – 353

ఈజ్ఞానము ప్రాప్తినజన్మసిద్ధమనుట నిర్వివాదము న పరుసన్బంధావ తారిక యందలి శ్రీధరీయమువలన నీవిషయము నిగదితము

"స్వభక్త పక్షపాతేన తద్విపక్ష విదారణమ్,
నృసింహమద్భుతం వందే పరమానంద విగ్రహమ్
కేషాఞ్చిత్ కంచదశాఖ్యాయైన స్వ పమే వర్ణ్యభేదునా,
కేషాఞ్చిద్వాసనా ప్రోక్తా తత్తత్కర్మానుసారిణీ
అశుభా చ శుభా చేతి ద్విధా సాపి హేతుభేదతః,
అశుభానుపరతాం కోపాచ్ఛుభా మహదనుగ్రహాత్
హార్దేర్వ్యాపరయోర్యద్వద్ద్వైప్యకుంతే వనితోరపి
చతున్సనరుపా విష్ణుద్వేషాద్యశుభవాసనా.
యథాహి దైత్యగర్భేఽపి ప్రహ్లాదస్య సతః స్థిరా
నారదానుగ్రహాదాస విష్ణౌ సద్భక్తి వాసనా
స్వభక్తం చ సదా విష్ణుర్విమంత్య్యపి రక్షతి
అతోఽపి మోఽథ భవే ద్వార్థ్నావకర కదాత్మపాత్మనః
అతో మనీషిణా యత్నః కార్యో మహదనుగ్రహే
ఇత్యేతదర్థమూలినాఖ్యా తలక్షణ ముచ్యతే
అత్రాడా దశభిర్ధ్రేత్య తత్ప్రతిమతిభేదతః
మహాతోర్కపానుకంపోత్థ వాసనాభేద ఉచ్యతే
సద్వాసనా చ యుజ్యేత కర్మభిశ్శుద్ధ చేతసః
పరైస్తు కంచభి నస్మాన్మ్మ క్రియతే ధర్మనిర్ణయః
తత్రతు ప్రథమేధ్యాయే హిరణ్యకశిపోస్సుతే
విష్ణుభక్తే విరోధస్తు విప్రశాపజ ఈర్యతే' పుట-878

అధునిక కాలమున భాగవత విమర్శకులకును శ్రీధరుని పై అవ తారికయే శిరోధార్యమైనది ధూళిపాళి శ్రీరామమూర్తిగారు తమ శ్రీమద్భాగవతానుశీలనములో నిట్లు వచించినారు.

"సప్తమస్కంధమున నూతి నిరూపితమైనది. ఊతి యనఁగా దత్తత్కర్మానుసారియగు వాసన. ఈవాసన శుభాశుభ భేదముచే ద్వివిధము. మహదనుగ్రహమువలన శుభవాసన మహదాగ్రహము వలన నశుభవాసన సంభవించును. వైకుంఠమున శ్రీవారి ద్వారపాలకులైన వారికిగూడ మహాత్ములైన చతుస్సనుల కోపమున విష్ణుద్వేషాద్యశుభ వాసన సంభవించినది. దైత్యగర్భవాసి యైనను ప్రహ్లాదునకు మహాత్ముఁడైన నారదుని యనుగ్రహమువలన విష్ణుభక్తియను శుభవాసన సంభవించినది. అందుచేత బుద్ధిమంతులు మహదనుగ్రహ సంపాదనమునకై ప్రయత్నింపవలయునని చెప్పుటకిట నూతిలక్షణము వర్ణితము."[1]

"తాళ్ళపాక సాహిత్యము - అధ్యాత్మ సంకీర్తనము" అను గ్రంథమున తత్పరిష్కర్త శ్రీ, గౌరిపెద్ది రామసుబ్బశర్మగారును హిరణ్యకశిపుని జ్ఞానిత్వమును, విష్ణుపార్షదత్వమును తమపీఠికలో నిగదితమొనర్చినారు

"శ్రీవైష్ణవమునందు హరికంటె హరిభక్తులధికులు. భక్తుఁడు గొప్పయా? భగవంతుఁడు గొప్పయా? అన్నప్రశ్నమునకు భారత భాగవత రామాయణాదులయందు భక్తుఁడే గొప్ప అని నిరూపించు సంశయములు కోకొల్లలు గలవు .. ... శ్రీమద్భాగవతమున నృసింహావతారకథయే ఇందుకు తార్కాణము. లోకులందరి దృష్టిలో ప్రహ్లాదుఁడు పరమ బాలభాగవతునిగ, హిరణ్యకశిపుఁడు మిక్కిలి క్రూరునిగ కనబడుట సహజము కాని ఇందు విచారించినచో హిరణ్యకశిపుఁడు అంతరంగికముగ ఎంతగా సాత్త్వికభక్తుఁడో, అంతగా బయటికి పరమ రాక్షసుఁడు ప్రపంచములో ఎక్కడ ఏతండ్రిగాని ఏకొడు

1 శ్రీమద్భాగవతానుశీలనము, డా॥ ధూళిపాళ శ్రీరామమూర్తి
పుటలు - 477, 478

కనుగాని ఇంత హింసలపాలు చేసినవాఁడు కానరాఁడు

.. .. . .

"తెంపున బాలుఁడాడిన సుధీకృత , "

ఈ 28వ పద్యములో హిరణ్యకశిపుని జ్ఞానిత్వము వ్యక్తమగు చున్నది 'హరిచే మృతియందు దలంతును' అన్న వాక్యముతో, వాఁడు పూర్వము ఘోరతపముచేసి బ్రహ్మనుండి కోరిన వరములను "గాలింగుంభిని నగ్నినంబువుల నాక శస్థలిన్ దిక్కులన్.. "పద్యం90

నిరూపించు పద్యమును ఒక్కసారి మననము చేయుదుమేని పంచభూతములు, తద్వికారములు, కాలము, దిక్కులు, వెలుపల, లోపల, పగలు, రాత్రి, పైన క్రింద కాని ప్రదేశమునందును, ప్రాణము కలిగినవి, ప్రాణములేనివి కాని వస్తువులతో మరణమును కోరుకొన్నాఁడు ఇన్నింటికి అతిరిక్తమైన ఉత్తమవస్తువు శ్రీమన్నారాయణమూర్తి కాక వేరొకటుండునా? కావునను, సర్వము శ్రీమన్నారాయణావతారమగు నృసింహునిచేత, స్వామిఒడిలోనే, ఏ ఆయుధములు లేక స్వామి గోళ్ళచేతనే తన చావును కోరుకొన్నాఁడు భక్తుఁడు భక్తుఁడు కోరుకొన్న కోరికను, వానితపస్సుకు సంతుష్టుఁడైన పరమేశ్వరుఁడు కాదనక,

"వ. ఇట్లు కేవల పురుషరూపంబును, మృగరూపంబునుంగాని నరసింహరూపంబున ... చక్రాదిక నిర్వక్ర సాధనంబుల నొక్కని జిక్కకుండం జిక్కడచు"

దీనివలననే హిరణ్యకశిపుఁడు పరోక్షభక్తుఁడు ప్రహ్లాదుఁడు ప్రత్యక్షభక్తుఁడు 1

---

1 శ్రీ తాళ్ళపాకవారి పదసాహిత్యము. సంపుటము – 8
అధ్యాత్మ సంకీర్తనలు, అన్నమాచార్య విరచితములు
పీఠిక – గౌరిపెద్ది రామసుబ్బశర్మ, పుటలు – 8 నుండి 11

హరి పార్షదునిగానున్న ఆసంస్కారము శాపగ్రస్తమైన జన్మ యందును హిరణ్యకశిపునకు సిద్ధించినది లేనిచో దితివంటి సర్వజ్ఞురాలికి ప్రపంచ నశ్వరత్వమును గూర్చి చెప్పెడిపాటి వాడనుట సాహసమగును హిరణ్యాక్ష వధానంతరము హిరణ్యకశిపుడు చెప్పిన ఉశీనర దేశాధిపతి సుయజ్ఞుని కథ వీరధర్మసంబంధి వేదాంతజ్ఞానమునకు, వీరధర్మమునకు గల అన్యోన్య సంబంధము హిరణ్యకశిపుని పలుకులలో స్పష్టము ఇవి యముని వాక్యములైనను అజ్ఞానములో చెప్పుచున్నాడు కనుక హిరణ్యకశిపుని అభిప్రాయమే యనదగును

"య ఇచ్ఛయేశః సృజతీదమవ్యయో
య ఏవ రక్షత్యవలుంపతే చ యః
తస్యాబలాః క్రీడనమాహురీశితు
శ్చరాచరం నిగ్రహ సంగ్రహే ప్రభుః" 7-2-39

"పృధిచ్యుతం తిష్ఠతి దిష్టరక్షితమ్
గృహే స్థితం తద్విహతం వినశ్యతి
జీవత్యనాథోఽపి తదీక్షితో వనే
గృహేఽభిగుప్తోఽస్యహతో న జీవతి" 7-2 40

"భూతాని తైస్తైర్నిజయోని కర్మభి ర్భవంతి కాలే న భవంతి సర్వశః
న తత్రహాత్మా ప్రకృతావపిస్థిత స్తస్యాగుణై రన్యతమోహి బధ్యతే"
7-2-41,

ఇదం శరీరం పురుషస్య మోహజమ్
యథా పృథగ్భౌతిక మీయతే గృహమ్
యథౌదకైః పార్థివ తైజసై ర్జనః
కాలేన జాతో వికృతో వినశ్యతి" 7 2 42

ఈ సందర్భమున పోతనగారి యనువాదముకూడ మూలాను

సారిదైౖ హిరణ్యకశిపుని జ్ఞానిత్వమునకు పరమోదాహరణముగ నున్నది

"ఎవ్వఁడు సృజించు ప్రాణుల
నెవ్వఁడు రక్షించుఁ ద్రుంచు నెవ్వఁడనంతుం
డెవ్వఁడు విభుఁడెవ్వఁడు వాఁ
డివ్విధమున మనుచునెనుచు హేలారతుఁడై" 7-48,

"ధనము వీధిఁబడిన దైవవశంబున
నుండుఁ బోవు మూలనున్ననైన
నడవి రక్షలేని యబలుండు వర్ధిలు
రక్షితుండు మందిరమునఁ జచ్చు" 7-49

"కలుగును నెఱి లేకుండును
గల భూతములెల్ల గాలకర్మవశములై
నిలువఁడు ప్రకృతిం దద్గుణ
కలితుఁడుగాఁడాత్మయుఁడగమ్యుఁడు దలఁపన్" 7-49

ఆత్మస్వరూపము హిరణ్యకశిపునకు కరతలామలకము
"సర్వజ్ఞుఁడీశుండు.." 7-39

ఇంతటి జ్ఞానబోధ చేసినవానికి యజ్ఞయాగాదులయందనాదరము, అహంకారము, భగవద్వైరము నెట్లు కలిగెనని యనిపింపక మానదు అపకారము జరిగినపుడు దానికి ప్రతీకారము చేయుట వీర లక్షణము. లేనిచో నసమర్థుఁడగును అసమర్థుఁడనిపించుకొనుట మరణమునకంటె దారుణశిక్ష ఎట్లయినను మరణింపక తప్పనపుడు వీర ధర్మము ననుష్ఠించి "యశో వా మృత్యుర్వా" అని ఉపక్రమించుటయే ప్రాజ్ఞలక్షణము

"వైరానుబంధతీవ్రేణ ధ్యానే నాచ్యుతసాత్మతామ్ "

అవిఘ్నపార్షదులు బహుకాలము వైరభావముతో నేకాగ్ర

చిత్తములో భగవానుని ధ్యానించి, తిరిగి పరమ పదమును పొంది నారు

హిరణ్యకశిపుఁడు బాహిరముగ రాక్షసరాజైనను అంతర్య మున విష్ణుపార్షదుఁడు

భ్రాతృవధకు కుపితుఁడైన హిరణ్యకశిపుఁడు గోబ్రాహ్మణ యజ్ఞాదికములను నాశనమొనర్పుఁడని తనయనుచరుల నాజ్ఞాపించు సందర్భములో

"తస్య త్యక్త స్వభావస్య ఘృణేర్మాయా వనౌకసః
భజంతం భజమానస్య బాలస్యేవాస్థిరాత్మనః" 7-2-7

అని వ్యాసవాణి "ధాతూనామనేకార్థత్వాత్" కదా! పై శ్లోకమున 'ఘృణి', 'మాయా', 'వనౌకసః' అను పదముల ప్రయో గముచేత వ్యాసభగవానుఁడు హిరణ్యకశిపుని జ్ఞానమును సూచించి నాఁడు అదే సందర్భమునందలి

"మచ్ఛూలభిన్నగ్రీవస్య భూరిణా రుధిరేణవై
రుధిరప్రియం తర్పయిష్యే భ్రాతరం మే గతవ్యథః" 7-2-8

అను శ్లోకమున హిరణ్యకశిపునకు తాను విష్ణుపార్షదుఁడనను జ్ఞాపిక యున్నట్లు వ్యాసమహర్షి ధ్వనింపఁజేసినాఁడు. శ్రీధరీయమిట గుంఫనముగా నుండ[1], వంశీధరీయ మీ యర్థమును ప్రకాశిత మొన ర్చినది

"మచ్ఛూల భిన్నా తదగోచరభూతా గ్రీవా తదుపలక్షితో విగ్రహో యస్య తస్య మే రుధిరేణ నృసింహాతయా ఆవిర్భావే

---

1 "తస్య రుధిరేణ యావత్తర్పయిష్యామి తావదూయం భువం యాత" ఇతి "శ్రుతియేనాన్వయః" పుట - 888

ఆనాయొక్క రక్తముతో నాసోదరునకు తృప్తికలిగించు పర్యంతము మీరు గోబ్రాహ్మణాదికములను బాధింపుఁడు

రస్మాత్ భ్రాత మదీయ రుధిరేణ రుధిరప్రియం భ్రాతరం తర్ప యిష్యే యథా తరోః మూలం నిషేచనేన" -వంశీధరస్వామి

'నాశూలముచే నారాయణుని కంఠమును భిన్నముచేసి, అతని రక్తముతో రుధిరప్రియుఁడైన నాసోదరుని తృప్తిపఱచెదనని' పైశ్లోకమునకు వాచ్యార్థము హిరణ్యకశిపుని రక్తముతో హిరణ్యాక్షునకు తృప్తికలిగించుట అను వ్యంగ్యార్థమును శ్రీధరుఁడు గుంఫనముగ వ్యక్తమొనర్చినాఁడు

ఇఁక 'శూల' అనుపదమునకు క్రోధమను ఉపలక్షితార్థము, 'భిన్నా' అను పదమునకు అగోచరమైన అనునర్థముల సంయోజనచే వంశీధరస్వామి హిరణ్యకశిపుని ఆంతర్యమును నిగదితమొనర్చినాఁడు

'నాశూలమున కగోచరమైన నాకంఠమును నేనే భిన్నము చేసికొని, అధికమైన నారుధిరధారలచే రుధిరప్రియుఁడైన నాసోదరుని తృప్తిపఱచెదను' అను హిరణ్యకశిపుని పలుకులాతని విష్ణుపార్షద జ్ఞాపకమునకు నిదర్శనము తన మరణము సోదరునకు సంతోషకర మఁట ఎందులకు? ఈజన్మమున నిరువురును మరణించినగాని తిరిగి జన్మలెత్తుట, భగవానుని జేరుట సాధ్యముకాదు కనుక తనమరణము సోదరునకు సంతోషకరము

సోదర వధచే రోషశోక దందహ్యమాన మానసుఁడైన హిరణ్యకశిపుఁడు వేదవర్ణ ధర్మాశ్రమముల నన్నిఁటిని నాశనము చేయుఁడని రాక్షసుల నాజ్ఞాపించినాఁడు.

"విష్ణుర్ద్విజ క్రియామూలో యజ్ఞోధర్మమయః పుమాన్
దేవర్షి పితృభూతానాం ధర్మస్యచ పరాయణమ్"

బ్రాహ్మణుల యజ్ఞక్రియలకు మూలము విష్ణువే ఆయనయే యజ్ఞరూపుఁడు ధర్మమయుఁడు ఇట్లనుటచే బ్రాహ్మణాదికములు

లేక విష్ణువు లేడు విష్ణువులేక వారులేరు కావున వారిని నాశనము చేసినచో విష్ణువును నాశనమొనర్చినట్లే యని పరీక్షిమ్ముగ చెప్పిన ట్లయినది

మూలమునందలి యీ శ్లోకము హిరణ్యకశిపుని భగవత్సం బంధ జ్ఞానమును వెలార్చును ఈవిషయమునే పోతనకవి యిట్లు ప్రపంచించినాడు

"పొండు దానవులార భూసురక్షేత్ర
సంగతమైన భూమికి గములుగట్టి
మహిఁ దపస్స్వాధ్యాయ మౌనవ్రతస్థుల
వెదకి ఖండింపుఁడు విష్ణుఁడనఁగ
నన్యుఁడొక్కఁడు లేడు యజ్ఞంబు వేదంబు
నతఁడె భూదేవక్రియాది మూల
మతఁడె దేవర్షి పితృాది లోకములకు
ధర్మాదులకు మహాధారమతఁడె

యేస్థలంబుల గో భూసురేంద్ర వేద
వర్ణ ధర్మాశ్రమంబులు వరుస నుండు
నా స్థలంబులకెల్ల మీరరిగి చొచ్చి
దగ్ధములు చేసిరండు మీదర్ప మొప్ప" 7.34

"మూలభాగవతము పురాణము గావున దానియందు పాత్ర చిత్రణమునకంత ప్రాధాన్యము లేదు మూలమునందలి పాత్ర చిత్రణములో బీజప్రాయముగా నున్న లక్షణములను బరిపుష్టము గావించి పోతన పాత్రలహృదయమును నావిష్కరించినాడు "1

---

1 శ్రీమద్భాగవతానుశీలనము, డా ధూళిపాళ శ్రీరామమూర్తి, పుటలు - 355, 356

"వైరానుబంధమునబునఁ
జేరిన చందమున విష్ణు జిరతరభక్తిం
జేరఁగరాదని తోఁచును
నారాయణ భక్తియుక్తి నాచిత్తమునన్" 7-15

అను నారదవచనములు పోతన హిరణ్యకశిపుని వైరమార్గాను యాయిగ దిద్దితీర్చుటకు ప్రధానాధారములు

"పరమాత్మను అన్వేషించడానికి వేదాంతశాస్త్రం రెండు మార్గాలు ఉపదేశించింది ఒకటి ప్రకృతిలోని ప్రతివస్తువును ఇది భగవంతుఁడు కాదు, ఇది భగవంతుఁడు కాదు అని న ఇతి-నేతి అనే మాటచేత నిషేధించుకొంటూ చివరకు 'నేను' (అహం) అనేది 'బ్రహ్మ' అని గ్రహించడం రెండవది ప్రకృతిలోని ప్రతివస్తువు లోనూ బ్రహ్మవున్నదనే భావనతో ఇదిబ్రహ్మము ఇది బ్రహ్మము అని అన్నిటిని బ్రహ్మగా భావించడం "[1]

మొదటిది వ్యతిరేకమార్గము, క్లిష్టమైనది రెండవది అన్వయ మార్గము ఇందు హిరణ్యకశిపుఁడు మొదటిమార్గమునకు, ప్రహ్లాదుఁడు రెండవమార్గమునకు చెందుదురు

హరి సోకర్హాంగముదాల్చి తన సోదరుని సంహరించెననుచు హిరణ్యకశిపుఁడు పలికిన పలుకులు విష్ణుతత్త్వప్రతిపాదకములు

"వనములనుండు జొచ్చు మునివర్గములోపల ఘోణిగాఁడు సం
జనన మెఱుంగ రెవ్వరును జాడమొకింతయు లేదు తన్ను డా
సిన మతిఁడాయు వెంటబడి చిక్కక చిక్కుఁడు పీనినొక్క కీ
లున మనమెల్లలోఁబడక లోఁబడఁ బట్టుకొనంగ నచ్చునే" 7-31

---

1 అంతరార్థభాగవతము, డా పేదుల సూర్యనారాయణశర్మ పుట-114

అను హిరణ్యకశిపుని పలుకులను పరిశీలించినచో నాతనిలో గాఢము గను, గూఢముగను నున్న భక్తి వ్యక్తమగుచు నీపద్య మద్భుతమైన భగవత్తత్త్వమును వెల్లడించుచు హరి యడవులలో తిరుగుచుండు ననియు, పుట్టుకజాడ తెలియదనియు నిత్యాదిగ నిందకన్పట్టుచున్నను, "సంజననమెఱుంగ రెవ్వరును" అనుట నారాయణుని అనాదిత్వమునకు సూచకము "జాడయొకింతయు లేద"నుట నారాయణ తత్త్వము నెఱుఁగుట దుస్తరమను నభిప్రాయమును సూచించును భక్తిపరాధీనుఁడైన భగవానునకు 'మనమెల్లలోఁబఱచి' ఆయనను పట్టుకొన వచ్చునను గంభీరార్థము పూర్వవాసనా వాసితమై యుట ధ్వనించును ఇట్లు నింద స్తుతిపర్యవసాయి యగుట మహాకవి సంప్రదాయము

"భుజశక్తి నాతోడఁ బోరాడ శంకించి
మున్నీట మునిఁగిన మునుఁగుగాక
యలయించి పెనఁగు నాయచల సంభ్రమమున
కెఱఁగి వెన్నిచ్చిన నిచ్చుఁగాక
జగడంబు సైపక సౌకర్యకాంక్షియై
యిలక్రింద సీఁగిన సీఁగుగాక
క్రోధించి యటుగాక కొంతపౌరుషమున
హరిభంగి నడరిన నడరుగాక

కఠినశూలధార గంఠంబు విదళించి
వాని శోణితమున వాడి మెఱసి
మత్సహోదరునకు మహి దర్పణము సేసి
మెఱసివత్తు మీకు మేలు తెత్తు" 7-32

ఇందు సారిదిని మత్స్య కూర్మ వరాహావతారములు, రాఁబోవు నృసింహావతారముకూడ హిరణ్యకశిపునకు మనోగోచరము

లైనవి పోతనకు ప్రసంగవశమున భగవల్లీలలను సూచించుట యభీష్టము. గజేంద్రమోక్షమునందలి లక్ష్మీదేవి సంశయమిట్టి లీలలను సూచించునదే 1

"చక్రాయుధుఁడేడి చూపుఁడని ధిక్కరించిరో దుర్జనుల్"
అనువాక్యము చదువఁగనే భాగవతవాసనగల యేరికైనను "డింభక సర్వస్థలంబుల " అను హిరణ్యకశిపుని నిర్భర్త్సనము స్ఫురింపక మానదు

"జీవి ఒకసారి సంపూర్ణస్థితి పొందినపిదప శాపకారణముచే బాహ్యరూపాదికములు మారినను స్వస్వరూపజ్ఞానము నశింపదు. జయవిజయులు భగవత్సాన్నిధ్యము పొందిన సంపూర్ణమూర్తులు. బ్రాహ్మణశాపముచే రాక్షసజన్మ యెత్తినను, వారు స్వస్వరూపజ్ఞానమును మఱచిపోదురా? అట్లు మఱచిపోయినచో ఏ మోక్షపదము కూడ శాశ్వతము కాదన్నమాటే!

సంపూర్ణస్థితిని పొందిన జీవి శాపకారణముచేనైనను స్వస్వరూపజ్ఞానమును మఱచిపోవుననుట వేదాంత తత్త్వమునకు విన్నుపోటు. జడభరతుఁడు తన తరువాతి రెండుజన్మలలో స్వస్వరూపజ్ఞానమును మఱచిపోలేదు "2

---

1. తన వెంచేయుపథంబు పేర్కొనఁ డనాథ స్త్రీజనాలాపముల్
   వినెనో ముచ్చులు ముచ్చిలించిరో ఖలుల్ వేద ప్రపంచంబులన్
   దనుజానీకము దేవతానగరిపై దండెత్తెనో భక్తులం
   గని చక్రాయుధుఁడేడి చూపుఁడని ధిక్కరించిరో దుర్జనుల్"
   8-100 పుట - 788

2. ముఖాముఖి - 1-2-87
   బ్రహ్మశ్రీ ఆర్ వీరభద్రరావుగారు (నాన్నగారు)
   రిటైర్డ్ డి యి, వో, రాధామాధవమందిరము
   అరండల్‌పేట, గుంటూరు

ఇట్టి హిరణ్యకశిపుడు ను బాహిరముగ రాక్షసునిగ ప్రవర్తించుచున్నను, అంతరంగమున స్వస్వరూపజ్ఞానమును మఱచిపోలేదు

ఇట్టి హిరణ్యకశిపుడు తనతపమునకు మెచ్చి ప్రత్యక్షమైన బ్రహ్మను

"నాంతర్బహిర్దివా నక్త మన్యస్మాదపి చాయుధైః
న భూమౌ నాంబరే మృత్యుర్న నరైర్న మృగైరపి"
7-3-36

"వ్యసుభిర్వాసుమద్భిర్వా సురాసురమహోరగైః
అప్రతి ద్వంద్వతాం యుద్ధే ఐకపత్యంచ దేహినామ్"
7-3-37

అని ప్రార్థించినాడు

"గాలింగుంభిని నగ్నివంబువుల నాకాశస్థలిన్ దిక్కులన్
రేలన్ ఘస్రములం దమః ప్రభల భూరిగ్రాహ రక్షోమృగ
వ్యాళాదిత్య నరాది జంతుకలహవ్యాప్తిన్ సమస్తాస్త్రశ
స్త్రాళిన్ మృత్యువులేని జీవనము లోకాధీశ యిప్పింపవే" 7 90

ఇట్లు వరము వేడుటలోనే హిరణ్యకశిపుడు ప్రహ్లాద జననమునకు ముందే నృసింహాకృతికి బీజావాపము కావించినాడు ఆయన సాన్నిధ్యమును వాంఛించినాడు ఇక నాయనను పొందుటకు మార్గ మన్వేషింపవలె. వేగముగా గమ్యమును చేరవలె ఇందులకుపాయము భాగవతిహింస. హిరణ్యకశిపుడు "నిరంతరాక్రాంత దురంత వైర వేగుండు" మార్గము తెలిసినపిదప నాలస్యమును సహింపలేడు

వరసంపాదనమునకు పిమ్మట హిరణ్యకశిపుడు అర్థసిద్ధికై ప్రయత్నములు నారంభించినాడు

"తస్యోగ్రదండ సంవిగ్నాః సర్వేలోకాః సపాలకాః
అన్యత్రాలబ్ధశరణాః శరణం యయురచ్యుతమ్" 7-4 21

"ఎన్నఁడుమాకు దిక్కుఁగలదెన్నఁడు దైత్యుని బాధమను" వని దేవతలు భగవానుని శరణుజొచ్చినారు

"ఈ రాక్షసుఁడు చేసేపనులన్నీ నేనెరుగుదును అతని మనస్సులోని చెడ్డ త్రోవలు నేనెరుగుదును అతఁడు నాభక్తుఁడయియుండి పైకి విపరీతముగా మాట్లాడుట, చెడ్డపనులు చేయుటయునూ నాకు తెలియును దానికి కారణముకూడ తెలియును కాలము సంప్రాప్తమయినపుడు అంతయును సరియగును అంతవరకును మీరు ఓపిక వహింపుఁడు" అని భాగవత ప్రభ పుట - 93

"కాలముగూడ జంపెదనని" హరిపలుకులు అదియెట్లు ?

"యదా దేవేషు వేదేషుగోషు విప్రేషుసాధుషు
ధర్మే మయిచ విద్వేషః సవా ఆశు వినశ్యతి" 7-4-27
"నిర్వైరాయ ప్రశాంతాయ స్వసుతాయ మహాత్మనే.. "
7-4-28

దేవవేదగోబ్రాహ్మణాదికముల నెప్పుడు హిరణ్యకశిపుఁడు ద్వేషించును నిర్వైరుఁడైన ప్రహ్లాదునెప్పుడు బాధించునో అపుడు వానిని నశింపజేయుదునని హరి అభయము

"శుద్ధసాధులందు సురలయందు శ్రుతులందు
గోవులందు విప్రకోటియందు
ధర్మపదవియందుఁ దగిలి నాయందు వాఁ
డెన్నఁడలుఁగు నాఁడె హింసనొందు" 7-111

'శమదమసంపన్నుఁడైన ప్రహ్లాదు నెన్నఁడాపన్నత నొందించునాఁడె పట్టి వధింతునని'నాఁడు శ్రీహరి భవిష్యత్తులో హిరణ్యకశిపుని వైరసాధనాలత ప్రహ్లాద భక్తిభూజము నల్లుకొని పైకిసాగనున్నది ఆ యాధారమునకు కష్టము వాటిల్లినపుడు తప్ప భగవానుఁడు రాఁడు

ప్రహ్లాదుడు జన్మించకముందు హిరణ్యకశిపునిలో బీజరూప మునవున్న వైరానుబంధము క్రమశః కుమారుని భక్తితో పాటుగ తీగెలు సాగినది

"ఈ ద్వేషమే వానికి ముక్తి హేతువైనది. ద్వేషముఖమున వానిసాధన సాగినది. ప్రహ్లాదుని సాధన భక్తిమార్గమున సాగినది. ఏభావముచేతనైనను పరమేశ్వరుని బొందవచ్చుననుటకీ కథ నిదర్శకము"1

హిరణ్యాక్ష హిరణ్యకశిపులలో నొకవిశేషము స్పష్టముగ గోచరించును హిరణ్యాక్షునకు హిరణ్యకశిపునకున్న ధీశక్తి లేదు ఆలోచన పెరిగినకొలంది సంశయములు పెరుగుట సహజము హిరణ్యాక్షునకైనంత సులభముగ హిరణ్యకశిపునకు హరి సందర్శనము కాకపోవుటకు వారిజ్ఞాన వ్యత్యాసమే కారణము హిరణ్యాక్షునకు వరుణోపదేశము, నారద మార్గదర్శకము లభించుటచే శ్రీహరి గూర్చి స్పష్టమైన అభిప్రాయము లేదు కాని వాగి యుపదేశముచే ప్రాక్తన సంస్కార ముద్బుద్ధమైనది హిరణ్యకశిపునకు విష్ణుస్థితిని గూర్చి నిశ్చయ జ్ఞానమున్నది అతని యీజ్ఞానము "యోగో జ్ఞానం తథాసాంఖ్యం విద్యాః శిల్పాది కర్మచ వేదశ్శాస్త్రాణి విజ్ఞానం ఏత త్సర్వం జనార్దనాత్' అను ఆర్షోక్తిని స్ఫురింపజేయును బ్రహ్మను గూర్చి తపమొనర్చిన సందర్భముకూడ నీతని యోగజ్ఞతను సూచించును యోగసిద్ధితో పాటు నారాయణ సాదృశ్యముకూడ పొందవలెనను ఆరాటము హిరణ్యకశిపున కున్నట్లు విద్వద్విమర్శకుల యభిప్రాయము

"హిరణ్యకశిపుడు పరమభాగవతోత్తము డగు విష్ణుద్వార

---

1 శ్రీమద్భాగవతానుశీలనము, డా ధూళిపాళ శ్రీరామమూర్తి పుటలు - 227, 228

పాలకుడు ముని శాపమున రాజస తామస భావములను గ్రహించిన వాడగు గొబట్టి, ఆయన నేనే రాజును, నేనే సర్వమునకు అధికారిని' అనే రాజసభావము కలవాడయినందున ఈక్రింది విధముగా కోరుకొనెను

అజేయమగు విష్ణుసాన్నిధ్యమున నిష్పటివరకు నుండి పెరిగినవాడనుగాన, నేనిప్పుడుగూడ ఎవరికి తలవంచజాలను అందరినీ జయించి ప్రపంచమునకు జయహేతువగు శ్రీహరి పార్శ్వచరుడ ననిపించుకొనవలెను అజరము - తరుగులేని తేజోమూర్తి శ్రీహరి 'అజరః కవిః' అనబడువాడు ఆయన బంటునుగాన నేనవరికిని తీసిపోరాదు అను భావము కూడ వైష్ణవభావమే, అనురము - మార్పు చెందని దివ్యజ్ఞాన స్వరూపుడగు నారాయణుని కరివారములోని వాడననుటచే, నేనుఎ అమురుడనుగా నిత్యవిభూతి నందెదను

'బ్రహ్మ సద్యంద్య మేకం' - అనగా శ్రీమహావిష్ణువు సర్వాంతర్యామియగు ఆత్మస్వరూపుడు 'అయమాత్మ' అన్న వాక్యమున శాధారభూతమైనవాడు కాన నేనును ఆ శ్రీహరి స్వరూపమే కావుననాకు ప్రతిగా నింకెవరు ఉండరాదు నాకు నేనేసాటి 'స్వరాట్ - విరాట్ - ఏకరాట్' అన్నప్పుడు శ్రీమహావిష్ణునియొ భావము తానొక్కడే ఈ సృష్టిని విరాజిల్ల జేసి వెలిగించెడువాడు.

అజరామరభావము శ్రీహరిది హిరణ్యకశిపుడా భావమునందే యుండ గోరుచున్నాడని భావము."[1]

ఇహ జన్మమునందే నారాయణ అద్రూక్ష్యము దుర్లభము కనుకనే బ్రహ్మయును అమరత్వము తప్ప తక్కిన వరములనన్నిటి

---

[1] భాగవతప్రభ - ఆహ్లాదకిరణము, పుటలు - 54, 55
శ్రీ కొత్త రామకోటయ్యగారు

ననుగ్రహించినాడు హిరణ్యకశిపునకు నారాయణ తద్రూపాక్యము జన్మవానవనలచే ననివార్యము బ్రహ్మ అమరత్వము నొసగినచో నది సిద్ధించ నేరదు కావున విధాతయు హిరణ్యకశిపుని భావిశభస్థితిని గుర్తించియే అమరత్వము ననుగ్రహింపలేదు తత్ప్రారంభ కాల మున నమరభావము నాకాంక్షించిన హిరణ్యకశిపుడు బ్రహ్మను వరములు వేడునాటికి

"గాలింగుంభిని నగ్నినంబువుల ... " 7-90

అని అమరత్వము పరిమితకారణ సిద్ధముగ కోరినాడు

ప్రథమజన్మమున శాపావసానకాలము సంకల్పగోచరమైనది కావుననే హిరణ్యకశిపుడిట్టి వరమడిగినాడు రాబోవు నరసింహ రూపమాతని మనోనేత్రమున గోచరించి యుండవచ్చును హిరణ్య కశిపుడడిగిన వరవిధానము వలన భగవానుని అంశస్థలితప్పు అతని సంహరించు స్థలాంతరము లేకపోయినది ఈవరవిధానము హిరణ్య కశిపుని వైరభక్తి వైశిత్యమునకు నిదర్శనము

వరసంపాదనమునకు పిమ్మట హిరణ్యకశిపుడు నారాయణుని జేరుటకు ప్రయత్నమారంభించినాడు నారాయణ స్వరూపులైన వారిని బాధించినచో నాయనయందు సత్వర ప్రవృత్తి కలుగునను నిశ్చయజ్ఞానము హిరణ్యకశిపున కున్నది అతడు శాస్త్రమార్గము నతిక్రమించి తామసుడై ప్రవర్తించినాడు తమోగుణముకూడ భగవత్సంకల్పసిద్ధమే భగవంతుడు తన సంకల్పానుసారము నిర్గుణుం డయ్యు సృష్టిస్థితిలయముల కనుకూలముగ గుణత్రయము వలన ప్రవ ర్తించునని భాగవతవచనము 1 కావున తమోగుణముకూడ భగవం

---

1 "సత్త్వం రజస్తమయితి నిర్గుణస్య గుణాః తతః
స్థితిసర్గ నిరోధేషు గృహీతా మాయయా విభోః"
2-5-18, పుట - 230

తుని రూపాంతరమే శ్రీహరి సంకల్పము తమోగుణరూపమున హిరణ్యకశిపునియందు ప్రవర్తిల్లినది భగవంతుఁడు శీఘ్రముగ తనను చేర్చుకొండనని తనపార్షదులకు చేసిన వాగ్దానమందలి ఏకదేశమును నిర్వర్తించుటకు హిరణ్యకశిపుని అట్లు ప్రవర్తింపజేసినాఁడు హిరణ్యకశిపుని తమోగుణమువలననే దేవతలు అనన్యశరణ్యులై నారాయణ ప్రపన్నులైనారు "హిరణ్యకశిపుని ప్రచండమైన దండనీతి, దేవతల నెల్ల శ్రీహరి శరణార్థులనుగా మార్చినది ఆయనకు తొందరగా రాక్షసభావము వదలి, వైకుంఠద్వారము చేరవలెనని తీవ్రమైన ఆకాంక్ష అదికూడ శ్రీహరి కృపావిశేషమే కాన, దేవతల మొర బహిరంగమైనది రాక్షసుని మొర అంతరంగమైనది"1

నారాయణుఁడీ కార్యమున ప్రవర్తించుటకు కారణము స్వభక్త పక్షపాతము ఈ స్వభక్త పక్షపాతమే సర్వతోముఖమై కారణ బహుత్వమందినది శ్రీధరుఁడు నరసింహావతార కారణమును వివరించుచు "స్వభక్త పక్షపాతేన తద్విపక్ష విదారణమ్" అని వ్యాఖ్యానించినాఁడు ఈ వాక్యము చదువఁగనే 'దేవతలయందలి పక్షపాతమును'ను స్ఫురించును కాని హిరణకశిపుని యందలి పార్షద ముఖ్యుఁడను పక్షపాతముచే శాపసిద్ధమైన విపక్షత్వ విదారణము భగవత్సంకల్పము ఈ యభిప్రాయమునే

"స్వభక్తంచ సదా విష్ణుః ద్వేషంతమపి రక్షతి"

అని శ్రీధరుఁడు నిగదితమొనర్చినాఁడు ఇట శ్రీధరుని "ద్వేషంతం భక్తం" అనుమాట హిరణకశిపుఁడు వైరభక్తుఁడనుటను దృఢీకరించును

ఇట మఱియొక విశేషము పార్షదులకును విష్ణుత త్త్వమగ స్వామి దీవిని వారికెరిగించుటకు నారాయణుని యనుగ్రహము కొంత

1 భాగవతప్రభ, అహ్లాదకిరణము, పుట - 82

ఆలస్యమైనది అట్టి ఆలస్యము అనుగ్రహవిశేషమే భక్తుడగు
వానికి సంశయములుండరాదు ఉన్నచో "సంశయాత్మా వినశ్యతి"
అను వాక్యము యదార్థమగును హిరణ్యాక్షునకిట్టి సంశయము కలుగ
లేదు కాని హిరణ్యకశిపునకు కలిగినది అట్టి సంశయమునకు శోధన
అపేక్షితము ప్రహ్లాదుడు సాధనముగ హిరణ్యకశిపుడీ శోధనను
పొందగలిగినాడు భాగవతోత్తముడైన ప్రహ్లాదుని హింసించుట
యను మార్గమున భగవదన్వేషణ మారంభించినాడు

"లోకమునందు ఏ తండ్రి, తనకు వ్యతిరేకముయిన కుమారుని
కూడా దండింపడు పైగా శిక్షించి సన్మార్గమునుచూపును ఏ చెడు
మార్గమునకును పోక మంచివాడయిన ప్రహ్లాదుని యెడల తండ్రి
పాపమునే పూనెను అన్నవుడు పాపములను తొలగించి తనకు సంక్ర
మించిన అఘమును బాపుకొనుటకు ప్రహ్లాదునే మంచి తరణోపాయ
ముగా హిరణ్యకశిపుడు గ్రహించెనని భావము ఋషుల శాపము
వలన లభించిన సర్వపాపములనుండి మోక్షము లభింపవలయునని
'ము - కుచ' అనేస్థితి రావలయుననియే హిరణ్యకశిపుడు కోరుచు
న్నాడు దానికై ప్రహ్లాదుని ఉపకరణముగా గోరుచున్నాడు ,,
ఇట ద్వేషము లేదనియు, తన రాక్షసజన్మయందలి ద్వేషమువలన
మరణమును తనకు ప్రయోగించుటకై పుత్రునికై ద్వేషమనియు
అర్థమును గ్రహింపదగును 1

హిరణ్యకశిపుడు కుమారుననేకవిధముల హింసించినాడు
కాని హరి కృపకు పాత్రుడైనందున ప్రహ్లాదునియందెట్టి వికారము
కలుగలేదు. కనుక ప్రహ్లాదుడు బాధల నొందినాడనుట అసంగతము
భక్తునకును, భగవంతునకును గల అభేదము ప్రహ్లాదచరిత్రయందు
నిగదితము. హిరణ్యకశిపుడు బాధించుకొలది ప్రహ్లాదుని యందా

1 భాగవతప్రభ - అహ్లాదకిరణము, పుట - 118

సంగమే అర్థమైనది 1 ఏవిధమునను చావని రూపుమాపలేక హిరణ్య
కశిపుఁడు "దురంతచింతా పరిక్రాంతుండయి"నాఁడు (200) ప్రహ్లా
దుని ప్రాణముల కపాయము వాటిల్లనగదా భగవానుఁడు వచ్చుట,
అర్థసిద్ధికలుగుట అందులకై దురంత చింతా పరిక్రాంతుడైనాఁడు

హిరణ్యకశిపుని వైరసాధన ఫలోన్ముఖమైనది "కావున
వీఁడు మహా ప్రభావ సంపన్నుఁడు వీనికెందును భయంబులేదు వీని
తోడి విరోధంబునం దనకు మృత్యువు సిద్ధించునని నిర్ణయించి "
7-205 ఇప్పటికి తనమృత్యువు తాను కోరుకొనిన విధముగా లభించు
నని నిశ్చయమైనది కాని కర్మవాసన లింకను అతనిని వీడలేదు కర్మ
పరిపాకమింకను కలుగకపోవుటచేతనే "చిన్నవోయి", "ఖిన్నుఁడై",
"విషణ్ణుండై" అను విశేషణములు సంగతములగుచున్నవి కర్మ పరి
పాక కాలమున ప్రహ్లాదుఁడే హిరణ్యకశిపునకు పరమగురువై హరి
తత్త్వమును సమగ్రముగ బోధించినాఁడు (7-264 నుండి 275 పద్య
ములు) "ఇందుగలఁడందు లేఁడని సందేహము వలద"నుచు భగవం
తుని విశ్వమయత్వమును తండ్రికి నిరూపించినాఁడు

ఇట పద్మపురాణమునందలి వాక్యములును స్మరణీయములు
హిరణ్యకశిపుఁడు విష్ణుతత్త్వమును ఎఱిగినవాఁడయ్యు, విష్ణురూప
మును ప్రత్యక్షముగా సందర్శింపవలెనను జిజ్ఞాసతో నాయనను
చూపుమని ప్రహ్లాదునడిగినాఁడు

"త్వయా విష్ణోః పరత్వంచ సమ్యగుక్తం మమాగ్రతః
వ్యాపిత్వాత్ సర్వభూతానాం విష్ణురిత్యభిధీయతే"
"యోసౌ సర్వగతో దేవః స ఏవ పరమేశ్వరః
తస్య సర్వగతత్వం వై ప్రత్యక్షం దర్శయస్వ మే"

1 శ్రీమదాంధ్రభాగవతము, 7-193, 194, 195 పద్యములు,
పుటలు - 63, 64

"ఐశ్వర్యశక్తి తేజాంసి జ్ఞానవీర్య బలానిచ
పశ్యేఽయం తస్య పరమం రూపం గుణ విభూతయః
సంయగ్దృష్ట్వా ప్రయత్నేన విష్ణుం యాస్యే దివాకరమ్' 1

'శ్రీమహావిష్ణువుయొక్క పరదైవతత్వము నీవు నాయెదుట చక్కగా నిరూపించితివి సర్వభూతములయందును వ్యాపించియుండుటచే నాతనిని విష్ణువనుచున్నారు ఎవ్వఁడు సర్వగతుఁడో వాఁడు పరమేశ్వరుఁడు అట్టి మహావిష్ణువు సర్వగతత్వమును నాకు ప్రత్యక్షముగా చూపవలసినది ఈశ్వరత్వము, శక్తి, పరాక్రమము, జ్ఞానము, సత్త్వము మున్నగు నారాయణుని పరమ దృుతమైన గుణసంపత్తిని చూడగలను అట్లు చూచి ప్రయత్నించి నారాయణుని వైకుంఠ నిలయనిగ నెఱుఁగఁగలను ' అని కుమారునితో పలికినాఁడు

ప్రత్యక్షానుమాన ఉపమాన శబ్దప్రమాణము లనునవినాలుగు ప్రమాణములు వానిలో ప్రహ్లాదునివలన హిరణ్యకశిపునకు పూర్వ జన్మయందలి సద్వాసన ఉద్బుద్ధమై విష్ణుగుణజ్ఞానము కలిగినది. నారాయణుఁడుఉపమేయుఁడు, సర్వగతుఁడు అను అనుమాన ప్రమాణమింకను నిశ్చయజ్ఞానమునుకూర్చలేదు అందువలననే సర్వస్థలముల యందును ఉన్నాఁడేమో యని అనుమానించుచు, స్తంభగతుఁడుగ నుండునా అను భాగవతప్రశ్న మిచట అనుసంధేయ మైనది. తరువాత భగవద్విభూతి సంపత్తి నరసింహరూపమున ప్రత్యక్షమైనది.

విష్ణువునకు తప్ప మిగిలిన దేవతలెవ్వరికిని విశ్వమయత్వము లేదని భాగవత విశ్వాసము. "విశ్వకరు...", "విశ్వమయతలేమి " 8_88, 94 ఆవిశ్వమయత్వ మనుభవసిద్ధముగ గ్రహింపవలెనను కుతూ హలము భక్తి పరిపాకముచే హిరణ్యకశిపునకు కలిగినది

---

1. పద్మపురాణము, ఉత్తరఖండము, 285వ అధ్యాయము
శ్లోకములు - 74 నుండి 77 పుట-472

"హరినర్వాకృతులంగలండనుచు బ్రహ్లాదుండు భాషింప న
త్వరుఁ గై కొందును లేఁడు లేఁడని సుతున్ దైత్యుండు తర్జింప శ్రీ
నరసింహాకృతి నుండె నచ్యుతుఁడు నానాజంగమ స్థావరో
త్కర గర్భంబు సన్ని దేశముల నుద్దండ ప్రభావంబునన్" 7-277

హిరణ్యకశిపుని వైరసాధనలో నొక క్రమపరిణామమున్నది అది నృసింహావిర్భావ సమయమునకు పచేళిమమైనది

"సత్యం విధాతుం నిజభృత్యభాషితమ్
వ్యాప్తిం చ భూతే ష్వఖిలేషు చాత్మనః
అదృశ్యతా ద్భుత రూపముద్వహన్
స్తంభే సభాయాం న మృగం న మానుషమ్" 7-8-17

ఈశ్లోకము, దీనికి శ్రీధరీయము హిరణ్యకశిపుని నిజభృత్యత్వమును నిగదితమొనర్చును పోతన వీనిని దృష్టియందుంచుకొని హిరణ్యకశిపుని పాత్ర నావిష్కరించినాఁడు

"సత్యం విధాతుం నిజభృత్యభాషితమ్" అను శ్లోకమునకు శ్రీధరీయమిది

"భగవాన్ తదా అదృశ్యత దృశ్యో బభూవ కిమర్థం నిజభృత్యేన ప్రహ్లాదేన యద్భాషితం దృశ్యత ఇతి తత్సత్యం విధాతుం కర్తుం తథా అఖిలేషు భూతేషు స్వాత్మనో వ్యాప్తించ సత్యాం కర్తుం స్తంభే అదృశ్యత ఇత్యన్వర్థమ్? . నిజభృత్యేన హిరణ్యకశిపునా బ్రహ్మణం ప్రతియద్భాషితమ్. శ్లో॥ "భూతేభ్య స్త్వద్విసృష్టేభ్యో మృత్యుర్మాభూన్మమ ప్రభో" ఇతి తథా నాంతర్న బహిరితి న నరైర్న మృగైరితి చ బ్రహ్మణాచ నిజభృత్యేన యద్భాషితం తత్తథా స్త్వితి తత్సత్యం కర్తుం శ్లో॥ "కౌంతేయ ప్రతిజానీహి నమే భక్తః ప్రణశ్యతి" ఇతి తథా "తేషామహం సముద్ధర్తా

మృత్యుసంసారసాగరాది" త్యాది చ సత్యం కర్తుం అదృశ్యతేతి ద్రష్టవ్యమ్ అలమతి విస్తరేణ పుట - 932

'నిజభృత్యభాషితము'ను మాటలో వ్యాసభగవానుడు ప్రహ్లాద, సనకాదిముని ప్రవర, బ్రహ్మ, నారదాదులతో పాటు హిరణ్యకశిపునికూడ నిజభృత్యునిగ సూచించినట్లు శ్రీధరీయము వ్యాఖ్యానించుచు, భగవానుడు ప్రహ్లాద, హిరణ్యకశిపులను సంసారసాగరము నుండి సముద్ధరించినాడని తెలిపినది వ్యాసభగవానుడు సూచించిన విషయమును పోతన శ్రీధరీయము ననుసరించి ప్రకాశిత మొనర్చినాడు.

శ్రీ నృసింహావిర్భావమును వర్ణించు పోతన వచనము రస సమంచితము, అలంకారస్థగితము " ప్రహ్లాద హిరణ్యకశిపు రంజనభంజన నిమిత్తాంతరంగ జేగీయమాన కరుణా వీరరస సంయుతుండును మహాప్రభావుండును నయిన శ్రీ నృసింహదేవుండావిర్భవించినం గనుంగొని" 7-285

తాను భావించిన నరసింహరూపమున నారాయణుడు ప్రత్యక్షముకాగా, హిరణ్యకశిపుని మనస్సు ఒకవిధమైన నిశ్చలస్థితి నందినది "నరమూర్తిగాదు కేవల హరిమూర్తియుగాదు ... " 7-286 అను చిన్నపద్య మాతని మనఃస్థితికి దర్పణము

నృసింహావిర్భావమునకు ప్రహ్లాద హిరణ్యకశిపు లిరువురును కారణులే అందునను కోరిన వరవిధానమువలన హిరణ్యకశిపుడు ముఖ్యంతగ కారణభూతుడు అతని నిరంతర వైరసాధనాలత ప్రహ్లాద భక్తి భావనుసల్లుకొని తీగలుసాగి యిప్పుడు ఫలోన్ముఖమైనది శాపవశమున కలిగిన అజ్ఞానాంధకారము తొలగి, శ్రీహరి మనోగతము భక్తున కవగతమైనది.

అట్టి నృసింహునిజూచి

"ప్రాయేణమేఽయం హరిణోరుమాయినా
వధః స్మృతోఽనేన సముద్యతేన కిమ్
ఏవం బ్రువం స్త్వభ్య పతద్గదాయుధో
నదన్నృసింహం ప్రతిదైత్యకుంజరః"                7.8.28

మాయావి యగుశ్రీహరి తనను చంపుటకు వచ్చెనని సింహ నాదము చేయుచు హిరణ్యకశిపుడు నృసింహ దేవునిపైకి ఉరికి నాడు

"తెంపున బాలుఁడాడిన సుధీరత సర్వగతత్వము ం బ్రతి
ష్ఠింపఁదలంచి యిందు నరసింహ శరీరముఁదాల్చి చక్రి శ
క్తింపఁగ వచ్చినాఁడు హరిచే మృతియుంచుఁ దలంతు నైన నా
సొంపును తెంపు నందఱునుజూడఁ జరింతు హరింతు శత్రువుల్"
7-287

అని పోతన ఇందలి 'సర్వగతత్వముం బ్రతిష్ఠింపఁదలంచి', 'చక్రి శక్తింపఁగ వచ్చినాఁడు', 'హరిచే మృతియుంచు దలంతు'నను హిరణ్యకశిపుని పలుకులాతని వైరయోగమునకు పరాకాష్ఠ సాధనలో నాతఁడు కోరిన భగవద్దర్శనము లభించినది ఇక స్పర్శనముతో సాఫల్యమును బొందవలెను

'హరింతు శత్రువుల్' అనునది పార్షదత్వ జ్ఞాపకము అందు వలన వీరధర్మానుష్ఠేయమైనది కైవల్యమార్గమునకు ప్రథమద్వార మహావృత్తియైనది.

హిరణ్యకశిపుఁడు కొంతతడవు స్వామితో 'నిలింపులాత్మీయ జీవన శంకా కళంకితుల'గునట్లు వీరోచితముగ పోరాడి,

"సురరాజవైరి లోఁబడెఁ
బరి భావిత సాధు భక్త పటలాంపాలకున్
నరసింహునకు సుదంచ
త్ఖరతర జిహ్వునకు నుగ్రతర రంహునకున్" 7.298

అట్లు లోఁబడగా,

"విహగేంద్రుండహిఁబ్రచ్చుకై వడి మహోద్వృత్తిన్ నృసింహుండు సా
గ్రహుఁడై యూరువులందుఁజేర్చి నఖసంఘాతములన్ వ్రచ్చె దు
స్సహు దంభోళి కఠోరదేహు నచలోత్సాహున్ మహాబాహు నిం
ద్రహుతాశాంతక భీకరున్ ఘనకరున్ దైత్యాన్వయ శ్రీకరున్" 7.295

భగవానుఁడాతనిని "ఊరువుఁలందు" చేర్చికొని నఖసంఘాత ములతో చీల్చినాఁడు. భగవచ్చాంత దృష్టిచే హిరణ్యకశిపుఁడు నిర్మలత్వము నొంది, పాపసంఘము విలన బాసి శుద్ధాత్ముఁడై నాఁడు

జయవిజయుల మిగిలిన శాపజన్మలలో భగవానుఁ డొకే అవతారముతో, చక్రాద్యాయుధములతో సంహరించినాఁడు హిర ణ్యాక్ష హిరణ్యకశిపులనుమ క్రమ వేర్వేరు అవతారములఁదాల్చి వధింపవలసివచ్చినది హిరణ్యకశిపుఁడు కోరిన వరవిధానము, అతని సాధనచే యిందులకు కారణము అతని సాధన ఫలోన్ముఖమై వరా త్మనందిన పిదప భగవానుఁడు సాక్షాద్దర్శనమిచ్చుటయే కాక, తన అంఘ్రులనిచ్చినాఁడు భాగవతోత్తముఁడైన ప్రహ్లాదునకు తండ్రి యగుటచే కూడ హిరణ్యకశిపుఁడీ సన్మానమున కర్హుఁడే

హిరణ్యకశిపుని వధానంతరము ఇంద్రాది దేవతలు నృసింహ దేవుని స్తుతించు సందర్భమున విష్ణుపార్షదులు

"అద్యైతద్ధరి నరరూపమద్భుతం తే
దృష్టం నః శరణద సర్వలోక శర్మ
సోఽయం తే విధికర ఈశ విప్రశప్త
స్తస్యేదం నిధనమనుగ్రహాయ విద్మః"      7.8.56

'సర్వలోక మంగళకరమగు నీ నృసింహరూపమును దర్శించితిమి బ్రాహ్మణ శాపగ్రస్తుడైన ఈదైత్యుని అనుగ్రహముచేతనే వధించితివి' అని స్తుతించినారు

"సంచిత విప్రశాపమునఁ జందనిశాచరుఁడైన వీని శి
క్షించుట కీడుగాదు కృపసేసితివీశ్వర భక్తితోడ సే
వించుట కంటె వైరమున వేగమ చేరఁగవచ్చు నిన్ను నీ
యంచిత నారసింహ తనువద్భుతమాపడఁ జూసి రందఱున్"      7.338

భక్తితోడ సేవించుటకంటె వైరమున వేగమ చేరఁగవచ్చు నిన్ను' అను వాక్యము పైవిషయమున కంతటికిని ఉపబలకము

## రావణుడు

"అజ్ఞాశక్రశిఖామణి ప్రణయిని శాస్త్రాణి చక్షుర్నవమ్
భక్తిర్భూతపతౌ పినాకినిపదం లంకేతి దివ్యాపురి
ఉత్పత్తిర్ద్రుహిణాన్వయేచ తదహో నేదృగ్వరో లభ్యతే
స్యాచ్చేదేష న రావణః క్వను పునః సర్వత్ర సర్వేగుణాః"1

'హనుమన్నాటకము'ను గ్రంథమున రావణుని గుణగణముల వర్ణించు శ్లోకమిది. ఈ గ్రంథము హనుమత్కర్తృకముగనే ప్రసిద్ధము. 'రావణుని యాజ్ఞ మహేంద్రునకు శిరోధార్యము శాస్త్రానుసారముగ ప్రవర్తించుటచే శాస్త్రములే అతని కన్నులైనవి పరమేశ్వరుని యందాతనికి లోకోత్తరమైన భక్తి. ఇన్ని సద్గుణము లున్నపుడు సాధారణముగ పరిసరముల దుష్టభావము పడుచుండును. కాని యాతని విషయమున నట్లు జరుగుటకు వీలులేకుండ దివ్యనగరమైన లంకాపురి నివాసస్థానమైనది వంశానుగతమన్ననో పుట్టినది బ్రహ్మ వంశము ఇంతటి సమస్త సంపత్తి వీరశ్రీ సన్నివిష్టమగుట దుర్ఘటము. కాని అతఁడు రావణుఁడే కాకున్నచో అంతకన్న నుత్తముఁడు లభించునా'?

ఈకవి నిర్వేదము వాస్తవమే కాని రావణత్వ2 మాతని సహజలక్షణము కాదు. అతడు హరిపార్షదుఁడు. శాపవశమున జన్మించినవాఁడు జన్మలు గడచుకొలఁది వీరి వైరము క్రమముగ తగ్గినది

---

1. కావ్యప్రకాశము, సప్తమోల్లాసము, శ్లోకము - 278 పుట - 400
(పైశ్లోకమును మమ్మటుఁడు తనకావ్యప్రకాశమున నుదాహరించినాఁడు)

2. "రావయతి పీడా జననేన ఆక్రందయతి లోకానితి రావణః"
కావ్యప్రకాశము - బాలబోధిని వ్యాఖ్యానము, వామనాచార్య రావభట్ట ఝలకీకర్ శ్లోకము - 278 పుట - 400

హిరణ్యకశిపునిలో నున్నంత తీవ్రతరవైరము రావణునిలో కన్పట్టదు. తృతీయ జన్మాగు శిశుపాలుని యందింకను తీవ్రత తగ్గినది. హిరణ్యకశిపుడు సమస్తవిష్ణుతత్త్వమును ద్వేషించ, రామావతారమునకు రావణుని ద్వేషము పరిమితము. శిశుపాలునకు విష్ణుద్వేషము శ్రీకృష్ణుని అగ్రతాంబూలము వరకే పరిమితము. శాపము జన్మత్రయావధి యగుటచే నవశ్యానుభోగ్యమై విష్ణుపార్షదులైన హిరణ్యాక్షహిరణ్యకశిపులు రావణ కుంభకర్ణులుగ జన్మింపవలసి వచ్చినది. ఈ జన్మత్రయమునందు దేహప్రమాణము, సత్త్వము వారి కర్మశేషమున కనుకూలముగ తగ్గుచువచ్చినవి. హిరణ్యకశిపుని కాలమునాటికి అతని నెదిరింపగల మహాసత్త్వులెవరును లేరు. రావణుని కాలము నాటికి వాలియు, కార్తవీర్యార్జునుడును కన్పట్టుచున్నారు. మనుష్యమాత్రులలోకూడ పాండ్యదేశరాజునొకని గెలువలేక రావణుడు వానితో సంధిచేసికొనినట్లు కాళిదాస మహాకవి పేర్కొనినాడు.[1] అట్టివారున్నను నారాయణుని అనుగ్రహముండుటవలన రామావతారమునకును రావణుని జీవితావధి పెరిగినది. ఇదికూడ మిక్కిలి తక్కువయే. మూడుకోట్ల యేబది లక్షల సంవత్సరములీతని యాయుర్దాయము కాగా, విష్ణువొక వృద్ధబ్రాహ్మణ వేషమున నీతనిని వంచించి జీవితావధిని తగ్గించెనని యొకకథ ప్రబంధముల

---

"అస్త్రం హరాదాప్తవతా దురాపమ్
యేనేంద్రలోకావజయాయ దృప్తః
పురాజనస్థాన విమర్దశంకీ
సంధాయ లంకాధిపతిః ప్రతస్థే"

రఘువంశము, 6వ సర్గ శ్లోకము – 62 పుట – 94

యందు కన్పట్టును 1

రావణుఁడు భగవత్పార్షదుఁడనుమాట శ్రీమద్రామాయణమున లేదు కాని భాగవతవాక్యమే దీనికి ప్రమాణము 2 రామకథను తరువాత మార్కండేయుని ముఖమున వినగలవని ప్రహ్లాదచరిత్రము చెప్పుచు నారదుఁడు ధర్మజునితో[8] పలుకును నారదుఁడు చెప్పినట్లే రామాయణకథ శ్రీమద్భాగవతము, నవమస్కంధమున వర్ణితము శ్రీరామావతారకథ వైవస్వత మన్వంతరమున ఇరువదినాల్గవ త్రేతాయుగమున జరిగినట్లు హరివంశము చెప్పినది 3 అనఁగా నేటికి సుమారు రెండుకోట్ల యేఁబదిలక్షల సంవత్సరములకు పూర్వము జరిగినదని చెప్పవచ్చును రామావతారకాలమే శ్రీమద్రామాయణ కావ్యము ఆధునికులకిది విశ్వసనీయముగ కన్పట్టకపోవచ్చును కాని రామాయణమునందు శ్రద్ధకలవారికి రెండుమార్గము లున్నవి ఒకటి వైజ్ఞానికమతిగని వ్యవహరింపఁబడు ఆధునికవాదము రెండవది భక్తిపూర్వకమును, రసాస్వాదమును ప్రధానముగ గ్రహించెడి దీనికి దేశకాలములతో నిమిత్తములేక చక్రద్యుతియు, అధ్యాత్మికతత్త్వమును, భక్తిమార్గమును మాత్రమే లక్ష్యములు వైజ్ఞానిక మతమును

---

1 "ఇతఁడు మూఁడు కోట్ల నేఁబదిలక్షలు
సత్సరములు హరుని వరము వలన
నుండువాఁడ కాఁడె యొక వృద్ధవిప్రుఁడై
వచ్చి శౌరి మోసపుచ్చెఁగాక"
రామాభ్యుదయము, 8వ ఆశ్వాసము. పద్యము - 86 పుట - 298

2 జజ్ఞాతే తౌ దితేః పుత్రౌ దైత్యదానవ వందితౌ
హిరణ్యకశిపుర్జ్యేష్ఠో హిరణ్యాక్షోనుజస్తతః' 7-1-40, పుట - 15
"తతస్తౌ రాక్షసౌ జాతౌ కేశిన్యాం విశ్రవః సుతౌ
రావణః కుంభకర్ణశ్చ సర్వలోకోప తాపనౌ" 7-1-44 పుట-16

3. హరివంశము, పూర్వభాగము, చతుర్థాశ్వాసము, పద్యము-57 పుట-90

పేర హేతువాదము ప్రబలినచో మనశ్శాంతి లోపించును గోచరించెడినన్నియు వాస్తవములు కావేమో అను నిరంతర శంకయు మానవుని నిత్యశంకితుని జేయును. అందువలన విమర్శకుఁడు దఃఖభాగి యగును సుఖజీవనమునకు, భారతీయ మార్గమునకు ననుకూలమైనది ద్వితీయః క్రమః 1

భాగవతమునందలి శ్రీమద్రామాయణకథ వాల్మీకిరామాయణమునకు సంక్షేపము. రావణ జననాదికము శ్రీమద్భాగవతమున వర్ణితము కాలేదు. రావణ జన్మాదిక విశేషములు వాల్మీకి రామాయణము, ఉత్తరకాండమున విశేషముగ వర్ణితములైనవి. ఉత్తరకాండము వాల్మీకి కర్తృకము కాదను వాదమున్నది. కాని ప్రాచీన మహాకవులు, ఆలంకారికులు ఉత్తరకాండమును వాల్మీకి కృతిముగ సంగీకరించినారు. రామాయణమునకు 'పౌలస్త్యవధము'నది నామాంతరమే కాని, అంతవఱకే వాల్మీకి రచించినాఁడనుట యుక్తము కాదు

---

1 "There are two ways of handling the Ramayana one may be called the scientistic way and the other the artistic way The former is a long, devious and uneven path dark except for occasional glimmer and fit only for a certain class of tough-minded workers, and the mentality of one who pursues it must needs be very similar to that of a botanist of anatomist who tears to pieces a beautiful flower or a hand some human form in his quest for the pith or the truth And the appropriate way for the tender minded is the latter way the artistic way which is as good as and certainly sweeter than the other way and which the tough minded would also like to pursue atleast as a pleasant diversion "

వాల్మీకి రామాయణము, పీఠిక, పుట 14

By S కుప్పుస్వామిశాస్త్రి

రామస్య చరితం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్
పౌలస్త్యవధ మిత్యేవ చకార చరితవ్రతః"1

అను గ్రంథారంభమునందలి శ్లోకములో సమగ్ర రామచరితమును, సీతామహత్త్వపూర్ణ చరితమును మహాముని వర్ణించినట్లున్నది. పట్టాభిషేకముతో రామచరిత్ర పూర్తికాగా అంతేకాక రామపట్టాభిషేకము నాటికి రామాయణరచన జరిగినను, భవిష్యత్కాలమున జరుగఁబోవు ఘట్టములనుకూడ వాల్మీకి మహర్షి కూర్చినట్లు బాలకాండమున వర్ణితము. ఉత్తరకాండము వాల్మీకి కృతమని బాలకాండమున నిగదితము.2

ధ్వన్యాలోకకారుఁడు చతుర్థోద్యోతమున రామాయణమునందలి కరుణరసమును విస్తారముగ నిరూపించినాఁడు. సీతావియోగము రామాయణము కరుణారసభరితమనుటకు ప్రధానకారణముగ నితఁడు ప్రతిపాదించినాఁడు. ఉత్తరకాండము వాల్మీకి కృతమైనపుడే అట్టి యభిప్రాయము సంగతమగును. ఉత్తరకాండమునందలి కొన్నికథలు ప్రసంగవశమున మిగిలిన కాండములయందు పేర్కొనఁబడినవి. వానిలో ముఖ్యమైనది యుద్ధకాండమున రావణునకు పూర్వవృత్తాంత స్మరణము కలుగుట. సూర్యవంశమునందలి అనరణ్యుఁడను మహారాజును రావణుఁడు సంహరించినాఁడు. అనరణ్యుఁడవసానకాలమున, తనవంశమున జనింపఁబోవువాఁడే రావణుని వధింపఁగలఁడని శపించినాఁడు. రావణునకాశోకము యుద్ధసమ

---

1 బాలకాండము, 4వ సర్గ, శ్లోకము - 7 ఎటి-8

2 'రామాభిషేకాభ్యుదయం సర్వసైన్య విసర్జనమ్
స్వరాజ్యరంజనం చైవ వైదేహ్యాశ్చ విసర్జనమ్"
బాలకాండము, 3వ సర్గ, శ్లోకము - 38 ఎటి-8

యమున జ్ఞప్తికివచ్చి, తనమరణమును నిర్ణయించుకొనినాఁడు ఉత్తర కాండ వాల్మీకి కర్తృకము[1] కానిచో నిట్టివర్ణన మసంగతమగును రామాయణమునకు పూర్వమే యీవిషయము కావ్యరూపమున నున్నచోనిది సంగతమగును కాని ప్రప్రథమముగ వాల్మీకిమహర్షియే వాఙ్మయసృష్టి చేసినట్లు ప్రాచీన, నవీన విమర్శకు లంగీకరించినారు ఉత్తరకాండ కర్తృక విస్తరమునుగూర్చి డాక్టర్ మార్టూరి పాండు రంగారావుగారి "ఉత్తరరామాయణ విమర్శ"లో కననగును 2

---

1 "అనాగతంచ యత్కించిత్ రామస్య వసుధాతలే
తచ్చకారోత్తరే కావ్యే వాల్మీకిర్భగవానృషిః"
యుద్ధకాండము, శ్లోకము - 39 పుట - 9

2 ఉత్తరరామాయణ విమర్శ - డా మార్టూరి పాండురంగారావు
ఎం ఏ, పిహెచ్ డి.
హిందూకళాశాల, గుంటూరు.

పుటలు - 1 నుండి 62

రావణ జననము :

పట్టాభిషేకానంతరము శ్రీరాము నభినందించుటకు మహర్షులు వేంచేసినారు పౌలస్త్యవధ మింతటిశ్లాఘ్యమగుటకు హేతు వేమని రాముఁడా మహర్షుల నడిగినాఁడు. అపుడు రావణ జన్మాదికమును గూర్చి మహర్షులు రామునకు వివరించినారు

బ్రహ్మమానస పుత్రుఁడు పులస్త్యుఁడు వాని కుమారుఁడు విశ్రవసుఁడు. అతని జ్యేష్ఠపుత్రుఁడు కుబేరుఁడని ప్రసిద్ధుఁడైన వైశ్రవణుఁడు. ఒకనాఁడు విశ్రవసుఁడు సాయంసమయమున దేవతార్చన పరుఁడై యుండ సుమాలియను రాక్షసుఁడు తనకుమార్తెయైన కైకసిని విశ్రవసునకీయదలఁచి సంకల్పముతో నాతని యాశ్రమమునకు వచ్చినాఁడు. స్వయముగ వెళ్ళి విశ్రవసుని వరింపుమనియు, విశ్రవసునివంటి కుమారుఁడే అట్టి స్వయంవరమున జన్మింపగలఁడనియు నాతఁడు కుమార్తెకు బోధించినాఁడు 1 తండ్రియాజ్ఞ శిరసావహించి అప్రదోష కాలమునందే కైకసి విశ్రవసుని సమీపించినది. తనను గూర్చి పేరుమాత్రము చెప్పి, మిగిలిన వివరములు దివ్యదృష్టితో తెలియవలసినదని కోరినది. ఆముని అతీతానాగతములను ధ్యానమువలన గ్రహించి యీ దారుణసమయమున సంగమేచ్ఛతో సమీపించితివి కావున దారుణ చరితులైన కుమారులుద్భవింపగలరని విశ్రవసుఁడు పలికినాఁడు. కైకసి ప్రార్థనపై కొంతియుపశాంతినికూడ తెలిపినాఁడు. అది విభీషణాకృతమైనది. విభీషణుఁడు తనవంశమున కనుకూలమైన ప్రవర్తన కలిగియుండునని ఊరడించినాఁడు

---

1, 'భజ విశ్రవసం పుత్రి పౌలస్త్యం వరయ స్వయమ్
ఈదృశాః తే భవిష్యంతి పుత్రాః పుత్రి న సంశయః''
ఉత్తరకాండము, 9వ సర్గ, శ్లోకము - 12 పుట - 942

కైకసి ప్రథమ సంతానము దశగ్రీవుడు. దశగ్రీవములతో పుట్టుటవలన దశగ్రీవుడనియే తండ్రి యాతనికి నామకరణ మొనర్చినాడు. దశగ్రీవుని తరువాత కుంభకర్ణుడు, ఆపై శూర్పణఖ, తుదిని విభీషణుడు జన్మించినారు

దశగ్రీవుడు బ్రహ్మనుగూర్చి పదివేల సంవత్సరములు కాలి వ్రేలిపై నిలచి, నిరాహారుడై, సూర్యుని జూచుచు తపమొనర్చినాడు. వేయి సంవత్సరముల కొకమారు తనశిరస్సులలో నొకదానిని భగవదర్పణము చేయుచు తపమును కొనసాగించినాడు. దశమశిరమునుకూడ ఖండించుకొనుటకు సిద్ధపడినపుడు బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై వరములు వేడుమన,[1] దశగ్రీవుడు అమరత్వమును కోరినాడు. సర్వామరత్వము దుర్లభమనియు, మఱియొక వరమును కోరుకొనుమనియు బ్రహ్మ పలుకగా, మానవేతరులవలన నవధ్యత్వము నాతడు వరముగా వేడినాడు. బ్రహ్మ ఆవరమునిచ్చి, శిరస్సుల నర్పించినందులకు ప్రీతుడై అతడు కోరకయే ఆశిరస్సులను, కామరూపమును అనుగ్రహించినాడు [2]

---

1 రావణుడు త్రిలోకాధిపత్యమును తపఃఫలముగా సంకల్పించి శివునిగూర్చి తపమొనర్చినట్లు మహాకావ్యములందు గోచరము. శివునకు తొమ్మిది తలల నర్పించినపిమ్మట పదియవతల శివునివలన నివారింపబడుటచే, అది తన సాహసమునకు విఘ్నముగా రావణుడు భావించెనట

"ప్రభుర్బుభూషుః భువనత్రయస్య యః
శిరోతిరాగాత్ దశమం చికర్తిషుః
అతర్కయద్ విఘ్నమివేష్ట సాహసః
ప్రసాదమిచ్ఛా సదృశం పినాకినః"

మాఘము, ప్రథమసర్గ, శ్లోకము - 49 పుట - 18

ఇది పురాణకథగానే మల్లినాథుడు చెప్పినాడు. ఏపురాణములోనిదో తెలియదు

2 ఉత్తరకాండము, 10వ సర్గ శ్లోకములు - 23, 24 పుట - 944

విభీషణుడు ఎంతటి యాపదల యందును ధర్మబుద్ధి నశింపకుండునట్లును, ఉపదేశము లేకయే బ్రహ్మాస్త్రమును, విద్యాశ్రేయములందే బుద్ధికలుగునో అది ధర్మయుక్తమై యుండునట్లును వరమడిగినాడు బ్రహ్మ ఆ వరముల నిచ్చి, విభీషణుడు అడుగకనే అమరత్వము ననుగ్రహించినాడు 1 ఇక కుంభకర్ణునకు వరములిచ్చుటకు బ్రహ్మ సంకల్పింపగా వరముల నిచ్చినచో వాడు మూడులోకములను మ్రింగివేయగలడని దేవతలు పలికినారు దేవతల కపాయము లేని విధముగా కుంభకర్ణుడు వరముల నడుగునట్లు చూడుమని బ్రహ్మ సరస్వతి నాదేశించినాడు ఆమె ప్రభావమువలన కుంభకర్ణుడు తనకనేక సంవత్సరములు నిద్రననుగ్రహింపుమని బ్రహ్మను ప్రార్థించినాడు అతడట్లు వరమడుగగనే సరస్వతి వానినుండి నిష్క్రమించినది

రావణుడు సహజముగ క్షమాగుణ సంపన్నుడు గురుభక్తిపరుడు ఒకప్పుడు వైశ్రవణుని వైభవము జూచిన కైకసి మనసులో నసూయపడినది తల్లి హృద్గత సంతాపమును గుర్తించి దశగ్రీవుడు తన ఔన్నత్యమునకు ప్రయత్నింతునని ప్రతిజ్ఞ చేసినాడు ఇట్లు ప్రతిజ్ఞ చేసినను దశగ్రీవుడధర్మమార్గము నవలంబింపలేదు. అతని మంత్రులును, సుమాలియు వైశ్రవణుని జయించి లంకానగరము నాక్రమింతుమని ప్రోత్సహించినారు అప్పుడు దశగ్రీవుడు చెప్పిన సమాధానమాతని గురుభక్తిని సూచించును. ధనపతి తనకు పూజ్యుడనియు, తనకన్న పెద్దవాడనియు, కనుక నిట్టిమాటలు పలుకరాదనియు నాతడు సుమాలిని వారించినాడు మఱికొంతకాలము తరువాత ప్రహస్తుడు తిరిగి దశగ్రీవు ననేకవిధముల ప్రలోభపెట్టినాడు

---

1 "నాధర్మే జాయతే బుద్ధి రమరత్వం దదామి తే"
ఉత్తరకాండము, 10వ సర్గ, శ్లోకము - 35 పుట - 945

తుదకు మంత్రుల దుర్బోధయే జయించినది వాస్తవముగ లంకాపురమును బ్రహ్మయాజ్ఞపై విశ్వకర్మ రాక్షసుల నివాసార్థమే నిర్మించినాఁడు కావున లంకకు నిజమైన వారసులు రాక్షసులే [1]

దశగ్రీవుఁడు లంకాపురిని తమకప్పగింపుమని కుబేరునకు రాయబారమంపినాఁడు అందులకు ధనదుఁడు రాక్షసులచట లేని కాలమున తండ్రిననుమతితో లంక నేలుచుంటిననియు, రాజ్యమును విభజింపక తనతో కలసి సమానముగ భోగములననుభవింప వచ్చిన దనియు ప్రతిసందేశము పంపినాఁడు కుబేరుఁడిట్లు ప్రతిసందేశమంపి, తండ్రికడకేగి కర్తవ్యము నుపదేశింపుఁడని ప్రార్థించినాఁడు తండ్రి యాజ్ఞపై లంకాపురిని దశగ్రీవునకిచ్చి, తాను కైలాసపర్వతముపై నలకానగరము నిర్మించుకొనినాఁడు

వైశ్రవణుఁడు వదలిన లంకానగరమును దశగ్రీవుఁడాక్రమించినాఁడు పిమ్మట కాలకేయ గణాధిపతియగు విద్యుజ్జిహ్వునకు శూర్పణఖనిచ్చి వివాహముచేసినాఁడు తాను మయుని పుత్రికయగు మండోదరిని పరిణయమాడినాఁడు కుంభకర్ణుఁడు బలి దౌహిత్రియగు వజ్రజ్వాలను, విభీషణుఁడు శైలూషునను గంధర్వరాజకుమార్తె సరమను ఉద్వాహమైనారు

కొంతకాలమునకు పిమ్మట దశగ్రీవుఁ డధర్మమార్గమున చరించుచుండుటను గమనించి కుబేరుఁడు హితోపదేశము ప్రధానో

---

1 దక్షిణస్యోదధేస్తీరే త్రికూటో నామ పర్వతః
తస్యాగ్రే తు విశాలా సా మహేంద్రస్య పురీ యథా
లంకానామ పురీ రమ్యా నిర్మితా విశ్వకర్మణా
రాక్షసానాం నివాసార్థం యథేంద్రస్యామరావతీ'
ఉత్తరకాండ, 5వ సర్గ, శ్లోకములు - 26, 27 పుట - 931

ద్దేశముగ దూతను తమ్మునికడకు పంపినాఁడు. దశగ్రీవుని సంహరించుటకు దేవతలుపాయమాలోచించుచున్నారనియు, అందువలన అధర్మమును వీడినచో నాతఁడు చిరంజీవి కాఁగలఁడనియు కుబేరుని సందేశ సారాంశము. దేవతల యాలోచనయు తెలిసిన దశగ్రీవుఁడధర్మమార్గము వీడకపోఁగా దేవతలనే జయించుటకు నిశ్చయించినాఁడు. పైఁగా కుబేరుని దూతను సంహరించినాఁడు.[1] దశగ్రీవుఁడు తనదిగ్విజయమును కుబేరునిపై దాడితో ప్రారంభించి ఆతని పుష్పకమునపహరించినాఁడు.

---

1 ఇది కాలవశమున కలిగినబుద్ధి "సాధుధర్మే వ్యవస్థానం క్రియతాం యది శక్యతే" అను పలుకులలో 'యది శక్యతే' అను పదమే అసంభావ్యతను సూచించును. ధర్మవర్తనుఁడైనచో శాపము తొలఁగిపోవుటకది ప్రతిబంధకమగును.

## రావణ నామ ప్రాప్తి

కుబేరుని జయించిన దశగ్రీవుఁడు హిమవత్పర్వతమున కుమార స్వామి జన్మించిన శిఖరమును జేరి, అచట నందీశ్వరుని చూచినాఁడు ఈశ్వరుఁడేకాంతమున నున్నాఁడు కావున మరలిపొమ్మని నంది యాతనిని హెచ్చరించినాఁడు శంకరుఁడెవ్వఁడు, విరూపివైన నీవెవ్వఁ డవని దశగ్రీవుఁడు నందిని పరిహసించినాఁడు అందులకు నంది యాగ్రహించి 'వానరుఁడనని నన్ను పరిహసించితివి కాన నీకు వానరుల కారణముగనే వంశనాశనము సంభవించున'ని శపించి, 'నేను నిన్ను చంపుటకు సమర్థుఁడను కాని నీకర్మపరిపాకము వలననే నీవు మరణింపవలసి యున్నది కావున విడచిపుచ్చితిన'ని పలికినాఁడు దశగ్రీవుఁడు తనబలప్రదర్శనమునకై శివుఁడు క్రీడించుచున్న కైలాస పర్వతము క్రిందకుచేరి యాకొంగను కదల్చినాఁడు పరమేశ్వరుఁడిది గ్రహించి కాలిబొటనవ్రేలితో లీలగా కైలాసమును క్రిందకు నొక్కినాఁడు దశగ్రీవుఁడా బాధ భరింపలేక మూఁడులోకములు భయపడునట్లు దారుణరావము చేసినాఁడు మంత్రులు మహాదేవుని స్తుతింపుమని తమరాజునకు చెప్పినారు ఈవిధముగ నరచుచునే వేయిసంవత్సరములు వివిధములైన స్తోత్రములతో దశగ్రీవుఁడు శివునకు ప్రీతికలిగించినాఁడు అపుడు శివుఁడు ప్రత్యక్షమై, 'కొండ నుండి సుదారుణమైన రావమును జేసి లోకముల నాక్రందింపజేసితివి కాన నీకు 'రావణుఁడ'ను పేరిట ప్రసిద్ధవ్యవహారము కలుగునని యనుగ్రహించినాఁడు వరముకోరుమనిన పరమేశ్వరునితో రావణుఁడు నరులు తనకు లెక్కలోనివారు కారనుచు, బ్రహ్మయిచ్చిన దీర్ఘాయువు గాక ఆయుశ్శేషమును, అమోఘమైన ఆయుధమును అనుగ్రహింపుమని ప్రార్థించినాఁడు అందులకు శివుఁడు సమ్మతించి, చంద్రహాసమను ఖడ్గము నిచ్చుచు, దానిని రావణుఁడెప్పుడవమానించునో అప్పుడది తిరిగి తనను చేరుకొనునని హెచ్చరించినాఁడు

వేదవతి శాపము

కైలాసపర్వతమునుండి బయలుదేరిన రావణుఁడు హిమవత్ప్రాంతముల యందు మునివృత్తికొనున్న ఒక కన్యనుచూచి తాను మోహితుఁడై యామె వృత్తాంత మడిగినాఁడు. ఆమె రావణుని కాతిథ్యమిచ్చి 'నాతండ్రి బృహస్పతి కుమారుఁడైన కుశధ్వజుఁడను బ్రహ్మర్షి నిత్య వేదాభ్యాసముచేయు నామహర్షికి 'వాఙ్మయి'యైన కన్యగా జన్మించి వేదవతిగా వ్యవహరింపఁబడుచున్నాను. శ్రీమన్నారాయణుని జామాతగ భావించిన నాతండ్రి నన్నుకోరిన దేవ దానవ గంధర్వాదులను తిరస్కరించినాఁడు. దంభుఁడను దైత్యరాజందుల కాగ్రహించి ఆయనను హత్యగావించినాఁడు. నేను మాజనకుని యాశయము దీర్చదలంచి, నారాయణునిగూర్చి తపమొనర్చుచుంటిని నారాయణుఁడే నాభర్త. తపశ్శక్తివలన నీయనోగతము నాకవగత మైనది. ఇచటనుండి వెడలిపొమ్ము'ని పలికినది. రావణుఁడు తాను లంకాధిపతిననియు, తనకు భార్యవై సమస్తభోగముల ననుభవింపు మనియు కామలాడుచు వేదవతి కేశగ్రహణము గావించి బలాత్కరింపఁబోయినాఁడు. అంత తనహస్తమునే ఖడ్గముగ మార్చి కేశము లను ఛేదించుకొని 'నీవలన నట్టియవమానమును బొందిననాకు జీవితేచ్ఛలేదు. నిన్ను సంహరింపుటకై తిరిగినేను జన్మింపగలను. పాపాత్ముఁడవైన నిన్ను శపించినచో నాతపము వ్యర్థముగ వ్యయమగును నాసత్కార్మాచరణము వాస్తవమైనచో నేనయోనిజనై, పతివ్రతనై ధర్మాత్ముఁడైనవానికి పుత్రికగా జన్మింపగలను' అనిపలికి అగ్నిప్రవేశము గావించినది. కృతయుగమున నాటిలి ఆవేదవతియే త్రేతాయుగమున సీతాసాధ్విగ జన్మించినది.

వేదవతీ శాపమునకు విస్మృతరావణుఁడు యజ్ఞదీక్షలోనున్న మరుత్తు చక్రవర్తిని జయించినాఁడు.

## అనరణ్య శాపము

భూమండలమునందలి రాజులనేకులు రావణునితో యుద్ధము చేయలేక తాము పరాజితులమని యంగీకరించినారు రావణుడయోధ్యకువచ్చి తదధిపతియైన అనరణ్యుని యుద్ధమునకాహ్వానించినాడు రావణుని సేనలోని ప్రహస్తముఖులందరును ఆయుద్ధమున నోడిపోయినారు బ్రహ్మవరమువలన రావణున కపకారము కలుగలేదు అతడు తనచేతితో ననరణ్యుని తల పగులగొట్టినాడు యుద్ధముచేయక అట్లు కొట్టిన రావణుని జూచి యాచక్రవర్తి తన వంశమునందు జన్మింపబోవు దశరథనందనుడైన రాముడాతనిని సంహరింపగలడని శపించినాడు

పిమ్మట రావణుడు మరికొందఱు రాజులతో పోరాడినాడు నారదుడీ యకారణ జనక్షయమునుజూచి రావణుని మరలించుటకై జీవుని ప్రాణములు యముని అధీనమున నుండుననియు, అతని జయించినచో నందరిని జయించినట్లే యనియు బోధించినాడు నారద వాక్యములను విశ్వసించిన రావణుడు యమునగరముపై దాడి వెడలినాడు నారదుడు యముని హెచ్చరింపగా నాతడు యుద్ధసన్నద్ధుడైనాడు. రావణుడు పాశుపతాస్త్రమును ప్రయోగించి యమ సైన్యమును పారద్రోలినాడు యముడు కాలదండమును ప్రయోగింపబోగా, బ్రహ్మ ప్రత్యక్షమై తత్ప్రయత్నమును మరలించినాడు యమదండము సఫలమైనచో బ్రహ్మ రావణునకిచ్చిన వరము విఫలమగును యమునకు అమోఘమని బ్రహ్మ యనుగ్రహించినది కావున కాలదండ వైఫల్యము చేతనైనను బ్రహ్మవాక్కు రిత్తవోవును కావున నచటినుండి యంతర్హితుడవు కమ్మని బ్రహ్మ యాదేశింప, యముండా యాదేశమును పాటించినాడు. రావణుడు గెలుపిమ్మట వరుణుని జయించినాడు

ఇట్లు దిగ్విజయయాత్ర చేయుచున్న రావణుడొకనాడు రంభను జూచి మోహావశుడైనాడు. ఆమె, తాను రావణుని అన్నకుమారుడైన నలకూబరుని సఖినని, ఆ పుననకోడలినగుదుననియు వారించుచు జూచినది. రావణుడామె మొరలాలింపక బలాత్కరించినాడు. ఆ యవమానమునకు నలకూబరుడు కుపితుడై, రావణుడు తనను కోరని స్త్రీపై నత్యాచారము చేసినచో నాతని మస్తకము సప్త శకలములగునని శపించినాడు 1 తరువాతి కథాభాగమున రావణునకు కార్తవీర్యుని వలనను, వాలివలను కలిగిన పరాభవము వర్ణితము రావణుని పాతాళయాత్ర ప్రస్తావముగ ప్రదర్శితము 2

రావణుని ప్రస్తావన తొలుత బాలకాండలో కన్పట్టును దేవతలు వైకుంఠమునకేగి రావణవధార్థము నారాయణుని ప్రార్థించుట దాశరథిగా తాను జన్మింపగలనని ఆయన అభయమిచ్చుట బాలకాండ 15వ సర్గలో వర్ణితము 3 తరువాతి మారీచ సుబాహులు రావణ నియోగముచే యజ్ఞమును విఘ్నమొనర్చుట ప్రస్తావితము

---

1 యదాహ్యకామాం కామార్తో ధర్షయిష్యతి యోషితమ్
మూర్ధాతు సప్తధాతస్య శకలీభవితా తదా"
ఉత్తరకాండము, 26వ సర్గ శ్లోకము – 56 పుట – 983

2 పుటలు – 968 నుండి 977

3 శివధనుర్భంగమునకై రావణుడు ప్రయత్నించినట్లు జనశ్రుతి. ఈకథ వాల్మీకము కాదు. భవభూతి మహావీరచరిత్రమున సీతకై రావణుడు జనకుని కడకు రాయబారమంపినట్లున్నది
(ప్రథమాంకము, శ్లోకము – 31 పుట – 30)
హనుమన్నాటకమును, జయదేవుని ప్రసన్నరాఘవమునను రావణుడు స్వయంవర మంటపమునకు వచ్చి, తన యనుచరుడైన మారీచుని యాత్ర స్వనము విని మరలిపోయినట్లున్నది
ప్రసన్నరాఘవము, ప్రథమాంకము, శ్లోకము – 60 పుట–20
వీరి కల్పనలకు పురాణము లాధారములో తెలియదు

అరణ్యకాండమున ఖరాదులు రావణునియుక్తులై దండకారణ్య వాసులైన మహర్షులను బాధించుచున్నట్లు వర్ణితము. రావణుని ప్రత్యక్షప్రమేయ మరణ్యకాండ, 31వ సర్గనుండి ప్రారంభము. లక్ష్మణునివలన వైరూప్యమును బొందిన శూర్పణఖ ఖరదూషణాదుల సంహారానంతరము లంకకువచ్చి, రావణునకు తనకు రాఘవమును గూర్చి చెప్పినది. ఆమె ప్రథమవాక్యములనుండియు రావణునకు రామునిగూర్చిన యభిప్రాయము మనసులో చిత్రితమగుచు వచ్చినది. శూర్పణఖ తొలుత రాముని మనోహరరూపమును, ఆపై నాతని పరాక్రమమును వర్ణించినది. రాముని జయించి, మహాసౌందర్యవతియైన సీతను కొనితెమ్మని దురుపదేశ మొనర్చినది. రావణ సంహారమునకు ప్రతిముఖము ప్రారంభమైనది. రావణుడామె మాటలపై విశ్వాసముంచి, దండకారణ్యములోని మారీచాశ్రమమునకు వచ్చినాడు. అప్పటికిని రావణుని కర్మము ఫలోన్ముఖము కాలేదు. అందువలన మారీచుని హితోపదేశమును విని లంకకు మరలినాడు 1 కాని కర్మవిపాక మనుభవింపక తీరదుకదా! లంకకుచేరిన రావణుని శూర్పణఖ నిష్ఠురములాడి, సీతాపహరణమునకు ప్రోత్సహించినది. రావణుడు తిరిగి మారీచాశ్రమమునకు వచ్చి సీతాపహరణమునందాతని సహాయము కోరినాడు. మారీచుడు రామప్రభావమును, రామస్వరూపసారమును రావణునకిట్లు వివరించినాడు.

"రామో విగ్రహవాన్ ధర్మః సాధుస్సత్య పరాక్రమః
రాజా సర్వస్యలోకస్య దేవానామ్ మఘవానివ"2

ఇంకను, రామాస్త్ర మహిమను వర్ణించిన మారీచుడు రావణునకు సహాయముచేయుటకు నిరాకరించినాడు. రావణుడాగ్రహముతో,

---

1 అరణ్యకాండ, 31వ సర్గ, శ్లోకములు - 42 నుండి 50 పుట - 348

2 అరణ్యకాండ, 37వ సర్గ, శ్లోకము - 13 పుట - 353

వెళ్ళుచున్నచో సంహరింతునని దురుసులాడినాడు ఎట్లును మరణము తప్పనప్పుడు రామునిచేతిలో మరణము ఉత్తమగతి దాయకమని భావించిన మారీచుడు రావణుని పలుకుల నంగీకరించి, బంగరు లేడి రూపమున రాముని దూరముగా గొనిపోయినాడు మారీచ వంచనచే లక్ష్మణుడును సీతనేకాకిగవదలి రామునన్వేషించుటకు వెడలినాడు అంత రావణుడు భిక్షురూపమున సీతను సమీపించగా, వాస్తవము తెలియని జానకి అతనిని సత్కరించి, తనవృత్తాంతమును దెలిపినది రావణుడు నిజరూపమును ధరించి తనను వరింపుమనగ, సీత యాతని దుర్మార్గమును దూషించి, తిరస్కరించినది రామలక్ష్మణులు తనను జయింపలేరని రావణుడు ప్రగల్భము లాడుచు, ఆక్రందించుచున్న జానకిని బలాత్కారముగ సంకాధిరూఢను గావించి, రథముపై లంకాభిముఖుడైనాడు

సీతాక్రందనము విని జటాయువు రావణు నెదిరించినాడు అప్పటి జటాయువుమాటలవలన రావణుడు యువకుడను, బలాఢ్యుడను విన్నట్లు విదితము 1 జటాయువునకన్న వాస్తవముగ రావణుడు పెద్దవాడు అరువదివేల సంవత్సరముల వయస్సుకల జటాయువు సరిగ దశరథుడు బ్రతికినంతకాలము మాత్రమే బ్రతికినవాడు రావణుడు దశరథునకు కొన్నితరముల ముందువాడైన అనరణ్యుని కంటె పెద్దవాడు కాని బ్రహ్మవరోద్రిక్తుడగుటను అతడు జరాక్రాంతుడు కాలేదు, దేహబలమునుతగ్గలేదు కనుక యువకుడనుమాట ఉత్సాహసూచకమే కాని వయోవాచకముగ చెప్పుట అన్వయించదు వారిరువురికి జరిగిన ఘోరయుద్ధమున జటాయువు ప్రాణమాత్రావశిష్టుడైనాడు అదియును సీతజాడ రామునకు తెలుపుటకుపకారమైనది రావణుడు సీతను గొంపోయి అశోకవనమున నుంచినాడు

---

1 వృద్ధోఽహం త్వం యువా ధన్వీ సశరః కవచీ రథీ"
అరణ్యకాండము, 50వ సర్గ, శ్లోకము - 21 పుట - 374

ఆంజనేయుడు లంకనుచేరినప్పటినుండి రావణప్రసక్తి విస్తార ముగ వర్ణితము సుందరకాండములో రావణుని దుష్కృత్యములలో సీతాపహరణమే ప్రధానము ఆదుష్కర్మ వదలినచో నాతడు వేద వేత్తలైన బ్రహ్మరాక్షసుల కాశ్రయమిచ్చినవానిగ,[1] మహైశ్వర్య సంపన్నునిగ, మహాపరాక్రమశాలిగ సుందరకాండములో కన్పట్టును అంతటి పరాక్రమశాలికిని హనుమద్విక్రమముఁ జూచినపుడు ధైర్యము సన్నగిల్లినది ఇంద్రజిత్తునకు కట్టుబడిన హనుమంతుడు[2] రావణుని వైభవము, తేజముజూచి యాశ్చర్యపడినాడు

"ఘోరాకారమహోబలంబు ధృతియా హా తేజమా యద్దిరా
యారా రాజసమ స్తచిహ్నకలనం బహో్య యధర్మక్రియా
చారోదారుడు కాడ యేసియు బిడౌజస్సంయుతంబో మరు
ద్వారాగారము నేలలేడె యితడుద్యచ్ఛక్తి సంపన్నతన్"[3]

హనుమంతుడంతటివానికిని ఆశ్చర్యముగొల్పు బలరూపతేజము లా రావణునిని సీతాప్రత్యర్పణమునకై రాముని పసువున మొదట సందేశమును తెచ్చినవాడు హనుమంతుడే రామ పరాక్రమ మెట్టిదో కూడ రావణునకవ్వాడే బుద్ధ్యనుమేయమైనది అన్నిధర్మ

---

1 "షడంగవేద విదుషాం క్రతుప్రవర యాజినామ్
శుశ్రావబ్రహ్మఘోషాంశ్చ విరాత్రే బ్రహ్మరక్షసామ్"
సుందరకాండము, 18వ సర్గ, శ్లోకము - 2 పుట - 572

2 "సరోషయామాస పరైశ్చబంధనం ప్రసహ్యవీరై రభినిగ్రహం చ
కౌతూహలాన్మాం యది రాక్షసేంద్రః ద్రష్టుం వ్యవస్యేదితి నిశ్చితార్థః"
సుందరకాండము, 48వ సర్గ, శ్లోకము - 47 పుట - 627

4 శ్రీమదాంధ్ర వాల్మీకిరామాయణము (మందరము)
సుందరకాండము , 49వసర్గ, పద్యము - 1188 పుట - 648

గూఢు తెలిసిన రావణుఁడు హనుమంతుని సంహరింప నిశ్చయించుట శోచనీయము విభీషణుఁడా ప్రయత్నమును వారించినాఁడు

యుద్ధకాండమున హనుమంతుఁడు రావణుని దుర్గరక్షణ పద్ధతిని, సైనికబలమును రామునకు వివరించినపుడు రావణుని యుద్ధ ప్రవృత్తి వ్యక్తమగును. రాజనీతిపరముగ చూచినచో రావణుని మంత్రులే అతని దుర్మార్గమును ప్రోత్సహించిరనవచ్చును. రాముఁడు రావణునకు సరికాఁడనియు, ఇంద్రజిత్తు ఒక్కఁడే సమస్త వానరులను సంహరింపఁగలఁడనియు నిత్యాదిగనున్న వారి కరబలాభిజ్ఞతి రావణుని నాశనమునకు మూలకందమైనది 1 విభీషణుఁడు మాత్రము సీతను రామునకిచ్చి శరణువేఁడుమని సాచివ్యము చెప్పినాఁడు ఆమాటలు రుచింపని రావణుఁడు తిరిగి మంత్రులను సమావేశపరచినాఁడు రావణుఁడు వారితో 'హనుమంతుఁడొక్కఁడే అప్పటివఱకు చేసిన విధ్వంసము చూడఁగా వారిబలమెట్టిదో అవగతమగుచున్నది కార్యగతి యెట్లుండునో చెప్పలేము మానవుల వలన నవధ్యత్వము కోరలేదు కావున నాలోచింపవలసినదే' అని పలికినాఁడు

"మానుషాన్మే భయం నాస్తి తథాపి తు విమృశ్యతామ్"
(యుద్ధకాండము 12వ సర్గ, శ్లోకము - 23 పుట - 688)

అను రావణుమాట కర్యగతిని సూచించును సుగ్రీవాదులను కూడగట్టుకొని, దుర్లంఘ్యమైన సముద్రమునుదాటి సీతయున్న

---

1 తేషాం వీర్యగుణోత్సాహైః న సమో రాఘవో రణే
ప్రసహ్యతే త్వయా రాజన్ హతాః పరమదుర్జయాః"
"తిష్ఠవా కిం మహారాజ శ్రమేణ తవ వానరాన్
అయమేకో మహాబాహుః ఇంద్రజిత్ క్షపయిష్యతి"
యుద్ధకాండము, 7వ సర్గ, శ్లోకములు - 18, 19 పుట - 678

చోటికి వా రు చేరినారనుట సామాన్యవిషయముకాదు సీతా ప్రత్య ర్పణము జరుగకుండను, రామలక్ష్మణులు సంహరింపబడుటకును తగిన మంత్రాలోచనమును జెప్పుడని రావణుడు మంత్రులను కోరి నాడు కుంభకర్ణుడు రావణుడు చేసినపని తప్పగనే నిర్ణయించి నాడు కాని చేసినపనిని వదలిపెట్టుట వీరలక్షణము కాదుకావున యుద్ధమునివార్య మనినాడు మహాపార్శ్వుడు యుద్ధమే కర్తవ్యమని నాడు విభీషణుడు మహాపార్శ్వాదుల దుర్మంత్రమును వినవలదని అనేకపర్యాయములు అనునయించి, అన్నచే నిష్కాసితుడై నాడు

రావణునకు శ్రీరాముడే శ్రీహరియని నిశ్చయజ్ఞానమున్నది [1] ఈ సందర్భమున గౌరిపెద్ది రామసుబ్బశర్మగారి వ క్యములును రావ ణుని యాంతరంగిక భక్తిని, విష్ణుపార్షదత్వమును నిగదిత మొనర్చును

"శ్రీమద్రామాయణమున రావణునికథ సుప్రసిద్ధమే . .. వీనికికూడ శ్రీమహావిష్ణువునందు అంతరంగికముగ అపారమైన భక్తి కాని బయటికి తనరావణత్వము మాత్రము విడువడు. తుదకు రామావతారమునసున్న స్వామి భార్యనే అపహరించుకొని పోయి నాడు

ద్విశ్శరం నాభిసంధత్తే ద్విః స్థాపయతి నాశ్రితాన్
ద్విర్దదాతి నచార్థిభ్యః రామో ద్విర్నాభి భాషతే"

అని కీర్తిగడించిన శ్రీరాముడు రావణుని చంపుటకు మనసు రాక, వానిని సంస్కరించి పెద్దరాజుగా చేయవలెనను అభిప్రాయ ముతో, వానిని నాలుగుసార్లు గ్రుక్కత్రిప్పుకొనకట్లుచేసి, యుద్ధ భూమినుండి లంకకు త్రిప్పిపంపెను కాని రావణుడు పట్టువిడువక

---

1 "తం మన్యేరాఘవం వీరం నారాయణ మనామయమ్"
యుద్ధకాండము, 72వ సర్గ, శ్లోకము - 11 పుట - 813

ఐదవసారి యుద్ధమునకే వచ్చెను, అప్పుడు రాముడు ఇంకవీనిని సంహరించుట వీలుగానిదని అని దొడ్డగా విజృంభించి "అరావణ మరామంవా జగద్రక్ష్యథ వానరాః" అనిపలికి రావణునిపై యుద్ధమునకు తలకడెను రావణుడుకూడ పట్టువిడువక యుద్ధమునకే ఉపక్రమించెను అప్పుడు వీరిరువురి మనస్సులలోని భావములను సరిగాచూచి పసికట్టిన వాల్మీకి, "జేతవ్యమితి కాకుత్స్థః మర్తవ్యమితి రావణః" అని వారిరువురి అంతరంగిక అభిప్రాయములు వెలువరించినాడు తుదకు తనకోరిక ప్రకారము అంతర్భాగవతుడగు రావణుడు చచ్చెనే కాని, రాముని కోరిక ప్రకారము సంహరింపబడలేదు కావున పై చూపిన భారత భాగవత రామాయణములకు సంబంధించిన గాధల ప్రకారము భగవంతునికంటె భక్తుడే గొప్ప 1

ఇట్లు శ్రీరాముడే శ్రీహరియను నిశ్చయజ్ఞానమున్నది కను కనే రావణుడు తనకర్తవ్యముగా యుద్ధమునకే నిశ్చయించినాడు యుద్ధమున మహాయోధులందరు వీరస్వర్గము నలంకరించిన పిమ్మట, గత్యంతరములేక రావణుడు కుంభకర్ణుని అర్ధనిద్రయందే లేపి యుద్ధమునకు పంపినాడు యుద్ధరంగమున కేగుచు కుంభకర్ణుడు రావణునితో పలికిన పలుకులాతని సజ్జనత్వసూచకములు శ్రీరాముని బంద్రాస్త్రముతో కుంభకర్ణుని యాజన్మలోని భౌతికయాత్ర పరిసమాప్తమైనది కుంభకర్ణుని మరణముతో విభీషణుడు చెప్పిన హితమును నిర్లక్ష్యము చేసినందులకు రావణుడు దుఃఖించినాడు

ఆపై జరిగిన రామరావణయుద్ధము శ్రీధరపండితుడు చెప్పినట్లు భగవంతుని యుద్ధోత్సాహమును సమగ్రముగ నిర్వహించినది

---

1. శ్రీ తాళ్ళపాకవారి పదసాహిత్యము, సంపుటము - 3
అధ్యాత్మసంకీర్తనలు, అన్నమాచార్య విరచితములు
పీఠిక - గౌరిపెద్ది రామసుబ్బశర్మ, పుటలు - 12, 13

నేటికిని "రామరావణయోర్యుద్ధం రామ రావణయో రివ"1 అని అనన్యతమై శ్లాఘాపాత్రమైనది రాత్రింబవళ్ళు ముహూర్తకాలమైనను విరామములేక యుద్ధము జరిగినది 2

మాతలి రామునకు ఆయనమహత్త్వమును గుర్తుచేయుచు బ్రహ్మాస్త్రమును ప్రయోగింపుమని విన్నవించినాడు శ్రీరాముడు బ్రహ్మాస్త్రప్రయోగముతో రావణునకు భవబంధవిముక్తి గావించినాడు. రామరావణ వైరమంతటితో పరిసమాప్తమైనది

---

1 యుద్ధకాండము, 110వ సర్గ, శ్లోకము - 28 పుట - 886

2 "నైవరాత్రం న దివసం న ముహూర్తం నచ క్షణం
రామరావణయోర్యుద్ధం విరామముపగచ్ఛతి"
యుద్ధకాండము, 110వ సర్గ, శ్లోకము - 38 పుట - 880

## పద్మ పురాణము

ఇందు రామాయణకథ చాలవఱకు శ్రీమద్రామాయణమును పోలియున్నను భేదములుకూడ నున్నవి ఉత్తరకాండమున సీతారాముల శాశ్వతవియోగము వర్ణితముకాఁగా, శ్రీరాముని అశ్వమేధ యాగమునకు పిమ్మట సీతారాములు తిరిగి కలసికొనినట్లు పద్మపురాణోక్తము ముఖ్యముగ తెలుఁగు రామాయణములలోని అవాల్మీకములకు పద్మపురాణ మాధారమనిపించును రామరావణ యుద్ధమున విభీషణుఁడు శ్రీరామునకు రావణుని ప్రాణములు పోవుపద్ధతి తెలుపుట శ్రీమద్రామాయణమున లేదు పద్మపురాణమునందలి పాతాళఖండమున నీవిషయము పురాకల్పీయ రామాయణకథగా వర్ణితము

"అథ రావణం మహాబలం హంతుమశక్తో రామో విభీషణ ముఖమవలోక్య తదుక్తచిహ్నపదం బాణేన నిర్భిద్యామారయత్"[1]

రావణునితో యుద్ధముచేసి అలసిపోయిన రాముఁడాతనిని సంహరింపలేక విభీషణుని ముఖముచూచి, ఆతఁడు చెప్పిన గుర్తులు గల స్థానమును బాణముతో భేదించి రావణుని సంహరించినాఁడు. రంగనాథ రామాయణ, భాస్కర రామాయణములలో నీ కథ గృహీతము

మఱియొక విచిత్ర వృత్తాంత మీఘట్టమునసే వివృతము రావణుఁడు మరణించిన తరువాత, పగతీర్చుకొనుటకై కుంభకర్ణుఁడు రామునిపైకి వచ్చినట్లును, అపుడు రాముఁడాతనిని సంహరించినట్లును ఇట వర్ణితము.

---

1 పద్మపురాణము, పాతాళఖండము, 116వ అధ్యాయము,
గద్యము - 40 పుట - 579

"అథ కుంభకర్ణో మహాగదామాదాయ సర్వం సంపాద్య వానరాన్ అనేకశో భక్షయిత్వా రామోత్తమాంగం గదయాహత్ రామో నిశితబాణ శతేనాహన్ ముమార కుంభకర్ణః"[1]

రావణ మరణానంతరము కుంభకర్ణుడు వానరకులమును సంహరించుచు మహాగదతో రాముని శిరస్సుపై మోదినాడు. రాముడు నిశితబాణముచే కుంభకర్ణుని వధించినాడు ఈ కల్పన మాంధ్రరామాయణములలోనికి రాలేదు

## అధ్యాత్మ రామాయణము

ఇందలి కథాగమనమే రామాయణ కథకంటె భిన్నము ఈ గ్రంథరచనాకాలము స్పష్టముగ తెలియరాకపోవుటచే నాంధ్రగ్రంథముల లోని కల్పనలకిది యాధారమనలేము. కృష్ణద్వైపాయన వ్యాసప్రోక్తముగ నిది చెప్పబడుచున్నను, పురాణములయందు వ్యాసప్రోక్తములైన ప్రసిద్ధగ్రంథములలో నధ్యాత్మరామాయణము కన్పించుట లేదు

అధ్యాత్మరామాయణమున గనుపింపదగిన ప్రధానకల్పనము సీతాపహరణమునకు రావణుడు రానున్న విషయము రామునకు ముందుగా తెలియుట. 'రావణుడపహరించుట కనుకూలముగ మాయారూపమును భూలోకమున నుంచి, అగ్నియందు వాస్తవరూపముతో నొక సంవత్సరము నివసింపు'మని రాముడు సీత దేవిని హెచ్చరించినాడు

"అథ రామోऽపి తత్సర్వం జ్ఞాత్వా రావణచేష్టితమ్
ఉవాచ సీతాం ఏకాంతే శృణు జానకి మే వచః

---

1 పద్మపురాణము, పాతాళఖండము, 116వ అధ్యాయము
గద్యము - 49 పుట - 579

రావణో భిక్షురూపేణ ఆగమిష్యతి తే అంతికమ్
త్వంతు ఛాయాం త్వదాకారాం స్థాపయిత్వోటజే విశ
అగ్నావదృశ్యరూపేణ వర్షం తిష్ఠ మమాజ్ఞయా
రావణస్య వధాంతే మాం పూర్వవత్ ప్రాప్స్యసే శుభే"[1]

## శ్రీమద్భాగవతము

శ్రీమద్భాగవతము, నవమస్కంధమున మిక్కిలి సంగ్రహముగ రామాయణకథ వర్ణితము ఉత్తరరామాయణ కథ కూడ నిందు వివరింపబడినది సప్తమస్కంధమున, మార్కండేయుని మూలమున రామకథను విపులముగ వినగలవని నారదుడు ధర్మరాజునితో పలికి నాడు ధర్మరాజునకు మార్కండేయుడు వివరించిన రామవృత్తాంతము మహాభారతము, అరణ్యపర్వములో నున్నది

## విష్ణుధర్మోత్తరపురాణము

రావణుడు దిగ్విజయయాత్ర చేయుచు బలిని జయించుటకై పాతాళమున కేగినాడు ఈ పాతాళయాత్ర వాల్మీకి రామాయణము, ఉత్తరకాండమున ప్రక్షిప్తములని చెప్పిన సర్గలలో నున్నది[2] బలిని రావణుడు యుద్ధమున కాహ్వానించినాడు. బలి యచటనున్న ఒక కర్ణకుండలమును జూపి, దానినెత్తవలసినదిగా రావణుని కోరగా, అతడది యెత్తలేక భంగపడి, బలితో సంధిచేసికొనినాడు ఆ కుండలము తన ప్రపితామహుడగు హిరణ్యకశిపునిదని బలి తెలిపి

---

1 అధ్యాత్మరామాయణము, అరణ్యకాండ, 7వ సర్గ
శ్లోకములు - 1 నుండి 8 పుట - 246

2 వాల్మీకి రామాయణము, ఉత్తరకాండము, పుటలు 868 నుండి 970

నాడు రావణుఁడాశ్చర్యపడి, తాను నగరప్రవేశము చేయుసమయ మున ద్వారముకడ కన్పించిన మహాపురుషుఁడెవ్వఁడని ప్రశ్నింప, ఆయన త్రిలోకరక్షకుఁడైన శ్రీమన్నారాయణుఁడని బలి సమాధాన మిచ్చినాఁడు

పాతాళమునుండి బయలుదేరిన రావణుఁడు సాగరద్వీపపు పశ్చిమభాగమున తేజస్సంపన్నుఁడు, దివ్యస్వరూపుఁడు నైనయొక మహాపురుషునిఁ జూచినాఁడు ఆమహాపురుషుని సమీపమున దివ్యాంబరధారిణియైన స్త్రీ ఆయనకు పాదసంవాహనము చేయుచు కన్పట్టి నది రావణుఁడామె నపహరింప యత్నించి అశక్తుఁడై అదృశ్య శక్తిచే దూరమునకు విసరివేయఁబడినాఁడు అతని యవస్థఁజూచి దివ్యపురుషుఁడు 'నేను నారాయణుఁడను. నీకిప్పుడు మరణము లేదు నీ వే స్త్రీ నపహరింపఁజూచితివో ఆమెయే మానవకాంతగా జన్మిం చును అప్పుడును ఆమె నపహరింతువు ఈమెకై నేను మానవదేహ ధారినై అవతరించి, నిన్ను సంహరింపగలను' అని పలికినాఁడు నారా యణుని యీవాక్యములను విని రావణుఁడు,

"నాస్తిధన్యతరో లోకే మయా లోకత్రయే వినా
త్వద్ధస్తాత్ మరణం యస్య భవిష్యతి జగత్ప్రభో"
"యశస్యం శ్లాఘనీయం చ త్వద్ధస్తాన్ మరణం మమ"[1]

'నీచేతిలో మరణించుటకంటె కోరఁదగినది లేదు అందువలన త్రిజగములందును నేనుతప్ప అదృష్టవంతులు మఱిలేరు నీవలన పొందు మరణము నాకు శ్లాఘనీయమై కీర్తిప్రదమగును' అని తన సంతోషమును వ్యక్తమొనర్చినాఁడు అటుపై శ్రీమన్నారాయణుఁడు

---

1 విష్ణుధర్మోత్తరపురాణము, ప్రథమఖండము
239వ అధ్యాయము, శ్లోకములు – 36, 37
పత్రాంకము – 151 పుట – 302

రావణునకు తనవిశ్వరూపమును ప్రదర్శించినాఁడు 1 రావణుఁడు తన యదృష్టము నభినందించుకొని, నారాయణుని యనుమతితో గృహోన్ముఖుఁడైనాఁడు

## రంగనాథరామాయణము

రంగనాథ రామాయణము తొలితెలుఁగు రామాయణమన వచ్చును దీనికిపూర్వము తెలుఁగు రామాయణములున్న వేమో తెలియదు కాని లభ్యమైనవానిలో నిదియే ప్రథమము దేశీయఛందస్సులో నుండుటచే సామాన్యప్రజలలోకూడ ప్రచారమును పొందినది ఇందలి అవాల్మీకీయములు జనవ్యవహారమున ప్రామాణికములై గ్రహింపఁబడినవి

అహల్య శీ గామారినీ థ ఆంధ్రరామాయణములలో మొదట రంగనాథరామా యణమునసే కన్పట్టును. ఇందలి యవాల్మీకములలో సులోచన వృత్తాంతము ప్రధానము 2 ఉడుత సహాయమువంటి ఆంధ్ర దేశములో ప్రచారములో నున్న చిన్నచిన్నకథలు రంగనాథ రామాయణమున వర్ణితములు మఱియొక కల్పన హనుమంతుఁడు సంజీవకరణి తెచ్చునపుడు క్రమక్రమైన కాలనేమి వృత్తాంతము3

---

1 "అథాన్యగాత్రే సంపశ్యత్ రావణో భీమ విక్రమః"
"త్రైలోక్యం సకలం రాజన్ విశ్వరూప ధరస్యతు
దృష్ట్వై తత్ రావణో రాజన్ విస్మయోత్ఫుల్ల లోచనః"
"బహుమేనే తదాత్మానం నిర్జగామ తదైవచ
దేవదేవాభ్యనుజ్ఞాతః సజగామ తదాగృహమ్"
విష్ణుధర్మోత్తరపురాణము, ప్రథమఖండము, 239వ అధ్యాయము
శ్లోకములు - 37, 38, 39 వ్యాఖ్యానకము - 151 పుట - 303

2 రంగనాథరామాయణము పుటలు - 451 నుండి 467

3 ,, పుటలు - 487 నుండి 493

కుంభకర్ణునకు శ్రీరాముడు నారాయణుఁడను నిశ్చయజ్ఞానము క-
ల్గినను, అందువలననే సీతను తిరిగి అప్పగించవలసినదని రావణుని
హితము చెప్పినట్లును ఇందు స్పష్టముగ వర్ణితము 1

రామ రావణ యుద్ధమున రావణునితో మూఁడవమా
యుద్ధము చేసి అలసిపోయిన శ్రీరామునకు రావణుని నాభిదేశమంద
అమృతభాండమునుగూర్చి విభీషణుఁడు తెల్పుట మఱియొక క-
నము రాముఁడు పలుమాఱులు రావణుని శిరములను ఖండించెనఁ
అపుడు విభీషణుఁడు శ్రీరామునకు రావణుని ప్రాణరహస్యమ
నెఱిఁగించినాఁడు

"వనజాత జాతుని వరమునఁ జేసి యినకులాధీశ్వర యీతనినాభి
నమృతమున్నది కుండలాకృతిఁగలిగి యమృతత్వమూలమైయుది
చంపనీఁ
దానవుతలలు నుద్దండబాహువులు మానక నీ వెన్నిమాఱు లేసినను
మొలతెంచుచుండును నుమ్మాలమల్లావు తలఁకఁడు దీననద్దనుజవల్లభుఁడ

.. ... ... ...

కనలెడి దీర్ఘనిర్ఘాతముల్గురియు ఘనలాస్త్రమరివోసి యలవొప్ప నేసి
యీరావణుని నాభియందున్న యమృతమారూఢ శరవహ్ని
శాంతిచేసి2

శ్రీరాముడు రావణుని వధించినాఁడు ఈవిధమైన కల్ప-
నం సంస్కృతపురాణములం దెచటను కానరాదు కాని పద్మపురా-
మున నమృతభాండ ప్రసక్తి లేకయే 'శరీరముసందలి యొకభాగమున
విభీషణుడు చూపినాఁడని మాత్రము వర్ణితము పద్మపురాణము

---

1. రంగనాథరామాయణము, పుటలు - 281, 389
2 ,, పుట - 526

సంగతి యీ వాక్యము పైకల్పనమున కాధారమైయుండవచ్చును రావణసంహారమున వాల్మీకమునకు భిన్నమైన మరియొక విషయము. బ్రహ్మాస్త్రమునకు ముందు రాముడు నూటొక్కమారులు రావణుని శిరములు ఖండించినట్లు వాల్మీకము బ్రహ్మాస్త్రప్రయోగమునకు పిమ్మట యుద్ధప్రసక్తి లేదు రంగనాథరామాయణమున నమృతభాండమును కొట్టుటకుముందు కొన్నిపర్యాయములు శిరస్సుల ఖండించినట్లున్నది కాని అమృతభాండమును శరవహ్నికి నాహుతిచేసిన తరువాత నూటతొమ్మిది మారులు రావణుని తలలు, బాహువులు ఖండింపవలసిన అవసరమేమో తెలియకున్నది అపై బ్రహ్మాస్త్రప్రయోగావశ్యకత అంతకన్న లేదు 1

## భాస్కరరామాయణము

భాస్కరరామాయణ కర్తలు చాలవఱకు వాల్మీకమునను సరించినను, యుద్ధకాండమున రంగనాథరామాయణము ననుసరించినారు కాలనేమివృత్తాంతము,2 అమృతభాండకథ3 మున్నగు విషయములు రంగనాథరామాయణము ననుసరించినవి సులోచన వృత్తాంత మిందులేదు ఇంగలి కుంభకర్ణుని ఉపదేశముకూడ వాల్మీకమునకన్న రంగనాథ రామాయణమునే పోలియున్నది

---

1 రంగనాథ రామాయణము పుటలు – 526, 527

2. భాస్కరరామాయణము, యుద్ధకాండము, పుటలు – 518 558

3 "ప్రముదితమానసుండయిన బ్రహ్మవరంబున పీనినాభియం దమృతము కుండలాకృతి మహత్త్వమునం దగనుంటజేసి మూర్ధములను జేకులం దెగియు దక్షణమాత్రన పుట్టుచున్న వీ క్రమమున జావులేకునికి కారణమిట్లెఱుఁగంగఁ జెప్పితిన్"

భాస్కరరామాయణము, యుద్ధకాండము పుట – 612

## శ్రీమద్రామాయణ కల్పవృక్షము

విశ్వనాథవారి శ్రీమద్రామాయణ కల్పవృక్షము, యుద్ధకాండ మందు రావణునకు పూర్వవాసన యున్నట్లు స్పష్టముగ గోచరిం చును. కుంభకర్ణుడును రామునియందు భక్తిభావము కలవాడిగనే కన్పట్టును కావ్యధర్మమున కనుకూలముగ రావణుని స్వప్నమువంటి కల్పనలున్నను, మూలకథ రామాయణానుసారియే

## పౌలస్త్యహృదయము

ఖండకావ్యములలో కాటూరివారి 'పౌలస్త్యహృదయము' రావణుని భక్తిభావము నావిష్కరించును. ఆధునిక విమర్శకులలో కొత్త రామకోటయ్యగారు హిరణ్యకశిపుని పూర్వజన్మ సంస్కారము ను వర్ణింపఁగా, రావణుని సంస్కారము కాటూరివారికి కావ్య వస్తువైనది చెఱుకుపల్లి జమదగ్నిశర్మగారు శిశుపాలుని భక్తిభావ మును కావ్యవస్తువుగ గ్రహించినారు జయవిజయుల యీ జన్మ త్రయము మాత్రమే నేటికిని సంస్కారవంతమైన వైరభక్తికి క్రమ ణముగ నిలచినది

కాటూరివారు రావణశబ్దముతో వ్యవహరింపక, సంస్కారము సూచితముగునట్లు 'పౌలస్త్యహృదయము'ని గ్రంథనామము నుంచినారు శ్రీరాముడు సముద్రతీరముచేరి దర్భాసనముపై నుండ, సాగరుడు శ్రీమన్నారాయణుడు దాశరథియై యేతెంచినాడని రావణునకు తెలిపినాడు. తనయదృష్టమును తలఁచుకొని పౌలస్త్యుడానందకరవశుఁ డై ఆ సందర్భమీ ఖండకావ్యము రామునకై తనచిరకాల నిరీక్షణము ఫలించెనను సంతోషము తో పాటు, జానకిని హరించి తెచ్చిన శాధ యునిందు రావణునిలో వ్యక్తము జానకీహరణము గావించుచో

శ్రీరాముఁడు తనకడకు రాఁడేమో యను శంకయు క్రమే తనచేసినట్టి దుష్కృత్యము చేయించినదని ఆతని వ్యథ కార్యమునింతవఱకు నుపేక్షించిన రాముని పైననే అపరాధము పర్యవసన్నమైనది రావణుఁడే శ్రీరాముని యన్వేషించుచు నేలపోరాఁడను శంకకుకూడ పూర్వజన్మ సంస్కారమున వచ్చిన వైరభక్తినే సమాధానముగ చెప్పిన మహావీరునిగ రావణుఁడీకావ్యమున నిరూపింపఁబడినాఁడు

"రావణుఁడన్నఁగాళ్ళఁబడు రాయియు అవ్వయుఁగాదు జాలిపై గావఁగ నాతి కోతియును గాకియు గ్రద్దయుఁగాదు లోక వి ద్రావణుఁడుగ్రవీరచరిత క్రథితుండతిమానియౌ దశ గ్రీవుఁడు పోరిలోఁబొడిచి గెల్చును జచ్చునుగాక వేఁడునే"[1]

లోకసహజమైన స్వోత్కర్షయు, ప్రభువుపంచలి యనురాగమును ప్రకటించుచునే రామభక్తాగ్రేసరులను కూడ స్మరించి భక్తి స్మరణమును వైష్ణవ సంప్రదాయము నిందు రావణుఁడనుసరించినాఁడు ఈ పద్యమున వరుసగ సహల్య, శబరి, సుగ్రీవుఁడు, కాకాసురుఁడు, జటాయువు సూచింపఁబడినారు

## వైరభక్తి

జమదగ్ని శర్మగారు రచించిన యీకావ్యము ప్రధానముగ శిశుపాలుని సంస్కారమును సూచించును ఆ సంస్కారమునకు పూర్వరంగముగ పూర్వజన్మద్వయమునుపోద్ఘాత రూపమున శర్మగారు వర్ణించినారు ఇందలి ప్రథమాశ్వాసమున మాత్రమే శిశుపాలప్రశంస యున్నది చతుస్సనులవలన శప్తులై తాఁమసయోనియందు జన్మించి, భగవదనుగ్రహమువలన భక్తిని విస్మరింపనివారై, జన్మత్రయమున జయవిజ

1 శిశుపాలహృదయము, కాటూరి వేంకటేశ్వరరావుగారు పుట-7

యులు పొందిన యీ రాత్రి యీ కావ్యమున వర్ణితము కాని పార్వతీ దులలో నొకరిజన్మమే కవికి ఉపాదేయవస్తువైనది హిరణ్యకశిపుడు ప్రహ్లాదునితో చేసిన సంవాదమీ రాత్రిలోని భాగముగ కవి మనోహారముగ వర్ణించినాడు 1

శిశుపాలుని వృత్తాంతము మాత్రమే కావ్యవస్తువుగ గ్రహించినను, హిరణ్యాక్ష కుంభకర్ణుల వృత్తాంతము కూడ పేరు సూచించినారు 2

రావణునకు పుట్టినది మజలీ జన్మమెవ్వరు వదలునా యను నాతురతయే నిరంతరము పీడించుచుండెనట కాని శివునివరము దుర్లంఘ్యమై ఆయుశ్శ్రీమమును దీర్ఘీకరించినది అట్టి దీర్ఘాయువును భరింపలేక, హరిమెంతకు కరుణింపకపోవుటచే, రావణునకు సీతనపహరింపక తప్పలేదు.

"శివవర క్తిన్ బ్రతకటింది చావలేను వాసింగాంది యవ్విష్ణు నె య్యవిజుచ్చక నుతివానిన్నిటిని మాయుంజేసెదక రాక యే మవునంచునె దెగజాలి యప్పటికి రాడామెన్ గదా యంచు దక్షే-వియున్ గాదు వరింతు బేయుసి నికళ్ళేంచచ్చుచంచెంచె శివ"3

రావణుడు నాశనమైనను వైరముపోక శిశుపాలుడయ్యె ననుటకిది యుపోద్ఘాతము

ఈవిధముగ ప్రాచీన, అర్వాచీన రామకథాకావ్యము లందు రావణుని జన్మాంతరస్మరణము నిగదితము రామకథలయందే కాక

1 పైరశక్తి, చెఱుకుపల్లి జమదగ్ని శర్మగారు, పద్యములు-17, 18 పుట-4
2 పైరశక్తి, జమదగ్ని శర్మగారు, పద్యములు-20, 23 పుటలు-4, 5
3 " " పద్యము-24 పుట-5

మాఘమహాకవియు రావణుఁడు శ్రీరాముని నారాయణునిగా నెఱిఁగియే సీతాపహరణము గావించెనని వర్ణించినాఁడు

"అమానవం జాతమజం కులే మనోః
ప్రభావినం భావినమంతమాత్మనః
ముమోచ జానన్నపి జానకీం న యః
సదాభిమానైక ధనాహి మానినః"1

రాముఁడు మానవమాత్రుఁడు కాఁడనియు, అచ్యుతుఁడనియు, మనువంశమున తనను సంహరించుటకే జన్మించినవాఁడనియు నెఱిఁగియు రావణుఁడు జానకిని విడువలేదు అభిమానధనుల కాత్మగౌరవము ప్రాణముకన్న మిన్నకదా!

---

1 మాఘకావ్యము, ప్రథమసర్గ, శ్లోకము - 67 పుట - 25

## కుంభకర్ణుని సంస్కారము

విష్ణుపార్షదుల (మూడుజన్మములలో నొకనికి ప్రధానముగ నున్న వైరము ద్వితీయునియందు తీవ్రతతగ్గి, గౌణమైనట్లు భాసించును హిరణ్యాక్షునకు హిరణ్యకశిపునకున్నంత తీవ్రవైరము కన్పట్టదు. వరుణుని యుద్దేశమునుండి హిరణ్యాక్ష పలాయనమున్న స్వల్ప ఘట్టమే వారివైరమునకు నిదర్శనము. అట్లే కుంభకర్ణునియందును రావణునియందున్నంత తీవ్రవైరము కన్పట్టదు. రావణునితో విరోధించినాడను కారణముగనే కుంభకర్ణుడు శ్రీరామునితో యుద్ధమునకు సన్నద్ధుడైనాడు. సీతను రావణుడు కొనితెచ్చిననాటికి కుంభకర్ణుడు నిద్రాసక్తుడై యుండెను. మంత్రాలోచనము నాటికి మేల్కొనియుండి, తిరిగి యుద్ధారంభమునకు నిద్రాగతుడైనాడు. ఈవిధముగ రామ రావణయుద్ధమునందు కుంభకర్ణునకు దీర్ఘకాలాను బంధము లేదు.

కుంభకర్ణుని పరాక్రమమసామాన్యము. అతడు నిద్రింపని సమయమున యుద్ధము సంభవించినచో మరియొక రాక్షసవీరునకు యుద్ధమునకు వెళ్ళవలసిన అవసరముండెడిది కాదు. కుంభకర్ణుని పుట్టుకను చూడగనే బ్రహ్మదేవునకుకూడ భయముకలిగినదట 1 అందువలననే మృతునితో సమానముగ నిద్రావశుడవై యుందువని బ్రహ్మ కుంభకర్ణుని శపించినాడు 2

---

1 "కుంభకర్ణం సమీక్ష్యైవ వితత్రాస ప్రజాపతిః"
వాల్మీకిరామాయణము, యుద్ధకాండము, 61వ సర్గ
శ్లోకము - 28 పుట - 779

2 ఉత్తరకాండములోని శాపవృత్తాంతమునకు, ఈశాపమునకు భేదముకన్పట్టును. నిద్రసరస్వతి మాయయని ఉత్తరకాండము

కుంభకర్ణుఁడు పుట్టఁగనే ప్రజల నవిశ్రాంతముగ భక్షింపసాగి నాఁడు అందువలన నచిరకాలములోనే లోకములు నాశనమగునని భయపడిన యింద్రుఁడు బ్రహ్మతో మొరపెట్టుకొనినాఁడు బ్రహ్మ కుంభకర్ణుని తనయొద్దకు పిలిపించి, లోకవినాశనమునకే విశ్రవసుఁ డాతనికి జన్మనిచ్చెనను చు పై విధముగ శపించినాఁడు 1 పిమ్మట రావణుని ప్రార్థనపై నారునెలలకొక్కదినముమాత్రము మెలకువతో నుండుననియు, ఆదినమున నిద్రాకాలమునకు సరిపడునాహారము కుంభకర్ణుఁడు స్వీకరించుననియు బ్రహ్మ యనుగ్రహించినాఁడు

వానరసేనలతో శ్రీరాముఁడు సముద్రము దాటివచ్చినాఁ డనువార్త తెలిసి రావణుఁడు మంత్రులను సభా వేశకఱచి మంత్రాలోచనము చేసినాఁడు. అపుడు కుంభకర్ణుఁడన్నకు చెప్పిన హితమునం దౌచిత్యమున్నను శ్రీరాముఁడు నారాయణుఁడను నిశ్చయముకాని, అతఁడు రాక్షసకులమును నశింపఁజేయునను భావిజ్ఞానముకాని కనపట్టదు

"న్యాయేన రాజకార్యాణి యః కరోతి దశానన
న స సంతప్యతే పశ్చాత్ నిశ్చితార్థమతిః నృపః"
'అనుపాయేన కార్యాణి విపరీతాని యానిచ
క్రియమాణాని దుష్యంతి హవీంష్యప్రయతేష్వివ"
"యః పశ్చాత్ పూర్వకార్యాణి కురుతే బుద్ధిమోహితః
పూర్వంచోత్తరకార్యాణి న స వేద, నయానయౌ"
"చపలస్యతు కృత్యేషు ప్రసమీక్ష్యాధికం బలమ్
ఛిద్రమన్యే ప్రపద్యంతే క్రౌంచస్య ఖమివద్విజాః"

---

1 "ధ్రువం లోకవినాశాయ పౌలస్త్యేనాసి నిర్మితః
తస్మాత్ త్వమద్యప్రభృతి మృతకల్పః శయిష్యసే"
యుద్ధకాండము, 61వ సర్గ, శ్లోకము - 24 పుట - 779

"త్వయేదం మహదారబ్ధం కార్యమప్రతిచింతితమ్
దిష్ట్యా త్వం నావధీద్రామో విషమిశ్రమివామిషమ్"
"తస్మాత్త్వయా సమారబ్ధం కర్మహ్యప్రతిమం పరైః
అహం సమీకరిష్యామి హత్వా శత్రుం తవానఘ"[1]

'ఏపనినైనను చక్కగా నాలోచించి చేయవలెను ఒకకార్యమును ముందువెనుకలుగ చేయుట రాజధర్మముకాదు నీవు న్యాయముగ ప్రవర్తింపకపోవుటవలననే నీకు మంత్రులను సంప్రదించు నవసరము కలిగినది ఏమైనను రాజైనవాడొకనిశ్చయముచేసిన తిరువాత దానికి పశ్చాత్తాపపడరాదు ఉపాయములేక ప్రారంభించినపనులు అస్థానపతితమైన హవిస్సువలె దుష్ఫలితముల నిచ్చును కరణీయములందు చపలుడై తనబాహుబలమును నమ్మి ప్రవర్తించినచో వాని యందలి దోషము కనిపెట్టి విరోధులు సులువుగా భేదింతురు ఇపుడు నీవుచేసినది అప్రతిచింతితమైన కార్యము అదృష్టవశమున రాముడు నిన్నింతవఱకు సంహరింపలేదు అందువలన నేను ప్రతీకారము చేయుటకు ప్రయత్నింతును రాముడు నన్నెట్లును ఒక్కబాణముతో చంపలేడు. రెండవబాణము ప్రయోగించునంతలో నేను రాముని చంపగలను

అను కుంభకర్ణుని పలుకులలో నాతని రాజనీతిజ్ఞత, హితవాక్కు, పరాక్రమము ప్రస్ఫుటములు ఇట నాంధ్రవాల్మీకి పలుకులును స్మరణీయములు

"పరులకుఁజాలదుష్కరమైన కార్యంబు
నాత్రికొంటిని ఘటించుటకును
సీతోడబుట్టుట సీతోడ నిల్వక
నాకుఁదప్పునె దైత్యనాథయిపుడు

1 యుద్ధకాండము, 12వ సర్గ, శ్లోకములు – 30 నుండి 35 పుట – 633

జరుగంగఁదగు కార్యసరణి వచించెద
నీవగతురనేనుసిల్లజేసి
కార్యంబు సరిపడఁగావింతు శత్రుకాన
లార్కుమరుచ్ఛీకులడ్డఁకడిన

గేల బరిఘమూని లీలమైద్రిప్పుచు
గఱకుగోటిడాలు కదలగప్పఁ
గొండబోలు మేన గండున గర్జింపఁ
గొండ వగతుఁడైన బెండువడఁడె"1

అను కుంభకర్ణుని పలుకులు వీరరస సముచితములు "సీతోడఁ బుట్టుట సీతోడ నిల్వక నాకుఁదప్పున" అనుట, చేయఁబోవునది యధర్మకార్యమైనను భ్రాతృధర్మమునకు కట్టుబడుటను సూచించును

"రెండవ శరమున రాముఁడు
ఖండించెడునంతలోఁ దగగనాసత్రు
ద్దండత నేఁద్రావెదఁజుమీ
ఖండితసురజాల సుఖము గాంచుము మీదన్"2

రాముని మొదటిబాణమునకే నేనుఁజావను కావున రెండవ బాణము వైచి నన్నుఖండించులోపలనే పైబడి యారాముని నెత్తురు నేను త్రావెదను ఆవలనీవు సుఖపడుము

"తగగనీ + ఆ నెత్తురని యొక్క పదచ్ఛేదము - తగగ + నానెత్తురని యొక్క పదచ్ఛేదము రెండవయర్థమున నానెత్తురు నేనే త్రావెదను, ఆవల నీవు సుఖపడుము"3

---

1 మందరము, యుద్ధకాండము, 12వ సర్గ, పద్యము - 246 పుట - 105
2, ,, ,, పద్యము - 247 పుట - 105
3 ,, ,, పుటలు - 105, 106

"భీమాహవరంగంబున
యామపురికేగ మృత్యుసంగతి నల శ్రీ
రాముఁడు పదపడి సీతా
భామా రత్నంబుఁ బొందు బాధముదమునన్"[1]

"ఆ శ్రీరాముడు భయంకరయుద్ధమందు జచ్చి యమపురికిఁ బోగా నావల సీతాభామారత్నముతో నీవు సంతోషింపుము రెండవ యర్థము - కర్తృపదము 'నేను' అనునది అధ్యాహారము నేను భయంకరయుద్ధభూమియందు జచ్చి యమపురమునకుఁ బోఁగా ఆవల శ్రీరాముఁడు సంతోషముతో సీతాభామారత్నమును బొందును నన్ను జంపినవాఁడు నన్ను జంపక విడుచునా? కావున నీవు చచ్చిన వాఁడవే లేదా నీవు యుద్ధమున జచ్చిన పదపడి యని చెప్పినను చెప్పవచ్చును లేక మనము పదము కర్తగాను గ్రహింపవచ్చును"2

ఇత్యాదిగనున్న కుంభకర్ణుని పలుకులాతని సంస్కారమును నిగదితమొనర్చును

యుద్ధమునకు బయలుదేరి పోవునపుడుకూడ కుంభకర్ణుఁడిట్టి యుపదేశమునే రావణునకు చేసినాఁడు[3] రాక్షసవీరులందఱును యుద్ధమున మడియుచుండుట గాంచి, రావణుఁడు కుంభకర్ణుని యర్ధ నిద్రలో లేపి, లంకానగరమును రక్షింపుమని కోరినాఁడు అందులకు కుంభకర్ణుడు మంత్రాలోచన సమయమున నెట్టికీడు మూడునని తామెల్లరు హెచ్చరించిరో అట్టికీడే వాటిల్లినదనుచు,

---

1 మందరము, యుద్ధకాండము, 12వ సర్గ, పద్యము - 249 పుట - 106
2 ,, ,, 249వ పద్యతాత్పర్యము, పుట-106
3 వాల్మీకిరామాయణము, యుద్ధకాండము, 63వ సర్గ, శ్లోకములు - 13 నుండి 19 పుట 782

"దురితములు సేయువారలు
నిరయంబున గూలునట్లు నీచేసిన యా
దురితము తత్ఫలమున్నను
విరియక చేసేత ననుభవింపగఁజేసెక్ "1

అని రావణుని మందలించినాఁడు

"మునునీ నుజాఁడు చెప్పిన
పనిఁజేయుమ యదియునీకు బరమహితంబౌ
దనుజాధిప నామతియిది
విను మాపల జేయుమిగా యభీష్టముపగిదిన్ "2

పరదారాపహరణము : భీషణుని వలె తనకును సమ్మతము కాదని కుంభకర్ణుఁడు నిష్కర్షగ తెలిపినాఁడు

"చాలు రాక్షసరాజ .. " 1484
"చూఁడుమున్నిదే సమరశూరుని .. " 14 5
"నామహితంపు ముష్టికతనంబు , " 1441

ఇత్యాది పద్యము లర్థద్వయ యుక్తములై కుంభకర్ణుని జ్ఞానమునకు నిదర్శనములుగ నున్నవి 'శత్రునాశనంబు' - 'శత్రువగు రాముని వలన నాశము నేను జేయించుకొని' అను కుంభకర్ణుని పలుకులు 'మచ్ఛూలభిన్నగ్రీవస్య'- 'నాశూలమునకగోచరమైన నాకంఠమును నేనే ఉత్తరించుకొని' అను హిరణ్యాక్షిపుని పలుకులను స్ఫురింపఁజేయును.

అధ్యాత్మరామాయణమున కుంభకర్ణుఁడు రావణునకు చేసిన ఉపదేశములో శ్రీరాముఁడే నారాయణుఁడను నిశ్చయజ్ఞానమున్నది.

---

4 మందరము, యుద్ధకాండము, 68వ సర్గ, పద్యము 1412 పుట - 672
1 మందరము, యుద్ధకాండము, 68వ సర్గ, పద్యము - 1426 పుట - 678

"కుంభకర్ణస్తదా ప్రాహ రావణం రాక్షసేశ్వరమ్
ఆరబ్ధం యత్ త్వయా కర్మ స్వాత్మనాశాయ కేవలమ్"
న దృష్టోసి[1] తదాభాగ్యాత్ త్వం రామేణ మహాత్మనః
యది పశ్యతి రామస్త్వం జీవన్నాయాసి రావణ"

"రామో సమానుషో దేవః సాక్షాన్నారాయణోవ్యయః
సీతాభగవతీ లక్ష్మీ రామపత్నీ యశస్వినీ
రాక్షసానాం వినాశాయ త్వయానీతా సుమధ్యమా"[2]

శ్రీమద్రామాయణ తత్త్వకథనమున వారణాసి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు కుంభకర్ణుని ధర్మతత్పరత్వమును చక్కగా నిరూపించినారు వారియభిప్రాయమిది

రావణుఁడు కుంభకర్ణుని నిద్రలేపి, రాక్షసకులమునకు వచ్చిన ఆపదను వర్ణించి "త్రాయస్వేహామహాబల" అని ప్రార్థింపఁగా కుంభకర్ణుఁడిట్లనినాఁడు

"దృష్టో దోషో హి యోస్మాభిః పురామంత్ర వినిర్ణయే
హితేష్వనభియుక్తేన సోయమాసాదితస్త్వయా"

వెనుక సమాలోచనము చేసినపుడు ఇట్టిముప్పు వచ్చునని మేమనుకొని చెప్పినాము హితోక్తులను వినిపించుకొనని నీకు అది ప్రాప్తమైనది

"శీఘ్రం ఖల్వభ్యుపేతం త్వాం ఫలం పాపస్య కర్మణః"

---

1 ఈవాక్యము శ్రీమద్రామాయణమునందలి "దిష్ట్యా త్వం నావధీద్రామో" అను శ్లోకభావమును పోలియున్నది

2 అధ్యాత్మరామాయణము, యుద్ధకాండము 2వ సర్గ
శ్లోకములు - 13 నుండి 16 పుట - 480

సీతాపహరణరూపమగు పాపకర్మముయొక్క ఫలము ఎప్పుడో కాక శీఘ్రముగనే నీ కందుకొనినది. రాబోవు అనర్థమును విచారింపక కేవల వీర్యదర్పముచేత నీవాపని చేసినావు

> "యదుక్తమిహతే పూర్వం ప్రియయా మేనుజేనచ
> తదేవనోహితం వాక్యం యథేచ్ఛసి తథాకురు"

నీకు కానుక నీపత్ని మండోదరి, నాతమ్ముఁడు విభీషణుఁడు చెప్పినదే మనకు హితము ఆపై నీయిష్టము ఇట్టిమాటలు రావణుఁడు విని క్రుద్ధుఁడై నీవిప్పుడు చేయవలసినది చేయక నాకు బోధింతువేమి? .. అని పలికిన రావణునితో కుంభకర్ణుఁడు ధైర్యముచెప్పుచు 'అవశ్యం హి హితం వాచ్యం సర్వావస్థాం గతం మయా' .. అని చెప్పి, కుంభకర్ణుఁడు యుద్ధములో ప్రవేశించి మహాయుద్ధముచేసి అందినవానరులను భక్షించి చాలమందిని వధించి తుదకు రామబాణ ప్రహారములచే హతుఁడయ్యెను."1

రంగనాథరామాయణమునను ఈయుపదేశము చాలవఱకిట్లే యున్నను, రావణుని కాలావధి పూర్తికావచ్చినట్లుకూడ కుంభకర్ణుఁడు స్పష్టముగ పేర్కొనినాఁడు. శ్రీరాముఁడే నారాయణుఁడను నిశ్చయ జ్ఞానమాతనికి ఉన్నది

> "పరధన పరసతీ పరచిత్తుఁడవ్వఁ
> దరయునాతఁడు కులంబంతయు జెఱచు"2

అను కుంభకర్ణుని పలుకులకు రావణుఁడు క్రోధపరవశుఁడై, వృథాజల్పములు మాని కార్యము సాధింపుమనినాఁడు. అంతలకు

---

1 శ్రీమద్రామాయణ తత్త్వకథనము, శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు పుటలు – 284, 285

2 రంగనాథ రామాయణము, యుద్ధకాండము, పుట – 888

కుంభకర్ణుఁడొకనాఁడు తాను దేవర్షివలన నెఱిఁగిన విషయమును రావణునకు వివరించినాఁడు రావణుని బాధలు పడలేని దేవతలు బ్రహ్మకు మొఱపెట్టుకొనఁగా, ఆయన

"వరమిచ్చినాఁడ నేవానికిమున్ను
సురగరుడోరగాసుర యక్షవరుల
చేనైన జావమి సిద్ధంబుగాఁగ
దీనికిమాఱు చింతించితివినఁడు
దడవఁడుమనుజుల దైత్యుండుగాన
దడవనేనును వరదానకాలమున
గాన రావణుని సంగరభూమియందు
మానవులో ద్రురు మనుజలోకమున
జనియింపఁ బ్రార్థింప జనునాది విష్ణు
వనజనాభుని లోకవంద్యు ముకుందు
ననవుఁడు సురమునులట్ల భావింప
ననఘుండు హరి మర్త్యుఁడై పుట్టె బుడమి
నని చెప్పి నారదుండరిగె దైతేశ
దినకరకులుఁడాది దేవుండుగాని
మనుజుండుగాఁడు రామక్షితీశ్వరుఁడు
జనకనందననిచ్చి శరణము వేగ
వనచరులెల్ల దేవతలుగాతలపు
దనుజేశ నామాట తథ్యంబు నమ్ము"[1]

అని కుంభకర్ణుఁడు శ్రీరాముఁడు శ్రీమన్నారాయణుఁడే యనియు, సీతాదేవి నాయనకిచ్చి శరణుకోరుమనియు రావణునకుప దేశించినాఁడు

---

1 రంగనాథ రామాయణము, యుద్ధకాండము, పుట - ౩౩౨

భాస్కర రామాయణమునందును కుంభకర్ణునకు రాముడు శ్రీమన్నారాయణుడను నిశ్చయజ్ఞానమున్నట్లు వర్ణితము

"ఆదిమధ్యాంతరహితుండైనట్టి విష్ణు
డసురకుల వధార్థంబిట్టులవతరించె
రవికులాంబుధి సోముడై రామచంద్రుఁ
డురుబలుఁడు గాని సామాన్యనరుఁడుగాఁగు"1

భాస్కరరామాయణము రంగనాథరామాయణము నందలి భావము యథాతథముగ గ్రహించుటయే కాక వతికొంత విస్తారముగ కుంభకర్ణుని వితర్కము, సమయజ్ఞతలను నిరూపించినది ఈసందర్భమున శ్రీమద్రామాయణము, యుద్ధకాండమందలి యుపదేశముతో రంగనాథరామాయణ ఘట్టమునకు సమన్వయము భాస్కరరామాయణమున కూర్పఁబడినది

| | |
|---|---|
| "విూది కార్యమేను విూమంత్రసమయంబు " | 886 |
| "కామక్రోధ మదాతిరేకమున..." | 887 |
| "మొదలవలయు విధము పిదపగావించుట..." | 888 |

ఇత్యాదిగ కుంభకర్ణుఁడు రావణునకు హితముచెప్పి, నారద మహర్షివలన తాను వినిన వృత్తాంతమును అన్నకు వివరించినాఁడు రావణ వధోపాయము చింతింపుఁడని దేవతలు ప్రార్థింపఁగా పితామహుఁడు,

"మదీయవరంబున వాఁడు సురాసురుల కజయ్యుండు నరవానరులచేతం బచ్చునది కారణంబుగా విష్ణుండు దశరథునకు బుత్రచతుష్టయంబుగా జనించు నిలింపులు తరుచరులై జనియించి యాతనికి దోడ్పడుండనుచు సంతర్హితుండయ్యె" అనిచెప్పి, కుంభకర్ణుఁడు

1. భాస్కరరామాయణము, యుద్ధకాండము, పుట - 332

"రామచంద్రుండు నారాయణుండు బలిముఖులు బర్హిర్ముఖులిది నిక్కువంబు నన్ననుగ్రహించి విగ్రహంబు విడిచి సీతనిచ్చివుచ్చి రాక్షస కులంబును లంకను రక్షింపుము మనకోలుచు బ్రహ్మకు నుపాస్యుం డగు సద్దేవదేవునకు నమస్కరించి నేమికోఁజంత"[1] అని అన్నకు విన్నవించినాఁడు ఈపలుకులు కుంభకర్ణుని సంస్కారమునకు, జ్ఞానిత్వ మునకు నిదర్శనములు

రావణుఁడీ యుపదేశమును లక్ష్యపెట్టలేదు రావణుని తోడ బుట్టిన కర్మమునకు కుంభకర్ణుఁడు శ్రీరామునితో యుద్ధముచేయక తప్పలేదు ఇది కుంభకర్ణుని యుద్దేశ్యము కాని భగవత్సంకల్పము యుద్ధమునతప్ప నెరవేరదు కావున సంస్కారము, పదనుగ్రహము రెండును రామాయణోపదేశమునను, కుంభకర్ణుని యుద్ధమునను సమ్మిళితములైనవని చెప్పకతప్పదు

విశ్వనాథవారు కుంభకర్ణుని జ్ఞాన సంపన్ననిగ నిరూపించినారు పురుషార్థజ్ఞానము, సృష్టితత్త్వము, ఆత్మలక్షణములు కుంభకర్ణునకు పరిపూర్ణముగ తెలిసినట్లు కల్పవృక్షమున నిరూపితము. యుద్ధరంగ మున రాక్షసవీరులందఱును పరునగా మడియుట చూచి, రావణుఁడు కుంభకర్ణుని నిద్రలేపి మహారణమునకు బోవ ప్రేరేపించినాఁడు

> "ఏమాలోచనచేయుచుంటివన నాదేమున్నదేమైన నీ
> రాముండిచ్చటికేలరావలయు సుత్రాముస్ జయింపంగ స్వ
> ర్ధామంబందలి సర్వభోగములు హస్తప్రాప్తముల్ గాఁగ స్వ
> ర్ధామశ్రీకథికంబు లేదనుచు వేదంబుల్ ప్రశంసింపఁగన్"[2]

---

1 భాస్కరరామాయణము, యుద్ధకాండము, వచనము – 882 పుట – 467
2 శ్రీమద్రామాయణ కల్పవృక్షము, యుద్ధకాండము,
కుంభకర్ణఖండము, పద్యము – 242 పుట – 107

"సచివులతోఁ జెప్పవలె సఖ్యము వైరము . ." 243
"మఱియును జీవులందఱు ప్రమాణముకల్గియు . " 244
"అట్టులు కాక నాల్గుపురుషార్థములై చను నాల్గుగుణ్యముల్ . . ." 245
"తెలిసిన యోగమార్గములు తెల్పెకి నీతికిఁగాక " 246
"ప్రెగ్గడలందు రుండయిన రీతులు కల్గు " 247
"నేరము పంచభూతములనిల్పిన చేతనతాన్వయాభవమా. . "248

ఇత్యాదిగనున్న కుంభకర్ణుని పలుకులాతనిని జ్ఞానసంపన్నునిగ నిగదిత మొనర్చును

"తనయుత్తాలగుణంబు పత్ఫలము పొందనరాక యుండగఁ జెల్పన కల్పించును బ్రహ్మయొక్కఁడు తిరంసాబుద్ధి జీవుండు పోవును వ్యామోహము వెంబడిం దనకుగాఁ బోనైన మేల్త్రోవ నెంచనునైనం గనకుండనక్కట యథస్థాదధ్వముం బట్టుచున్"[1]

ఇంతటి జ్ఞానసంపన్నుఁడయ్యు, కుంభకర్ణుని భ్రాతృభక్తి ఆతని యుద్ధమునకు హేతువైనది

లక్ష్మణుడు రాముని యందు చూపిన భక్తివిశేషమే కుంభకర్ణుడు రావణుని యంగు ప్రదర్శించినాఁడు ఈవిషయము "తనపితృభక్తిచే యొకుఁగుఁ దానయి యోతఁడు మాయొడందలన్ నునిచినరాజభక్తియును నేర్చు నెఱుంగగ నేఁడు కుంభకర్ణుని యొదలోన నన్నదెఁ నూల్కొను భక్తియు నేఁడెఱుంగు లక్ష్మణుడెసఁ బక్షపాతమది యు నగఁజాలెనయేని రాముఁడున్"[2]

అను మహోదరుని పలుకులలో వ్యక్తము

---

1 శ్రీమద్రామాయణ కల్పవృక్షము, యుద్ధకాండము
కుంభకర్ణఖండము, పద్యము - 294 పుట - 108

2 శ్రీమద్రామాయణ కల్పవృక్షము, యుద్ధకాండము
కుంభకర్ణఖండము, పద్యము - 267 పుట - 111

కుంభకర్ణునకు రాముఁడు నారాయణుఁడు కావచ్చునను ఆలో
చన యున్నది

"నాకున్ననిద్రయు నాయన్నగారన్న
నాకున్నభక్తియు నన్నుఁదోలచేఁ
గాకున్న స్వర్గమో లేకున్నధాత్రియో
కిడునమాయత్తమయ్యెడిది నాకు
నాహృదంతరము మానాథుండు పాలించు
నాదేహమలుపాల నద్ధకడదు
నారామమూర్తి నారాయణుండైనచో
నతనివిల్లును శార్ఙ్గమైనయెడల
మనము భయపడవలయు సంశయమెయున్న
నన్ను బంటఁడు సుమి దైత్యనాయకుండు
సర్వకాల జాగ్రద్భావ సంయుతుండు
మనుజభావ మర్యాదా రహస్యవేత్త" 269

"అతఁడాతండె యైనచో నమరవిభుఁడు
నను ననుసరించినను బ్రయోజనము లేద
యాతఁడాతండు కానిచో నమరఁదోఁడు
చనఁగనేమియు నా కవసరము లేదు" 270

అను కుంభకర్ణుని పలుకులలో రాముఁడు శ్రీహరియేమో అను శంక వ్యక్తము రాముఁడు విష్ణువుకానిచో నాతనిని సంహరించుటకు ఎవ్వరిసహాయ మక్కరలేదు విష్ణువే అయినచో నేసహాయమున్నను సాధించుట సాధ్యము కాదని కుంభకర్ణుని నిశ్చయము "నాహృదంతరముమానాథుండు పాలించు" అనుచో కుంభకర్ణుని హృదంతరమును ఉమానాథుఁడు పాలించుననియేకాక, మా + నాథుండు - లక్ష్మీనాథుఁడైన శ్రీమన్నారాయణుఁడు పాలించుననియు చమత్కృతి

శ్రీరాముఁడే నారాయణుఁడన్న నిశ్చయజ్ఞానమున్న రావణుఁడు రామునితో యుద్ధమొనర్చుటకు కుంభకర్ణుని నియోగించి నాఁగు సమస్తకాలములయందును రావణుఁడు జాగరూకుఁడై ప్రవర్తించును రామావతార రహస్యమాతనికి అవగతమే. తనతోటి పార్షదుఁడు భూలోకమున మిగులుట మర్యాదకాదు తనతోపాటు కుంభకర్ణుఁడును ఈ జన్మమును ముగింపవలసినదే కనుకనే రావణుఁడు కుంభకర్ణుని యుద్ధమునకు పంపెనని విశ్వనాథవారభిప్రాయపడినారు లేనిచో "అనుజభావ మర్యాదా రహస్యవేత్త" అను విశేషణము రావణునకు వ్యర్థమగును

కుంభకర్ణుఁడు వీరోచితముగ యుద్ధమొనర్చి, తుదకు రామబాణ ప్రహారములచే హతుఁడైనాఁడు

ఈవిధముగ ప్రాచీనార్ష గ్రంథములును, సంస్కృతమహాకావ్యములును, ప్రాచీనాంధ్రకావ్యములును, అర్వాచీన విద్వద్విమర్శకులును వర్ణించినరీతిని సమగ్రముగ పరిశీలించినచో కుంభకర్ణుని వృత్తసారాంశమిట్లున్నదగును

అప్రమాణ శరీరుఁడగు కుంభకర్ణుఁడు దేవ్రకసాదాది అనుగ్రహము లేకున్నను మహాబలాఢ్యుఁడు ఈ యప్రతిమశక్తి అతని దుశ్చరిత్రమునకు హేతువుకాకుండ నిద్ర అతని పాలిటి వరమైనది అందువలన రాక్షససహజమగు ప్రవర్తన చాలకాలము దూరమగుటచే పాపవృద్ధి జరుగలేదు రావణునికై సోగరధర్మము ననుసరించి యుద్ధమొనర్చినను, విభీషణునకువలె కుంభకర్ణునకును శ్రీరాముని యందు మహావిష్ణువను ప్రత్యయమున్నది. శ్రీరామునితో యుద్ధము చేయవలసివచ్చుట దైవసంకల్పము ఇట్లు బహుకాలజీవియయ్యు ధర్మజ్ఞుఁడై, తత్త్వజ్ఞుఁడై వీరమరణమునందిన కుంభకర్ణుఁడు తమ వైరథక్రుఁడనుట నిర్వివాదము.

## రావణుని సాధకత్వము

రావణుఁడు గుణాధిక్యత కల్గియు స్వల్పదోషముల వలన లోకమున తమోగుణ ప్రధానునిగ ప్రసిద్ధుఁడైనాఁడు. సత్త్వరజస్తమో గుణములు భగవంతుని రూపాంతరములని భాగవతోక్తి

"సత్త్వం రజస్తమయితి నిర్గుణస్య గుణాస్త్రయః
స్థితిసర్గ నిరోధేషు గృహీతా మాయయా విభోః" 1

భగవంతుఁడు సృష్టికై రజోగుణమును, స్థితికై సత్త్వగుణమును, లయమునకై తమోగుణమును గ్రహించును. అందువలన భగవంతుఁడు మూర్తిత్రయాత్మకుఁడగును నారాయణుఁడు సత్త్వమూర్తి, బ్రహ్మ రజోమూర్తి, శివుఁడు తమోమూర్తియని ఆర్ష వచనము 2 అందువలన తమోగుణ ప్రధానుఁడన్న మాత్రమున రావణుని హీనపరచవలసిన పనిలేదు. శాపకాలమున భగవదనుగ్రహమున్నను, వైరమే వీరికనుగ్రహింపబడినది. వైరము తమోగుణ ప్రభవము కనుక రావణుని తమోగుణ ప్రవృత్తియు భగవద్విలసితమే. ఈ తమోగుణమైనను అతనికి పుట్టుకతో వచ్చినదికాదు. తల్లియపరాధమువలన కలిగినదగుటచే స్వయంకృతముకాదు. అందువలననే ప్రారంభమునుండియు తమఃప్రవృత్తితో పాటు ధర్మప్రవృత్తియు సమానముగ రావణునియందు కన్పట్టును. వాస్తవమునకు రావణునకు దశగ్రీవుఁడనునదియే స్వాభిధానము. పౌలస్త్యుఁడు వంశనామము రావణప్రశస్తిని సూచించునపుడు పౌలస్త్యశబ్దము అధికముగ ప్రయుక్తిగను. కాటూరివారి 'పౌలస్త్యహృదయ'మను గ్రంథనామ నిర్దేశము ఇందులకుదాహరణము.

---

1 శ్రీమద్భాగవతము, 2-5-18. పుట - 230

2 విష్ణుసహస్రనామము, శంకరభాష్యము, 'భూతకృత్' శబ్దార్థము
శ్లోకము - 14 పుట - 75

ఉత్తరకాండమున, రావణుని మంత్రులు వైశ్రవణుని నుండి లంకను బలాత్కారముగ గైకొనుము చేసికొనవలెనని చెప్పినపుడు రావణుఁడు పలికిన పలుకులతని ధర్మతత్పరతను సూచించును ముఖ్యముగా మాల్యవంతుఁడీ దుష్కృత్యమును ప్రోత్సహించఁగా రావణుఁడు

"అథాబ్రవీత్ దశగ్రీవో మాతామహ ముపస్థితమ్
విత్తేశో గురురస్మాకం నా ర్హసే వక్తుమీదృశమ్"1

'పూజనీయుఁడైన ధనదునిగూర్చి యిట్లుపలుకుట తగదని సమాధానమిచ్చినాఁడు ఇట్లు పెద్దవారికిని బుద్ధులుచెప్పిన అతని ధర్మజ్ఞత దుర్మంత్రములవలన లుప్తమైనది. "దుర్మంత్రాత్ నృకతి ర్వినశ్యతి" అనికదా ఆర్యోక్తి. తల్లి అసూయకూడ రావణునిట్టి దుష్కృత్యములకు ప్రోత్సహించినది అతని యదృష్టముచలన మండోదరివంటి ఉత్తమురాలు భార్యగా లభించినది అట్టి మహాదవకాశము రావణుఁడు కర్మవిపాకముచే సద్వినియోగము చేసికొనలేక పోయినాఁడు

రావణుఁడు భ్రాతృవాత్స్య పూరితుఁడు సమరాంగణమున కుంభకర్ణుఁడు మరణించెనని తెలియఁగనే తమ్ముని పరాక్రమాదికముల తలఁచి, రావణుఁడు పరిపరివిధముల దుఃఖించినాఁడు తుదకు అతనికి జీవితముపై ననే వ్యామోహము నశించినది

"ఏటికినాకురాజ్య మికనేటికి సీవురి యేలసీత నా
కేటికి జీవితంబు రుచియించునె నాయనుజుండులేనిచో
సాటికి భ్రాతృపూంత రఘుచంద్రము నే నధియింపనేని ము
మ్మాటికిఁ జావె మేలు కొఱమాలిన యీబ్రదుకేల భూమిపై"2

1 శ్రీమద్రామాయణము, ఉత్తరకాండము, 11వ సర్గ శ్లోకము-10, పుట-946
2 శ్రీమదాంధ్రవాల్మీకిరామాయణము, (మందరము) యుద్ధకాండము-2
68వ సర్గ పద్యము - 1586 పుట - 743

ఇట్టి రావణుఁడొనర్చిన జైత్రయాత్ర వీరధర్మము కావున ఇంద్రాదులను జయించుట యశోభూషణమే కాని దూషితము కాదు. రావణుఁడు మహావీరుఁడు సాక్షాత్తుగా శ్రీరాముఁడాతని పరాక్రమమున కాశ్చర్యపడినాఁడు యుద్ధభూమిలో నిలచిన రావణుని జూచి, విభీషణుఁడు అతఁడే రాక్షసరాజని చెప్పఁగా,

"శ్రీరాముఁడానుడుల్విని
యారాతేజంబు పటుపరాక్రమ మరరే
సూరుఁడు కరగు లచేవలె
నీరావణుఁడనుర దుర్నిరీక్షుండగుచున్"

"దేవతలయందుగానేనియు
దేవారులయందునిట్టి తేజోయుతరూ
పేవేళవినఁగఁబడనే
యీవీరునిదీప్తి కలుగదిల నెవ్వరికిన్"1

అని శ్రీరాముఁడు రావణుని బలపరాక్రమములకు కరము వెఱగందినాఁడు

రావణుని దుష్ప్రవృత్తియనఁదగిన అంశము రాముఁడు జన్మించినపిమ్మటనే ప్రారంభమైనది వేదవేదాంగము లప్పటికిని లంకా రాజ్యమున నిరంతర మాదరింపఁబడినవి. హనుమంతుఁడు లంకలో వేదపారాయణము చేయుచున్న రాక్షసులను గమనించినట్లు శ్రీమద్రామాయణమున వర్ణితము 2

---

1 శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము, (మందరము)
యుద్ధకాండము I, 59వ సర్గ పద్యములు - 1249, 1250
పుటలు - 596 597

2 "షడంగవేదవిదుషాం క్రతుప్రవర యాజినామ్
శుశ్రావ బ్రహ్మఘోషాంశ్చ విరాత్రే బ్రహ్మరక్షసామ్"
సుందరకాండము, 18వ సర్గ, శ్లోకము - 2 పుట - 572

"అంతటనాలకించెను వడంగక వేదవిదుల్ మఖక్రియా
స్వాంతులు వేగుజాము సమయంబున మేల్కని బ్రహ్మరాక్షసుల్
మంతునోకింత లేక సుధి నద్రిఝ నించెడి బ్రహ్మఘోషముల్
వింతగా వాద్యనాదములు వీనులవిందుగ మ్రోయుచుండఁగన్"1

కావున రావణుడు మునులను, వేదకర్మలను బాధించుట శ్రీరామునాకర్షించుటకే యుద్దిష్టము లనవచ్చును మారీచ సుబాహులు రావణ ప్రేరితులై విశ్వామిత్రుని యజ్ఞమునకు విఘ్నమొనర్పుచున్నట్లు బాలకాండము, కదునా అవసరల్లో వివృతము. అచటి నుండి కథ క్రమముగా రావణ ముక్తి మార్గమున కున్ముఖమై నడచి నది అట్టిబిడిము తాటక సుబాహులు సంహరింపబడి, మారీచుడు దూరప్రక్షిప్తుఁ డగుటయందే వ్యక్తము. సీతాపహరణమున లుప్త ప్రాయమై, జటాయు వృత్తాంతమున అవమృష్టమై లంకాక్రమణముతో ఫలపర్యంత నిరూఢమైనది

రావణునకు కలిగిన శాపములు క్రమముగా నాతని ముక్తికి పరములై పరిణమించినవి వీని నాయా సందర్భములలో రావణుడు వివరించినాఁడు. ఈ శాపములన్నిటికి ఆనుపూర్విగ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు విమర్శనీయము కూర్చినారు ఇవి ఉత్తరకాండము లోనివి కావున సప్రమాణికములను వాద మొకటి యున్నది కాని యుద్ధకాండమున రావణుని వాక్యములలో నీశాపములు పేర్కొనబడినవి కనుక ప్రామాణికములని శాస్త్రిగారి యభిప్రాయము

సీతను బలాత్కారముగ వసుభవింపవేమి అని ప్రశ్నించిన మహాపార్శ్వనితో రావణుడు

"మహాపార్శ్వ నిబోధ త్వం రహస్యం కించిదాత్మనః
చిరవృత్తం తదాఖ్యాస్యే యదవాప్తం మయా పురా"

1. మందరము, సుందరకాండము, 18వ సర్గ, పద్యము 400 పుట - 234

మహాపార్శ్వా! చిరకాలముక్రిందట జరిగిన రహస్యమొకటి కలదు దానిని చెప్పెద వినుము-

బ్రహ్మభవనమునకు వెళ్ళుచున్న "పుంజికస్థల"ను ఆకాశమందు చూచి బలాత్కరించి నేనామెననుభవించితిని ఆపైనామె బ్రహ్మయొద్దకు వెళ్ళి నావ్యాపారమును చెప్పఁగా కుపితుఁడై బ్రహ్మ యిట్లుశపించెను

"అద్యప్రభృతి యామన్యాం బలాన్నారీం గమిష్యసి
తదా తే శతధా మూర్ధాఫలిష్యతి న సంశయః"

ఇదిమొదలు అన్యస్త్రీని బలాత్కరించి పొందెదవేని నీశిరస్సు శతశకలములగును అని

"ఇత్యహం తస్య శాపస్య భీతః ప్రసభ మేవ తామ్
నారోపయే బలాత్సీతాం వై దేహీం శయనే శుభే"
(యుద్ధ - స 18)

ఇట్టిశాపమునకు భీతుఁడనై సీతను బలాత్కరింపలేకున్నాను అని

ఇక్కడ ఒకవిషయము ననుకోనవలసి యున్నది- రావణునకు ఈ బ్రహ్మశాపమేకాక రంభా నిమిత్తకమగు నలకూబర శాపము గూడ నిట్లున్నది-

"యదా హ్యకామాం కామార్తో ధర్షయిష్యతి యోషితమ్
మూర్ధాతు సప్తధా తస్య శకలీ భవితా తదా" అని

తిలక వ్యాఖ్య— కుబేరపుత్ర నలకూబర శాపోపి రంభా నిబద్ధనః శ్రూయతే। తత్రోపస్థిత్యాన్యా అన్య ప్రథమత్వే తస్యాం బలాత్కారానంభవాత్ । తస్య ప్రథమత్వేస్యాం బలాత్కారా

సంభవాదతికేదిత్ । నలకూబరశాపస్య తపోబలేనా కించిత్కరత్వా
దయమేవ శాపో బ్రహ్మప్రవర్తితక్రియః పాశ్చాత్య ఇత్యస్యే"

ఈ శాపములలో మొదటిది నలకూబరశాపమని, అది రావణుని తపోబలమువలన అకించిత్కరమైనందున అప్రతిహతమైన ఈ బ్రహ్మశాపము తరువాత ప్రాప్తించినదని సారాంశము. 1

ఈశాపములు పరస్త్రీవిషయములైనవి నిష్కృష్టార్థముగ చెప్పవలెనన్నచో లౌకిక వ్యవహారమునకు ఈశాపములే రావణుని బలప్రయోగమును నిరోధించినవి లేనిచో ధాన్యమాలివంటి అంతఃపురస్త్రీలు చేసినయుపదేశమును2 విని, రావణుడూరకుండెనని అతని యశక్తతనో, అసహాయతనో కారణముగ చెప్పవలసివచ్చును. పరమార్థదృష్టితో చూచినచో రాముని తనకడకు రప్పించుకొనుటకే సీతనపహరించెను కాని కాముకుడై కాదు కామప్రదర్శన లోకమును నమ్మించుటకు రావణుడు మృత్యుభయముచేతనే సీతను విడువలేదనుట సరమవాక్యములవలన వ్యక్తము

"నత్వాముత్సహతే మోక్తుం అర్థమర్థపరో యథా
నోత్సహత్యమృతో మోక్తుం యుద్ధే త్వామితి మైథిలి
సామాత్యస్య నృశంసస్య నిశ్చయో హ్యేష వర్తతే
తదేషా నిశ్చితాబుద్ధిః మృత్యులోభాదుపస్థితా
భయాన్నశక్తః త్వాం మోక్తుం అనిరస్తస్తు సంయుగే"3

---

1 శ్రీమద్రామాయణ తత్త్వకథనము, వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
పుటలు - 161, 162

2 "అకామాం కామయానస్య శరీరముపతప్యతే
ఇచ్ఛంతీం కామయానస్య ప్రీతిర్భవతి శోభనా"
సుందరకాండము, 32వ సర్గ, శ్లోకము - 42 పుట - 580

3 శ్రీమద్రామాయణము,యుద్ధకాండము, 34వ సర్గ,
శ్లోకములు - 20 నుండి 28 పుట - 723

ఈశ్లోకములలో నొకేయర్థము మూఁడు పర్యాయములావృత్త మైనది ఏమాటనైనను నిశ్చయముగ చెప్పఁదలఁచినపుడు 'ముమ్మాటికి' అనుట లోకసంప్రదాయము 'అమృతో కాం క్షమ్' 'మృత్యులోభాత్', 'సంయుగేన అనిరస్త్రః' — అని రావణుని మరణము ముమ్మారు పరమా వాక్యములలో సూచితము

"రాజాస్య వినవమ్మ రావణుతల్లియు
మతియు నవిద్ధుఁడన్మంత్రివృద్ధ
శ్రీరామ విభునకు సీతనిమ్మంచును
బలువిధముల బోధపఱచిరమ్మ
యలజనస్థానమందైన యద్భుతము
దృష్టాంతంబుగా గొనియాడిరమ్మ
యంబుధి లంఘించి హనుమవచ్చుట
నిటనినుగంట నసురుల నిహతి సేత
మదినిఁగలఁపోయ మానవమాత్రుఁడైన
వాఁడు గావించు ననుతాని వలదె దేఁవ
నగుచు బోధింప ధనకామి ధనములోలె
నిన్ను విడువంగ నొల్లఁడు నిర్జరారి" 782

"ముక్కునను మార్పుగల్గ వలమూర్ఖుఁడు నిన్ను విడువంగఁబోఁడు' దన
ద్రెక్కను మృత్యులోభమున నిశ్చితమయ్యెను వానిబుద్ధి వాఁ
డుక్కఱి యీ బిభీషికలకోతరుణీ బెదరందు దానను
రక్కసులీల్గుదాక సినురాముని కప్పన సేయునేరఁడున్"[1] 783

అని మందరములోను పరమా వాక్యములలో రావణుని మరణము ముమ్మారుగు సూచితము

---

1 మందరము, యుద్ధకాండము, 34వ సర్గ
పద్యములు – 782, 783 పుట – 393

రావణుఁడు రాముని వధింపఁగలఁడనుకొనినను సీత అతనికి స్వాధీనము కాదు కావున నామెను రామునకప్పగించుటలో రావణునకు నష్టములేదు రాముఁడే రావణాంతకుఁడను ఒక్కమనను సీతా ప్రత్యర్పణము రావణునకు లాభదాయకము ఐనను అంతకంటె పరమసిద్ధియేదియో అతఁడు మనసులో కోరియుండవచ్చునని భావింపవగును. రాముని యతిలోకశక్తిని రావణుఁడు గుర్తించినాఁడు యుద్ధకాండమున మంత్రులకు చెప్పిన మాటలలో నీవిషయము స్పష్టమగును.

"సానుజుఁడుం జయుఁడయుతుఁడు నై రఘురాముఁడు దాటివచ్చునన్యాయసుఖంబుతో జలధియు క్త పరాక్రమరీతి నైబలియో హీనముచేసియో మఱి యొదేని నిజాద్భుతశక్తి జూపియో తానబురీబలంబులకు గల్గ శుభంబొకయుక్తి జెప్పఁడా"1

రావణునకు శ్రీరాముఁడే నారాయణుఁడను నిశ్చయజ్ఞానమున్నట్లు యుద్ధకాండమున స్పష్టముగ పేర్కొనఁబడినది

"యస్య విక్రమ మాసాద్య రాక్షసా నిధనం గతాః
తం మన్యే రాఘవం వీరం నారాయణ మనామయమ్"2

'ఎవ్వని పరాక్రమమువలన నతికాయ ప్రభృతులైన రాక్షసవీరులు హతులైనారో అట్టిరాముఁడు అచ్యుతుఁడైన నారాయణుఁడని ఇప్పుడనిపించుచున్నది'.

అని రావణుఁడు తలఁచినాఁడు ఇది యింతమింతయు యుద్ధమునందలి చివరిభాగమున రావణునకు కలిగినజ్ఞానము ఇది బహుకాలమంత్రగతమై, పిమ్మట వ్యక్తమైన దనుటకు సాక్ష్యములు రామాయ

1 మందరము, యుద్ధకాండము, 6వ సర్గ, పద్యము-137 పుట-62
2. శ్రీమద్రామాయణము, యుద్ధకాండము, 72వ సర్గ, శ్లోకము-11 పుట-813

ణమున లభ్యములు యుద్ధకాండమున అనరణ్యుని శాపము గుర్తు వచ్చినప్పుడే రాముఁడు నారాయణుఁడను నిశ్చయము రావణునకు కలిగినది

భక్తుఁడు కాలవశమున భగవంతుని మఱచిపోవు సందర్భమేర్పడినపుడు వానికా సంస్కారమును పునరుద్ధరణము చేయుట భగవంతుని కర్తవ్యము ఆతనికి ఆభక్తుల ఆత్మీయులలోనే కొందఱిని పరమేశ్వరుఁడెన్నుకొనును ఈసిద్ధాంతము విశ్వనాథవారిది.

"అచ్చటనొక్కఁడుండును రహస్యము చెప్పఁగ వారివారి నా
యచ్చట నచ్చటన్ నిలిపి యాయన ధాత్రికి డిగ్గి వచ్చులో
వచ్చినవాఁడు వాఁడెయని బంధుగుముల్ మఱి యాదృశంబుతో
నచ్చెరువుల్ వచించెడి నహో యదనేర్చిన నాటికిన్ వృథా"[1]

ఈలక్షణము వన్మాత్రియమునను జయవిజయులకు చక్కగా నన్వయించును హిరణ్యాక్షునకు వరుణుఁడు, నారదుఁడు యోగ్యమైన స్థానమునను న్నారు వరుణుఁడు లక్ష్యము నిర్దేశింపఁగా, తల్లక్ష్య సిద్ధికి నారదుఁడుపాయము చెప్పినాఁడు. ఇట తనవారనుచో హిరణ్యాభి లాషిత్వము ముఖ్యము. సంబంధము గౌణము హిరణ్యకశిపునకు ప్రహ్లాదుఁడు ఇట్టికర్తవ్యమును నిర్వర్తించినాఁడు రావణునకు వారివలె నొండు రెండు పర్యాయములు కాక, అనేకపర్యాయములు హెచ్చరికలు అవసరమైనవి ఖరదూషణులు శిక్షాసమయమున భీషావచము చేసినారు మందోదరి హితము జెప్పినది వీరందఱి ంకెు ప్రధానుఁడు విభీషణుఁడు ఇక శిశుపాలుని సంస్కారమును పునరుద్దీప్తముగావించు కర్తవ్యమును యుధిష్ఠిరుఁడు నిర్వర్తించినాఁడు రాజకీయ కవిభావములో నిట్టివారిని 'అహి' (స్వపక్షశత్రువు) యందురు

1 శ్రీమద్రామాయణ కల్పవృక్షము, యుద్ధకాండము, విప్లంశయఖండము
పద్యము - 66 పుట - 218

శూర్పణఖవాక్యములు వినినపిమ్మట రావణునకు శ్రీరాముడు నారాయణుడనియు, తననను గ్రహించుటకే స్వామి రామావతారమున నవతరించెననియు నిశ్చయజ్ఞానము కలిగినది

"యద్వా నరామో మనుజః పరేశో
మాం హంతు రామః సబలం బలౌఘైః
సంప్రార్థితోయం ద్రుహిణేన పూర్వమ్
మనుష్యరూపోద్య రఘోః కులేభూత్"

వధ్యో యది స్యాం పరమాత్మనాహమ్
వైకుంఠరాజ్యం పరిపాలయేయమ్
నోచేదిదం రాక్షసరాజ్యమేవ
భోక్ష్యే చిరం రామమతో వ్రజామి"

"ఇత్థం విచింత్యాఖిల రాక్షసేంద్రో
రామం విదిత్వా పరమేశ్వరం హరిమ్
విరోధ బుద్ధ్యైవ హరిం ప్రయామి
ద్రుతం న భక్త్యా భగవాన్ ప్రసీదేత్"[1]

మనుష్యమాత్రుడైన రాముడు పదునాలుగువేల మంది సైన్యముతో పాటు ఖరునెట్లు సంహరింపగలడు? కనుక రాముడు మానవమాత్రుడు కాడు పరమేశ్వరుడే బలాధ్యుడైన నన్ను కులయుక్తముగ నిర్మూలించుటకై బ్రహ్మచే ప్రార్థితుడై నారాయణుడు రఘుకులమున జన్మించినాడు నేను నారాయణునిచే వధ్యుడనైనచో వైకుంఠరాజ్యమునే పరిపాలింపగలను అట్లుకానిచో నీ రాక్షసరాజ్యమునే చిరకాలమనుభవింపగలను ఈవిధముగ నాలో

1 అధ్యాత్మ రామాయణము, అరణ్యకాండ, 5వ సర్గ
శ్లోకములు - 58 నుండి 60 పుట - 289

చించి శ్రీరాముని హరిగా నెఱిఁగి యింకను నిట్లు చింతించినాఁడు
విరోధముచేతనే నేను హరిని చేరఁగలను. విరోధము.తో నను గ్రహించి
నంత సులభముగ భగవంతుఁడు భక్తి మార్గమున ననుగ్రహింపఁడు '

ఈతుదివాక్యములు "యథా వైరానుబంధేన మర్త్య స్తన్మయతామియాత్ ." అను భాగవతివాక్యములను స్ఫురింపఁజేయును.

భగవానుని పతిత్వరముగ చేరుటకు సులభోపాయమైన వైర
మార్గము ననుసరించినాఁడు రావణుఁడు. 'వరదారాపహరణము కుల
మునకు చేటు, అనఘుఁడు హరి మర్త్యుఁడై పుడమిని బుట్టినాఁడు
కావున జానకిని రఘురామునకు సమర్పింపుము'నిన కుంభకర్ణునకు

"అరాఘవుఁడు విష్ణుఁడగుఁగాక యేమి
యారామునకుఁ దమ్ముఁడై న సౌమిత్రి
యారయ శేషుండై యగుఁగాక యేమి
యారవిసుతుఁడింద్రుఁడగుఁగాక యేమి"[1]

అని సమాధానమిచ్చిన రావణుఁడు

అంచిత దేవత్వమటుమానివచ్చి
వంచిన నిట మానవత్వంబునొంది
జగదేకరక్షకై సరసిజోదరుఁడు
జగతిపై రాముఁడై జనియించినాఁడు
వైరంబుగాని మనవథ కొఱకైన
నారామునితో సంధి యదియేల పొసఁగు' 2

అని రాముఁడే నారాయణుఁడని నిశ్చయించి చెప్పినాఁడు.
పరగొన్న తనను రాముఁడు పరిమార్చి తీరుననియు, కనుక నాతనితో

1, 2 రంగనాథరామాయణము, యుద్ధకాండము పుటలు - 389, 390

సంధి పొసఁగదనియు రావణుఁడు కుంభకర్ణునితో కార్యమురీతిని వచించినాఁడు

> "తెలువారఁగా నిటు సీతయై లక్ష్మి
> యిలకు జనించుట యే నెఱుంగుదును
> అరయంగ రఘురాముఁడా విష్ణుఁడగుట
> బరికించి యెఱుఁగుదు భావంబులోన
> వలనొప్ప దేవతల్ వానరులగుచు
> నిలమీద జన్మించుటే నెఱుంగుదును
> రాముచే మరణంబు రణములో నాకు
> నీమెయి సిద్ధించు టే నెఱుంగుదును
> తలమి గాఢంబున నే సీతఁ దేను
> బలిమి క్రోధంబునఁ బట్టిరోఁ దేను
> రణములోపల రఘురాముచే నీల్గి
> ప్రణుతింప విష్ణుని పరమపదంబు
> దక్కఁగ బొందంగ దలఁచియే సీత
> నిక్కంబు దెచ్చితి నింకేలదాప' 1

'సీతారాములు లక్ష్మీనారాయణులనియు; సీతను తాను కామముతో తేలేదనియు; రాముచే తనకు మరణము తథ్యమనియు, పరమపదమును పొందుటకు సీతనుపకరణముగ గ్రహించితిననియు' నిత్యాదిగనున్న రావణుని పలుకులు విష్ణుపార్షదత్వ సూచకములు

రావణుఁడిట్లు జనకనందననుపకరణముగ గ్రహించినాఁడు కావుననే ఆమెను రామునకు సమర్పింపుమనిన కుంభకర్ణునితో,

---

1 రంగనాథరామాయణము, యుద్ధకాండము పుట - 380

"నీవిటు విన్నవాడట నిక్కముగాదన నాకు నేటికిన్
దేవహితంబుగా మనుజదేహముఁ గైకొని వచ్చుటం బ్రతి
జ్ఞావిధి చొప్పడన్ మనలఁజంకఁ విష్ణుఁడు రిత్తవోవునే
వేవురుజెప్పినం గృపణవృత్తికోడంబడ నీను జానకిన్"1

'మనల సంహరించుటకు మనుజదేహమును ధరించిన విష్ణువు రిత్తవోవునా? ఎవరెన్ని చెప్పినను జానకీ ప్రత్యర్పణము మాత్రము చేయను'ని సమాధానమిచ్చినాడు. అంతేకాక వామనావతారమును స్మరించి,

'వామనమూర్తియైవచ్చి, పదత్రయమాత్రమర్థియై, పరిపూర్ణ మనోరథుఁడయ్యె నా బలిని రసాతలమునకణచిన విష్ణువును నమ్మ వచ్చునా? తాన విష్ణుఁడై సంగామిమ్ము రాములో విగ్రహంబె తాని విదయమొల్లన'ని నిశ్చయించి పలికినాఁడు

"జనకసుత లక్ష్మి రాముండు వనజనాభుఁ
డగుట నిక్కము తెలిసియు నితని చేత
బవరమునఁగూలి కైవల్యపదమునొంద
నీకుఁజెప్పితి నిరకేమి సెప్పఁబోము"2

అను రావణుని పలుకులాతని నిశ్చయజ్ఞానమును, రాముచే హతుఁడై కైవల్యమార్గమునకు ద్వారమపావృతము చేసికొనుట యందలి దీక్షను సూచించును

ఆధునిక రామాయణ కావ్యములందు మకుటాయమానమైన రామాయణకల్పవృక్షమున రావణునకు రామునియందంతరాంతర ములలో సహజమౌ అవ్యాజానురాగ మున్నట్లు వర్ణితము

---

1 భాస్కరరామాయణము, యుద్ధకాండము, పద్యము - 895 పుట-467

2 భాస్కరరామాయణము, యుద్ధకాండము, పద్యము - 900 పుట 468

"మనోఽపి జన్మాంతర సంగతిజ్ఞమ్" అని పెద్దలన్నట్లు రావణునకు రామునియందు యుద్ధసమయమున నేదియో అవ్యక్తానురాగము జనించినది

"మాయుద్ధఆలోచల మతి
యీయన గెలుచుటయె మంచిదివ్వగు తనకుం
పోయెడి దేమీ నాకుం
పోయినదిప్పటికి సర్వమున్ మాయయుగా"1

ఆయుద్ధసన్నివేశమున రామునియందు రావణునకు కలిగిన అనురాగమును రావణుని సారథిసైతము గ్రహించునంత స్పష్టముగ నాతని ముఖకవళికలున్నవి

"ఈవయి నేనుచెప్పుటయు నింతయు ధర్మము గాదు స్వామికిం
గోపము రానిచో నిడయుఁగొంచెము చెప్పెద రామునందు నే
డో పరమానురాగము దయోదయమో ఘటియిల్లెనీకు నీ
వోపఁగ నెంచినన్ రిపుని యుద్ధమునందది కోసివేయనా"2

అను సారథిపలుకులిందులకు నిదర్శనములు. ఈ యనురాగమునకు బీజము యుద్ధకాండారంభమున రాముఁడమానుష శక్తిసంపన్నుఁడను రావణుని తలాలోచనలోనే కన్పట్టును. శివుఁడు హంసరూపమున సీతారాములకు ప్రణయదౌత్యము కావించుట తెలిసి, తనకిప్పటి వఱకు బహిశ్శత్రువైన రాముఁడిక్కపై అంతశ్శత్రువైనాఁడని రావణుఁడు భావించినాఁడు. శివునకు, విష్ణువునకుగల ఆప్తభావము

---

1 శ్రీమద్రామాయణ కల్పవృక్షము, యుద్ధకాండము
నిస్సంశయఖండము, పద్యము – 198 పుట – 243

2 శ్రీమద్రామాయణ కల్పవృక్షము, యుద్ధకాండము
నిస్సంశయఖండము, పద్యము–348 పుట – 269

పురాణప్రసిద్ధము శివకేశవులు సదృశ సత్త్వులని కొన్ని పురాణములు చెప్పఁగా, అభిన్నులను వాదము సహృదయ ప్రశస్తమైయున్నది

"తనకుఁబోలెడలు లజిగియిచ్చినవాఁడు
సృష్టి మొదలు మొదలు చివరిదాక
కానరాఁడు తన్నుఁగాదని యెవనినో
తన్నుఁబోలు జోగి నెన్నుకొనియె"1

శివుఁడు తనవంటి మతియొక జోగిని తనవానిగ నెన్నుకొనె నను రావణుని పలుకులలో జోగి - సన్యాసి యను వాచ్యార్థముతో పాటు విష్ణువను వ్యంగ్యార్థమును ద్యోతికము

'జోగి' యనునది 'యోగి' శబ్దభవము నారాయణుఁడు యోగీశ్వరుఁడు శివునిబోలిన యోగి విష్ణువనుట నిర్వివాదము

"నాకంటెక్ మునుపైన భక్తుఁడఁటె యీనాటికబంధ్వస్యయుం
డాకొన్నాఁడు శివుఁడు దంపతులమధ్యన్ వార్తలందింపఁగా
త్స్మాకన్యాపతి యింతదాకను బహిశ్శ్వంత్రుండె యీనాటికిం
దాకన్ వచ్చినయంతఁగనపడియె సంతిశ్శ్రుతుల్తాస్థానమై"2

రాముఁడు యోగీశ్వరుఁడైన నారాయణుఁడను సంశయము కలిగిన పిమ్మట రావణుఁడాయనను వైరము గ్గమున పొందఁగోరి శత్రుత్వమును వహించినాఁడు ఈ సంశయమునకు పిమ్మట నిశ్చయ జ్ఞానమునకు సామీప్యమును రావణునియందు కన్పట్టును

---

1 శ్రీమద్రామాయణ కల్పవృక్షము, యుద్ధకాండము
సంశయఖండము, పద్యము - 98 పుట - 17

2 శ్రీమద్రామాయణ కల్పవృక్షము, యుద్ధకాండము
సంశయఖండము పద్యము - 102 పుటలు - 17 18

"ఎలనాగన్ గొనివచ్చినంతఁదరకు యీచేత లక్షోప ల
క్షలు కాంతల్ శిలలన్ బిగించి కడలిన్ సర్వాసురాసుప్రజం
బులు వైవస్వతు మందిరంబునకు బంపున్ సృష్టి దానొక్కఁడే
విలుపట్టంగలవాఁడు హేమధరణీ భృచ్చాపుఁడేయయ్యెడున్' 1

సముద్రమునకు వారధిని నిర్మించిన రాముఁడు సామాన్యుఁడు కాఁడను నభిప్రాయము రావణునిలో బలపడినది

"మారీచుఁడు చెప్పినదియు
మారీచునిగూర్చి యితఁడు మాటాడినదిన్
వేరావణు నెదఁదిరిఁగెను
తారాముని రక్ష యింత తార్కాణముగన్"2

రామునిగూర్చి మారీచుఁడు పలికిన పలుకులు స్ఫురించి రావణుని యనుమానము మఱింత దృఢపడినది

"నా సేవించు శివుండు కాని శివుఁడున్నాఁడొక్కఁడచ్చంపు దే
జై సంవ్యాప్త జగత్త్రియంబుగను వాఁడల్పీయసుండై సునా
యాసంబొప్ప మహీయసుండగున తానా తేజు వ్యాపించదే
లాసన్నంబగునట్టి మానిసులయందా నిండు కన్పింఁగన్"1

రాముఁడు మానవరూపమున నున్నపరమేశ్వరుఁడే యని రావణుఁడు నిశ్చయించినాఁడు

---

1, 2 శ్రీమద్రామాయణ కల్పవృక్షము యుద్ధకాండము, కుంభకర్ణఖండము పద్యములు - 65, 108 పుటలు - 78, 86

3. శ్రీమద్రామాయణ కల్పవృక్షము, యుద్ధకాండము కుంభకర్ణఖండము పద్యము- 155 పుట - 93

"ఇతనికును దిక్కు లేద యవతారము తాల్చునుణో హరింపఁగా
దనుజులనేనుగా మొదలి ద్వారమునందలి యున్నగుబ్బలం
బున బెను చంద్రహాసమున దూసిన వాసిన రెక్కసందులం
గనుగొని గోచిగాంగ్రడు భయాంపితుడైనది యేమిరైయెవదో"1

రాముఁడు విష్ణువను నిశ్చయముతో పాటు తాను విష్ణుపార్ష దుఁడనను జ్ఞాపిక ర వణుని యావులుకులలో నిగదితము ఇట్లు ప్రతిజ్ఞానము స్పష్టమై రామునియందు శ్రీమన్నారాయణుఁడను నిశ్చయ జ్ఞానము పౌంస్త్యునకు కలిగినది

"ఇతనిభుజాయుగంబు మత్రి యీతని కంఠము పాదయుగ్మముల్
శితిశర మెంత వేగియును భిన్నము చేయుద వేలువత్సరాల్
స్థితి దినిపట్టి కార్యమును చేయఁగ జాలఁడ యెవ్వఁడున్ క్రియా
తతి నియమంబు నిశ్చితము దాటినదీతని యబ్బురంబుగా"

"కొని యావేల్పుల తామసంబయిన శస్త్రల్ పొల్చు నస్త్రంబులన్
దనరన్ శైవము వైష్ణవంబయిన యస్త్రప్రహాత విరాధప్రక్రియా
చణమాఁబట్టుగఁ బరమేశ్వర మహాస త్త్వప్రధానంబులై
యునయంబున్ బెఱజీవులందిది పాసాధ్యం బెంత యోజించినన్"

"నెక్కొని గాధిరాట్పుత్రుఁడు నేర్పెనుపీనికిఁ జెట్టమంత్రముల్
చిక్కఁగ దానియందొకటి చాలునొ యీనికిఁ భృశంబుగన్
నిక్కముగాఁగ నిట్లియగు నేరని యీతఁడు నేఁ పాటు వాఁ
డెక్కడ పీఁడఁ దోష్ఠజాఁడ డెక్కడ ధూర్జటి సామ్య నత్యుఁడై"

1 శ్రీమద్రామాయణ కల్పవృక్షము, యుద్ధకాండము
సంశయఖండము పద్యము - 150 పుట - 28

"ఆయమ పీనఁగానలకు కంపినయట్టిది పిన్నతల్లి కై
కేయి ధనుఃకళావిభవ కృత్రిమతా కరివేత్రి నేర్పు నే
దో యొక యిట్టిదా కిటుకు నొప్పఁగఁ బండితలోకవంచనా
ధీయుతి యీతఁడే హరి వధించును నన్నసుభ్రాంతి కల్గఁగన్"

"ఇదివిడి కుంభకర్ణు వధియించుట యెంతయు సంశయంబు లే
నిదియగునైన వాని మరణించుటయున్ వ్యతిరేకలక్షణం
బొడిగినదైన యాసరసిజోద్భవు మాటను లేద శైవ చా
పదళన శక్తి యింతుఁడవు బాల్యమునందె మతింపఁజెట్టిరే"[1]

రాఘవుని ఐంద్రాస్త్రమున ఖండితమైన కుంభకర్ణుని శిరము తన జాంబూనద సౌధము గోపురమున పడఁగా చూచి రావణుఁడు నిశ్చేష్టుఁడైనాఁడు కుంభకర్ణునివంటి మహాకాయుని సంహరించుట, వానిశిరము నింతదూరము పడునట్లు పడవేయుట సామాన్యులకు సాధ్యముకాదనియు, కావున రాముఁడు ధూర్జటి సామ్యసత్వుఁడైన అధోక్షజుఁడే యనియు రావణుఁడు నిశ్చయించినాఁడు. ఇట్టి నిశ్చయ జ్ఞానముకలిగిన యనంతరము రావణున కాత్మజ్ఞానము ప్రబుద్ధమైనది

"కడుకొని వేదముల్ చదివి కయ్యము సేయఁగ నేర్చినారు నా
కడుపునఁబుట్టినట్టి పసికందులఁ బొట్టనఁబెట్టుకొన్న యీ
వడిగల వింటివాఁడొకఁడు వచ్చిన విష్ణువటంచు నెంచఁగా
నిశియఁగఁజేయు చొప్పికొన సీయదు కోపము మండిపోవుచున్"

1 శ్రీమద్రామాయణ కల్పవృక్షము, యుద్ధకాండము
కుంభకర్ణఖండము పద్యములు – 407 నుండి 411 పుట – 134

"చెలువుగఁ బుత్రులై హితము చెప్పుటతప్పని చెప్పరంతె మం
త్రులవలెఁ దమ్ములం బలెఁ ననున్ వచియించియుండ్రు లేనిచో
దలఁపున నుండె నంచెఱిఁగి తానది చెప్పమి చేసి లేనియ
ట్టుల నటియించు మూఢుఁడు జడుండు జనుండు స్వలాభబుద్ధియై"1

యుద్ధమున పుత్రులను పోగొట్టుకొనిన రావణుఁడు వారు తన మంత్రులవలెఁ, సోదరులవలె హితము చెప్పని కారణమూహించినాఁడు. ఇఁకపై సమరము చేసి లాభమించుకయు లేకపోయినను సమరము చేయుదుననియు, జానకి దైత్యవంశ వినాశహేతువైనను ఆమెను వదలననియు రావణుఁడు నిశ్చయించినాఁడు

"ఘనుఁడీతండె త్రివిక్రముండయినచో గానిమ్ము యిందాఁక దె
చ్చిన దేహాలును మానవుండగుచు వచ్చెన్ శ్రీవికుంఠుం బునం
దునఁ గాలూదక లేక జానకియు దోడ్తో లక్ష్మియైనన్ దనం
తన యేతెంచి యిటన్ వసించె హరికింతన్ సిగ్గుచేటౌనటుల్"2

అని సీతారాములను లక్ష్మీనారాయణులుగా రావణుఁడు నిశ్చయముగా నెఱిఁగినాఁడు

రావణునకు తన కేవిధముగ మోక్షము లభించునో తెలియుననియు, అందువలన పరమపదమును చేరుమార్గముగ సీతాపహరణము నాశ్రయించినట్లును విభీషణ లక్ష్మణుల సంభాషణములో విశదమగును.

"పరమను కాంతజాణ యతిబంధురధీకము లోకమున్ సుత్రిన్
మరిదన పైపు లాఁగికొన మానియత్నము సేయుచుండుఁ దె
క్కుఁ కుర్కురి దెస బిట్టుదుఃఖమును గోడకు వెన్కనివాసముండి బం
ధురమతి నేఁడొ కుడ్యమునుదాఁకి తనుం గవయంగ నెంచుచున్"

---

1, 2 శ్రీమద్రామాయణ కల్పవృక్షము, యుద్ధకాండము
ఇంద్రజిత్ఖండము పద్యములు 101, 102, 105 పుటలు—152, 158

అఖిలజనులు హృద్యముగాక నరుగుచెంచి
యాగిపోదురు పుత్రదుఃఖాభిహతుఁడు
విపరిణతమతి దూఁకునంత పనిచేసి
రొక్క మోహానఁబడి వెన్కదిక్కు తిరుగు 1

ఇందు పరమను కాంత సీత, ఆమెను పొందుటకు మానని ప్రయత్నము చేయువాఁడు రావణుఁడు మోక్షమును చేరఁదలఁచిన వారల్పసత్త్వులైనచో కలుగు ప్రతిబంధకములు వారినామార్గము నుండి వెనుకకు మరలించును కాని రావణుఁడు పరమునే ప్రధానముగ భావించినాఁడు "అనుజభావ మర్యాదా రహస్యవేత్త" అయిన రావణుఁడు తనకే కాక, తనవారికిని మోక్షమును కోరినాఁడు అనదాశయముతోఁ దనే లౌకికమైన సోదరప్రేమను, పుత్రవ్యామోహమును విడచి, వారినికూడ రామునకర్పించినాఁడు

ఈ భక్తిలక్షణములే కాక, రావణునియందలి ధర్మప్రవృత్తిని కూడ విశ్వనాథవారు వర్ణించినారు. సీతను సంహరించినట్లు మేఘనాదుఁడు రామునకు భ్రాంతికలిగింపఁగా, విభీషణుఁడా విషయమును తిరస్కరించుచు,

"సీతాదేవిని మేఘనాదుడు వధించెన్నాఁగ నమ్మంగ రా
దాతండ్రిన్ దనయుండెఱుంగు నతఁడేలా యొప్పికో లేచ్చు భూ
జాతన్ బంక్తిగళుండు గొంతున నభస్వద్వీచి యాడంగ నా
రీతిం జేయఁగ నొప్పికోఁడిది మృషావృత్తాంత మెల్లించినన్"

"అతనికొద్ద దుర్గుణము లన్నము లొక్క సహస్రముండినన్
నాతిని వధంబు సేయుటనినన్ దశకంఠుఁడు సేయఁడెప్పుడున్

---

1 శ్రీమద్రామాయణ కల్పవృక్షము, యుద్ధకాండము
ఇంద్రజిత్ఖండము పద్యములు-5, 6 పుటలు-186, 187

సీతివిదుండు శౌర్యరసనిరధి వేదమహార్థవేత్త కా
మాతురుఁడన్న దొక్కటియ యంగ౯ జంపెడునంతచెట్టయే"1

రావణుఁడు తనకంఠమున నూపిరియుండఁగా జానకిని చంపుట కంగీకరింపఁడు నీతివిదుఁడు, శౌర్యరసనిరధి, వేదమహార్థవేత్త యిన రావణుఁడు నాతివధమున కెన్నటికిని పాల్పడఁడు' అని రామునితో పలికినాఁడు రావణునిలోని కొన్ని దుర్గుణములుకూడ నిధర్మమార్గమున లెక్కింపదగినవి కావని విభీషణుని యభిప్రాయముగ కన్పట్టును.

రామరావణ యుద్ధము దివారాత్రములు సాగినది

"సాగరంబులేదు రేఁగు చీకటిలేదు
మిన్ను లేదు మత్రియు మన్ను లేదు
వారెకలరు బాణపంజరంబునయందుఁ
బోరుచున్న రెండు పులులవోలె"2

ఆయుద్ధమున రామమూర్తి కతివేలమైన ఆశ్చర్యము కలిగించినది రావణుని పరాక్రమము వాలి తన ఒక్కబాణమునకే నిలువలేక పోయినాఁడనియు, అట్టిబాణము లెన్ని వేసినను ఎదురునిలిచిన రావణుఁడు పదిపర్వతముల బిగువుకలవాఁడనియు రాముఁడు భావించినాఁడు 3

రామునిజూచి రావణుఁడంతకన్నను దిగ్భ్రాంతి జెందినాఁడు.

---

1 శ్రీమద్రామాయణ కల్పవృక్షము, యుద్ధకాండము
ఇంద్రజిత్ఖండము, పద్యములు - 371 372 పుట - 197

2 శ్రీమద్రామాయణ కల్పవృక్షము, యుద్ధకాండము
నిస్సంశయఖండము, పద్యము-212 పుట - 245

3 శ్రీమద్రామాయణ కల్పవృక్షము, యుద్ధకాండము
నిస్సంశయఖండము, పద్యము - 214, 215 పుట - 246

"బహ్మరవోయి రావణుఁడు బ్రహ్మయు జేయఁగఁజాలఁడీ కనిన్
నమ్మఁగరానివర్యో నయుంబులు వేలును లక్షలైన చ
క్రమ్మలు సూక్ష్మముల్ శరపరంపర నమ్మఁగఁజేత చేత జ
క్రమ్ము కలాఁడు చేయువలెఁగాని యిరుంచఁ సరింపఁజాలఁడున్"

"అప్పుడు రామచంద్రుఁగన నాయనచేతి ధనుస్సు చక్రమై
యొప్పెను శీఘ్రశీఘ్రములు నుగ్రశరంబులనేయు వేడిలోఁ
ద్రిప్పుచుఁ ద్రిప్పుచున్ విలుధరింపఁగనద్దియె నాల్గుబాహులై
కొప్పను శంఖమై విరిసికోల్వహియించెఁగనుల్ భ్రమింపఁగన్"[1]

ఇందు శ్రీరాముఁడు శంఖచక్రగదాపాణియు, చతుర్భుజుఁడును నైన శ్రీమన్నారాయణుఁడై రావణునకు దర్శనమిచ్చినాఁడు

రామాయణ గ్రంథములనిట్లు సూక్ష్మముగ పరిశీలించినచో రావణుఁడు శ్రీరాముని లంకానగరమునకు రప్పించుటకే సీతాపహరణముఁ గావించెననియు, అదియే మోక్షదాయకమని నిర్ణయించెననియు విదితమగును

రావణుని యీసంస్కారము నాధారముగఁగొని కాటూరి వారు సీతాహరణోద్యోగమున పౌలస్త్యహృదయము నావిష్కరించి నారు

సముద్రుఁడు లంకకావలి తీరమున రాముఁడు కపిసేనతో విడిదిచేసిన వృత్తాంతమును తనచెలికాఁడైన రావణునకెఱిఁగింప వచ్చినాఁడు రావణునకు సముద్రునకు పరస్పర రక్షాసంధి యొకటి ఉన్నదఁట

"భ్రుకుటిమాత్రముచే మూఁడు భువనములకు
విలయము ఘటించు జగదేకవీరులముఁట

1 శ్రీమద్రామాయణ కల్పవృక్షము, యుద్ధకాండము
నిస్సంశయఖండము పద్యములు – 221, 222 పుట – 248

నీకు సుద్భావము వింశతి నాకు నీదు
వేదికాకోటి యంట కోట వెఱపిఁకేల"[1]

అను రావణుని పలుకులిందులకు నిదర్శనములు. అందువలన రాముని రాక నెఱిగించుటకు సముద్రుఁడు నురగలు గ్రక్కుచు రావణునికడకు వచ్చినాఁడు. అతనినిజూచి రావణుఁడు "సత్యాకార్ముకుఁడై రామచంద్రమూర్తి శింజినీటాంకృతియు సంతసేయులేదా" కదాయని ప్రశ్నించినాఁడు. సముద్రుని మౌనమే రావణునకు సమాధానమైనది

"ఎట్లు! చెప్పవు? రాఘవుఁడే! మత్రేల!
విడువు కంపము త్రోవరా విడువుమతని
కనుజ సౌమిత్రితో సూర్యతనయుతోడ
హనుమతోఁ దరుచర వరూధినులతోడ"[2]

చిరకాల ప్రతీక్షితమైన రామాగమనము రావణునకానందదాయకమైనది. ఏనాటిశాపమో స్వామికీనాటికి జ్ఞప్తికి వచ్చినదని నిష్ఠురములాడుచునే ఇరువదికన్నులు కలిగిన ఫలమాసన్నమైనదని సంతసించినాఁడు.

"నాటికి నేఁడా తలఁపున
నాటెను సామికి వికుంఠనగరోదితమౌ
మాటలు దీర్ఘవిలంబము
వాటించి విభుండు నన్ను వంచింపఁగదే"[3]

---

1, 2, 3 పౌలస్త్యహృదయము, కాటూరి వేంకటేశ్వరరావుగారు
పుటలు-1, 2, 3

అను రావణుని పలుకులలనాఁడు చతుస్సనులు విష్ణుపార్షదులైన తమకిచ్చిన శాపమును, హరి అభయమును స్ఫురింపజేయును వైరభక్తి చేరిట తనచేత నెన్ని యో అకార్యములు చేయించి, స్వామి తనను వంచించినాఁడని రావణుఁడు నిర్వేదమందినాఁడు 'శివకోదండమునుద్రుంచి సీతవరియించెన్ రాముఁడ'న్నపుడే అది మాధవు కార్యమని నిశ్చయించి; దినమొకయుగముగ నాయనకై ప్రతీక్షించి ఉత్కంఠతభరించలేక రాముని రప్పించుటకై సీతాహరణరూపమైన స్వామిద్రోహమునకు తలపడినాఁడు "స్వామిద్రోహముకూడ నేర్పెనుదకున్ వైకుంఠండాదార" యనుచు ఆనేరమునకు స్వామినే కారణముచేసినాఁడు

"పుడమికాను పు నేనట్లు పుడికితెచ్చు
టలు జటాయువుచే విని విలులితాత్రకు
కలుషిత కపోలములఁ గెంపుదొలుకఁగ్రోధ
ముద్రితాననుఁడై రామభద్రమూర్తి
రావణా! యని నన్నుఁబేర్వాడి ప్రతిన
నలిపినపుడు గదా మనశ్శాంతి దొరకె"1

ఇప్పటికి రాముచే తనమరణము నిశ్చయమై రావణునకు మన శ్శాంతి లభించినది తనను వెదకు నాయాసముకూడ స్వామికి ఉండరాదని మునుల హింసించుటలు, సతుల చెఱపిడుటలు ఇత్యాదికృత్యముల మూలమున రావణుఁడు తినయునికి తెలిపినాఁడు. ఇట్లనుటచే రావణుఁడు వైరసాధనమున భగవానుని పొందుటకు ప్రయత్నించెనని స్పష్టము

రాముని దరికి తాను పోదగిన మార్గములన్నియు మూసివేయఁ

---

1 పొల స్త్యహృదయము, కాటూరి వేంకటేశ్వరరావుగారు పుట-4

దారితె మొనర్చి, ఆగంటుదారి వెంట
హృదయమున్ జొచ్చి యేకాంతమిచ్చగించి
స్వాగతము బల్కునని విన్నపమ్ము సల్పు
మచటనే పునర్దర్శనమగుత మనకు"1

అని రావణుడు సముద్రునితో బలికినపలుకులు పరాక్రమ స్ఫోరకములు, భక్తిసమన్వితములు తాము (జయవిజయులు) వీకాంతులైన విష్ణుపార్షదులమను విషయమును స్మరించి, స్వామి హృదయ మందిర ప్రవేశమును వాంఛించినాడు భక్తుడు

కాటూరివారి విధముగ సీతాపహరణమందలి పౌలస్త్యహృదయము నావిష్కరింపగా జమదగ్నిశర్మగారును కాటూరివారి మార్గమునే పాటించి భవబంధమోక్షణమే రావణుని సీతాపహరణ తాత్పర్యముగ నిరూపించినారు విష్ణుపార్షదులు మూడు జన్మలయందును నారాయణుని తమకడకు రప్పించుకొనవలెనను ప్రయత్నము చేయుట అను పురాణాంశమే వీరి పద్యములలోను సూచితము

"భక్తియు వైరముల్ గనవచ్చును భిన్నముగాగ భావము
ద్రిక్తత సందిలక్ష్యముఖ తీవ్రగతింగని సిద్ధినందుచో
నుక్తవిభేదమంతయును నుద్ధృతమై చను దైవవైరమున్
భక్తిగ సత్ఫలంబిడును భాగవతోక్తి ప్రసిద్ధమయ్యెడన్"2

అనుచు కవి భాగవతోక్తమైన వైరానుబంధమును తనకావ్యమున ప్రధానవస్తువుగ ప్రతిపాదించినాడు

వైరము భక్తియోటయును భక్తియొకప్పుడు వైరమూటయున్
సారవిహీనమా జగతిసాధ్యమె యంతయులీల యీశ్వరుం

---

1 పౌలస్త్యహృదయము, కాటూరి వేంకటేశ్వరరావుగారు పుట-12
2. వైరభక్తి, జమదగ్ని శర్మగారు, పద్యము-2 పుట- 1

జేరికి నెట్టులీ బ్రదుకులిచ్చునో నేరమెఱుంగ సుంతయున్
సారరసస్వరూప నిజసర్గ విలాసికిఁ గేలుమోడ్చెదన్"[1]

అను కవిపలుకులలో జయవిజయులకు జన్మత్రితయమున వైరానుబంధము భగవత్సంకల్పమను విషయము నిగదితము

రావణుఁడు శాపఫలమైన యీజన్మమును సత్వరము వీడఁగోరు నాత్రముతో

శివభక్తిన్ బ్రకటించి చాపఁడను శాసింగాంచి యవ్విష్ణు వె
య్యదివచ్చున్ మఱి వని వన్నిటిని మాయంజేసెదన్ రాక యే
మవ్వసంచున్ దెగజాలి యప్పటికి రాఁడాయెన్ గదా యంచు ద
క్కోవియున్ గాదు హరింతు బ్రేయసి నటంచెట్లేవచ్చునంచెంచెదిన్'[2]

'విష్ణువునకు బ్రీతిఁగొల్పువానినన్నిటిని నాశనమొనర్చి, అప్పటికిని మనోవాంఛితము నెరవేరకపోవుటచే రాముని రప్పించుటకు చివరి ప్రయత్నముగా సీతాహరణము గావించినాఁడు

"వెన్నుఁడవైనవచ్చి నిజవృత్తిని మున్నటు నిల్పుపొంటె నీ మన్నగు జేహమూడ్చవలె" నని యెంచిన రావణుఁడు తాను కోరుకొనిన మార్గమున తనమరణమును పొందినాఁడు[3]

ఈవిధముగ భాగవతదృష్టితో రామాయణకథ ననుసరించి ప్రాచీనార్వాచీన మతములను సమన్వయించినచో రావణుఁడు జన్మప్రభృతి ధర్మతత్పరుఁడనియు, కొన్ని దుష్కార్యములు రాక్షసజాతి స్వభావములనియు, అవియు తమోగుణరూపమైనశాపఫలములనియు, రామరావణులకు కామవైరము ప్రధానము కాదనియు, పార్షదుల ముముక్షుత్వమే రామరావణ యుద్ధహేతువనియు ఫలితాంశము

---

1, 2, 3 వైరభక్తి, జమదగ్ని శర్మగారు, పద్యములు–2, 4, పుటలు–1

## శిశుపాల దంతవక్త్రుల వృత్తాంతము

యదువంశమున ననేక యుపశాఖలు విస్తరిల్లినవి వృష్ణి భోజ కుకురాంధకములు యదువంశ శాఖలు యదువంశమునకు మూల పురుషుఁడు యయాతికుమారుఁడైన యదువు చంద్రవంశీయుఁడైన యదువువంశమునకు చెందినవారగుటచే యాదవులు క్షత్రియ విభాగములోనివారే అనుట స్పష్టము ఈవంశ విస్తరము భాగవతము, నవ మస్కంధమున కననగును

ప్రస్తుతాంశము శ్రీకృష్ణునకు, శిశుపాల దంతవక్త్రులకు గల బాంధవ్యము శిశుపాల దంతవక్త్రులు అక్కచెల్లెండ్ర సంతానము పూర్వజన్మములయందువలె ఏకగర్భవాన మీజన్మమున కలుగలేదు కాని తల్లుల వరుసచే నన్నదమ్ములుగనే వ్యవహృతులు. ధర్మజునకు వీరు పినతల్లులపిల్లలు శూరుఁడను యదువంశరాజునకు మారిషయను నామెయందు వసుదేవుఁడు, దేవభాగుఁడు, దేవశ్రవుఁడు, ఆనకుఁడు, సృంజయుఁడు, శ్యామకుఁడు, కంకుఁడు, అనేకుఁడు, వత్సకుఁడు, వృకుఁడునను పదిమంది కుమారులును, పృథ, శ్రుతదేవ, శ్రుతకీర్తి, శ్రుతశ్రవ, రాజాధిదేవి అనునైదుగురు కుమార్తెలును కలిగినారు.[1]

---

1 శ్రీమద్భాగవతము, నవమస్కంధము, 24వ అధ్యాయము
శ్లోకములు – 28 నుండి 30 పుట – 160

శ్రీమదాంధ్రభాగవతము, నవమస్కంధము, గద్య–714 పుట–155

తెలుగు హరివంశము, పూర్వభాగము, తృతీయాశ్వాసము
పద్యము – 159 పుట – 72

పేరిలో పృథయే కుంతీదేవి, పాండురాజు భార్య. రెండవదయాకు శ్రుతదేవ ఈమెను కారూశాధిపతియైన వృద్ధశర్మ వివాహమాడి నాడు. వీరికుమారుడు దంతవక్త్రుడు 1 అక్కచెల్లెండ్రలో నాల్గవది యైన శ్రుతశ్రవసను చేదిరాజగు దమఘోషుడు వివాహమైనాడు. వీరికుమారుడు శిశుపాలుడు 2

"...శ్రుతదేవను గారూశకుండైన వృద్ధశర్మ పెండ్లియాడె. ఇయ్యిద్దఱకు మునిశాపంబున దంతవక్త్రుడను దానవుండు జన్మించె ..చేదిదేశాధిపతియైన దమఘోషుండు శ్రుతశ్రవసను బరిగ్రహించె వారలకు శిశుపాలుం డుదయించె"3

యదువంశ వర్ణనమునకు ప్రమాణమనదగిన హరివంశమునను విష్ణుపురాణమునను కూడ శిశుపాల దంతవక్త్రులు అక్కచెల్లెండ్ర సంతానముగనే పేర్కొనబడినారు.

"శూరుడు పోరాని చుట్టమౌ కుంతిభోజునకుం
దా గుంతినాదఁదయాగాఁగఁ
బృథనిచ్చెనాయమ క్రథితతేజుండగు
పాండుని భర్తగా బడసి ధర్మ

---

1 "శ్రుతదేవాం తుకారూషో వృద్ధశర్మా సమగ్రహీత్
యస్యామభూత్ దంతవక్త్ర ఋషిశప్తో దితేస్సుతః"
శ్రీమద్భాగవతము, 9-24-38 పుట - 160

2 "తమఘోషశ్చేదిరాజః శ్రుతశ్రవసమగ్రహీత్
శిశుపాలస్సుత స్తస్యాః కథిత స్తస్య సంభవః"
శ్రీమద్భాగవతము, 9-24,38, 39 పుటలు-160, 161

3. శ్రీమదాంధ్రభాగవతము, నవమస్కంధము, గద్యము-722 పుటలు-155, 156

మారుత శక్రాశ్విమహితాంశ జన్ములగనియెఁ
బాండవుల నఖండయశుల
శ్రుతకీర్తి వృద్ధశర్ముఁడు గరూశాధీశు
వల్లభయై దంతవక్త్రుఁగాంచె
విను శ్రుతశ్రవఁ జైద్యుఁడు విగతరోషుఁ
డైన దమఘోషుఁడుద్వాహయై యుదగ్రు
పరిభటాభీలు శిశుపాలు నా హిరణ్య
కశిపు తేజోంశసంభవుఁ గలుఁగఁజేసె"1

అని హరివంశము ఇక విష్ణుపురాణమున,
"శ్రుతదేవాంతు వృద్ధధర్మా నామ కారూశ ఉపయేమే
తస్యాం చ దంతవక్త్రోనామ మహాసురో జజ్ఞే"
"శ్రుతశ్రవసమపి చేదిరాజో దమఘోష నామోపయేమే
తస్యాం చ శిశుపాల ముత్పాదయామాస"2

అని వర్ణింపఁబడినది ఈవిధముగ ప్రామాణిక గ్రంథములను పరిశీలించినచో శిశుపాల దంతవక్త్రులేకగర్భజనితులు కారనుట స్పష్టము

శ్రీకృష్ణునకు శిశుపాల దంతవక్త్రులు మేనయత్తల కుమారులు ఈవిధముగ బాంధవ్యమున్నను, బాంధవ్యమునకన్న వైరమే ప్రధా

---

1 హరివంశము, పూర్వభాగము, తృతీయాశ్వాసము, పద్యము-160 పుట-72
(మిగిలినగ్రంథములలో దంతవక్త్రుని తల్లి శ్రుతదేవ అని యుండ,
ఎఱ్ఱన శ్రుతకీర్తియని చెప్పినాఁడు)

2 విష్ణుపురాణము, చతుర్థాంశము, 14వ అధ్యాయము,
వచనములు - 30, 45 పుట - 310

నమై, వీరు వైరానుబంధముతో భగవంతుని పొందినట్లు వర్ణించుటకు హేతువైనది

"కామోత్కంఠత గోపికల్ భయమునం గంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాలముఖ్య నృపతుల్ సంబంధులై వృష్ణులుం
బ్రేమన్ మీరలు భక్తినేము నిదె చక్రింగంటి మెట్లైన ను
ద్దామధ్యాన గరిష్ఠుడైన హరిఁజెందన్ వచ్చు ధాత్రీశ్వరా"[1]

"ప్రాధాన్యేన వ్యపదేశాభవంతి" అనికదా ఆర్యోక్తి.

---

1 శ్రీమదాంధ్రభాగవతము, 7-18 పుట-8

## శిశుపాల జన్మవృత్తాంతము

శిశుపాలుఁడు జనన సమయమున నాలుగు చేతులతోను, మూఁడు కన్నులతోను జన్మించినాఁడు ఆసమయమునఁ నాకాశవాణి 'ఎవరిచే బాలుని ఎత్తికొనినపుడు అధికముగానున్న చేతులు, కన్ను అణగిపోవునో అతఁడే ఈ పాపని సంహరింపఁగలఁడ'ని పలికినది ఒక నాఁడు బలరామకృష్ణులు సాత్వతిని జూడవచ్చిరి అపుడు కృష్ణుఁడు బాలుని ఎత్తికొనఁగా నధికముగానున్న అవయవము లదృశ్యములైనవి సాత్వతి ఆకాశవాణి పలుకులను తలఁచి, తనకుమారుఁడెన్నఁడైన కృష్ణునకనిష్టము చేసినచో మన్నింపుమని ప్రార్థింప అపరాధశతమును సైతునని కృష్ణుఁడు పలికినాఁడు 1

---

1 "ఏవముక్తాతతః కృష్ణమబ్రవీ ద్యదునందనమ్
శిశుపాలస్యాపరాధాన్ క్షమేథా స్త్వం మహాబల"

కృష్ణ ఉవాచ

'అపరాధశతం క్షామ్యం మయాహ్యస్య పితృష్వసుః
పుత్రస్యతే వధారహాణం మాత్వం శోకే మనః కృథాః"

శ్రీమద్భారతము, సభాపర్వము (శిశుపాలవధ పర్వము), 40వ అధ్యాయము,
శ్లోకములు - 21, 22 పుట - 193

"కుపితప్రవృత్తుఁడయి వీఁ
డపనయమున నీకనిష్టుఁడయినను గరుణా
నిపుణుఁడవై నీమఱఁదికి
నపరాధశతంబు సైపుమయ్య యుపేంద్రా"

శ్రీమదాంధ్రమహాభారతము, సభాపర్వము, ద్వితీయాశ్వాసము
పద్యము - 59 పుట - 652

## మరణించునాటికి శిశుపాలుని వయస్సు

శ్రీకృష్ణుఁడు ధర్మరాజునకన్న కొంచెము చిన్నవాఁడు కనుక భీమునకు సమవయస్కుఁడై యుండవచ్చును అనఁగా ధర్మజునికన్న నొక్క సంవత్సరము మాత్రము చిన్నవాఁడు శతశృంగమునుండి హస్తినకు వచ్చునాటికి ధర్మజుని వయస్సు పదునాఱేండ్లు 1 పిమ్మట ద్రోణునికడ నస్త్రవిద్యనభ్యసించినది పదమూఁడు వత్సరములు 2 వారణావతమున నున్నది ఆరునెలలు ఏకచక్రపురమున గడపినది సుమారొక సంవత్సరము ఇంద్రప్రస్థమున రాజ్యముచేసినది ఇరువది మూఁడేఁడులు 3 దీనినిబట్టి ధర్మజుని వయస్సు యాగమునాటికి సుమారు ఏఁబదిరెండు సంవత్సరము లుండవచ్చును కృష్ణునకేఁబది యేండ్లుండవచ్చును శ్రీకృష్ణుఁడు పదునాఱు వత్సరముల ప్రాయములో కంసవధానంతరము సాత్వతిని చూడవచ్చినట్లు ప్రసిద్ధము కావున శిశుపాలుఁడు కృష్ణునకన్న సుమారు పదునైదు వత్సరములు చిన్నవాఁడై యుండవచ్చును దీనినిబట్టి శిశుపాలునకు మరణించు నాటికి ముప్పదియైదు, నలుబది సంవత్సరములకన్న వయసుండదు

---

1, 2 శ్రీమదాంధ్రభారతము, ఆదిపర్వము, 6వ ఆశ్వాసము
గద్య – 142 పుటలు – 355, 356

3 శ్రీమదాంధ్రభారతము, సభాపర్వము, ద్వితీయాశ్వాసము
గద్య – 317 పుట – 724

## దంతవక్త్రుఁడు

ఈతని జన్మవృత్తాంతమునుగూర్చి విశేషమేమియు కనపట్టదు. శాపవశమున దితికుమారుఁడు దంతవక్త్రుఁడై జన్మించెనని మూల భాగవతము ఆదితిపుత్రుఁడు హిరణ్యాక్షుఁడు దంతవక్త్రుఁడు దానవుఁడని చెప్పుటకు మూలమున నవకాశములేదు (9-24-36) కాని పోతన "దంతవక్త్రుఁడను దానవుండ' ని పేర్కొనినాఁడు విష్ణుపురాణమునను దంతవక్త్రుఁడసురుఁడని చెప్పఁబడినది శిశుపాలుఁడు మరణించిన సంవత్సరమునకు దంతవక్త్రుఁడు మరణించినట్లు భాగవతము, దశమస్కంధమున వర్ణితము ఈ సంవత్సరమైనను కృష్ణుఁడింద్రప్రస్థమున నుండిపోవుటవలన కలిగిన వ్యవధానము కృష్ణుడింద్రప్రస్థము నుండి తననగరము చేరిన తరువాత దంతవక్త్రుని సంహరించినాఁడు.

---

1 "భగవానపి తత్రాబ్దం న్యవాత్సీత్ప్రియంకరః "
శ్రీమద్భాగవతము, దశమస్కంధము, 78వ అధ్యాయము
శ్లోకము - 29 పుట - 499

## వైరవిస్తరణము

శ్రీమద్భాగవతము ధర్మజుఁడు రాజసూయ యాగాంతమున శ్రీకృష్ణునకగ్రపూజచేయుటను శిశుపాలుఁడు ప్రతిఘటించినాఁడు అంతవఱకాతఁడు కొన్ని యపరాధములు చేసియుండవచ్చును

యుధిష్ఠిరుఁడు తొలుత సాహచాతులను సత్కరించినాఁడు అటుపై శ్రేష్ఠపూజను ఎవ్వరికి చేయవలెనని ఆలోచనాయత్తుఁడు కాఁగా, సహదేవుఁడు శ్రీకృష్ణుని మహిమలను కొనియాడి, ఆయనకే అగ్రపూజ యొనర్పఁడనినాఁడు (10-74-19 నుండి 26) సహదేవుని వాక్యములను సభాసదులభినందించినారు శిశుపాలుఁడొక్కఁడే ఈ పూజను ప్రతిఘటించి, శ్రీకృష్ణుని దుర్భాషలాడినాఁడు 1 భగవన్నింద వినలేక సజ్జనులు సభనుండి వెడలిపోయినారు కొందఱు బలాఢ్యులైన రాజులు శిశుపాలుని సంహరించుటకును సిద్ధపడినారు (10-74-42) శ్రీకృష్ణుఁడు వారిని వారించి చక్రాయుధముతో శిశుపాలుని శిరసు ఖండించినాఁడు శిశుపాలుని దేహమునుండి యొకదివ్య తేజము వెలువడి కృష్ణునిలో లీనమైనది ఈవిధముగ మూఁడుజన్మల వైరము ముగిసినపిమ్మట వైరభావ కారణమైన దేహము వదలి శిశుపాలుఁడు విష్ణుమయుత్వమును పొందినాఁడు 2

శిశుపాలుని మరణానంతరము వైరనిర్యాతనమునకై దంత

---

1 శిశుపాలుని నిందయందలి స్తుతి ప్రకరణోచితముగ శ్రీధరీయానుసారము వివృతమగును

1. 'జన్మత్రయాను గుణితవైర సంరబ్ధయాధియా
ధ్యాయం స్తన్మయతాం నీతో భావోహి భవకారణమ్"
శ్రీమద్భాగవతము, 10-74-47, పుట-497

వక్త్రుఁడు ద్వారకను ముట్టడించినాఁడు అతఁడొక్కఁడే గదాపాణియై మహావేగముతో శ్రీకృష్ణుని నెదిరించి 'కృష్ణా! నీవు మా మేనమామ కుమారుఁడవు మిత్రద్రోహివి మూఢుఁడవైన నిన్ను గదతో సంహరించి నామిత్రుల ఋణము తీర్చుకొందు'నని కరుషాధిపుఁడు పలికినాఁడు ఇట్లు దుర్భాషలాడుచు దంతవక్త్రుఁడు శ్రీకృష్ణుని గదతో మోదినాఁడు శ్రీకృష్ణుఁడు చలింపక కౌమోదకితో నాతని వక్షస్థలమున ప్రహారము చేసినాఁడు ఆఘాతమునకు సురోవిదారమై దంతవక్త్రుఁడు రక్తముక్కుకొనుచు నేల కూలినాఁడు అపుడు శిశుపాలుని వలెనె దంతవక్త్రుని దేహమునుండియు నొక సూక్ష్మజ్యోతి సర్వులును చూచుచుండ శ్రీకృష్ణునిలో లీనమైనది 1

## శ్రీమదాంధ్ర భాగవతము

శ్రీకృష్ణుఁడు ద్వారకలో నుండఁగా నొకనాఁడు నారదమహాముని ఆయనను దర్శింపవచ్చినాఁడు ఇంతలో నపూర్వదర్శనుఁడైన భూసురుఁడొక్కరుఁడు రాజదూతయై వచ్చి, జరాసంధుని వధించి తమకు రక్షణ కల్పింపుమని ఆయా రాజుల పసుపున కోరినాఁడు.2 అనమయమున నచటనేయున్న నారదుఁడు, ముందు ధర్మజుఁడు చేయుచున్న రాజసూయయాగమునకు వెళ్ళవలసినదిగా శ్రీకృష్ణుని కోరినాఁడు. కార్యద్వయ వ్యగ్రుఁడైన కృష్ణుఁడుద్ధవుని సాచివ్యమును

1 "తతస్సుదర్శనం జ్యోతిః కృష్ణమా విశదద్భుతమ్
పశ్యతాం సర్వభూతానాం యథా చైద్యవధేనృప"
శ్రీమద్భాగవతము, 10-78-10, పుట - 507

2 శ్రీమదాంధ్రభాగవతము, దశమస్కంధము, ఉత్తరభాగము, పద్యములు 643 నుండి 664 పుట 417

కోరఁగా నారఁడు ధర్మజుని యాగమునకు వెడలుటయే యుక్తమనియు, ధర్మరాజు చేయు దిగ్విజయములో జరాసంధుని జయించినచో నుభయప్రయోజక మగుననియు కలికినాఁడు కృష్ణుఁడామాటలకంగీకరించి రాజసూయమునకు బయలుదేరినాఁడు ఇంద్రప్రస్థము చేరిన కృష్ణుఁడు భీమునిచే జరాసంధుని చంపించినాఁడు

రాజసూయము పూర్తియైన సందర్భమున నగ్రపూజ ఎవరికి చేయవలెనను సందేహము ధర్మజునకు కలిగినది సహదేవుఁడు శ్రీకృష్ణునకగ్రపూజ యొనర్పఁదగునని ధర్మజునకు సూచించినాఁడు శిశుపాలుఁడది సహింపలేక కృష్ణుని నిందించుచు సభాసదులతో 'బాలుఁడగు సహదేవుని మాటలువిని మీరందరు వివేకము కోల్పోయి, సభలోని మహాత్ములను ధిక్కరించి, హవిస్సులను నక్కలకిచ్చినట్లగ్రపూజను గోపాలునకిచ్చితిరి'ని తిరస్కరించి పలికినాఁడు

> "గురుదేవ భూసురుండు కులగోత్రరహితుండు
> దలిదండ్రు లెవ్వరో తడవగాన
> మన్నల బోరలేడు నాదిమధ్యావ
> సానంబులందరయ మానంబు లేదు..."[1]

ఇత్యాదిగనున్న శిశుపాలుని నిందను తొలుత శ్రీకృష్ణుఁడు గణింపలేదు శిశుపాలుని కరుషోక్తులు సహింపలేని కేకయ సృంజయభూకతులును, పాండవులును వానితో యుద్ధమునకు సిద్ధపడినారు. భుజాగర్వదుర్వారుఁడై న శిశుపాలుఁడు వారినిసైతము నిందింపఁగా,

"ముకుందుండాగ్రహంబున లేచి తన కట్టెదుర నెదిర్చియున్న

---

1 శ్రీమదాంధ్రభాగవతము, దశమస్కంధము, ఉత్తరభాగము, పద్యము 790, పుట 432

శిశుపాలుని రూక్షేక్షణంబుల నీక్షించుచు నాక్షణంబ తన్మస్తకంబు నిశితధారా కరాళంబైన చక్రంబున"1 ఖండించినాఁడు

"మునివరులును జనపతులును
గనుఁగొని వెఱఁగందఁ జైద్యుగాత్రమునందుం
దనుకా తేజము వెలువడి
వనజోదరు దేహమందు వడిఁజొచ్చె నృపా"2

అప్పుడందఱు నాశ్చర్యపడి చూచుచుండ శిశుపాలుని దేహము నుండి యసమాన కాంతిపుంజము వెలువడి, శ్రీకృష్ణునిలో ప్రవేశించినది.

శిశుపాల వధానంతరము శ్రీకృష్ణుఁడు కొంతకాలము ఇంద్రప్రస్థముననే యుండెను. ఇంతలో సాల్వుఁడు ద్వారకను ముట్టడించినాఁడు కృష్ణుఁడు ద్వారకచేరి సాల్వుని, పౌండ్రకుని సంహరించినాఁడు దంతవక్త్రుఁడు శిశుపాల, సాల్వ, పౌండ్రకులకు పారలౌకిక క్రియలొనర్చి, కృష్ణునిపైకి దాడివెడలినాఁడు శ్రీకృష్ణుని గదాప్రహారముతో దంతవక్త్రునకురోవిదారమై, తద్గాత్రమునుండి సూక్ష్మతేజము వెడలి గోవిందుని దేహముఁ బ్రవేశించినది

## సంస్కృత భారతము

శిశుపాల వధ వృత్తాంతము సభాపర్వముయొక్క ఉపపర్వము లైన అర్ఘ్యాభిహరణ పర్వము, శిశుపాలవధ పర్వములలో విపులముగ వర్ణితము

యాగాంతర మగ్రపూజయం దెవ్వరిని పూజింపవలెనను

---

1, 2 శ్రీమదాంధ్రభాగవతము, దశమస్కంధము, ఉత్తరభాగము
వచనము 794, పద్యము 795, పుట 433

ధర్మజున నందేహమునకు, శ్రీకృష్ణునకగ్రపూజ చేయుమని భీష్ముఁడు సమాధానమిచ్చినాఁడు (2.38.27)

శిశుపాలుఁడందుల కంగీకరింపక 'మహాత్ములైన పాండవుల కల్పబుద్ధివై నీవిట్లు చెప్పుట కూడదనియని యని భీష్ముని యాక్షేపించి నాఁడు ఇంకను శిశుపాలుఁడు ధర్మజునితో 'ఇందరు రాజులుండగా దాశార్హుఁడు పూజార్హుఁడెట్లగునాఁడు? కృష్ణుఁడు వసుదేవునికన్న వయోవృద్ధుఁడా! ద్రుపదునికంటె నీకింతటియుఁడౌనోఁడా? ద్రోణుని కంటె నాచార్యశ్రేష్ఠుఁడా? వ్యాసునికన్న ఋత్విజుఁడా? ఇట్లర్చనార్హతలేని వానినేమిని అర్చించితివి? అదియుచటి రాజులకవమానము కాదా? రాజసభలో నింతటింటు నవమానమున్నదా? అప్రాప్తలక్షణుఁడైన (2.34-16) కృష్ణునర్చించి ధర్మపుత్రుఁడవను కీర్తిని పోగొట్టు కొంటివికదా! ఈవృష్ణికులమునఁ బుట్టినవాఁడు జరాసంధు నన్యాయముగ చంపలేదా?' అని తిరస్కరించి పలికినాఁడు శిశుపాలుఁ డంతతోనాగక శ్రీకృష్ణునితో 'పాండవులు భయపడి సమాధానము చెప్పటలేదు నీవైన నేకారణముచే పూజకు తగుదునని యంగీకరించితివి? అయోగ్యుఁడవైన నీకుజరిగిన సత్కారములో హవిస్సును కుక్క ఆస్వాదించినట్లుండె బహమాకరణము చేసికొనుచున్నావు పేడికి వివాహము, పుట్టుగ్రుడ్డికి రూపదర్శనములవలె రాజు కాని నిన్ను పూజించుట వ్యర్థమైనది ధర్మజుఁడు, భీష్ముఁడు, నీవు పరస్పరము తగినవారైనారని నిందాపూర్వకముగ పలికి, యుద్ధసన్నద్ధుఁడైనాఁడు.

అపుడు ధర్మరాజు శిశుపాలు ననునయించుచు 'భీష్ముఁడు చెప్పినది ధర్మము ఆయననవమానించుట తగదు. మిగిలిన రాజులు కృష్ణుని పూజనంగీకరించినారుకదా! వారివలె నీవునంగీకరింపుము (షింతుమర్షాసి)భీష్మునకు శ్రీకృష్ణతత్వము తెలిసినట్లు నీకు తెలియద'ని

పలికినాడు అపుడు భీష్ముడు 'వీనిని ప్రతినమలు చనవసరము లేదు క్షత్రియులనందఱ జయించినవాడు వీర శ్రేష్ఠుడు సభలోని యీరాజులలో కృష్ణునిచే జయింపబడని వాడెవ్వడు? శ్రీకృష్ణుడు జ్ఞానవృద్ధుడనుట సత్యము బ్రాహ్మణులలో జ్ఞానసంపన్నుడు, క్షత్రియులలో బలాధికుడు పూజ్యులు ఆ రెండును గోవిందునియందు కపన్నము లగుటచే నాతనిని పూజించితిమి'[1] ని స్పష్టముగా పలికినాడు

భీష్ముడిట్లు పలుకగా, సహదేవుడు 'మేము కృష్ణపూజయొనర్చితిమి అదినహింపని వారి తలపై పాదముంచెదన'ని చరణ మెత్తినాడు అపుడాతనిపై పుష్పవృష్టి కురిసినది యజ్ఞవిఘ్నము కలుగునను భయముతో, ధర్మజుడు రోషావేశులైనవారిని శాంతింపజేయుమని భీష్ముని ప్రార్థించినాడు కృష్ణుడు మాటలాడనంతవఱకే వీరియాగడములు చెల్లుననియు, భయములేదనియు భీష్ముడభయమిచ్చినాడు. శిశుపాలుడామాటలకు రెచ్చిపోయి 'కృష్ణుని యండజూచుకొని నన్ను బెదరించుచున్నావు పౌరుషములేని నీకిది సహజము ఓడతో గట్టిన నోడవలె నిన్నుగూడి ధర్మజుడును చెడినాడు కృష్ణుని స్తుతించు నీ నాలుకను కోయవలెన'ని యాక్షముగ పలికినాడు శిశుపాలుడాపై కృష్ణుని బాల్యక్రీడల నధిక్షేపించి, ఆయనపౌరుషమునుకూడ ధిక్కరించి దురుక్తులాడినాడు. భీముడపుడు శిశుపాలుని సంహరింపగా భీష్ముడు వారించి, కృష్ణునివలననే శిశుపాలుడు వధింపబడుట విధినిర్ణయమని దెలిపి, ఆతని జన్మవృత్తాంతమును వివరించినాడు

శిశుపాలుడింకను నుద్ధతుడై ప్రవర్తించుచుండుట చూచి గోవిందుడాతడాదినుండియు చేయుచున్న అపరాధములు వివరిం

---

1 జ్ఞానవృద్ధో ద్విజాతీనాం క్షత్రియాణాం బలాధికః
పూజ్యేతావిహ గోవిందే హేతూద్వావపి సంస్థితౌ"
శ్రీమహాభారతము, 2-35-17, పుట 175

చుచు 'మేము ప్రాగ్జ్యోతిష పురముపైకెత్తి భగదత్తునితో యుద్ధము చేయుచుండ, వీడు ద్వారకను దహించినాఁడు రైవతక పర్వతమున క్రీడలలోనున్న భోజవంశీయులగు మా బంధువులఁ జంపినాఁడు మా తండ్రిగారి యశ్వమేధాశ్వమును హరించినాఁడు బభ్రుఁడను యదు వృద్ధుఁడు సౌవీర దేశమునకు పోఁగా వీఁడాయన భార్యనపహరించి నాఁడు. నామేనత్తకిచ్చిన మాటను పాటించి వీనినింతదనుక సహించి తిని ఈవిధముగ ప్రత్యక్షముగను, పరోక్షముగను వీఁడు చేసిన అప రాధములవధిపూరకములైనవి రుక్మిణీహరణము నాతప్పుగ నీతఁడు ప్రచారముచేయుచున్నాఁడు రుక్మిణికితనియందు జుగుప్స ఆమె నన్ను వరించినద'ని పలికినాఁడు

రుక్మిణీహరణ ప్రసక్తి వినిన శిశుపాలుఁడు ద్విగుణీకృతముగ శ్రీకృష్ణుని దుర్భాషలాడినాఁడు అంత కృష్ణుఁడు చక్రాయుధము ప్రయోగించి శిశుపాలుని శిరము ఖండింప నొకమహాతేజమాతని దేహము నుండి వెలువడి శ్రీకృష్ణునకు నమస్కరించి ఆయనలో లీన మైనది 1

## ఆంధ్ర మహాభారతము

ధర్మరాజుఁడొనర్చిన రాజసూయ యాగమునకు సంతుష్టుఁడై భీష్ముఁడు స్నాతక, ఋత్విజ, సద్గురు, భూతిలేశ, నయజ, ఇష్టులలో నెవ్వఁడు మహాత్ముఁడో వానిని పూజితుఁజేయుమనినాఁడు అట్టి

---

1 తతశ్చేదిపతేః దేహాత్ తేజోఽగ్ర్యం దదృశుర్నృపాః
ఉత్పతంతం మహారాజ గగనాదివ భాస్కరమ్"
"తతః కమల పత్రాక్షం కృష్ణం లోకనమస్కృతమ్
వవందే తత్తదా తేజః వివేశచ నరాధిప"
మహాభారతము, సభ పర్వము, శిశుపాలవధ పర్వము, 42వ అధ్యాయము, శ్లోకములు 22, 28 పుట - 202

వానిని తనకెఱిఁగింపుమని ధర్మజుఁడు ప్రార్థించఁగా, యజ్ఞపురుషుఁడు, అఖిలలోకపూజ్యుఁడు, అచ్యుతుఁడు నైన శ్రీకృష్ణుని పూజించిన నదియే యజ్ఞఫలమని భీష్ముఁడు తెలిపినాఁడు

ధర్మజుఁడు శ్రీకృష్ణున కగ్రపూజచేయఁగా, అదిచూచి సహింపలేని శిశుపాలుఁడు 'అవనీనాథులనేకులుండఁగా వార్ష్ణేయుని పూజించితివి దాశార్హుఁడు పూజార్హుఁడా? కృష్ణుఁడు మీకెంత యిష్టుఁడైనచో ధనాదికముల నీయఁదగును గాని ఇట్లు సభనవమానింతురా? కృష్ణుఁడు వయోవృద్ధుఁడా? ఋత్విజుఁడా? ఆచార్యుఁడా? భూనాథుఁడా? ఏమని పూజించితివి? తెలియక నీవర్ఘ్యమిచ్చినను తగుదునని కృష్ణుఁడెట్లు స్వీకరించినాఁడు? పేడికి భార్యవలె, చెవిటివానికి మధుర గీతివలె, గ్రుడ్డివానికి సురూపదర్శనమువలె కృష్ణునకీయగ్రపూజ వ్యర్థము'ని ధర్మజు నాక్షేపించి సభనుండి వెడలిపోయినాఁడు

శిశుపాలు ననునయించుచున్న ధర్మజుని వారించి, భీష్ముఁడు శ్రీకృష్ణుఁడర్ఘ్యమునకెట్లు అర్హుఁడో వివరించిచెప్పి శిశుపాలునివంటి దుర్నయులు దీనినెఱుఁగలేరని పలికినాఁడు శిశుపాలుఁడు యుద్ధసన్నద్ధుఁడు కాఁగా, సకలక్షత్రియక్షోభము మాన్పుమని ధర్మజుఁడు భీష్ముని ప్రార్థించుట; శిశుపాలుఁడు భీష్ముని దూలనాడుట, భీష్ముఁడు శిశుపాలుని జన్మవృత్తాంతమును భీమునకు చెప్పుట; శ్రీకృష్ణుఁడు శిశుపాలుని యపరాధముల వివరించుట, తుదకు కృష్ణుఁడు చక్రాయుధముచే నాతని సంహరించుట, శిశుపాలుని దేహమునుండి తేజస్సు పరమేశ్వరునిలో లీనమగుట ఇత్యాదులు మూలముతో తుల్యములు.2

---

1. శ్రీమదాంధ్ర మహాభారతము, సభాపర్వము, ద్వితీయాశ్వాసము
   పద్యము - 11 పుట - 640
2. శ్రీమదాంధ్రమహాభారతము, సభాపర్వము, ద్వితీయాశ్వాసము
   పద్యములు - 22 నుండి 69 పుటలు - 642 నుండి 654

## మాఘకావ్యము

శ్రీమద్భాగవతమునకు శ్రీధరస్వామి వ్యాఖ్య ప్రాచీనము, ఉత్తమము ఈ వ్యాఖ్య క్రీ శ 1300-1350 సంవత్సరముల మధ్య కాలమున రచింపబడినదని పురాణచరిత్రకారుల యభిప్రాయము[1] శ్రీధరుడు హిరణ్యాక్ష శిశుపాల దంతవక్త్రు లొనర్చిన భగవన్నిందా పరములైన మూలశ్లోకములకు స్తుతిపరముగ వ్యాఖ్య యొనర్చినాడు.

శ్రీధరస్వామికి సుమారు ఏడువందల సంవత్సరములకుముందు మాఘుకవి క్రీ శ ఏడవ శతాబ్ది ప్రారంభమున[2] శిశుపాలవధ కావ్యమున నిట్టిస్తుతిగర్భములగు నిందావాక్యములున్న శ్లోకములనుగూర్చినాడు మల్లినాథసూరి వీనిని స్తుతిపరములుగ వ్యాఖ్యానించినాడు

## మాఘకావ్య కథాంశము

నారదమహర్షి ద్వారకలోనున్న శ్రీకృష్ణునికడకు ఇంద్రసందేశమును గొనివచ్చినాడు శిశుపాలుని పూర్వవృత్తము చెప్పుచు 'వీడు పూర్వము హిరణ్యకశిపుడను రాక్షసుడు, రెండవజన్మమున రావణుడు, మూడవ జన్మమున శిశుపాలుడు వీడు ధార్మికశాసనముల నుల్లంఘించుచున్నాడు. వీనిని వెంటనే వధింపుము'ని యింద్రుని సందేశసారాంశమును నారదుడు తెలిపినాడు ఈసమయముననే యుధిష్ఠిరుని రాజసూయమునకు కృష్ణున కాహ్వాన మొచ్చినది. ముందు శిశుపాలుని చంపుటకు పోవలెనా, రాజసూయయాగమునకు పోవలెనాయని కృష్ణుడు డోలాయమానసుడై ఉద్ధవ బలరాముల

1 పురాణవిమర్శ (హిందీ), బలదేవోపాధ్యాయ, పుట-578
2 సంస్కృతసాహిత్యేతిహాస, శ్రీరామచంద్రమిశ్ర పుట-49

సాచివ్యము కోరినాఁడు బలరాముఁడు ముందు శిశుపాలునిపైకి దండె త్తిపోవుదమనియు, తాము లేకున్నను ధర్మజుఁడు రాజసూయము నిర్వహించుకొనగలఁడనియు బలికినాఁడు కాని ఉద్ధవుఁ డీమాటల నంగీకరించలేదు బలవంతుఁడు శత్రువును అలస్యముచేసినను జయిం పఁగలఁడు కాని, అప్పుల మనస్సు నొప్పించి నరిచేయలేఁడనియు, కనుక ధర్మజుని నొప్పింపక ముందు యజ్ఞమునకు వెళ్ళుటయే కర్తవ్య మనియు ఉద్ధవుఁడు పలికినాఁడు 'అంతే కాక శిశుపాలుఁడనహా యుఁడు కాఁడు వానికి వానివంటి దుష్టులైన సాల్వుఁడు, రుక్మి, కాల యవనాదులున్నారు 1 మనకు ప్రస్తుతము వేఱు సహాయములేదు యజ్ఞమునకు వెళ్ళినచో ధర్మజు నీయందు విశేషభక్తిని చూపఁ గలఁడు అది శిశుపాలాదులు సహింపలేరు అపుడు తిరుగుబాటుతప్ప దు అందువలన మనపక్షమువారు విరోధులు నను రెండువర్గములేర్ప డును ఆత్మవేత్తలయండ నీకు లభించుటచే అచటనే నీకు విజయము సిద్ధించును' అను ఉద్ధవుని సాచివ్యము శ్రీకృష్ణునకు నమ్మతమైనది

నవనమునకు వచ్చిన శ్రీకృష్ణునకు ధర్మజుఁడు స్వాగతము పలికినాఁడు తననంపదనంతటిని గ్రహించి రాజసూయమును కృష్ణునే చేయుమని ధర్మజుఁడు కోరఁగా శ్రీకృష్ణుఁడు ధర్మరాజే అందులకర్హుఁ డనియు, యజ్ఞనిర్వహణమున నాటిని యాజ్ఞను పాటింపని రాజులను సుదర్శనముతో 2 ఖండింతుననియు హెచ్చరించినాఁడు యజ్ఞనహా ప్తి

1 'యేనాన్యే కాలయవన సాల్వ రుక్మిద్రుమాదయః
తమప్యభావాస్తేవ్యన్యే ప్రదోషమమయాయునః',
"మాపేది యదపాదేకో కేకవ్యస్తేదిరాడితి
రాజయక్ష్మేవ రోగాణాం సమూహస్సమహీభృతామ్"
మాఘము, ద్వితీయసర్గ, శ్లోకములు-96, 98 పుట-60

2 "య స్తవేహ నవనే నభూపతిః కర్మ కర్మకరవత్ కరిష్యతి
తస్యనేష్యతి వపుః కబంధతాం బంధురేష జగతాం సుదర్శనః"
సర్గ - 14 శ్లోకము - 16 పుట - 331

తరువాత కృష్ణునకగ్రపూజ గావింపుమని భీష్ముఁడు ధర్మజునకు చెప్పినాఁడు శ్రీకృష్ణుని మాటలతో శిశుపాలవధ సూచితమైనను, భీష్ముని పలుకులతో రంగము సిద్ధమైనది

చేదిరాజగు శిశుపాలునకీప్రతిపాదనము సమ్మతము కాలేదు ఇతఃపూర్వమే కృష్ణునితో వైరముగల యాతనికీవిషయము సహజముగనే ఉద్వేజకమైనది అపుడు స్వేదతో నిండిన శరీరముతో వేగముగ లేచినిలచిన ఆశిశుపాలుని దేహము భూమిని ధరించుచున్న వరాహమూర్తి శరీరము సముద్రజలములో తడిసినపుడున్నట్లు ప్రకాశించినది 1 అట్లు రోషపరవశుఁడైన శిశుపాలుఁడు పాండవుల నిందించుచు 'మీరా మురారి పూజ మీరాయిష్టమైన వానియందు ప్రేమ చూపుటయే కాని అతని గణిత్వ నిమిత్తము కాదు రాజు కాని మురారికి యిట్లగ్రపూజ చేయుట. శునకమునకు హవిస్సునిచ్చుటయే సత్యమే పలుకుదువను ప్రసిద్ధిగన్న ధర్మజా! నింద్యమైన హరిచరితమే నీపూజచే నీసత్యహీనతను లోకమునకు చాటిచెప్పును అమంగళమైన భౌమవారమును మంగళవార మన్నట్లే నిన్ను ధర్మరాజనుటయును నీకు కృష్ణుఁడే పూజ్యుఁడైనచో నిందరు రాజులనేల పిలిచితివి? బుద్ధి లేని భీష్ముఁడు చెప్పినమాటలేల వింటివి?' అని యధిక్షేపించి కలికినాఁడు ఇక భీష్ముని 'నీవు స్నాతకుఁడు, గురువు, ఇష్టబంధువు, ఋత్విజుఁడు, అల్లుఁడు, రాజు పూజార్హులంటివి కదా!'2 వీరిలో కృష్ణుఁడెవ్వఁడు? రాజులలో నీవంటి మూర్ఖుఁడు పుట్టఁడని హేళనచేసినాఁడు ఇక శ్రీకృష్ణునుద్దేశించి శిశుపాలుఁడు 'నీవు మధువను రాక్ష

---

1 సనికామ ఘర్మితతనుర్భీక్ష్ణ మధు వదవధూతరాజకః
క్షిప్తబహుల జలబిందువపుః ప్రలయార్ణవోత్థిత ఇవాది సూకరః"
సర్గ – 15 శ్లోకము – 5 పుట – 357

2 సర్గ – 14 శ్లోకము – 55 పుట – 345

సుని చంపి మధుసూదనుఁడవైనావఁటఁగదా! అంతేనా లేక దండ
ముతో మధుతాడనముచేసి (తేనటీగను కొట్టి) మధుసూదనుఁడ
వైతివా? నీవు బలరామునితో కలసియున్నందున "నబలుఁడ"వైనావు.
చక్రముధరించి చక్రధారివయ్యు నది శత్రుభంజకము కాదు యదు
వంశమునఁ బుట్టుటచే రాజ్యార్హత లేకున్నను, నీవారుమాత్రమే
నిన్ను శ్రీపతి యనుచున్నారు యుద్ధములయందు శీఘ్రక్రమణము
(పారిపోవుట) కల్గియుండుటచే "విక్రముఁడ"నబడినావు. జరాసం
ధుఁడు నిన్ను మధురనుండి వెడలనడచుటచే "భూమిభృత్" అని
నిన్ను జనులు పరిహాసముగ పిలుచుచున్నారు' అని యధిక్షేపించినాఁడు
శిశుపాలుని పలుకులనువిని భీష్ముఁడు ఈనిర్ణయమునకెదురు పలికిన
వారిని దండింతుననియు, కృష్ణపూజ నాదరించిన వారిశిరసుపై తన
పాదముంచెదననియు హుంకరించినాఁడు ధర్మజుఁడు కోపము విడువుఁ
డని సభవారినందరిని ప్రార్థించినాఁడు శిశుపాలుఁడా సభను విడచి
వెడలినాఁడు ఆపిమ్మట నాతఁడు శ్రీకృష్ణునికడకొక దూతనంపినాఁడు.
ఆసందేశమంతయు అంతరార్థ గుంఫితము. ఆదూత శ్రీకృష్ణునితో
'శిశుపాలుఁడిచ్చట అవిధముగ నప్రియములుపలికి పరమానుశయము
(పశ్చాత్తాపము) పొంది, (యుద్ధముచేయవలెనను కోరికనణచలేక)
నీవలన తిరిగి మ ననము (గౌరవము, చావు) కోరుకొనుచున్నాఁడు.
కోరుకొనిన గాఢమైన విగ్రహాలింగనము (కౌఁగిలి, యుద్ధకాంక్ష)
లభించినచో నిర్వృతి (పరశాంతి, మోక్షము) పొందఁగలఁడు రాజు
లందరిచే తిరస్కరణాసము పొందిన (నిన్ను) తనను, నీ (తన) శాసనము
గౌరవింపవలసియున్నది'[1] అని శిశుపాలుని సందేశమును వినిపించి

---

1 మాఘము, సర్గ - 16 శ్లోకములు - 2, 8

నాఁడు ఇచ్చట నింకను అనేకములగు గూఢార్థశ్లోకము లున్నవి[1] కాని వాని యర్థద్వయ మనువదించుట తెనుఁగు సంప్రదాయమున సాధ్యముకాదు. మల్లినాథసూరి ఈశ్లోకములన్నింటిని భక్తిపరార్థమునఁగూడ వ్యాఖ్యానించినాఁడు. తరువాత యుద్ధసన్నాహము, సభ కోలాహలము పక్షితము తుదకు చక్రప్రయోగమున శిశుపాలుని సంహరించినవిమ్మట దివ్యజ్యోతి ఆతనిదేహమునుండి వెలువడి శ్రీకృష్ణునిలో ప్రవేశించినది[2]

---

1. మాఘము పూర్తిగా 16వ సర్గ, 84 శ్లోకము
2. " సర్గ - 20 శ్లోకము - 79 పుట - 506

## వైరభక్తి

చెఱుకుపల్లి జమదగ్నిశర్మగారు శిశుపాలుని వైరభక్తి వేదన నావిష్కరించుచు 'వైరభక్తి' యను ఖండకావ్యమును రచించినారు జన్మత్రయమున శిశుపాలుఁడు పొందిన యాతనావేదనకు నిదర్శనముగ తొల్లింటి రెండుజన్మలను సంక్షేపముగ కవి వర్ణించినారు శ్రీకృష్ణ శిశుపాలురకు వైరము కల్గుటకు ప్రధానకారణము రుక్మిణీదేవి శిశుపాలుని చిన్ననాటనే శ్రీకృష్ణుఁడాతనికి మృత్యువని లోకవిదితము కాని, అది యెన్నటికి జరుగునో ఆతనికి తెలియదు అందువలన సాయుజ్యమును వేగముగ పొందుటకై రుక్మిణీదేవిని తన వైరసాధన కుపకరణముగ శిశుపాలుఁడెంచుకొనినాఁడు కావున రుక్మిణీకల్యాణ మును వీరి గ్రంథమున ప్రధానస్థానము వహించినది

శ్రీకృష్ణుఁడు శిశుపాలునకు మార్గముచూపుటకు తానే రుక్మిణీ హరణము గావించి శిశుపాలుని వైరాభిముఖుని గావించెననియు మహాకవుల యభిప్రాయము 1 శిశుపాలుఁడే ప్రారంభించినను, శ్రీకృష్ణుఁడే ప్రారంభించినను వైరకారణము రుక్మిణి యనుట నిర్వివాదము కావుననే అగ్నిద్యోతనుని రాయబారమునుండి కల్యాణము వఱకుఁగల భాగమీ గ్రంథమున ప్రధానపాత్ర వహించి, రాజసూయము గౌణమైనది వైరానుబంధ తీవ్రతయే వైరభక్తినుద్దీపనము గాన జమదగ్నిశర్మగారామార్గముననే వైరభక్తి రసపోషణ గావించినారు

---

1 'త్వయా విప్రకృతశ్చైద్యో రుక్మిణీం హరతా హరే
బద్ధమూలస్య మూలం హి మహద్వైరతరోః స్త్రియః''

మంత్రాలోచన సమయమున బలరాముఁడు కృష్ణునితో 'నీవు రుక్మిణిని హరించుటచే శిశుపాలుఁడు నీవలన నపకారమును పొందినాఁడు. వైరమను వృక్షమునకు స్త్రీలు ముఖ్యముకదా' అనినాఁడు

మాఘము, 2వ సర్గ శ్లోకము - 38 పుట - 41

## దంతవక్త్రుని సంహారము

జయవిజయులకు హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగ నున్ననాటి తీవ్రతర వైరమున తరువాతి జన్మలయందు క్రమముగా తగ్గుచు వచ్చినది కాని ఆయా జన్మల సత్త్వసంపద ననుసరించి ఆపాటి వైరమే తీవ్రము యుగధర్మమును బట్టి ఆయుః ప్రమాణమును, జీవశక్తియు మారుచుండును శిశుపాల దంతవక్త్రులకు కలియుగ ప్రారంభము నాటి లక్షణములే యుండుటచే వారి ఆయుర్దాయమును శతవర్ష పరిమితము భారతయుద్ధము తరువాత పరీక్షిత్తు రాజ్యముచేయు కాలముననే కలియుగము ప్రవేశించినది పరీక్షిత్తుని యసాధారణ శక్తివలన నాతని రాజ్యమున కలిబాధ లేకపోయినది 1 యుగలక్షణములు కొంత ధర్మతత్పరతవలన నాగినను, యుగధర్మము లాగవు ద్వాపరము చివరిభాగము కలియుగ సంధికాలము ఈసంధికాలమున శిశుపాల దంతవక్త్రుల సంహారము జరిగినది

మఱియొక విశేషము శాపకాలమున జయవిజయులకు ఏకస్థానస్థితి సిద్ధించినను, వారి యనుబంధము క్రమముగా తగ్గుచువచ్చినది. హిరణ్యాక్ష హిరణ్యకశిపులు కలసియున్నంతకాలము రావణ కుంభకర్ణులకు కలసియుండుట కథకాశము లేదు ఉన్నయవకాశమును కుంభకర్ణుని నిద్రారూపమున విధివారించినది అనురాగబంధము పెరిగినచో నది పునర్జన్మ హేతువగును ఈరహస్యము శ్రీమద్భాగవతము, చతుర్థస్కంధములో జడభరతుని వృత్తాంతమున వివృతము మర్త్యతోనియందనురాగము మిగిలిన జన్మములలోకంటె అధికముగ నుండును భగవంతుడీ రహస్యమును పాటించియే కాంబోలు మొదటి

---

1 శ్రీమదాంధ్రభాగవతము ప్రథమస్కంధము
పద్యములు - 411 యుండి 456 పుటలు - 67 నుండి 68

రెండుజన్మలలోను వీరగర్భజనితులైనవారికి, మూడవ జన్మమునకట్టి యనుబంధమును తప్పించినాడు కాని శిశుపాలునితో కొంతయైనను అనుబంధము లేనిచో దంతవక్త్రునకు నిర్వాణావకాశము కలుగదు శిశుపాలవధకు ప్రతీకారముగ దంతవక్త్రుడే కృష్ణునిపై యుద్ధమునకు వెడలనిచో శాపమోక్షమున కవకాశమే యుండగు అందువలన కొంతయైనను అనుబంధశేషముండుటకై, భగవత్కృపవలన సక్కు చెల్లెండ్ర పిల్లలుగ వారు జన్మించినారు వీరియనురాగము ప్రత్యక్ష జన్యము కాదని శ్రీమద్భాగవతమునసే వర్ణితము

"శిశుపాలస్య సాల్వస్య పౌండ్రకస్యాపి దుర్మతిః
పరలోకగతానాం చ కుర్వన్ పారోక్ష్యసౌహృదమ్"1

శ్రీధరస్వామి "పరోక్షేకరణీయం సుహృత్కృత్యమ్" అని 'పారోక్ష్య సౌహృదము'ను పదమును వ్యాఖ్యానించినాడు అవ్యాఖ్యకు స్నేహితుని మరణానంతరము చేయవలసినకని మిగిలిన స్నేహితుని కర్తవ్యమని భావము ప్రస్తుతకథలోనది ప్రతీకారరూపమైనది శిశుపాల దంతవక్త్రుల ప్రత్యక్షసంబంధము అన్నదమ్ముల వరుసగల బంధుత్వము. పరోక్షసంబంధము నారాయణ పార్షదత్వము శాప శేషము దంతవక్త్రుడే. అందువలన 'పారోక్ష్య సౌహృదము' దంతవక్త్రుని కర్తవ్యమైనది కనుకనే అతఁడనపాయుఁడై పారిపెదురొక్కని నాఁడు

"ఏకః పదాతిసంక్రుద్ధో గదాపాణిః ప్రకంపయన్
పద్భ్యామిమాం మహీం మహారాజ మహాసత్త్వో వ్యదృశ్యత"2

1 శ్రీమద్భాగవతము, 10-78-1 పుట - 506
2 శ్రీమద్భాగవతము, 10-78-2 పుట - 506

సాల్వ పౌండ్రక శిశుపాలురకు పారలౌకిక క్రియలు కావించి, దంతవక్త్రుండతి భీషణాకారముతో

పెటపెట పండ్లుగీటుచును బెట్టుగ మ్రోయుచుం గన్నుగ్రేవలం
జిటజిట విస్ఫులింగములు సింద మహోద్ధత పాదఘట్టనన్
పటపటనై ధరిత్రి వడకాడ వడిన్ గద కేల ద్రిప్పుచున్
మిటమిట మండు వేసవిని మించుదివాకరుఁబోలి యుగ్రతన్ "[1]

కృష్ణు నెదుర్కొనినాడు ఒంటరిగా పాదచారియై గదతో శ్రీకృష్ణు నెదిరించుటకు దంతవక్త్రుండు వచ్చిన ఈ సన్నివేశము హిరణ్యాక్షుడు వరాహరూపము నెదుర్కొనుటకు వెడలిన ఘట్టమును స్ఫురింపజేయును సూక్ష్మముగ పరిశీలించినచో దంతవక్త్రునితో పూర్తియైన మూడుజన్మలయందు నిట్టివిశేషమే గోచరించును హిరణ్యాక్షుడొక్కడే హరినన్వేషించినాడు కుంభకర్ణుడొక్కడే రామునిపై యుద్ధమునకు వెడలినాడు ఇపుడును దంతవక్త్రుండు మాత్రమే దాడికివచ్చినాడు శాపప్రారంభ సమాపనములు ప్రత్యాహార మొకరీతిలోనే జరిగినది నారాయణ హిరణ్యాక్షులకును గదాయుద్ధమే జరిగినది శ్రీకృష్ణ దంతవక్త్రులకును గదాయుద్ధమే జరిగినది. నారాయణునకు కలిగిన యుద్ధకుతూహలము శస్త్రాస్త్రప్రయోగములతో పరిపూర్ణనిర్వహణము పొందినది అస్త్రము మంత్రకము శస్త్రము భుజప్రయోజ్యము యుద్ధారంభము సాధారణ శస్త్రములతో ప్రారంభించి, శత్రువు సామాన్యుడు కాడనుకొనినపుడు మాత్రమే అస్త్రమును ప్రయోగించుట వీరధర్మము, హిరణ్యాక్షుని తోడి యుద్ధమున నారాయణుని శస్త్రకౌశల ప్రదర్శనోత్సాహము

---

1 శ్రీమదాంధ్రభాగవతము, దశమస్కంధము, ఉత్తరభాగము
పద్యము - 915 పుట - 448

నెరవేరినది కుంభకర్ణునకు శస్త్రములచే మరణముతో పోవుటచే బ్రహ్మాస్త్ర ప్రయోగమవసరమైనది మొదటి రెండుజన్మలలోనే భగవత్సంకల్పము నెరవేరినది కనుకనే పార్షదుల శాపశేషమును నెరవేర్చుటకే భగవంతుఁడాయుధమును పట్టెను.గాని యుద్ధోత్సాహమిట కన్పట్టదు శిశుపాలునితో యుద్ధమే లేదు దంతవక్త్రునికి మాత్రమొక్క గదాప్రహారము ప్రసాదించినాఁడు అదియు నిర్నిమిత్తము కాకుండ దంతవక్త్రుఁ డొనర్చిన నిందను, అతని ప్రథమప్రహారమును నిమిత్తముగ స్వీకరించినాఁడు

దంతవక్త్రుఁడు శిశుపాల, పౌండ్రక, సాల్వులవధకు ప్రతీకారముగ గదాపాణియై కృష్ణునిపై దండెత్తివచ్చి,

“ . దిష్ట్యాదిష్ట్యా భవానద్య మమ దృష్టిపథం గతః”
“త్వం మాతులేయో నః కృష్ణమిత్రధ్రుఙ్మాం జిఘాంససి
అతస్త్వాం గదయా మందహనిష్యే వజ్రకల్పయా”

“తర్హ్యానృణ్యముపైమ్యజ్ఞ మిత్రాణాం మిత్రవత్సలః
బంధురూపమరిం హత్వా వ్యాధిం దేహచరం యథా”1

అని నిందించినాఁడు ఈనిందాశ్లోకములను శ్రీధరస్వామి స్తుతిపరముగ వ్యాఖ్యానించినాఁడు

“జన్మత్రయేణ అన్విష్యమాణః అద్య బ్రహ్మశాపావసానే భవాన్ మమ స్వామీ దృష్టిపథం గతః ప్రాప్తః పతిద్దిష్ట్యాదిష్ట్యా భద్రం అతి హర్షే వీప్సా (4) కించ త్వమితి హేకృష్ణ త్వమస్మాకం మాతులేయో బంధుః ఏవమపి మిత్రధ్రుక్ మిత్రాణి ఘాతితవాన్. మాం చ త్వం జిఘాంససి తస్మాదస్మాకం త్వత్తో మృత్యుః ననా

1 శ్రీమద్భాగవతము, 10-78 4 నుండి 6, పుటలు-506, 507

ద్యనుగ్రహః ప్రాప్తోనూనం దుర్వారః అతస్త్వామేతావన్మాత్రమహం యాచే కిం తత్ తదాహ - హే అమంద నర్వసహన సమర హృత్తధర్మేన సేవితుం గదయా త్వాం హనిష్యే ప్రహరిష్యామి తామేకవారం సహస్వేతి సను వజ్రతుల్యాం త్వద్గదాం కోవా నహేతతి నైవమిత్యాహ- అవజ్ఞేయ్యయా ఉత్పల మాలావదతి కోమలయేత్యర్థః (5) ఏన్వేవం హాననేకి స్వ పురుషార్థ స్తమాహ - తర్హీతి అజ్ఞః న విద్యతే జ్ఞో యస్మాత్ తస్య సంబుద్ధిః హే సర్వజ్ఞే త్యర్థః పరమార్థతః స్వామినమ్ పరిద్దేహానంబంధేన బంధురూపవమ్ బ్రహ్మశాపేన తు శత్రుత్వేన ప్రతీతం త్వాం హత్వా మిత్రతా మాపన్నాం ఉపైమి ఉపైష్యామి విశేషేణ అధీయతే మనసి చింత్యత ఇతి వ్యాధిః దేహే అంతర్యామి తయా చరతీతి తథా తమీశ్వరం హత్వా హృత్తధర్మేణ అరాధ్య హంతేర్గత్యర్థస్య జ్ఞానార్థత్వాత్ జ్ఞాత్వేతి వా తేన యథా పిత్రాదీనామానృణ్యమువ యంతి తద్వదితి, (6)"1

"మూాఁడు జన్మలనుండి యన్వేషించుచున్న నిన్నిన్నాఁడు మహ ర్షుల శాపము పూర్తికావచ్చినందున చూడఁగలిగితిని' 'దిష్ట్యా దిష్ట్యా' అనఁగా భాగధేయముచేత ననుదానికి ద్విరుక్తి హర్షాతిశయ మున వీఖను 'నీవు మా మేనమామకుమారుఁడ వగుటచే పోరాని చుట్టమవు అయినను (మాయందనుగ్రహముచే) నామిత్రుల సంహ రించితివి అందువలన సనకాదుల శాపము తప్పమైన ఈయనుగ్రహము పరిహరింపరానిది. అందులకే నిన్నింతమాత్రమే కోరుచున్నాను సర్వ సహానసమర్థుఁడా! ఆకోరిక యేమనఁగా, హృత్తధర్మము ననుసరించి నిన్ను సేవించుటకు (వజ్రకల్పమైన) ఉత్పలకోమలమైన గదతో నిన్నొక్కమాఱు కొట్టెదను'

1 శ్రీ మద్భాగవతము, 10-78-4 నుండి 6 శ్లోకములకు
శ్రీధరీయము, పుటలు - 506, 507

ఇచట శ్రీధరస్వామి 'హనిష్యే వ్రజాల్పయా' అనుదానిని పూర్వరూపసంధిగా నర్థాంతరమున నన్వయించినాడు. అవ్రజ కల్పయా - పూర్వరూపసంధి "తర్హ్యానృణ్యమ్" అనుశ్లోకమునందలి 'అజ్ఞ' శబ్దమును నిందాపరముగ నఞ్ సమాసముగను, స్తుతిపరముగ బహువ్రీహిగను, హిరణ్యాక్షుని వధసందర్భములోవలె నిచటను శ్రీధరుడు వ్యాఖ్యానించినాడు 'ఆనృణ్యమ్' అనగా ఋణము తీర్చుకొనుట ఈ దేహసంబంధమైన ఋణశేషము తీర్చుకొనవలసి యున్నదని గూఢార్థము 'వ్యాధి' శబ్దము విశేషధ్యానపరమని శ్రీధరీ యాభిప్రాయము విశేషముగా మనసునందు ధ్యానింపబడునది ఆధ్యానమునకు దేహమాధారము విశేషముగా దేహమునందంత ర్యామియై చరించుచున్న భగవంతుడని తాత్పర్యము వ్యాధిశబ్దము నకు ప్రకృతిప్రత్యయవిభాగ మిట్టియర్థమునకు యౌగికమై అనుకూ లించును.1

ఆంధ్రభాగవతమున దంతవక్త్రుని వాక్కులలో నిట్లు స్తుత్య ర్థము స్పష్టముగ కన్పట్టుచున్నను, వారికిని హరిపార్షదులకునుగల సంబం ధము సూచితము

దంతవక్త్రుడు కండ్లు కటకటకొలుకుచు తనపై నెత్తిరాగా,

---

1 వి, ఆఙ్ అను రెండుపసర్గలు పూర్వమందున్నచో "డుధాఞ్ ధారణ పోషణయోః" అను ధాతువునుండి యీరూపము నిష్పన్నము ధరించుట, పోషించుట అని ధాత్వర్థము ధాతువునకుపసర్గ ఉపపదముగా నున్నపుడు కర్మవాచకమైన అధికరణమును బోధించుచు 'కి' అను ప్రత్యయమువచ్చును దీనియందు 'ఇ'కారము మిగులును ధాతువులోని 'ఆ'కారమునకు "ఆతో లోప ఇటిచ" అను సూత్రముచే లోపము 'ఉపసర్గే ఘోః కిః" "కర్మణ్యధికరణేచ" సిద్ధాంతకౌముది, 4వ భాగము 3-3-92, 3-3-93 పుట-629

"పడిఁజను దేరఁజూచి యదువల్లభుఁడుల్లము పల్లవింప న
ప్పుడు గదఁగేలఁబూని రథమున్ డయమొప్పఁగడిగ్గి యుగ్రతన్[1]

ఎదురుపడచినాఁడు హరి తనపార్షదులకిచ్చిన వాగ్దానము నెరవేర్పవలసిన సమయమాసన్నమైనది శాపావధి పూర్తియైనది కావున స్వామికి ఉల్లము పల్లవించినది. "నీవు మదీయ భాగ్యంబునంజేసి నేఁడు నాదృష్టిపథంబునకు గోచరుండవైతివి" అను దంతవక్త్రుని పలుకులును భావస్ఫోరకములే

ఈవిధముగ పరుషవాక్యములచే భగవంతుని బాధించినట్లు దంతవక్త్రుఁడు తనకార్యము నిర్వహించినాఁడు. హిరణ్యాక్షవధయందు వలెనే యథాశ్రుతార్థము కర్తవ్య నిర్వహణమునకుపాయమైనది, ఫలితమే కౌమోదకీ ప్రహారము

"తతస్సూక్ష్మతమం జ్యోతిః కృష్ణమావిశదద్భుతమ్
పశ్యతాం సర్వభూతానాం యథాచైద్యవధే నృప."[2]

అప్పుడు నిఖిలభూతంబులు నాశ్చర్యంబునొందఁ దద్గాత్రంబున నుండి యొక్క సూక్ష్మతేజంబు వెలువడి గోవిందుని దేహంబుఁ బ్రవేశించె"[3]

కౌమోదకీ ప్రహారముతో దంతవక్త్రునకురోవిదారమై, ఒక మహాజ్యోతి అతనిదేహమునుండి వెలువడి కృష్ణునిలో లీనమైనది ఈ విధముగ దంతవక్త్రుఁడు తిరిగి హరిపార్షదత్వ మందినాఁడు.

---

1 శ్రీమదాంధ్ర భాగవతము, దశమస్కంధము, ఉత్తరభాగము
పద్యము - 916 పుట - 446

2 శ్రీమద్భాగవతము, 10-78-11 పుట-507

3 శ్రీమదాంధ్ర భాగవతము, దశమస్కంధము, ఉత్తభాగము
వచనము - 919 పుట - 447

## శిశుపాలుని సాధకత్వము

కర్మ సంస్కారము మిగిలి హిరణ్యకశిపుఁడు రావణుఁడై, రావణుఁడు శిశుపాలునిగ జన్మించిన కథ సప్తమస్కంధమున ప్రసిద్ధము. మహాభారతమున హిరణ్యకశిపుని యంశతో శిశుపాలుఁడు జన్మించినట్లు వర్ణితము. అనగా రావణాంశమునుకూడ భారతమంగీకరించినట్లే. మహాభారతానుసారమును శిశుపాలుఁడు విష్ణుపార్షదుఁడనుట నిర్వివాదము 1 భారత భాగవతములందు శిశుపాలుఁడు వైరభక్తునిగనే ప్రసిద్ధుఁడు. భారతమున శిశుపాల వాగ్వాద మధికముగ నున్నను, అతనిభక్తికి భాగవతమే ప్రధాన ప్రమాణము. వైరభక్తికి భాగవతమున శిశుపాలుఁడే ప్రధానోదాహరణముగ గ్రహింపఁబడినాఁడు. వైరభక్తి ప్రస్తావన వచ్చిన ప్రతిసందర్భమునను2 శ్రీమద్భాగవతమున శిశుపాలుఁడే ప్రథముఁడుగ నుదాహరింపఁబడుట అతని వైరభక్తికి నిదర్శనము. శిశుపాలుని వైరభక్తి నారదమహర్షికిని స్తోత్రపాత్రము. మహర్షి స్తోత్రపాత్రమైన నీయర్థము కేవలద్వేషసంపా

---

1 ఈ విషయము మహాభారత సాధన సమన్వయమున నీలకంఠవ్యాఖ్యాన సారము ప్రకరణోచితముగ నిరూపింపఁబడును

2 "గోప్యః కామాద్భయాత్కంసో ద్వేషాచ్చైద్యాదయో నృపాః"
7-1-31 పుట - 12

"ఉక్తం పురస్తాదేతత్తే చైద్యస్సిద్ధిం యథాగతః
ద్విషన్నపి హృషీకేశం కిముతాధోక్షజ ప్రియాః"
10-29-13 పుట - 308

"కామోత్కంఠత గోపికల్ భయమునం గంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాల ముఖ్యనృపతుల్ "7-18, పుట- 6

"మును నే జెప్పితిఁ జక్రికిం బగతుఁడై ఘూర్ణుండు చైద్యుండు ;",
'బాంధవముననైన బగనైన వగనైన" దశమస్కంధము, పూర్వభాగము
పద్యములు - 872, 873 పుట - 462

ద్యము కాదు. దైవమాత్ర సాధ్యమైనచో ప్రత్యుదాహరణములుగ నిచ్చిన వేనాదులకుకూడ సింహాకారమున్నట్లు చెప్పవలసియుండును

శ్రీకృష్ణునకు, శిశుపాలునకు వైరము జాతిసిద్ధముకాని, జన్మసిద్ధముకాని, రాజకీయముకాని కాదు శిశుపాలునకిట్టి ప్రత్యక్షసంబంధము చెప్పుటకవకాశ మేపురాణమునను లేదు దైవనిమిత్తము చెప్పుటకు నవకాశములేదు రాజకీయమైన వైరము పరంపరాగతమైనది రాజులలో సహజశత్రువులు, సహజమిత్రులు, కృత్రిమశత్రువులు, కృత్రిమమిత్రులు నని నాలుగువిధములుగ వైరము, స్నేహము సంభవించు పద్ధతులను రాజనీతిశాస్త్రము చెప్పును జరాసంధ, కాలయవన, కంసులకు శ్రీకృష్ణునితో వైరమున్నను వైరము కలిగియుండుటకుఁగల యవకాశములు సహజవైరమునకు చెందినవి దీనివలన శత్రుత్వము బలపడదు కృత్రిమమనఁగా క్రియా నిర్వృత్తమైనది కృత్రిమశత్రువు సహజశత్రువునకంటె వైరభావము నధికముగా కలిగించుటకు అవకాశము లుండుటవేఱు, వానిని వినియోగించుట వేఱు వైరమునకవకాశమున్నంత మాత్రమున పెంచువారు లేకున్నచో నది పెరగదు అట్లే స్నేహమును జరాసంధునితో శిశుపాలునకుగల మైత్రి కృష్ణునితో సహజశత్రుత్వమగును అది కృష్ణ శిశుపాలుర విరోధమునకు చాలినది శత్రుత్వముఁగూర్చి రాజనీతిజ్ఞు లిట్లు చెప్పుదురు

"సఖాగరీయాన్ శత్రుశ్చ కృత్రిమస్తౌహి కార్యతః
స్యాతా మమిత్రౌ మిత్రేచ సహజ ప్రాకృతావపి"1

మిత్రుఁడగు కాఁదగిన వాఁడపకారమువలన శత్రువు కావచ్చును అట్లే శత్రువును నుపకారముపొంది మిత్రుఁడు కావచ్చును

---

1 మాఘకావ్యము, సర్గ - 2 శ్లోకము - 36 పుట - 40

అందువలన నుపకారాపకారరూపమైన క్రియలచే కలిగిన మైత్రీవైరములు బలవత్తరములు. ఉపకారియగు శత్రువుతో సంధిచేసికొనవచ్చును. అపకారియగు మిత్రుని పొరపాటునను దరిజేరనీయరాదు. ఈలక్షణము కృష్ణశిశుపాలుర వైరమునకును మఱి వి యన్వయించి నాఁడు బంధుత్వమునుబట్టి శిశుపాలుఁడు కృష్ణునకు సహజమిత్రుఁడు. జరాసంధాదుల సంబంధమును బట్టి సహజశత్రువు ఇట్టి మిత్రత్వము కాని, శత్రుత్వము కాని శిశుపాలునకు మోక్షమిచ్చుటకు హేతువులు కావు నేటికిని అధికారులు తామనుగ్రహింపఁదలఁచిన వారిని రక్షింపఁదలఁచినపుడు కాని, ఉన్నతస్థితిని కల్పించుటకు కాని అందుకుతగిన అర్హతను ఆశ్రితులకు కల్పించుటయో, ఆశ్రితుల యర్హతకు తగిన పదవిని ప్రసాదించుటయో చూచుచున్నాము. అట్లే కైవల్యసిద్ధికి శిశుపాలున కర్హత కల్పించుటకు భగవానుఁడు ప్రయత్నించినాఁడు. ఆప్రయత్నమే రుక్మిణీహరణము. తత్ప్రయత్నములోనే వైరానుబంధము తీవ్రమైనది. భక్తులకులేని యవసరము భగవంతునకేల యుండవలెనను ప్రశ్న యుత్పన్నమగును. మూఁడు జన్మములలో వైరమును తీర్చి, తిరిగి పార్షదత్వమును ప్రసాదింతునని భగవంతుఁడు పార్షదుల ననుగ్రహించిన కథ యిట స్మరణీయము. నారాయణుఁడు సత్యసంధుఁడు ("సత్యా సంధా యస్య సః సత్యసంధః" అని శంకర భగవత్పాదులు).

అదికాక ఒక్కమారు శరణన్నచో సమస్త ప్రాణులకు నభయమిచ్చెదనను ప్రతిజ్ఞ కలవాఁడు స్వామి

"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతిచ యాచతే
అభయం సర్వభూతేభ్యో దదామ్యే తద్వ్రతం మమ"
(శ్రీమద్రామాయణము)

కాలవశమున శిశుపాలునియందు సంస్కారము లోపించినది. పార్షదు లనన్య శరణ్యులు వారు కావకాలమున

"భూయాదభోని భగవద్ధకారిదండో
యాసో హ రేత సురహేలన మప్య శేషమ్"1

అని చతుస్సనులను ప్రార్థించుచు, శాపకాలమున భగవ
త్స్మృతి నశించకుండునట్లు వేడికొనిరి మునులకు మారుగా శ్రీహరి
తానే వారికి అభయమిచ్చి, అభక్తి వైరయాగమున నుండునట్లనుగ్
హించినాడు శిశుపాలుని యావసదశవటకు వైరస్మరణము కలిగి
నట్లు భారత భాగవతములయందు గోచరించదు "అనన్యాశ్చింతయం
తోమామ్"అని తానుచేసిన ప్రతిజ్ఞను నిర్వహించుటకు భగవానుడు
న్యాయముగా వైరము కల్పించవలసి వచ్చినది రుక్మి వైద్యనకు
నిశ్చయించిన రుక్మిణిని కొనితెచ్చుటతో కృష్ణుడు వైరమును ప్రారం
భించినాడు ఇట్లు ప్రారంభించుట

"తత స్తం ప్రీయమాణంతు కాష్ఠపాషాణ సన్నిభమ్
అహంస్మరామి మద్భక్తం నయామి పరమాంగతిమ్"2

అను భగవద్వాక్యమున కనుకూలము

నాటినుండి శిశుపాలుడు వైరములో కృష్ణుని నిరంతర స్మరణ
చేసినాడు

---

1 శ్రీమద్భాగవతము, 3-15-26 పుట - 381

2 ఈ వరాహవచనము విశిష్టాద్వైత సంప్రదాయానుసారులగు విష్ణుభక్తులకు
వేదవాక్యము కల్యాణపత్రిక - వరాహపురాణము పుట - 13
ప్రభుద తత్త్వబ్రహ్మచారి ప్రాచీన వ్యాసము దీనినిఖిలాంశమని పిరు
చెప్పియున్నారు
కంచి శ్రీరామానుజ పీఠాధిపతులగు అణ్ణంగరాచార్య స్వామివారు 'భగవ
ద్రామానుజ గ్రంథమాల' అనుపేరుతో తొమ్మిది గ్రంథములను కలిపి
ప్రచురించినారు ఇయ్యది భగవద్రామానుజ వ్యాఖ్యానజాతము

శ్రీధరస్వామి శ్రీశుకునివంటి జ్ఞానియై నృసింహోపాసకుండై భగవత్తత్త్వమును గ్రహించినాడని ప్రసిద్ధి

"వ్యాసో వేత్తి శుకో వేత్తి రాజా వేత్తి న వేత్తి వా
శ్రీధరః సకలం వేత్తి శ్రీనృసింహ ప్రసాదితః"[1]

అట్టి శ్రీధరుడు సంస్కృతభాగవతమున, ప్రథమజన్మయందు హిరణ్యాక్షుడై నట్టి నిందకు అర్థాంతరమును వ్యాఖ్యానించినట్లే శిశుపాలుని వాక్యములకును స్తుతిపరమైన అర్థమును నిరూపించినాడు

ధర్మరాజుడు రాజసూయ యాగానంతరము శ్రీకృష్ణునకగ్ర పూజ యొనర్చినాడు శిశుపాలుడందుల కంగీకరింపక కృష్ణుని నిందించినాడు

"సదస్పతీ నతిక్రమ్య గోపాలః కులపాంసనః
యథా కాకః పురోడాశం సపర్యాం కథమర్హతి"

"వర్ణాశ్రమకులాపేత స్సర్వధర్మ బహిష్కృతః
స్వైరవర్తీ గుణైర్హీన స్సపర్యాం కథ మర్హతి"

"యయాతినైషాం హి కులం శప్తం సద్భిర్బహిష్కృతమ్
వృథాపానరతం శశ్వత్సపర్యాం కథమర్హతి"

"బ్రహ్మర్షిసేవితాన్ దేశాన్ హిత్వైతే బ్రహ్మవర్చసమ్
సముద్రం దుర్గమాశ్రిత్య బాధంతే దస్యవః ప్రజాః"[2]

పై శ్లోకముల వాచ్యార్థమిది.

"యోగ్యులైన సభాసదులను వదలి, కులదోషకుడగు సీగోపాలుడు పూజార్హుడెట్లగును? కాకి పురోడాశమును స్వీకరించుట కర్హ

1 పురాణ విమర్శ (హిందీ), బలదేవోపాధ్యాయ పుట - 571
2 శ్రీమద్భాగవతము, 10-74 35 నుండి 38 పుట - 498

మగునా? వర్ణాశ్రమ ధర్మముల పరిత్యజించి సర్వధర్మములచేతను
బహిష్కరింపఁబడిన వాఁడై, స్వేచ్ఛాచారియై గుణహీనుఁడైన
యాతఁడు పూజకర్హుఁ డెట్లగును? యయాతి మహారాజే వీరికులమును
సజ్జనులచే బహిష్కరింపఁబడునట్లు శపించినాఁడు వ్యర్థమైన, పానా
సక్తమైన ఈకులమెట్లు పూజ్యమగును? బ్రాహ్మణులచే, ఋషులచే
పరిత్యజింపఁబడిన, అమంగళమైన సముద్రదుర్గము నాశ్రయించి ప్రజ
లను బాధించుచున్నాఁడు '

ఈశ్లోకములకు స్తుత్యర్థముగను వ్యాఖ్యానించిన శ్రీధరీయము

"సదస్పతీనితి అస్యైవ వాస్తవోర్థః పూర్వవదున్నేయః సద
స్పతీనితి గోపః వేద వృత్త్యాది పాలక ఇత్యర్థః కుత్సితం వేద
విపరీతం లపంతీతి కులపాః పాషండాః తాన్ అనతే ఘాతయతీతి
కులపాంసనః, అతాకః నం చ అకం చ తాకే సుఖదుఃఖే తే న
విద్యేతే యస్య సః అతాకః ఆప్తకామ ఇత్యర్థః స యథా అర్హ
తామో దేవయోగ్యం కేవలం పురోడాశాది మాత్రం నార్హతి
అపితు సర్వస్వమపి తథాయం శ్రీకృష్ణోపి బ్రహ్మర్షియోగ్యం సప
ర్యామాత్రం కథమర్హతి కింతు స్వాత్మసమర్పణమప్యర్హతీత్యర్థః
(౨౮) వర్ణేతి వర్ణాశ్రమకులేభ్యః అపేతః బ్రహ్మత్వాత్ శ్రు
"అనామగోత్ర" మితి శ్రుతేః అత ఏవానధికారిత్వాత్ సర్వధర్మ
బహిష్కృతః స్వైరవర్తీ పరమేశ్వరత్వాత్ అత ఏవ నిర్గుణః తమ
ఆదిరహితః ఏవం భూతో జీవానాం యోగ్యం తుచ్ఛం సపర్యా
మాత్రం కథమర్హతీత్యర్థః (౨౯) యయాతినేతి అపిచ కథం వర్ణ
నీయో మాదృశైరేషాం యదూనాం మహిమా. యస్మాదేషాం
కులం యయాతినా శప్తమపి కిం సద్భిర్బహిష్కృతమ్ అపితు శిరసా
ధృతం కించ అస్మదాది కులవత్ వృథా పానరతం కిం అపితు
అతినియతాచార మిత్యర్థః అహో యదూనామేవ తావదీదృశం
మాహాత్మ్యం యదుకుల వృద్ధస్య యయాతేః శాపో న ప్రవదుర్యా

యాదిత్యాది అయం తు సాక్షాదీశ్వరః అతః సపర్యామాత్రం కథ మర్హతీత్యర్థః" (37) 1

'గోశబ్దమునకు భూమి, వేదము, ధర్మము మున్నగు వర్థములు కలవు గోపాలకుఁడనఁగా వేదధర్మరక్షణ తత్పరుఁడని తాత్పర్యము కు + లప + అంసకః అని పదచ్ఛేదము. కుత్సితమైన వేదవిరుద్ధమతము ననుసరించువారిని ధ్వంసము చేయువాఁడని భావము. "యథాకాశ" అనుదానియందు యథా + అకాశ అని ఛేదము 'కమ్' అనఁగా సుఖము 'అకమ్' అనఁగా దుఃఖము ఆ రెంటి నతిక్రమించినవాఁడు సుఖదుఃఖాతీతుఁడు అట్టివాఁడు కేవల పురోడాశమునకే కాక నమస్త ప్రదానమునకును నర్హుఁడని భావము అట్లే వర్ణాశ్రమ కులముల కతీతుఁడై, నర్వధర్మములకు నూర్ధ్వభాగమునసుండి, విధినియతుఁడు కాక, త్రిగుణాతీతుఁడైన పరమేశ్వరునకే సపర్య పర్యాప్తమా? యయాతి యంతటి వానికిని పొగడరాని యదుకుల మహిమ అల్పులమైన మా వంటివారికెట్లు తెలియును? యయాతి శాపమునకు గురియయ్యు యదుకులము మహిమ తరుగనిది అయ్యెననియు చెప్పవచ్చును అందువలన సాక్షాదీశ్వర స్వరూపుఁడైన నారాయణునకీపూజ పర్యాప్తమా?' (సు గమిాయఁదగును)

అని శిశుపాలుని స్తుతి ఇట్లే ఈసందర్భమంతయు స్తుతిపరముగ శ్రీధరుఁడన్వయించినాఁడు

పోతనకూడ శ్రీధరుని భావమును గ్రహించి, రెండువిధములైన అర్థములయందు నన్వయించునట్లు వ్యాజస్తుతిగనే ఈ సందర్భము నుకూర్చినాఁడు

---

1 శ్రీమద్భాగవతము, 10-74-35 నుండి 37 శ్లోకములకు శ్రీధరీయము
పుట - 496

"గురుదేవ శూన్యుండు కులగోత్రరహితుండు
    దళిదం(డు లెవ్వరో తడవఁగాన
మప్పలభొరలెడు నాదిమధ్యావ
    సానంబులందరయమానంబు లేదు
బహురూపిఁయై పెక్కుభంగుల వర్తించు
    వావిన రసములు వరుసలేవు
పరికింప విగతసంబంధుండు దలపోయ
    మ నిమిత్తంబున మానినయ్యెఁ

బరగమున్ను యయాతి శాపమునఁజేసి
వాని కెక్కఁడ యీ యదువంశ మెల్ల
బ్రహ్మతేజంబు నెల్లఁగోల్పడిన యితఁడు
బ్రహ్మఋషి నెవ్వఁడగునె గోపాలకుండు",

"జారుఁడు జన్మాదిరహితుఁడు
చోరుఁడు ముప్పోకలాఁడు సుమహితపూజా
చారక్రియలకు నర్హుఁడె
వారక యితఁడనుచు నశుభ వాక్యస్ఫూర్తిన్ "[1]

కృష్ణుఁడు కులగోత్రములు లేనివాఁడనియు, సంజనన మెఱుఁగ రానిదనియు, తమతోడి బంధుత్వము వలననే ఆయనకు గుర్తింపు లభించినదితప్ప నాతఁడు వా విప్రవములు లేనివాఁడనియు నిత్యాదిగ నిందార్థము. ఇఁక శ్రీకృష్ణుఁ డాదిమధ్యాంతరహితుఁడైన, అమేయుఁడైన, వేదధర్మ రక్షణపరుఁడైన, త్రిగుణాతీతుఁడైన సాత్త్వాదీశ్వరుఁ డని స్తుతి. మానినిమిత్తంబుగ ననుచో మా - లక్ష్మీనిమిత్తముగనని చెను

---

1   శ్రీమదాంధ్ర భాగవతము, దశమస్కంధము, ఉత్తరభాగము
    పద్యములు - 790, 791   పుటలు - 432, 433

ప్రభృతి 'పెక్కుభంగుల వర్తించువాఁడు', 'పగతసంబంధుండు', 'మహోగ్రలాఁడు' ఇత్యాది విశేషణములు గంభీరార్థ స్ఫోరకములు

హిరణ్యాక్షవధ సందర్భమువలెనె కర్తవ్యనిర్వాహణమునకై భగవానుఁడు యథార్థశరీరమును గ్రహించినాఁడు ఆయన చక్రాయుధముతో శిశుపాలుని మస్తకమును ఖండింపఁగా,

"చైద్యదేహోత్థితం జ్యోతిర్వాసుదేవముపావిశత్
పశ్యతాం సర్వభూతానాముల్కేవ భువి ఖాచ్చ్యుతా"1

"మునివరులును జనపతులును
గనుఁగొని వెఱఁగందఁ జైద్యుగాత్రమునందుం
డనుపమతేజము వెలువడి
వనజోదరు దేహమందు వడిఁజొచ్చె నృపా"2

సర్వులు నాశ్చర్యచకితులై వీక్షించుచుండ శిశుపాలుని దేహమునుండి అనుపమ తేజము వెలువడి వాసుదేవునిలో ప్రవేశించినది

"జన్మత్రయానుగుణిత వైరసంరబ్ధయాధియా
ధ్యాయంస్తన్మయతాం యాతో భావో హి భవకారణమ్"3

---

1 శ్రీమద్భాగవతము, 10-71-40 పుట-497

2. శ్రీమదాంధ్ర భాగవతము, దశమస్కంధము, ఉత్తరభాగము
పద్యము - 795 పుట - 488

3 శ్రీమద్భాగవతము, 10-74-47 పుట-497
దీనికి శ్రీధరీయము "జన్మత్రయే అనుగుణిత ఘనువర్తితం యద్వైరం తేన సంరబ్ధయా ఆవిష్టయా తన్మయతాం తత్స్వరూపతాం యాతః పునః పార్షదో బభూవేత్యర్థః అత్రహేతుః భావోహీతి భావో భావనా అనుధ్యానమ్ భవస్య ద్వైయాకార జన్మనః కారణం పేశస్కారీ ధ్యానేన కీటాదౌ తథా దృష్టత్వాదిత్యర్థః" పుట - 497

"బద్ధుడై తొంతకుమీఁది మత్సరమునన్ మ త్రిల్లి జన్మత్రయా
వధియే ప్రొద్దుఁ దదీయ రూపగుణ దివ్యధ్యానపారీణ ధీ
నిధియౌటన్ శిశుపాలభూవిభుఁడు తా నిర్ధూత సర్వాఘుఁడై
విధిరుద్రాదులకందరాని పదవిన్ వేపొందె నుర్వీశ్వరా"[1]

ఇట్లు శిశుపాలుఁడు జన్మత్రయావధి కృష్ణ రూపగుణ దివ్య ధ్యాన పారీణుఁడై విధిరుద్రాదులకు లభింపని స్థానమును పొంది నాఁడు.

సంస్కృతమహాభారతమునకు ప్రామాణిక వ్యాఖ్యాతయగు నీలకంఠపండితుఁడు శ్రీమద్భాగవతమును ప్రమాణముగఁగొని, శిశు పాలుఁడు కృష్ణుని నిందించిన సందర్భమును స్తుతిపరముగ 'భావ దీప వ్యాఖ్య' యందు వ్యాఖ్యానించినాఁడు.

శిశుపాలునకు కైవల్యమొసఁగదలఁచి, కృష్ణుఁడే ఆతనిబుద్ధిని వైరాభిముఖముగ తీవ్రమొనర్చి తానిసనుగ్రహింపఁ గోరుచున్నాఁ డని భీష్ముని యభిప్రాయము

"నైషా చేదిపతేర్బుద్ధిః యయా త్వాహ్వయతేచ్యుతమ్
నూనమేష జగద్భర్తుః కృష్ణస్యైవ వినిశ్చయః"[2]

మహాభారతమునందలి యీవాక్యములవలన శిశుపాలుని దోష ము తొలఁగిపోయినది. ఇపుడు శ్లోకములను స్తుతిపరముగ వ్యాఖ్యా నింపకున్నను దోషములేదు. భగవంతుఁడు సర్వసముఁడగుటచే నిందా స్తుతులకు భేదముండదు. కావున వ్యాఖ్యాతలు శిశుపాలుని వైరభక్తి తాత్పర్యమును కొనియాడుటకే స్తుతికల్పన మొనర్చినారని చెప్పవ

---

1. శ్రీమదాంధ్ర భాగవతము, దశమస్కంధము, ఉత్తరభాగము
   పద్యము – 789 పుట – 438
2. మహాభారతము, సభాపర్వము, 44వ అధ్యాయము, శ్లోకము–1 పుట–72

చ్చును అందువలన స్తుతికారత్వమును విస్తారముగ నిరూపించనవసరము లేకున్నను, స్థాలీపులాకముగ నిట చూపఁబడుచున్నది

పృథివ్యాం సాగరాంతాయాం యో వై ప్రతినమో భవేత్
దుర్యోధనం తం రాజేంద్ర అతిక్రమ్య మహాభుజమ్"[1]

సమస్త భూవలయమునకును చక్రవర్తి కాఁదగిన దుర్యోధనుని వదలి శ్రీకృష్ణునకగ్రపూజ చేయుటయం దౌచిత్యమేమని నింద

'వై ప్రతి నమః' అనుదానినేకపదముగ నన్వయించి, 'విగతః ప్రతినమో యస్య' - అనఁగా అతులుఁడని స్తుత్యర్థమున నీలకంఠీయము (పుట - 78)

"అథవై షాం న తే బుద్ధిః ప్రకృతం యాతి భారత
మయైవ కథితం పూర్వం భూలింగ శకునిర్యథా"[2]

'నేలలో తలదూర్చి నివసించు నొకపక్షి తనచుట్టునున్న విశాల ప్రపంచమును చూడలేనట్లు, నీవును (ధర్మజుఁడు) కృష్ణపరుఁడవై లోకములోని మహాత్ములను కానలేకున్నావ'ని నింద

"తే త్వత్సంబంధినాం యేషాం పుంసాం బుద్ధిః ప్రకృతిం న యాతి. స్వకారణే న లీయతే తత్ర పులింగ శకునిః యథా అన్య ద్వదత్ అన్యత్కరోతి తద్వత్ తే శుద్ధం కామయంతే శబలం వదంతీత్యర్థః భువం లింగతీతి భూలింగో బిలకాయీ పక్షి విశేషః"[3]

'భూమియందవతార విశేషమును ధరించిన కరమాత్ముఁడు భౌతిక లక్షణములతో తాదాత్మ్యము చెందక, వానికతీతుడై సర్వ

1 మహాభారతము, సభాపర్వము, 44వ అధ్యాయము, శ్లోకము-15 పుట-78
2 మహాభారతము, సభాపర్వము, 44వ అధ్యాయము, శ్లోకము-27 పుట-78
3 పై 27వ శ్లోకమునకు నీలకంఠీయము పుట - 78

పూజ్యుఁడగునని స్తుతి 'అన్యద్వదతి', 'అన్యత్కరోతి' అను నీలకంఠుని భావములో, చెప్పెడుదానికంటె భిన్నమైనది, అనఁగా, స్తోత్రమునిచ్చే తాత్పర్యము శిశుపాలునకు కృష్ణుఁడు తప్ప మఱియొక లోకము కన్పట్టుటలేదని ఉపమానమును శిశుపాలపరముగకూడ సమన్వయింప వచ్చును "తదా న్వస్యైవ శిశున్యుపమత్వమ్"

భారతమున శిశుపాలుఁడు నారాయణాభిన్నునిగ వర్ణింపఁబడి నాఁడు

"తతః శ్రుత్వైవ భీష్మస్య
చేదిరాడురు విక్రమః
యుయుత్సుర్వాసుదేవేన
వసుదేవమువాచ హ"[1]

'భీష్ముని పలుకులువిని, పరాక్రమ సంపన్నుఁడగు చేదిరాజు వాసుదేవునితో యుద్ధముచేయఁ దలఁచినవాఁడై నిట్లనినాఁడు'

ఇచట 'ఉరువిక్రమః' శబ్దము శిశుపాలునకు నారాయణాభేద సూచకమని నీలకంఠుఁడు.

"ఉరువిక్రమః ఉరుః మహాన్ విశ్వవ్యాపీ విక్రమః
పాదవిక్షేపో నశిశుపాలో హరిణానహాభేదాత్"[2]

శిశుపాలుఁడు తేజోరూపుఁడై కృష్ణసాయుజ్యమును పొందిన దానికి ప్రమాణముగ నీలకంఠుఁడిట భాగవత సప్తమస్కంధము లోని శ్లోకములనే ప్రమాణముగ చూపినాఁడు.

"యథోక్తం శ్రీమద్భాగవతే";

---

1 మహాభారతము, సభాపర్వము, 45వ అధ్యాయము, శ్లోకము-1 పుట-74
2 పై శ్లోకమునకు నీలకంఠీయము పుట - 74

"గోప్యః కామాద్భయాత్కంసో ద్వేషాచ్చైద్యాదయో నృపాః
సంబంధాద్వృష్ణయః స్నేహాద్యూయం భక్త్యావయం విభో"[1]

మహాభారతమునందును, తద్వ్యాఖ్యయందును ఈవిధముగ శిశుపాలుఁడు వైరభక్తిసాధకుఁడనుట స్పష్టముగ నిరూపితము. నన్నయ మహాభారతాభిప్రాయమును స్తుతికి ననుకూలముగ నన్వయించుచు కొన్నిసందర్భములలో సూచించినను, యథాశ్రుతార్థమే యధికముగా నాంధ్ర సభాపర్వమున గోచరించును

శిశుపాలుఁడు కృష్ణపూజను నిరసించుచు భీష్ముని తూలనాడు సందర్భములలో,

"పూతనాఘాతంబుఁ జేతనేతర్వమైన
శకటంబు ద్రోవును జరణ నిహతి
వీకతోఁగడుబూచు మాఁకుల విఱుపును
వల్మీకమాత్ర పర్వతము నెత్తి
కొని లావుగల్గుడు ధీఁషన ధేఁనుదివసంబు
లునికియు వృషవధయును ననఘ!
బమ్మనికృష్ణు బీరమ్ములు పొగడుచు
నున్ననీనాలుక యొక్కఁడయ్యు

ప్రయ్యవలయు నూఱుప్రయ్యలుగాఁగ న
ట్లయినగాని చాలవతనిఁబొగడ
నెల్లదానినేన రొఱుఁగుదు నెందు వాఁ
డర్ఘ్యదాన యోగ్యుఁడయ్యెఁ జెపుము "2

1, నీలకంఠీయము పుట – 76
2 శ్రీమదాంధ్రమహాభారతము, సభాపర్వము, ద్వితీయాశ్వాసము పద్యము–41 పుట – 647

అనుచు కృష్ణుని యతిమానుష కార్యముల నన్నిటిని అల్పవిష యములుగ ప్రకటించినాఁడు ఈ వ్యాజార్థమున నవియన్నియు నల్ప విషయములని శిశుపాలుఁడన్నట్లు కన్పించుచున్నను, "ఎల్లదాని నేన యెఱుఁగుదు" నను శిశుపాలుని వాక్యముతో పై కార్యములన్నిటికి ననల్పత్వము స్ఫురించును 'ఎల్లదాని నేన యెఱుఁగుదు' ననుట శిశుపాలుని భగవల్లీలావేత్తృత్వమును సూచించును

శిశుపాలుని పలుకులలో యథాశ్రుతార్థమును స్వీకరించిన భగవానుఁడు చక్రధారచే నాతని మస్తకమును ఖండింప,

"ప్రల్లదమాడి యిట్లు శిశుపాలుఁడు వజ్రహతాద్రితుల్యుఁడై
త్రెళ్ళుడు వానిదైన పృథుదేహము వెల్వడి తేజమంబరం
బెల్ల వెలుంగవచ్చి పరమేశ్వరు దేహముఁ జొచ్చె విస్మయో
త్ఫుల్ల విశాలనేత్రులయి భూపతులెల్లను జూచుచుండఁగన్."1

శిశుపాలుని దేహమునుండి తేజము వెలువడి, పరమేశ్వరుని దేహము జొచ్చినది

మాఘకావ్య వ్యాఖ్యాతయైన మల్లినాథసూరి శిశుపాలుని పలుకులను భక్త్యర్థపరముగ వ్యాఖ్యానించినాఁడు పదునాఱవ సర్గలోని శిశుపాలుని దూత చెప్పిన వాక్యములకధిక భాగము మల్లినాథుఁడర్థాంతరమును ప్రతిపాదించినాఁడు ముఖ్యముగ రుక్మిణీ హరణ ఘట్టమే వైరహేతువుగ నీ గ్రంథమునను నిరూపితమగుట విశేషము.

రుక్మిణీకల్యాణము రాక్షసవివాహమని ప్రసిద్ధి రుక్మిణి తనసందేశమున "రాక్షసవివాహమునన్ భవదీయశౌర్యమే యుంకువజేసి కృష్ణ పురుషోత్తమ చేకొనిపొమ్ము వచ్చెదన్" అని చెప్పినట్లు వర్ణించుటచే

---

1 శ్రీమదాంధ్ర మహాభారతము, సభాపర్వము, ద్వితీయాశ్వాసము
పద్యము - 69 పుట-854

పోతనకును రుక్మిణీ కృష్ణులది రాక్షసవివాహము నభిప్రాయమున్న ట్లున్నది మల్లినాథుఁడిది రాక్షసవివాహము కాదని స్పష్టముగ చెప్పినాఁడు

రాక్షసవివాహలక్షణమిది.

"హత్వా ఛిత్వాచ భిత్వాచ
క్రోశంతీం రుదతీం తథా
ప్రసహ్య కన్యాహరణమ్
రాక్షసో విధిరుచ్యతే"1

కన్యబంధువులను సంహరించి లేదా బాధించి, ఏడ్చుచున్న కన్యను బలవంతముగా హరించినచో నది రాక్షసవివాహము. శిశుపాలుని నిందాదృష్టికిది రాక్షసవివాహము శ్రీమన్నారాయణుఁడు కామజనకుఁడని ప్రసిద్ధి శిశుపాలుఁడుపంపిన సందేశములో శ్రీకృష్ణుని కామజనకునిగ చెప్పినశ్లోకమిది

"గురుభిః ప్రతిపాదితాం వధూమపహృత్య స్వజనస్య భావతః
జనకోసి జనార్దన స్ఫుటం హతధర్మార్థతయా మనోభువః"2

'ఓ జనార్దనా! తలిదండ్రులచే మారాజగు శిశుపాలున కీయబడిన భార్యనపహరించి, ధర్మార్థములను హతమొనర్చి నీవిపుడు వాస్తవముగ కామజనకుఁడవైనావు' "గురుభిః ప్రతిపాదితాం" అనుటయే అసత్యము ప్రతిపాదించినది రుక్మియే కాని భీష్మకుఁడు కాఁడు అందువలన నీనింద వైరనిమిత్తమే తప్ప వాస్తవముకాదు నిందయందును 'జనార్దన' అని సంబోధించుటచేతను, కామజనకుఁ

---

1 మాఘకావ్యము, 16వ సర్గ,40వ శ్లోకసందర్భములోని మల్లినాథసూరి వ్యాఖ్యలోని శ్లోకము పుట-399

2 మాఘము సర్గ-16 శ్లోకము-40 పుట-399

డనుటవలనను శిశుపాలుఁడు శ్రీకృష్ణుని శ్రీమన్నారాయణునిగ గుర్తిం చినట్లు విదితము

మాఘకావ్యము చివరి నాలుగుసర్గల (16 నుండి 20) యందును వైరానుబంధము భక్తిసాధనా ఫలోన్ముఖముగ నుత్తరోత్తర తీవ్రత తో వర్ణితము

రాజసూయయాగ సందర్భములో సభనుండి వెడలిపోయిన శిశుపాలుఁడొక దూతముఖమున శ్రీకృష్ణునకు సందేశమంపినాఁడు

"అహితాదన పత్రపస్త్రపః
అతిమాత్రోజ్ఝిత భీరనాస్తికః
వినయోపహిత స్త్వయా కృతః
సదృశోన్యోగుణవానవిస్మయః"[1]

మల్లినాథుఁడీ సందర్భమున స్తుతిపరమైన యర్థమును ముందు వ్యాఖ్యానించి, అప్రధానముగ పరుషార్థమును వ్యాఖ్యానించుట భక్తిప్రాధాన్యమునకు సూచకము

"త్వయా సదృశోన్యో గుణవాన్ గుణాఢ్యః కుతః న కుత్రాపీత్యర్థః కుతస్త్వం అహితాత్ అనర్థాత్ త్రపస్ అధర్మభీరురిత్యర్థః అపత్రపో మిత్రపో న భవతీతి అనపత్రపః త్రపావాన్ అకార్య జుగుప్సురిత్యర్థః అతిమాత్రమత్యంతముజ్ఝితభీః త్యక్తారి భయ ఇత్యర్థః న అస్తి మతిరస్యేతి నాస్తికః నాస్తి పరలోకః న భవతీతి అనాస్తికః. ఆస్తిక ఇత్యర్థః వినయేన అనౌద్ధత్యేన ఉపహితో విశిష్టః వినయవానిత్యర్థః విస్మయో విశిష్ట గర్వో న భవతీతి అవిస్మయః అగర్వః

---

1 మాఘకావ్యము సర్గ-16 శ్లోకము-7 పుట-388

పరుష స్తు - త్వయా సదృశః అన్యః గుణవాన్ న భవతీతి అగుణవాన్ నిర్గుణః కుతః న కుత్రాపీత్యర్థః ఇతః త్వం అహితాత్ శత్రోః త్రసన్ భీరుః నాస్తి అపత్రపా లజ్జాఽశేషః యస్యేత్యనప త్రపః నిర్లజ్జః అతిమాత్రేణ ప్రమాణేనైవ ఉజ్ఝితభీరపాకృతారి భయః సతం పరాక్రమశాలీతి భావః అస్తీమతిరస్యేతి ఆస్తికః అస్తి పరలోకః న స భవతీత్యనాస్తికః నాస్తిక ఇత్యర్థః వినయోఽనయా తీతః అనాహితో హితాదపేతః విస్మయో విగర్వో న భవతీతి అవిస్మయో గర్వీ గర్వయుక్త ఇత్యర్థః అత్ర అహితాదితి ఆర్థశ్లేషః అన్యత్ర శబ్దశ్లేష ఇతి అనయో సంకరః" 1

శిశుపాలుని పలుకులలో సంతర్గూఢమైయున్న స్తుతి .

అహితాత్ త్రసన్ - అధర్మమునకు భయపడువాఁడు,
అనపత్రపః - అకార్యములయందు జంకుకలవాఁడు,

అతిమాత్రోజ్ఝితభీః- పూర్తిగా శత్రువులవలని భయములేనివాఁడు,
అనాస్తికః - నాస్తికుఁడు కానివాఁడు,
వినయోపహితః - వినయముచేత నమ్రతకలవాఁడు,
అవిస్మయః - (స్మయమనఁగా గర్వము, విస్మయమనఁగా విశేష గర్వము, అవిస్మయ శబ్దమునకు గర్వరహితుఁడనియర్థము)
గర్వము లేనివాఁడు,

పరుషార్థము ‘నీకు సరిరాఁగల లజ్జాహీనుఁడు, గుణహీనుఁడు, నాస్తికుఁడు, నయహీనుఁడు, హితాచరణము లేనివాఁడు, గర్వితుఁడు మఱియొకఁడు లేఁడు.

మల్లినాథుని వ్యాఖ్యానమును బట్టి ప్రస్తుతాప్రస్తుత విషయములు రెండును శ్లేషవిషయము లగుటచే [illegible] అన్వయము

---

1 మాఘము, 16వ సర్గ, 7వ శ్లోకమునకు మల్లినాథసూరివ్యాఖ్య పుట-388

సిద్ధింపను శబ్దశక్తి మూలధ్వని యైనచో నొకటి ప్రస్తుతమును, మఱి యొకటి అప్రస్తుతమును కావలసివచ్చును. శ్లేషయందు రెండును ప్రస్తుతములో, రెండును అప్రస్తుతములో యుండును. ప్రస్తుతాప్రస్తుతములయందు శ్లేషయుండదు

"ప్రకృతాప్రకృతోభయాశ్రితం తు చేత్ శబ్దమాత్ర సాధర్మ్యమ్
శ్లేషోయం శ్లిష్టత్వం సర్వత్రాద్యద్వయో నాన్త్యే"

(ప్రతాపరుద్ర యశోభూషణము)

కేవల ప్రకృతములకుగాని, కేవలాప్రకృతములకుగాని, తదుభయములకుగాని శబ్దమాత్ర సామ్యమున్నచో శ్లేష యగును

"కృతగోపవధూరతేర్ఘ్నతో
వృషముగ్రే నరకేఽపి సంప్రతి
ప్రతిపత్తిరధః కృతైనసో
జనతాభిస్తవ సాధు వర్ణ్యతే [1]

"గోప్య ఏవ వధ్వః గోపవధ్వః తాసు రతిః కృతా యేన తస్య గోపీజన వల్లభస్యేత్యర్థః

వృషం వృషభరూపిణం అరిష్టాఖ్యం అసురం ఘ్నతో హ ర యతః అథ కృతయేనసో నిరస్త కల్మషస్య తవాగ్రే భయంకరే నరకే నరకాసురే ప్రతిపత్తిః సంప్రతి జనతాభిః జనసమూహైః సాధువర్ణ్యతే

పరపక్షస్తు- గోపానాం వధూషు రతిః కృతా యేన తస్య పారదారికస్య వృషం ధర్మం వృషభం వా ఘ్నతః అత ఏవ కృతైనసః పాపకృతః తేన ఉగ్రే దారుణే నరకే నిరయే అధః ప్రతిపత్తిః అధః

---

1 మాఘము సర్గ-16 శ్లోకము-8 పుట-888

ప్రాప్తిః అత్ర గోపపారదారికోఽపి అథ కృతైనాయితి విరోధాభాసః శ్లేషేణ సంకీర్యతే"1

'గోపికలయందు వాల్లభ్యము కలవాఁడవు వృషభరూపరూపమునున్న అరిష్టాసురుని సంహరించినవాఁడవు సర్వపాపములను దూరముచేయువాఁడవు నీ స్మరణమువలన నరకమును నాలోచన గూడ నుండదు ఇపుడు (ఇచటచేరిన) జననమూహముచే నీకీర్తిగానముచేయఁబడుచున్నది' —స్తుత్యర్థము

'గోపవధూగతి కలవాఁడవు అనఁగా పారదారికమైన మహాపాపము నొనర్చినవాఁడవు వృషమనఁగా ధర్మము ధర్మమును నాశనముచేసినవాఁడవు అందువలననే భయంకర నరకమునకర్హతనుపొందియున్నావు. మహాజనులందఱును నీకు దుర్గతి యపరిహార్యమని ఘోషించుచున్నారు' — నిందార్థము

ఇచట గోపపారదారికుఁడయ్యు పాపములను పోగొట్టువాఁడని విరోధాభాసాలంకారమునకు శ్లేష సాంకర్యమును వర్ణించుటచేత మాత్రమే స్తుత్యర్థముపపన్నమగునని మల్లినాథుఁడు వివరించినాఁడు.

ఇట్లు శిశుపాలుని నిందాఘట్టములో నధికభాగమును మల్లినాథుఁడు స్తుతిపరముగ నన్వయించినాఁడు శిశుపాలుని శాపవిమోచనానంతరము జ్యోతిఃప్రవేశమును మల్లినాథుఁడు భాగవతమును ప్రమాణముగగొని వ్యాఖ్యానించినాఁడు అచట శిశుపాలుని ముక్తిఫలముగ జ్యోతిఃప్రవేశమును వర్ణించి, భాగవతశ్లోకములనే మల్లినాథుఁడుదాహరించినాఁడు

1 మాఘము, 16వ సర్గ 8వ శ్లోకమునకు మల్లినాథుని వ్యాఖ్యానము పుట.౩౩౬

"శ్రియాజుష్టం దివ్యైః సపటహరవైరన్వితం పుష్పవర్షై
ర్వపుష్యశ్చైద్యస్యక్షణాదృషిగణైః స్తూయమానం నిరీయ
ప్రకాశేనాకాశే దినకర కిరాన్విక్షపద్విస్మితాక్షై
ర్నరేంద్రైరౌపేంద్రం వపురథవిశ ద్ధామవీక్షాం బభూవే"1

ఈశ్లోక వ్యాఖ్యలో

"తతశ్చేదిపతేః దేహాత్ తేజోఽగ్రియం దదృశుర్నృపాః
ఉత్పతంతం మహారాజ గగనాదివ భాస్కరమ్"
"గోప్యః కామా ద్భయాత్కంసో ద్వేషాచ్చైద్యాదయో నృపాః
సంబంధాద్వృష్ణయః స్నేహాద్యూయం భక్త్యావయంవిభో"

(సప్తమస్కంధము)

అను శ్లోకములను ప్రమాణముగ చూపినాఁడు

ఇట్లు శిశుపాలుఁడు నిరంతర వైరసాధనతో శాపాంతమును బొంది, తిరిగి విష్ణుపార్షదుఁడైనాఁడు

---

1. మాఘము సర్గ-20 శ్లోకము-79 పుట-506

ఆధునికకవులలో చెఱుకుపల్లి జమదగ్నిశర్మగారు శిశుపాలుని సాధన వైరోన్ముఖముగ ప్రారంభ మగుటకు పూర్వజన్మ సంస్కారమే హేతువనియు, రుక్మిణీస్వయంవర విషయమున శ్రీకృష్ణునకు తాను ప్రతిబంధకమైనచో తననాయన అనుగ్రహించి వధించునేమో యని శిశుపాలుని ఆశయనియు వర్ణించినారు

"భక్తియు వైరమ్ములు కనవచ్చును భిన్నములుగాఁగ భావము
ద్రిక్తతనంది లక్ష్యముకు తీవ్రగతింగని సిద్ధినందుచో
నుక్తవిభేదమంతయును నుద్ధృతమైచను దైవవైరమున్
భక్తిగ సత్ఫలంబిడును భాగవతోక్తి ప్రసిద్ధమయ్యెడన్"1

అను కవివలుకులు శిశుపాలుని వైరసాధనకవతారిక యనవచ్చును ఈకథకిని ఈవిషయమున భాగవతమే ప్రధానము

సనకసనందనాదుల శాపము జయవిజయులను వైరభావదేహములఁ దాల్పఁజేసినది

"అనర్థమయ్యెనని సాగి తనంతగ వచ్చునట్లు చేయనువలె నష్టగాని చరితార్థతకల్గదు జన్మజన్మలన్" అను వారియాలోచనము వైరసాధన మూలమున భగవంతుని తమకడకు రప్పించుకొనవలెనను టను నిగదిత మొనర్చును

సమ్మిన రావణుండపుడు నాశనమందెను కాని వైరమే
యిమ్మడుగాచు భూమి ప్రభవించెను సాత్త్వతి పెద్దబిడ్డగా
సమ్మహనీయురాలు తనయయ్యకు చెల్లెలుగాఁగ బావ భూ
తము మ్మను స్వామిరూర్చె నదుచారగనూరును నిండునంతకున్"2

---

1 వైరభక్తి, చెఱుకుపల్లి జమదగ్నిశర్మగారు, ప్రథమాశ్వాసము పద్యము - 2 పుట - 1

2 వైరభక్తి, ప్రథమాశ్వాసము, పద్యము-26 పుట-5

జయవిజయులు ప్రథమజన్మమున హిరణ్యాక్ష, హిరణ్యకశిపులుగను; ద్వితీయజన్మమున రావణ కుంభకర్ణులుగను, తృతీయజన్మమున శిశుపాల దంతవక్త్రులుగను జన్మించినారు శిశుపాలుడు తనకు మేనత్తకుమారుడౌటచే శ్రీకృష్ణుడాతని యపరాధశతముల నోర్చినాడు

శిశుపాలుడు భగవానుని తనకడకు రప్పించుకొనుటకనేక ప్రయత్నములు చేసి, విసివి,

"ఏయుడు రాజసూయపూజపరియించునో యాయాయు నేను భార్యగా జేయుదు రాక్షసులకు మునిచి తజాచారికి గ్గమై సుధి ద్వేషియుడు క్రోధమూర్తియయి శిరచ్ఛేదవిని పలుంచువచ్చు రాగా నీ యవుడేమి చేయవలెనిద్ధుస్సియవ్వడి చూడదాగాపలెన"[1]

అని నిశ్చయించినాడు దీనివలన, శిశుపాలుడు తన వైర సాధనకు రుక్మిణీదేవి సుదకరణముగా స్వీకరించినట్లు స్పష్టమగును శిశుపాలుడట్లు తలంచి విభునందు మహత్తర వైరమూనంగా, స్వామియు బంధుత్వమును, సన్నిహితత్వమునిచ్చి, తనచేతనే ముక్తియనెడు చిత్తమునుకూడ చిన్ననాటనే కూర్చినాడట.

"ఒకవస్తువుమీద దృష్టినిలిపి ఏకాగ్రతను సాధించుటను త్రాటకసాధనమందురు

శిశుపాలుడు చేసినది త్రాటకసాధనము ఒకేవస్తువునందు (శ్రీకృష్ణపరమాత్మయందు) తనమనస్సును సతతము లగ్నముచేసి నాడు అతనికి మరియొకటిలేదు సత్యముగా చూచినచో రాగము ద్వేషమును రెండును వాసనలే! కావలసినది వాసనాక్షయము. చిత్తము పరమాత్మయందు పరిపూర్ణముగా లగ్నమైనప్పుడాతడు

---

1 వైరభక్తి ప్రథమాశ్వాసము పద్యము-30 పుట-8

చిత్తస్థితకరముఁడు చిత్తమునందు మరియొకటేమియు లేదు రాగముగాని, ద్వేషముగాని, అప్పుడు (శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః) ఆ పరమునిలో చిత్తము సంలీనమైపోవును

సాధనమార్గము రాగమైన ద్వేషమైన క్రమముగా సోపానము లెక్కినప్పుడు చేరునదొక్కటే"1

శిశుపాలుఁడు శ్రీకృష్ణునియందే తనమనస్సును సతతము లగ్నము చేసినాఁడు అతనికి కృష్ణుఁడుతప్ప నితరములేదు కృష్ణునిపొందుట కాతఁడు చేయు వైరసాధనయు భగవల్లీలయే

బలరామ కృష్ణులు కంసుని, ముష్టికొందఱు యోధులను సంహరించినారు

"పడియుంజేసిరి తానెఱుంగునిది దుర్మార్గుండు కంసాతకుం
డడఁగించున్ దను నన్నమాట తెలియున్ కానిన్ విచారింప కె
ప్పుడు తద్ద్రోహముసల్పుచుండనిగ సుద్యూత క్రుధామూర్తియై
పడదారింబడు చైద్యుఁడాత్మహననాభీష్టమ్ము సిద్ధింపఁగన్"2

కంసాంతకుఁడే తనను కూడ పరిమార్చునన్న విషయమెఱిఁగియు చైద్యుఁడాత్మహననాభీష్టము సిద్ధించునట్లు కృష్ణద్రోహమెల్లప్పుడు చేయుచుండునట ఇదియాతని విష్ణుపార్షదత్వమునకు సూచకము. శాపాంతము సమీపించినది భగవత్కృపచే నీజన్మమును వదలించుకొని, పూర్వపదవిని పొందుటకు శిశుపాలుఁడు పడునారాటమిందు స్పష్టము

శిశుపాలుఁడు మరణించుటయే లక్ష్యముగ భూమిపై జన్మించినాఁడని కృష్ణుని యూహ

---

1 'వైరభక్తి' ఖండకావ్యమునకు తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారు వ్రాసిన 'మిత్రసంమోదము' లోని వాక్యములు, పుటలు-8, 9, 7-9-1977

2 వైరభక్తి, ప్రథమాశ్వాసము, పద్యము-66 పుట-12

"శౌరిచే చచ్చుటకై జనించుటయు ముఖ్యంబైన యివ్వాని కు
ర్వరపై మోహము లేదు చాపభిదార్థంబైన సద్దానికే
వరియింపందగు దానెయుంగుగద తత్ప్రాణంబు నాచే ఎని
స్మరణంబందునటంచు త్రింగిటులు దౌష్ట్యంబేల పూనంజనునీ"1

"నన్నుం జంపుమటంచు వచ్చినను ప్రాణాల్ తీయ టెల్లొను నా
యన్నుం గౌగిలి నాకు నా ప్రియుడు దానద్దైన గ్రుద్ధసితిన్
ఛిన్నగ్రీవు నొనర్పవచ్చు నిదితజ్జీవుండు వాంఛించు నై
నన్నాడట్లు వరంబు కైకొనియె కానన్నేడు చారాదవా"2

శిశుపాలుని మరణము తనవలననే సంభవించుననియు, కాని సాత్వతికి తానిచ్చిన వరమువలన శిశుపాలుని అపరాధశతముల నోర్వ వలసినదేఅనియు కృష్ణుడు తలచినాడు ఇట్లు కృష్ణుడు తనతల్లికిచ్చిన వరము చైద్యునకు ముక్తిప్రతిబంధకమైనది

శిశుపాలుడు రుక్మిణీహరణ సమయమున కృష్ణునెదిరించి, తుదకు పారిపోవుటకు దైవసంకల్పమే హేతువు

"అతండారుక్మిణిం గొంచుబోవునపు డెట్లైనన్ సరే యడ్డి యా
యతివర్గ వానికిదక్కనీననుచు సైన్యాన్వితుండై రుక్మితో
నితరక్ష్మాపతి కోటితో నిలువగా నంతే ప్రయత్నించి త
త్పతి తానేసిన దుష్కయాశుగముతోఁ ప్రాణమ్ములన్ గాచుకో"3

శ్రీకృష్ణుడు రుక్మిణిని కైకొనిపోవుచుండ, శిశుపాలుడడ్డగడి నాడు స్వామి బాణపాతమునకు భయపడి యాతడు ప్రాణముల రక్షించుకొనుటకు వెనుదిరిగినాడు ఇట్లు పారిపోయి, పౌండ్రకాదుల

---

1 వైరభక్తి, ద్వితీయాశ్వాసము, పద్యము-5 పుట-28

2 వైరభక్తి, తృతీయాశ్వాసము, పద్యము-6 పుట-26

3 వైరభక్తి, పంచమాశ్వాసము, పద్యము - 7 పుట 50

యుండనాజేరి, "యదూత్తమాండికను బట్టువడెన్ దనంచు" నెంచినాఁడట

"స్వాశ్రయనాశహేతువగు వహ్నికి వైరము చుట్టమౌట న
ర్వాశ్రయుఁడైన కృష్ణునెడ వైరము హెచ్చిన చైద్యుఁడంధుఁడై
యాశ్రయసాధ్యమౌను తనయాశయమంచు స్వజాతిమృత్యువున్
బ్రాశ్రయమొప్పఁజేరి కొలువక సమకట్టెను దైవమొప్పనే"[1]

కృష్ణునియెడ వైరము హెచ్చిన చైద్యుఁడు తనవలె స్వామిచే మరణింపనున్నవారి యాశ్రయమున జేరినాఁడు

రాజసూయ యాగానంతరము ధర్మరాజుఁడు శ్రీకృష్ణునకగ్రపూజ చేయఁగా, శిశుపాలుఁడు ధర్మరాజు నధిక్షేపించినాఁడు కృష్ణుడాతని యపరాధములను సభాసదులకు వివరించినాఁడు

"అపురా నీకృప నీదుకిన్క నొకఁడేలా కోర భీంద నే
నపుడున్ జైద్యుఁడ నన్ను జూఁగుమిఁక కృష్ణాయన్న యామాటతో
ద్వివృతాన్యమ్మున నంతఁ వెల్వడినదంతే యంతలో గృష్ణ మా
ధవ నిర్ముక్త సుదర్శనాయుధమతిన్ దచ్ఛీర్షముర్వింబడెన్"[2]

'నీకృప, నీకినుక రెండును నాకవసరము లేద'న శిశుపాలుఁడనుచుండఁగనే కృష్ణవినిర్ముక్త సుదర్శనాయుధ మాతని శీర్షమును ద్రుంచినది.

"కృష్ణాయన్న పదమ్ము నోటననుచోఁ గృత్తంబుగ నాటరో
చిష్ణు ప్రాంశు తదీయదేహజనితార్చిష్మన్మహోతేజ మ
జిష్ణున్ విష్ణుని నేత్రకాంతులను జొచ్చెన్ సర్వులుంజూడ స
హిష్ణుండాతనికింక జన్మము వేఱేయుండునా లీనమై",

---

1 వైరభక్తి, పంచమాశ్వాసము, పద్యము-21 పుట 52

2 వైరభక్తి, షష్ఠాశ్వాసము, పద్యము-45 పుట-68

"సకిరీటంబు సకుండలంబయిన శిరచ్ఛేదోత్తమాంగంబు శి
ల్పి కృతంబై చతురాష్ట విగ్రహము వోలెన్ జీవసౌభాగ్య మం
చుకరమ్మైనం దటుగంగఁబోలె కనులచ్చో లక్ష్యమై కృష్ణుఁ బా
యక చూచుంబలె నిల్చె నందఱు నహో యంచున్ బ్రశంసింపఁగన్"

"వైరము వైరమేయయికి భక్తిసమగ్రములోనఁ గావునన్
కేరెను జీవితేజమది శ్రీకరితేజము చైద్యుఁడెంత దీ
వ్యారమణీయ వర్తనుఁడు? చక్షుతృణంబున నొక్కమాటు నో
రారఁగ దైవనామమును అంతటితో మాటను యొగ్గ వేగఁ లే"[1]

ఇట్లు శిశుపాలుని వైరభక్తి సాధనను కవి వర్ణించిన మార్గము భారత భాగవతసారమని చెప్పవచ్చును

1. వైరభక్తి, షష్ఠాశ్వాసము, పద్యములు - 46, 47, 48 పుట-69

# ఉపసంహారము

"నృణాం నిఃశ్రేయసార్థాయ
వ్యక్తిర్భగవతో భువి
అవ్యయస్యాప్రమేయస్య
నిర్గుణస్య గుణాత్మనః"[1]

మానవులకు మోక్షాది సమస్త శుభములను కల్గించుటకై అవ్యయుఁడు, అప్రమేయుఁడు, నిర్గుణుఁడు నగు నారాయణుఁడు స్వేచ్ఛగా నవతారములను ధరించును ఆ భగవల్లీల వలననే యథార్థముగ నాయా అవతారములలో సత్త్వరజస్తమోరూపమైన గుణత్రయము ప్రకాశితమగును

నరులకు మాత్రమే కాక సమస్త ప్రాణిసామాన్యమున కీలక్షణ మన్వయించును గజేంద్రాది తిర్యక్కులు భగవత్కృపకు పాత్రము లగుట ప్రసిద్ధము భగవంతుఁడు తాననుగ్రహింపఁదలఁచిన రీతిలో నాయాప్రాణులను కర్మమార్గమున ప్రవర్తింపఁజేయును జయవిజయులకు జన్మత్రయమున వైరసాధనము భగవత్సంకల్పమే. ప్రతి జన్మమునను భగవంతునిచే మరణము పొందినను, కర్మశేషముండుటచే వారికి పునరావృత్తి కలిగినది ఈ విషయము విష్ణుపురాణమున స్పష్టముగ వర్ణితమైనట్లు వారణాసివారు సప్రమాణముగ నిరూపించినారు.

"రామచంద్ర భగవానునిచే వధింపఁబడిన రావణుఁడు పూర్వ జన్మలో హిరణ్యకశిపుఁడు ఉత్తరజన్మములో శిశుపాలుఁడు. శిశుపాలుఁడు కృష్ణభగవానునిలో, సంహరింపబడి లయమయ్యెను. హిరణ్యకశిపువు, రావణుఁడు భగవంతునిచే సంహరింపబడియు, ఆ భగవంతునిలో లయము కాలేదు అఖండమైన ఐశ్వర్యమును భోగములను

---

1. శ్రీమద్భాగవతము, 10-29-14 పుట-808

మున్మతము వారు పొందిరి దీనికి కారణము విష్ణుపురాణములో ప్రశ్న పూర్వకముగా ఇట్లు చెప్పబడినది —

"హిరణ్యకశిపుత్వేచ రావణత్వేచ విష్ణునా
అవాపనిహతో భోగా న ప్రాప్యా నమరైరపి॥
న లయం తత్ర తేనైవ నిహతస్సకథం పునః
సంప్రాప్తశ్శిశుపాలత్వే సాయుజ్యం శాశ్వతే హరౌ"

అను మైత్రేయప్రశ్నపై పరాశరోక్త సమాధానమిది—

"దైత్యేశ్వరస్య వధాయ, అఖిలలోకోత్పత్తి స్థితి - వినాశ కారిణా పూర్వం తనుగ్రహణం కుర్వతా నృసింహరూప మావిష్కృతమ్ తత్రచ హిరణ్యకశిపోః విష్ణురయ మిత్యేతన్న మనస్యభూత్.. రజోద్రేక ప్రేరితైకాగ్రమతి స్తద్భావనా యోగాత్తతో నావాప్తవధ హైతుకీం నిరతిశయామేవాఖిల త్రైలోక్యాధిక్యకారిణీం దశాననత్వే భోగసంపద మవాప । న తు స తస్మిన్ననాది నిధనే పరబ్రహ్మభూతే భగవతి అనాలంబిని కృతే మనసః (అవిషయీకృతే) తల్లయమవాప"

ఏవం దశాననత్వేపి అనంగపరాధీనతయా జానకీ సమాసక్త చేతసః, భగవతా దాశరథి రూపధారిణా హతస్య తద్రూపదర్శన మేవాసీత్ నాయమచ్యుత ఇత్యాసక్తి ర్విపద్యతో నాత్కరణే మానుష బుద్ధిరేవ కేవలమస్యాభూత్ ।

పునరచ్యుత వినిపాతమాత్ర ఫలమఖిల భూమండల శ్లాఘ్య చేదిరాజకులే జన్మ అవ్యాహతైశ్వర్యం శిశుపాలత్వేప్యవాపి తత్ర్వ తన్నామకారణభూతా నామ తేషామేవా భగవన్నామ్నాం మనవరత మనేకజన్మసు వర్ధిత విద్వేషానుబద్ధిచిత్తో వినిన్దన సతిరస్కారాది ష్వాచ్చారణ మకరోత్ తచ్చ రూపమ త్ఫుల్ల పద్మదలామలా

స్ఫురదుజ్జ్వల పీతవస్త్రధారి, అమల కిరీట కేయూరహార కటకాది శోభితముదార చతుర్బాహు శంఖచక్రగదాధర, మత్రప్రయూధ స్త్రై ధానుభావాదటన భోజన స్నానాసన శయనాదిషు అశేషావస్థాన్తరేషు నాన్యత్రోపయుయూవన్యక్షేరనః। తతస్తమేవాత్రోశేషమూచ్చారయన్ తమేవ హృదయేన ధారయన్ అత్యంతధాయ యూవద్భగవద్దత్త చక్రాంశు మాలోజ్జ్వల మక్షయ తేజస్స్వరూపం బ్రహ్మభూత మమ గత ద్వేషాదిదోషం భగవన్త మద్రాక్షీత్, తావత్స్య భగవచ్చక్రేణాశు వ్యాపాదితః తత్స్మరణ దగ్ధాఖిలాఘః సంచరయా భగవతా త్త ముపనీత స్తస్మిన్నేవ లయముపయుయౌ॥ (అ 4 అ 15)

హిరణ్యకశిపు వధార్థము నరసింహరూపమును ధరించినప్పుడు రజోగుణ ప్రాబల్యముకల హిరణ్యకశిపునకు ఆతడు విష్ణువను భావన కలుగలేదు, అందుచేత లయమునొందక విష్ణుకృత సంహారకారణమున మఱునటి రావణజన్మలో నిరతిశయమైన భోగసంపదను పొందెను. ఆ రావణుడు కామునకులోనయి సీతాదేవియందు ఆసక్తుడై శ్రీరాముని యందు కేవల మనుష్యుడను బుద్ధియే కలిగియుండి మనుష్యాకృతిగల రామునిచే వధింపబడెను లయమునొందలేదు, అనంతరము రామ కృత సంహారకారణమున, శ్లాఘ్యమగు చేదిరాజకులమందు శిశుపాలుడుగా జనించి అఖండైశ్వర్యమునొందియుండి కృష్ణావతారములోని విశిష్ట వ్యాపారములను బోధించు "దేవకీనందన" "కంసధ్వంసి" ఇత్యాదినామములను విద్వేషముతో పునఃపునః ఉచ్చరించుచు శ్రీకృష్ణభగవానుని ఆ దివ్యరూపమునే సర్వావస్థలయందును మనస్సులో పెట్టుకొనియుండి తన్ను వధించుటకు చక్రహస్తుడై అఖండ తేజస్స్వరూపముతో నిలచియున్న భగవద్రూపమును సందర్శించుచున్న పటు వధింపబడి శ్రీకృష్ణభగవానునిలో లయమునొందెను అని సారాంశము.

1 శ్రీమద్రామాయణ తత్త్వదీపము, వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు పుటలు 473 నుండి 476

హిరణ్యాక్షాదులయం దౌద్ధత్యము, రావణునియందు కామము గర్వము భగవత్సంకల్పజన్యములని ఉక్తచరము.

ఆధ్యాత్మిక సౌఖ్యమనుగ్రహింపదలచిన భక్తుని సమస్త ఐహికసుఖములను హరింతునని స్వామివాక్కు. బలిని పాతాళమునకు పంపుటకట్టి భగవత్సంకల్పమే కారణమని బ్రహ్మదేవునకు నారాయణుడు చెప్పిన వాక్యములిట స్మరణీయములు

"బ్రహ్మన్ యమనుగృహ్ణామి తద్విత్తం విధునోమ్యహమ్
యన్మదః పురుషః స్తబ్ధో లోకం మాం చావమన్యతే"1

"ఎవ్వనిఁగరుణింప నిచ్చించితిన్ వాని
యఖిలవిత్తంబు నేనపహరింతు
సంసారగురుమద స్తబ్ధుఁడై యెవ్వఁడు
జగతి లోకము నన్ను ధిక్కరించు
నతఁడెల్ల కాలంబు సకలయోనులయందుఁ
బుట్టును దుర్గతిఁబొందుఁజిదకు
విత్తవయోరూప విద్యాబలైశ్వర్య
కర్మజన్మంబుల గర్వమెడలి
లోకనిత్యమ్మున నిర్మలుఁడై యెవ్వఁడుండు
వాఁడు నా కూర్మి రక్షింప వలయువాఁడు
స్తంభలోభాభిమాన సంసారవిభవ
మత్తుఁడై చెడనొల్లఁడు మత్పరుండు"2

1 శ్రీమద్భాగవతము, 8-22-25 పుట-75

2 శ్రీమదాంధ్ర భాగవతము, అష్టమస్కంధము, పద్యము-661 పుట-76

హిరణ్యకశిపు ప్రభృతులకు వైరము ననుగ్రహించి, వారిని ముక్తులఁగావించిన పరమేశ్వరుఁడు వారనుభవించిన ఐహికసుఖములు భక్తిప్రతిబంధకములు కాకపోవుటచే వానిని హరింపలేదు

హిరణ్యకశిపుఁడు భగవంతుని వైరానుబంధముతో నన్వేషించుచుండఁగా, కర్మఫలపాకమువలనను దర్శనమీయరాము, అతని శరీరమునందే సూక్ష్మరూపముతో ప్రవేశించి అగోచరుఁడై యుండినట్లు భాగవతమున వర్ణితము

"యం వినిర్జిత్య కృచ్ఛ్రేణ విష్ణుః క్ష్మోద్ధార ఆగతః
నాత్మానం జయినం మేనే తద్వీర్యం భూర్యనుస్మరన్",

"నిశమ్య తద్వధం భ్రాతా హిరణ్యకశిపుః పురా
హంతుం భ్రాతృహణం క్రుద్ధో జగామ నిలయం హరేః",

"తమాయాంతం సమాలోక్య శూలపాణిం కృతాంతవత్
చింతయామాస కాలజ్ఞో విష్ణుర్మాయావినాంవరః",

యతో యతోహం తత్రాసౌ మృత్యుః ప్రాణభృతామివ
అతోహమస్య హృదయం ప్రవేక్ష్యామి పరాగ్దృశః",

"ఏవం సనిశ్చిత్య రిపోశ్శరీర మాధావతో నిర్వివిశే సురేంద్ర
శ్వాసానిలాంతర్హిత సూక్ష్మదేహః స్తత్ప్రాణరంధ్రేణ వివిగ్న చేతాః",

"సతన్నికేతం పరిమృశ్య శూన్య మపశ్యమానః కుపితో ననాద
క్ష్మాంద్యాం దిశః ఖం వివరాన్ సముద్రాన్ విష్ణుం విచిన్వన్న దదర్శవీరః",

"అపశ్యన్నితివోవాచ మయాన్విష్ట మిదంజగత్
భ్రాతృహా మే గతో నూనం యతో నావర్తతే పుమాన్",

"వైరానుబంధ ఏతావానామృత్యోరిహ దేహినాం
అజ్ఞాన ప్రభవో మన్యురహం మానోపబృంహితః"[1]

"ఎదురై ఘోర జయింపరాదితనినింకెందేనినిందింప భీ
ప్రదుఁడై ప్రాణులఁ డోలు మృత్యువు ప్రియంబై వచ్చునంచుం గ్రియా
విదుఁడశ్రాంతుఁడు సూక్ష్మరూపమున నావేశించి నిశ్శ్వాస రం
ధ్రదశన్ దైత్యు హృదంతరాళమునఁ బ్రత్యక్షక్రియాభీరుఁడై"[2]

'హిరణ్యాక్షుని వధించిన విమ్మట విష్ణువు తాను కృతకృత్యుఁడైనట్లు భావింపలేదు హిరణ్యాక్షుని పరాక్రమము నారాయణుని హృదయమున పీడలేదు అందువలన తనకై యన్వేషించుచున్న హిరణ్యకశిపు ప్రతాంణకై నారాయణుఁడాతని దేహమునసే ఘ్రాణరంధ్రమునుండి సూక్ష్మరూపములో ప్రవేశించినాఁడు అది తెలియని హిరణ్యకశిపుఁడు విష్ణువు నన్వేషించినాఁడు కనుక వైరానుబంధము భక్తివిశేషమై దేహధారులకు అమృతత్వహేతు వగుచున్నది' అని వామనుని వచనము

కావున వైరభక్తి మోక్షహేతువనుట, అదియును భగవత్సంకల్పమువలన కొందఱు సాధకులకేర్పడినది యనుట భాగవతసిద్ధాంతము. కాలానుగుణముగ నెవ్వరైనను భగవత్సంకల్పమువలన నిట్టివారైనచో చెప్పలేము కాని, సాధారణ భక్తిమార్గము నవవిధమనుట సామాన్య విషయము. వానిలో స్మరణము సాధనాంతరాపేక్షరహితము ఆ స్మరణమున కనుకూలమైన బుద్ధిననుగ్రహింప వలసినదిగా భగవంతుని ప్రార్థింపవలెనని భగవద్రామానుజుల యాదేశము

---

1 శ్రీమద్భాగవతము, అష్టమస్కంధము, 19వ అధ్యాయము
శ్లోకములు - 6 నుండి 13 పుటలు - 63, 64

2 శ్రీమదాంధ్ర భాగవతము, అష్టమస్కంధము, పద్యము-567 పుట-80

"అఖిలభువన జన్మస్థేమ భంగాదిలీలే
ప్రణత వివిధభూత వ్రాత రక్షైకదీక్షే
శ్రుతి శిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే
భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా"[1]

---

1 శ్రీమదాంధ్ర శ్రీభాష్యము, శ్లోకము 1 పుట 1
భగవద్బాదరాయణమహర్షిప్రణీత శ్రీశారీరక మీమాంసాశాస్త్రమునకు
భగవద్రామానుజ ప్రణీత శ్రీభాష్యమునకు సరియైన తెనుగున
శ్రీమాన్ కందాడై శేషాచార్యులవారిచే రచింపబడి
స్వకీయ
వేదాంతముద్రాయంత్రమున ముద్రింపబడి ప్రచురింపబడినది మద్రాసు 1022

## ఉపయుక్తగ్రంథావళి

### సంస్కృతగ్రంథములు :


1 అధ్యాత్మరామాయణము — సంపాదకులు శ్రీ జీవానంద విద్యాసాగరభట్టాచార్య, నూతనవాల్మీకియంత్రే ముద్రితమ్,సంవత్సరము 1892

2 అమరకోశము — రామాశ్రమి వ్యాఖ్యా సహితము, వ్యాఖ్యాత భానోజిదీక్షితులు చౌఖాంబ సంస్కృతసిరీస్ ఆఫీసు, వారణాసి సంవత్సరము 1970

3 ఉత్తరరామచరితము — భవభూతి, చౌఖాంబ సంస్కృతసిరీస్ ఆఫీస్, వారణాసి-1 సంవత్సరము 1976

4 కావ్యప్రకాశము — మమ్మటుఁడు భండార్కర్ ఓరియంటల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్,పూనా-4 సంవత్సరము 1950

5. కావ్యప్రకాశదర్పణము — విశ్వనాథుఁడు, భండార్కర్ ఓరియంటల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్, పూనా-4 సంవత్సరము 1950

| | | |
|---|---|---|
| 6 | కూర్మపురాణము | సర్వభారతీ కాశీరాజన్యాస్ దుర్గ్ రామనగర్, వారణాసి సంవత్సరము : 1972 |
| 7 | గీతగోవిందము | జయదేవుఁడు, చౌఖాంబ విద్యాభవన్, వారణాసి-1 సంవత్సరము 1967 |
| 8 | ధ్వన్యాలోకము | ఆనందవర్ధనుఁడు, మోతిలాల్ బనారసీదాస్, పోస్ట్‌బాక్స్-75 వారణాసి, సంవత్సరము 1968 |
| 9 | ధ్వన్యాలోకలోచనము | అభినవగుప్తుఁడు, మోతీలాల్ బనారసీదాస్, నేపాలీఖపరా, వారణాసి-1 సంవత్సరము . 1963 |
| 10 | నారదభక్తిసూత్రములు | గీత ప్రెస్- గోరఖ్‌పూర్, విక్రమశకము . 2021 |
| 11. | నృసింహపురాణము | గోపాలనారాయణ కంపెనీ కల్బాదేవిరోడ్ బొంబాయి సంవత్సరము 1911 |
| 12 | పద్మపురాణము | మనుస్సుఖ్ రాయ్ మోర్ 5 క్లైవ్ రోడ్, కలకత్తా-1 సంవత్సరము . 1951 |
| 18. | పాణినీయము | బాలమనోరమ ప్రెస్, మైలాపూర్, మద్రాసు సంవత్సరము . 1937 |

14 ప్రసన్నరాఘవము — జయదేవుడు
నిర్ణయసాగర్ ప్రెస్, బాంబే
శకసంవత్సరము 1843

15 బ్రహ్మాండ పురాణము — కృష్ణదాస అకాడెమీ
పోస్ట్ బాక్స్ నం 118
వారణాసి-221001
సంవత్సరము 1983

16 భక్తిరసామృతసింధువు — శ్రీలరూపగోస్వామి
(తెలుగు అనువాదము శ్రీ
జన్నాభట్ల వాసుదేవశాస్త్రి)
శ్రీ గాడీయమఠము,
గుంటూరు
ముద్రణము రఘు
సంవత్సరము 1965

17 భక్తిరసాయనము — మధుసూదన సరస్వతి
ఆంధ్రవివృతి-శ్రీ పోతుకూచి
సుబ్రహ్మణ్యశాస్త్రి
జానకిరాం ప్రెస్, సాధన
గ్రంథమండలి, తెనాలి
సంవత్సరము 1953

18. మహాభారతము — ప్రెస్ స్వాధ్యాయమండల్
లిమిటెడ్, పోస్ట్ కిల్లాపార్డి,
బల్సార్ జిల్లా, గుజరాత్
సంవత్సరము 1981

9. మాఘకావ్యము — క్షేమరాజ శ్రీకృష్ణదాస్
వేంకటేశ్వర స్టీమ్ ప్రెస్
కల్యాణ్, బొంబాయి
శకసంవత్సరము , 1847

20 ముకుందమాల — శ్రీ భావ్యం అప్పలాచార్యుల
వ్యాఖ్యానము
శ్రీ బాదం సుబ్రహ్మణ్యం,
దేవాలయంవీధి, కాకినాడ-1
దుర్గా ప్రెస్

21 రఘువంశము — కాళిదాసు, నిర్ణయసాగర
ప్రెస్, బొంబాయి
సంవత్సరము 1927

22. రసగంగాధరము — జగన్నాథపండితరాయలు
బెనారస్ హిందూయూనివర్సిటీ
విక్రమసంవత్సరము 2020

23. వంశీధరీయము — క్షేమరాజ శ్రీకృష్ణదాస్,
శ్రీ వేంకటేశ్వర స్టీమ్ ప్రెస్,
బొంబాయి

24 విష్ణుధర్మోత్తరపురాణము — క్షేమరాజ శ్రీకృష్ణదాస్
శ్రీ వేంకటేశ్వర స్టీమ్ ప్రెస్
బొంబాయి
శకసంవత్సరము 1884

25 విష్ణుపురాణము — శ్రీ వేంకటేశ్వర ఆర్ష భారతి
ట్రస్ట్, గురుకృప, అశోకనగర్
హైదరాబాదు
సంవత్సరము . 1984

26 విష్ణుసహస్రనామము — శంకరభాష్యము, గీతాప్రెస్, గోరఖ్‌పూర్ విక్రమసంవత్సరము . 2026

27 శ్రీధరీయము — శ్రీమద్భాగవతము శ్రీధరీయ వీరరాఘవీయ వ్యాఖ్యాద్వయ సహితమ్ వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, ఇత్యేతైః ప్రకటీకృతమ్, చెన్నపుర్యామ్ సంవత్సరము 1927

28 శ్రీమద్భగవద్గీత — గీతామకరందము, 10వకూర్పు శ్రీశుక బ్రహ్మాశ్రమము, శ్రీకాళహస్తి, భారతీప్రెస్, తెనాలి సంవత్సరము 1970

29 a) శ్రీమద్భాగవతము (చంద్రికావ్యాఖ్య) — వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, మద్రాసు సంవత్సరము ; 1941

b) శ్రీమద్భాగవతము — గీతాప్రెస్, గోరఖ్‌పూర్ విక్రమసంవత్సరము . 2028

c) శ్రీమద్భాగవతము (నవమస్కంధము) — శ్రీరామానంద గాడీయమఠము, కొవ్వూరు ముద్రణము . రఘు, గుంటూరు సంవత్సరము ' 1982

| | | |
|---|---|---|
| 30 | శ్రీమద్రామాయణము | వాల్మీకి,<br>యమ్ యల్ జె ప్రెస్<br>మైలాపూర్, మద్రాసు<br>పబ్లిషర్ N రామరత్నం<br>సంవత్సరము 1958 |
| 31 | శృంగారప్రకాశిక | భోజుడు<br>ఆర్ యస్ జోస్యర్<br>కారోనేషన్ ప్రెస్,<br>100 ఫీట్ రోడ్, మైసూరు |
| 32 | సంస్కృతసాహిత్యేతిహాసః | శ్రీ రామచంద్రమిశ్ర<br>చౌఖాంబ విద్యాభవన్<br>వారణాసి-1<br>సంవత్సరము 1976 |
| 33 | సిద్ధాంతకౌముది | భట్టోజి దీక్షితులు<br>చౌఖాంబ సంస్కృతసంస్థాన్<br>పోస్టుబాక్స్ 139 వారణాసి<br>సంవత్సరము 1976 |

తెలుగు గ్రంథములు ;

| | | |
|---|---|---|
| 34 | అంతరార్థభాగవతము<br>(బ్రహ్మవిద్యాదర్పణము) | డా॥ వేదుల సూర్యనారాయణ శర్మ, ముద్రణ ఎలక్ట్రిక్ ప్రెస్<br>విజయవాడ-1<br>సంవత్సరము 1984 |
| 35 | నృసింహపురాణము | ఎఱ్ఱాప్రెగడ, వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్<br>మద్రాసు-1<br>సంవత్సరము : 1968 |

| | | |
|---|---|---|
| 36 | పౌలస్త్యహృదయము | కాటూరి వేంకటేశ్వరరావు<br>త్రివేణీప్రెస్, మచిలీపట్టణము |
| 37 | భాగవతప్రభ<br>(ఆహ్లాదకిరణము) | శ్రీ కొత్త రామకోటయ్య<br>పంచాక్షరీప్రెస్, బ్రాడీపేట,<br>గుంటూరు-2<br>సంవత్సరము, 1989 |
| 38 | భాస్కరరామాయణము<br>(శ్రీమేడేపల్లి వేంకటరమణా<br>చార్యులవారిచే పరిష్కృతము) | వావిళ్ళరామస్వామిశాస్త్రులు<br>అండ్ సన్స్, చెన్నపురి<br>సంవత్సరము, 1928 |
| 39 | a) మహాభారతము | ఓరియంటల్ బుక్స్ ప్రచురణ<br>ఓరియంటల్ బుక్స్ రీప్రింట్<br>కార్పొరేషన్<br>54, రాణిఝాన్సీరోడ్<br>న్యూఢిల్లి<br>సంవత్సరము, 1979 |
| | b) మహాభారతము | తెలుగుశాఖ, ఉస్మానియా<br>విశ్వవిద్యాలయము,<br>హైదరాబాదు<br>సంవత్సరము 1938 |
| 40 | రంగనాథ రామాయణము | సి.వి. కృష్ణాడిపో, 19/99<br>అమ్మన్ కోవిల్ వీధి,<br>వాల్టాక్స్ రోడ్ పోస్ట్<br>మద్రాసు-1<br>సంవత్సరము 1927 |

| | | |
|---|---|---|
| 41 | రామాభ్యుదయము | అయ్యలరాజు రామభద్రుడు<br>ఆంధ్రప్రదేశ్ సాహిత్య<br>అకాడమీ, కళాభవనము<br>హైదరాబాదు-4<br>సంవత్సరము 1076 |
| 42 | వైరభక్తి | శ్రీ చెఱుకుపల్లి జమదగ్నిశర్మ<br>శ్రీ కృష్ణా ప్రింటింగ్ వర్క్స్<br>కృష్ణాటాకీసు ప్రక్కవీథిలో,<br>రాజమండ్రి-533101<br>ప్రథమముద్రణ 1978 |
| 43 | శ్రీ తాళ్ళపాక వారి పదసాహిత్యము<br>అధ్యాత్మసంకీర్తనలు | అన్నమాచార్య విరచితము<br>లు, సంపుటము-8<br>ప్రచురణ కార్యనిర్వహణా<br>ధికారి, తిరుమల తిరుపతి<br>దేవస్థానములు, తిరుపతి<br>సంవత్సరము 1986 |
| 44 | a) శ్రీమదాంధ్రభాగవతము | సంపాదకుడు. దావులూరు<br>కోటిసూర్యప్రకాశరావు,<br>ఆంధ్రగ్రంథమండలి, తెనాలి |
| | b) శ్రీమదాంధ్రభాగవతము<br>(సప్తమస్కంధము) | వావిళ్ళరామస్వామిశాస్త్రులు<br>అండ్ సన్స్, వావిళ్ళప్రెస్,<br>చెన్నపురి<br>సంవత్సరము : 1968 |
| 45 | శ్రీమద్భాగవతానుశీలనము | డా ధూళిపాళ శ్రీరామమూర్తి<br>ముద్రణ గ్రామస్వరాజ్య<br>ప్రెస్, విజయవాడ-2 |

| | | |
|---|---|---|
| 46 | శ్రీమదాంధ్రవాల్మీకిరామాయణము (సుందరము-సుందరకాండము) | ఆంధ్రవాల్మీకి వాసుదాసస్వామి, ప్రకాశకులు శ్రీ కోదండరామసేవక ధర్మసమాజము, అంగలకుదురు తెనాలి సంవత్సరము 1964 |
| 47 | శ్రీమద్రామాయణకల్పవృక్షము | శ్రీవిశ్వనాథ సత్యనారాయణ శ్రీ కృష్ణాప్రింటింగ్ వర్క్స్ విజయవాడ 2 సంవత్సరము 1970 |
| 48 | శ్రీమద్రామాయణ తత్త్వకథనము | శ్రీ వరణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీశారదాపవర్ ప్రెస్, ధట్నవిల్లి సంవత్సరము 1961 |
| 40 | హరివంశము | ఎఱ్ఱాప్రెగడ వావిళ్ళరామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, మద్రాసు సంవత్సరము 1967 |

హిందీగ్రంథము .

| | | |
|---|---|---|
| 50 | పురాణవిమర్శ | బలదేవోపాధ్యాయ చౌఖాంబ విద్యాభవన్ వారణాసి-1 సంవత్సరము 1965 |

ఆంగ్లగ్రంథము ·

| | | |
|---|---|---|
| 51. | History of Sanskrit Poetics | P V Kane, మోతీలాల్ బనారసీదాస్ చౌక్, వారణాసి సంవత్సరము . 1971 |

# సవరించుకొనవలసిన కొన్ని అచ్చుతప్పులు

| పుట | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 3 | ఫలాూపత్వాత్ | ఫలరూపత్వాత్ |
| 7 | అన.భావితస్య | అనుభావితస్య |
| 12 | పాగ్వినివిష్ట | ప్రాగ్వినివిష్ట |
| 23 | లక్ష్యముగ | లక్ష్యములుగ |
| 32 | అతి స్తదా | అత స్తదా |
| 34 | విదుద్ధరసములు | విరుద్ధరసములు |
| 38 | తత్రనేదృశ్యమ్ | తత్రనేదృశమ్ |
| 38 | పూర్ణన.ఖా | పూర్ణసుఖా |
| 40 | రసత్వ | రసత్వము |
| 43 | తనుహార | తమహం |
| 54 | హిరణాక్ష | హిరణ్యాక్ష |
| 54 | మధుకైటభులు, మాలిసుమాలి | మధుకైటభులు, హేతి ప్రహేతి, మాలిసుమాలి |
| 61 | ప్రథ సుజాయతం | ప్రథమసుజాయతతం |
| 62 | శ్రీసుదాంద్ర | శ్రీమదాంధ్ర |
| 65 | వారయూమానతు | వీరయూమానతు |
| 79 | కర్వణా | కర్మణా |
| 83 | ప్రహాదుఁడు | ప్రహ్లాదుఁడు |
| 86 | హిరణ్యకపుఁడు | హిరణ్యకశిపుఁడు |
| 86 | ప్రహ్లారం | ప్రహ్లాదం |
| 91 | ఎక్షన | ఎఱ్ఱన |
| 96 | నిశ్చప్రపచయము | నిశ్చప్రపచము |
| 98 | భావములగుచుక్ | భావములగుచుక్ |

| | | |
|---|---|---|
| 105 | సంయుక | సంయుగ |
| 105 | ప్రకటింతులో | ప్రకటింతురో |
| 111 | స్పృష్టముగ | స్పష్టముగ |
| 112 | ఎవ్వకింటె | ఎవ్వనికంటె |
| 114 | నిలుకొనలేదు | నిలువుకొనలేదు |
| 120 | హార్ద్వారకరహో: | హార్ద్వారకహో: |
| 128 | కృథిచ్యుతం | కథిచ్యుతం |
| 130 | ప్రముచ్చలించిరో | ప్రముచ్చిలించిరో |
| 132 | సురలయందు | సురలందు |
| 135 | 125 | 135 |
| 138 | విరోధంబునుం | విరోధంబుగం |
| 141 | నిమిత్తాంతరంగ | నిమిత్తాంతరంగబహిరంగ |
| 141 | హితణ్యకశిపుండు | హిరణ్యకశిపుండు |
| 142 | శిక్షింపం | శిక్షింపంగ |
| 145 | దుష్టభావము | దష్ట్రభావము |
| 146 | చేసికొనునటు | చేసికొనినట్లు |
| 147 | వ్యవరింకబడు | వ్యవహరింపబడు |
| 147 | విశ్రవః నతో | విశ్రవః సుతో |
| 148 | botanist of | botanist or |
| 154 | విశకకర్మ | విశ్వకర్మ |
| 159 | ఉత్తకాంశము | ఉత్తరకాండము |
| 170 | త్వద్ధస్థాణ | త్వద్ధస్థాన |
| 188 | 145 | 1485 |
| 191 | తనలోపాటు | తనతోపాటు |
| 200 | విశ్వనాథ | విశ్వనాథ |
| 200 | వచ్చులో | వచ్చుటో |

| | | |
|---|---|---|
| 201 | నిర్మూచించు | నిర్మూలించు |
| 201 | జన్మంలినాఁడు | జన్మించినాఁడు |
| 206 | బహిశ్కంత్రిండె | బహిశ్కృతుండె |
| 208 | పాసాధ్యంబెంగ | యసాధ్యంబెంత |
| 222 | శుత్రశ్రవసాపి | శ్రుతశ్రవసఁపి |
| 224 | శిశుపాలవధకర్వము | శిశుపాలవధపర్వము |
| 225 | ఇంక్రస్థమున | ఇంద్రప్రస్థమున |
| 233 | ణధ్యాయము | అధ్యాయము |
| 236 | ధగ్మజు | ధర్మరాజు |
| 237 | స్వేదతో | స్వేదముతో |
| 240 | వైరథక్రీసద్దీకనము | వైరథక్రీకినుద్దీపనము |
| 242 | సౌహృదదము | సౌహృదము |
| 243 | నెదుర్కొటకు | నెదుర్కొనుటకు |
| 252 | కృష్టుని | కృష్ణుని |
| 257 | శాధ్యాయము | అధ్యాయము |
| 260 | స్నేహదూర్యాయం | స్నేహాదూర్యాయం |
| 263 | అనాసిక్తః | అనాస్తికః |
| 265 | జననమూహైః | జననమూహైః |
| 266 | వృషభరూఖరూప | వృషభరూఖ |
| 280 | రత్నైకదీక్షం | రత్నైకదీక్షే |
| 280 | మహార్షిప్రణీత | మహర్షిప్రణీత |

